**LŌKAM CHOOSĀKA**
Muppidi Prabhakara Rao Kathalu
July 1992

*Published by*
MUPPIDI PUBLICATIONS
46-18-25/1, Danavaipet,
Rajahmundry-533 103

Cover Painting
'Dali'

Title Design:
'Seelavi'

*Price:*
Library **Rs. 60**
Ordinary **Rs. 35**

*Sole Distributors:*
Visalaandhra Publishing House
Vignana Bhavan, 4-1-435, Bank Street
Hyderabad - 500 001
And
All its Branches.

*Cover Printed at*
Kala Jyothi, Chikkadapalli, Hyd

*Text printed at*
Ramsha Siriesha Publications, Samalkot

(తెలుగు విశ్వవిద్యాలయం ఆర్థిక సహాయంతో ప్రచురితం)

# MAN IS HIS STORIES

*K. Siva Reddy*

కథ నా ఏరియా కాదు. అయినా కథలు చదువుతాను. కవిత్వం నుంచి నేర్చుకున్నట్టుగానే కథల్నుంచీ నేర్చుకున్నాను. నా కవిత్వానికి మంచి కథలూ చాలా ఉపయోగపడ్డాయి. బహుశ మంచి కథా, మంచి కవితా అందించే సందేశం ఒకటే; ఇచ్చే జీవనానుభవం ఒకటే. ఏదో ఒక స్థాయిలో ఎక్కడో ఒక చోట రెండూ కలుస్తాయని – బహుశ సెంఘార్ అనుకుంటాను ఒక సందర్భంలో అంటాడు "మాకు కవితకీ, వచనానికీ ఆట్టే తేడా లేదు" అని. రెండింటికీ ఒక సంఘటనో, సందర్భమో, ఒక సన్నివేశమో, ఒక వ్యక్తో లేదు ఒక సామాజిక సన్నివేశం తాలూకు 'మూడ్' మూలమవుతుంది.

కథకి వస్తువే ప్రాణం. పాత్రలూ, వర్ణన కథలో అత్యధిక ప్రాధాన్యత వహిస్తాయి. కథకుడు అన్ని పాత్రల్లో కలిసిపోయినా, ఏదో ఒక పాత్రలో తన్ను తాను వ్యక్తీకరించుకుంటాడు. కథలో పాత్రలెంత ముఖ్యమో అతనికి చుట్టూ వున్న పరిసరాలూ, వాతావరణం అంతే ముఖ్యం. అందుకే కథలో *details* చాలా అవసరం. కథకుడు ఏ ఒక్క *detail*ని వదలటానికీ వీల్లేదు. ప్రాణం వున్నవే కాకుండా జడాలూ అధిక ప్రాధాన్యత వహిస్తాయి.

కవిత చదివి ముగ్ధుణ్ణై, కళ్ళుమూసుకుని ఎంత అనుభవించానో కథ చదివీ అంతే ముగ్ధుణ్ణై కళ్ళు మూసుకుని 'ఆహా ఎంత బ్రహ్మాండంగా చెప్పాడు – మంచి కథరాయటం ఎంత కష్టం, అని అనుకున్న సందర్భాలు చాలా ఉన్నాయి.

బహుశా ఇది తెలిసీ మిత్రుడు ముప్పిడి ప్రభాకరరావు తన కథా సంపుటికి నన్ను నాలుగు మాటలు రాయమన్నాడనుకుంటాను. ఆ రంగంలో పని చేసిన వాళ్ళయితే తమ అనుభవంలోంచి యితని కథల్ని విశ్లేషించగలరు. నేనేమి చేయగలను? బహుశ ఈ కథలు చదివినప్పుడు నాకు కలిగిన అనుభవాల్ని, భావాల్ని చెప్పగలను. *A total impact*- అంతే.

ప్రభాకర్ నాకు యిరవై సంవత్సరాల నుంచీ తెలుసు. యిరవై సంవత్సరాల నుంచీ దీన్లో పడి కొట్టుకుంటున్నాడు. హైదరాబాద్ నారాయణగూడలో "న్యూవేవ్ కథా రచయితల" సర్కిల్లో మొదట చూశాను. శ్రీకంఠమూర్తి, శ్రీపతి, సి.యస్. రావు, చంద్ర, ముని, భైరవయ్య, డి. వెంకట్రామయ్య, వి. రాజారామ్మోహనరావు మరికొంత మంది మిత్రులూ క్రమం తప్పకుండా డి. వెంకట్రామయ్యగారి ఇంట్లో కలిసేవాళ్ళు. తాము రాసిన కథలు చదివి వినిపించుకునే వాళ్ళు, చర్చించుకునే వాళ్ళు. ఆనాడొస్తున్న కథా సాహిత్యంమ్మీద కూడా చర్చలు జరిగేవి. అప్పుడు ఆ పదేళ్ళలో ఆ సర్కిల్ నుంచి మంచి కథలు చాలా వచ్చాయి. నలుగురు కలవటంలోనే ఒక సమూహ లక్షణం వుంది. ఒక వాతావరణమేర్పడుతుంది. నలుగురు కలవటం, చర్చించుకోవటం ఎప్పుడూ అభివృద్ధికే దోహదం చేస్తుంది. ముప్పిడి ప్రభాకరరావు కూడా అదిగో ఆ వాతావరణం నుంచీ, ఆ చర్చల నుంచీ, ఆ అవగాహన నుంచీ వచ్చినవాడు. కథని ఒక సామాజిక పరమార్థంతోనే రాశాడు. తన అనుభవాన్ని సమూహం యొక్క అనుభవంతో మిళితం చేసుకుని కథలు రాయటం నేర్చుకున్నాడు. సమూహం అనుభవాన్ని తన అనుభవంగా స్వీకరించినవాడు.

సమూహం *myth* గాదు. సమూహం అంటే సమాజమే. సమూహం *myth* అయితే వ్యక్తి *myth* అవుతాడు.

వ్యక్తి సమూహంలో భాగమయినా, తనదయిన వ్యక్తిత్వం, అస్తిత్వం తను ఏర్పరుచుకుంటాడు. తన వ్యక్తిత్వ వికాసానికి సమూహం అనుభవం, సృజన కారణం అని ఎంచితే అభివృద్ధి సక్రమంగా జరుగుతుంది. లేకపోతే రచయిత ఒంటెత్తు పోకడలు పోతాడు. సమాజం నుంచి *delink* అవుతాడు. అట్లా *delink* అయినప్పుడు వచ్చే సాహిత్యమే వ్యక్తి వాద సాహిత్యం. అది కవిత్వంలోగావచ్చు, కథల్లోగావచ్చు. బహుశ కథల్లో వ్యక్తివాద సాహిత్యం తక్కువ. నేను ఈ కథలను ఈ కోణం నించే చూశాను; సమాజం నుంచి ఈ కథలు *delink* అవలేదు.

ఒకపాటి లైంగిక "క్షుద్ర అల" ముంచుకొచ్చినప్పుడయినా తాను చలించలేదు. ఆ రచన వైపు మొగ్గలేదు. చాలా అణకువతోనే తన రచనతాను చేసుకుపోయాడు.

ఈ కథలు చదివితే మీ కర్థమవుతుంది. ప్రభాకరరావు జీవితాన్ని అన్ని కోణాల్నుంచీ పట్టుకున్నాడని. తన అనుభవాన్ని సుసంపన్నం చేసుకున్నాడని. బహుశ జీవితం ఇంత శిథిలమయిపోవటానికి కారణాలు వెతికే ప్రయత్నం చేశాడని–

అనుభవాన్ని అనుభవంగా చెప్పటం కన్న అనుభవమూలాన్ని వెతికి తెలుసుకుని "ఇది ఇట్లా వుండడానికి ఇదే కారణం" అని తన అనుభవం జోడించి చెప్పడానికే తాను

ప్రయత్నించాడు. లేకుంటే 'రుతువు' 'కబురు', 'వర్షం' '       'కల'... మొదలైన కథలు అంత తేలిగ్గా అతని కలం నుండి రాకపోయి వుండును.

మంచి కథలెప్పుడూ అశ్రద్ధ చేయబడలేదు.

ప్రభాకరరావు ఈనాడు తన ఉనికిని తాను వెతుక్కోవలసిన అవసరం లేదు.

అసంఖ్యాకంగా వస్తున్న చెత్తా చెదారం మధ్య మంచి కథ తన ఉనికిని అదే తెలియ చేస్తుంది. *'It stands out of rut'* అని- కాలగతిలో అవి ఎదుగుతాయి. వ్యాప్తి చెందుతాయి. బహుళ సమూహపు స్మృతిలో అవి అనుభూతిగా పరివర్తన చెంది జాతి ఆస్తిగా మిగిలిపోతాయి. ఒక కథ వచ్చినపుడు అది కలిగించిన సంచలనంకంటే కాలక్రమంలో అది ఎదిగిన క్రమం గొప్పది. సమాజానికి అన్వయింపు గొప్పది. నిర్దిష్టమైన కథ సాధారణీకరణ చెంది అందరికీ చెందింది అవుతుంది. బహుళ సాహిత్యం ఈ నాటికీ సజీవంగా ఉండడానికి ఇదే మూలమైవుంటుంది.

"ముడి వజ్రాలు సమూహంలోనే, ప్రజలలోనే పుట్టాయన్నమాట- వ్యక్తి దగ్గర కళ వుంటుంది. కానీ సృజనాత్మకత మాత్రం సమూహం దగ్గరే వుంటుంది-"

"ఎల్లప్పుడూ, ప్రతిచోటా చరిత్ర అంతటా మనిషిని తయారు చేసినది ప్రజలే-"

-గోర్కీ

ఈ కథలు చదువుతున్నపుడు నాకీ మాటలు పదేపదే గుర్తుకొచ్చాయి. ఈ వ్యవస్థలో వ్యక్తిత్వం ఎలా శిథిలమౌతుందో చూయించటానికే ముప్పిడి ప్రభాకరరావు కథలు రాస్తున్నాడని నిస్సందేహంగా చెప్పుకోవచ్చు-

సామూహిక అనుభవాన్ని భావాల రూపంలో, ప్రతిపాదనల రూపంలో, సిద్ధాంతాల రూపంలో సంఘటితం చేయాలనే తన అత్యున్నత సృజనాత్మక కర్తవ్యాన్ని ముప్పిడి ప్రభాకరరావు నిరాకరించలేదన్నది ఈ కథలు చదివాక తెలుస్తుంది.

అందుకే తన కథాసంపుటికి "లోకం చూశాక" అని నామకరణం చేశాడు. 'దేశపటం' తో మొదలయి 'లోకం చూశాక'తో ఈ సంపుటి ముగుస్తుంది. అక్కడో కథ, ఇక్కడో కథ చదివిన దానికంటే పాతిక కథలు ఒక దగ్గిర చదివినప్పటి అనుభవం వేరు; ముద్రవేరు. ఈ సంపుటిలో మొత్తం కథలు చదివాక ముప్పిడి ప్రభాకరరావు ఏమిటో స్పష్టంగా అర్థమౌతుంది. నేను ఈ కథల్లోని వస్తువు యిది దీన్ని యిలా కథగా మలిచాడు అని చెప్పబోవటం లేదు. అది రేపు పుస్తకం అచ్చయ్యాక సమీక్షకుడు చేసేపని.

నిజానికి ప్రభాకరరావు చాలా తక్కువ రాసినట్టు లెక్క. అతనిలో ప్రలోభాలకి లొంగని ధీరత్వం వుంది. నా మీద వున్న ప్రేమతో నా ఈ వెర్రి మొర్రిమాటల కోసం మూడు నెలలు పైగా నిరీక్షించాడు. ఓర్పు వహించాడు. అది నాపట్ల అతనికున్న అభిమానం.

*'Style is the man'* అంటారు. కాని అతన్ని చూస్తే *'Man is his stories'* అని అనవచ్చునేమో. సాధనతో కళ కరతలామలకం అవుతుంది. వయసుతో పాటు కథలోనూ, కవిత్వంలోనూ అనుభవసాంద్రత పెరుగుతుంది. మనం రచన చేయాల్సిన సరియైన సమయం ఇదే - స్తబ్దుగా నిశ్శబ్దంగా వుండకూడదు. అది మృత్యువు.

ప్రభాకరే అంటాడొకచోట - "ఇన్నాళ్ళూ బతుకు బతకటంలోనే సరిపోయిం దని-" అది మామూలు విషయం గాదు.

బతుకు బతకడానికీ, జనాన్ని బతకమని చెప్ప డానికీ చేవ గావాలి... సాహసం గావాలి. రేపటి పట్ల ప్రేమ కావాలి -

అందుకే-

ఈ కథలు ఉబుసుపోకకి చదువుకునే కథలు గావు. ఒక ఆర్తి అంతటా అల్లుకుని వుంది. దాన్ని అంటిపెట్టుకుని ఒక జీవన సంఘర్షణ వుంది. జీవితం పట్ల ప్రేమ వుంది. దాని వెనకనే ఒక నిరసన స్వరం వుంది.

జీవితానికి ఎన్ని అంచులున్నాయో, పార్శ్వాలున్నాయో, అన్నింటినీ పట్టుకోవటానికి ప్రభాకర్‌లో తగినంత స్ఫూర్తి వుంది.

ఈ కథలు మొదట్నుంచి చివరిదాకా మిమ్మల్ని చదివిస్తాయి. ఇంకా ఆలస్యం దేనికి- వెంటనే కథల్లోకి వెళ్ళండి-

హైదరాబాద్
*23-7-1992*

కె. శివారెడ్డి

# కథాక్రమం

# కృతజ్ఞతలు

అడిగిన వెంటనే కాదనక అభిమానంతో ముందుమాట రాసి
ఇచ్చిన శ్రీ కె. శివారెడ్డికి-
కవర్ పేజీ మీద తన అభిప్రాయాన్ని నిరాడంబరంగా చెప్పిన
శ్రీ డి. వెంకట్రామయ్యకూ
ఈ పుస్తకం రావడానికి ఎంతగానో సహకరించిన
వాసిరెడ్డి నవీన్ గారికీ,
శిలా వీర్రాజు గారికీ,
బొందలపాటి శివాజీరావుగారకీ,
ఎండ్లూరి సుధాకర్ గారికీ,
జయధీర్ తిరుమలరావుగారికీ,
పెమ్మరాజు గోపాలకృష్ణగారికీ...
ఇంకా....
మొదటిగా నా కథ (వర్షం) ను డిసెంబరు '72, జ్యోత్స్నలో
ప్రచురించిన ఎడిటర్ రాజేంద్ర గారికీ -
జ్యోతి, యువ, ఆంధ్రజ్యోతి, ప్రజాతంత్ర, తెలుగు అమెరికా,
తూర్పు తీరం... మొదలైన పత్రికల్లో నా కథలను ప్రచురించిన
సంపాదకులకూ...
కృతజ్ఞతలు.

# దేశపటం

## కుటుంబం ఎలా వుండాలి?

మా అమ్మా, నాన్నా, అయిన దానికీ , కాని దానికీ ఎప్పుడూ ఏదో గొడవ పడడమే. వాళ్లకి అదొక అలవాటై పోయింది. చినికి చినికి గాలివాన అయినట్టు ప్రతి చిన్న విషయమూ చివరికి పెద్ద రగడగా అవుతుంది. ఆయన ఆమెను కొడతాడు, ఆమె ఆయన్ను తిడుతుంది. ఇరుగూపొరుగూ వున్నారని గానీ, వాళ్లు వింటే పరువు పోతుందని గానీ ఆ ఇద్దరికీ ఎక్కడా ఏ కోశానా వుండదు.

ఇతరుల సంగతి ఎలావున్నా ఇంట్లో పసివాళ్లం మేమున్నామని గానీ, మా లేత హృదయాలు వాళ్ల చేష్టల వల్ల భయభ్రాంతులకు లోనై నిస్సహాయతకూ, నిర్వేదనకూ గురౌతాయని గానీ, ఏనాడూ ఊహించి వుండరు.

కన్నవాళ్ళను విమర్శించడం, వాళ్లు ఫలానా విధంగా తప్పని సరిగా నడుచుకోవాలని నిర్దేశించడం నా ఉద్దేశం కాదు.

అయితే వాళ్ల ప్రవర్తన తమ బిడ్డల పాలిట శాపంగా మారకూడదని మాత్రం అంటాను. ఎందుకంటే -

నేనా సంవత్సరం నాల్గో తరగతి తప్పాను.

ఎన్నడూ మంచి మార్కులతోనే పాసయ్యే నేను నాల్గవ తరగతి తప్పడమేమిటి?

ఆ సంవత్సరం గాంధీ మహాత్ముడు చనిపోయాడు. కాదు ఆయన చంపబడ్డాడని చరిత్ర చెబుతోంది.

మహాత్ముడు చనిపోయాడన్నా, హత్య చేయబడ్డాడన్నా నాకా వయసులో అంతా ఒక్కటే -

చావుకూ, హత్యకూ తేడా తెలియని నాకు పరీక్షలో నేను తప్పానో, తప్పించబడ్డానో ఎలా తెలుస్తుంది-

నేనా సంవత్సరం పరీక్ష తప్పడానికి మా పక్కింటావిడే కారణం. ఆమె స్వయానా నాకు క్లాసు టీచరు, మా మిస్ -

మా అమ్మను ఆమె చులకన చేసింది. తరచూ ఇంటిని వీధిని పడేసే మాఅమ్మను చులకన చేయడంలో ఆమె తప్పేమీ లేదు.

కాని మాట పట్టింపు కోసం భర్తను సైతం లెక్కచెయ్యని మా అమ్మ ఓ పరాయి ఆడది తనను చులకన చేస్తే సహిస్తుందా?-

నేను నాల్గవ తరగతి తప్పాను.

ఇప్పుడు నా భవిష్యత్తు మా ఇంటిల్లపాదికీ ఓ సవాలుగా నిలిచింది. అందుకని ఇంట్లో ఏదో నిరాశ, నిస్పృహ-

ఆరు నెలల క్రితం గాంధీ మహాత్ముడు చనిపోయినప్పుడు కూడా ఇలాంటి నిరాశా నిస్పృహలే మా ఇంటిల్లపాదినీ ముంచివేసింది. మళ్ళీ ఇప్పుడు అదే మౌన తెరల మధ్య గంభీరతని నేను బిక్కు బిక్కు మంటూ అనుభవించాను.

అందుకని నా చదువు గురించి అనేక తర్జన భర్జనల్తో ఓ నిర్ణయానికొచ్చారు. నా తండ్రికి నా తెలివితేటల మీద అపారమైన విశ్వాసముంది. ఆ కారణంగానే, నాల్గవ తరగతి తప్పిన నన్ను ప్రైవేటు కాండిడేట్ గా ఎంట్రన్సు రాయించి ఊరు చివరి హైస్కూల్లో ఆరవ తరగతిలో చేర్పించారు.

ఇది మాపక్కింటావిడకు చెంపపెట్టు-

నేనిప్పుడు నా చదువు నిమిత్తం ఊరు చివరి స్కూలుకు రోజూ రెండు మైళ్ళు నడిచి వెళ్ళి, నడిచి వస్తున్నాను.

కొత్త స్కూల్లో, కొత్త వాతావరణంలో ఇమడడానికి ఏమంత కాలం పట్టలేదు. కొత్తమాష్టార్లూ... కొత్త విద్యార్థులూ... అంతా బాగానే వుంది కొత్తొకవింతలా...పైగా నాచేతిలో అన్నీ కొత్త పుస్తకాలే... ఆ పుస్తకాలను చూస్తుంటే నా ప్రాణం లేచి వచ్చేది.

ఆ రోజు మాష్టారు మాకోసం 'సాంఘిక శాస్త్రం' చెప్తున్నారు. నేను దానికి సంబంధించి నా పుస్తకం లోని 'దేశపటాన్ని' చూస్తున్నాను. అది 'హిందూదేశపటం' ఔనో, కాదో తెలియకుండా వుంది. అవాక్కయ్యాను. ఓ అపరిచిత వ్యక్తిని చూసినట్టు నా కళ్లు ఆ పటం కేసీ, 'హిందూ దేశం' అన్న అక్షరాలకేసీ చూశాయి.

గుండెల్నిండా ఏదో అయోమయం-

ముమ్మాటికీ ఇది 'హిందూ దేశపటం' కాదు గాక కాదు.

నేను విడిచి వచ్చిన మిషనరీ స్కూలు గుర్తుకొచ్చింది. ఆ తరగతి గదుల్లో విశాలమైన గోడలమీద బొమ్మలూ, చార్టులూ, మేప్‌లూ గుర్తొచ్చాయి. అన్నిటినీ మించి ఖాళీగా వున్న బ్లాక్ బోర్డులపై వేసిన ఓ రెండు చిత్రపటాలు నా స్మృతి పథంలో ఇంకా నిలిచే వున్నాయి. నా లేత హృదయాన్ని హత్తుకుపోయి, చెరగని ముద్ర వేశాయి. అందులో ఒకటి 'దిశలూ-ఎల్లలు'.

ఉదయించే సూర్యుని వేపు తిరిగి రెండు చేతులూ బార్లా చాచి నిలిచిన బాలుడు. అతనికి తూర్పు పడమర, ఉత్తర దక్షిణాలు, వాటి మధ్య ఎల్లలూ గుర్తించబడ్డాయి. నేనా వయసులో దానికేసి ఎంతో ముచ్చటగా చూశాను. అంత ముచ్చటగానూ చూసుకున్న రెండవ చిత్రం -

'హిందూదేశ పటం.'

నల్లని బ్లాక్‌బోర్డు మీద తెల్లని సుద్దముక్కతో గీసిన 'భరతఖండం'. ఈ రెండు చిత్రాలనూ పెన్నుల్తో, పెన్సిళ్లతో, సుద్దముక్కల్తో ఎన్నెన్ని చోట్లనో గీశాను. మా ఇంటి గోడల మీద సైతం అవే - నా నోటు పుస్తకంలో సైతం అవే-అట్ట లోపల ఇరువేపులా

వేసుకుని, ముందు సంవత్సరాల కోసం అట్టే పెట్టుకున్నాను.

'దేశపటం' వంటి ఓ చిత్రం ఏముందని అభం శుభం ఎరగని ఓ పసి హృదయాన్ని అంతగా హత్తుకుంది-అని కొందరు అడగవచ్చు-

మరి కొందరు దీనికి, పూవు పుట్టగనే పరిమళించునట్లు, దేశాభిమానం అనో, మరోటనో భాష్యం చెప్పవచ్చు.

నిజానికి 'నాది' అన్న మహత్తు తప్ప, దేశభక్తి అనేది ఆ చిరు వయసుకు చేతగాని పని.

అయితే నేనా చిత్రాలను ఏ స్ఫూర్తితో వేసుంటాను?

ఆనాటి నాలేత హృదయానికి ఈ 'భరత ఖండం' ఓ విచిత్ర రూపంలో, ఒక 'ఆవు'లా కనిపించింది.

చంద్రుడిలో 'జింక'ను చూసినట్లే నేను నా దేశపటంలో ఓ 'గోవు'ను చూశాను.

కాశ్మీరము దాని తలకట్టు లానూ, పంజాబు సింధులు దాని ముఖం లానూ, బర్మా రంగూన్‌లు దాని తోకలానూ, బెంగాల్ దాని చనుకట్టులానూ కనిపించసాగింది.

మతాన్నీ, సెంటిమెంటునీ అవతల పెట్టేస్తే... నిజానికి నా దేశ పటం 'గోమాత' లానే వుంది.

'అంబా' అని ఆవులించిన నోరులా బెలుచిస్తాన్ కనిపించగా, అడుగున శ్రీలంక దాని బుల్లి దూడలా ఒదిగి వుంది.

నేనా భావోద్రేకాలను ఏనాటికీ వివరించలేనేమో.

ఆరు బయలు వేసవి వెన్నెట్లో వెల్లకిలా పడుకుని, చల్లగా సాగిపోయే పున్నమి చంద్రుడిలోని 'జింక'ను చూస్తుంటే మనసెంతగా మైమరచి మురిసేదో, ఆ నల్లని బ్లాక్ బోర్డు మీద తెల్లని సుద్దముక్కతో గీసిన నా 'భరత ఖండం' ఓ 'గోమాత'లా కనిపించగా నా హృదయం చెంగున లేచి అప్పుడేపుట్టిన దాని లేగలా పరవళ్లు తొక్కేది. నా ఊహాంచలాన్ని తట్టి తన్మయ పరిచేది.

కాని ఇప్పుడు?

ఇప్పుడు నా హిందూదేశం 'గోవు' లా లేదు.

ఇప్పుడు నా హిందూదేశం 'అంబా' అని పాలు కుడవడానికి దాని లేగల్ని పిలిచే 'గోమాత'లా లేనే లేదు.

ఎందుకంటే-

'అంబా' అని పిలవడానికి దాని నోరేదీ?

దాని లేగలు పాలు కుడవడానికి దాని చనుకట్టేదీ?

ఇంటివద్ద నోటు బుక్కులో క్రిందటేడాది గీసుకున్న పటాన్ని తీసి నా ముందుంచుకుని రెంటినీ సరిపోల్చుకున్నాను. నా చిన్న చేతుల్తో తడిమి తడిమి చూసుకున్నాను.

ఎక్కడో ఏదో మోసం జరిగిపోయింది. ఎవరో ఈ దేశాన్ని మార్చేశారు. ఈ కొత్త పుస్తకం నన్ను ముమ్మాటికీ మోసం చేస్తోంది.

ఎప్పుడూ మంచి మార్కుల్తో పాసయ్యే నన్ను మా పక్కింటావిడ, నా క్లాస్ టీచరు ఫెయిల్ చేసింది. నా భవితవ్యాన్ని అస్తవ్యస్తం చేయడానికి నిర్దాక్షిణ్యంగా తన ఏకపక్ష నిర్ణయాన్ని నాపై అమలు పర్చింది.

ఆమె నా జీవన పురోగమనాన్ని ఒక సంవత్సరం వెనక్కి లాగితే, నా తండ్రి ఒక సంవత్సరం ముందుకు నెట్టారు.

నా భవిష్యత్తు పట్ల నా తండ్రి నిర్ణయం శ్లాఘనీయం.

కాని బలైపోయిన నాజాతి పిత పటాన్ని నా గదిలో ప్రతిష్టించి ముక్క చెక్కలై తరిగిపోయిన నా దేశపటాన్ని పొగొట్టుకున్న మనస్సుతో సజల నయనాల్తో నా యవ్వన కాలమంతా దిద్దాను.

'దిక్కులు-ఎల్లలు' లోకానికెంత నిత్య సత్యమో, నా దేశపటం అంతటి నిత్యసత్యం అనుకున్న నా విశ్వాసం వమ్మైపోగా– నేను నా చదువును పూర్తి చేశాను.

చదువు పూర్తయిందన్న సంతోషంతోనూ, నేను స్వతంత్రుణ్ణి అవ్వాలన్న ఆకాంక్షతోనూ జీవితంలోకి అడుగుపెట్టాను.

పత్రికల్ని తిరగేసి అర్హతున్న ప్రతి చోటకీ ఉద్యోగం కోసం దరఖాస్తు పెట్టాను. ఇంటర్వ్యూ వచ్చిన ప్రతి చోటకూ లేదనకుండా వెళ్లాను.

అయితే ఈ నా భరత ఖండంలో నే వెళ్లిన ప్రతిచోటా ప్రశ్నలే ఎదురైనాయి. ఎందుకంటే ఆ ప్రశ్నలు అలాంటివి.

నీదే ప్రాంతం వాడివి? నీదే జాతి వాడివి? అన్న ప్రశ్నలు అడగడంలో వాళ్ల ఆంతర్యం ఏమిటి?

ఈ నా దేశం 'మతం' ప్రాతిపదికగా ముక్క చెక్కలయింది.

ఈ నా దేశం 'కులం' ప్రాతిపదికగా కుమ్ములాడుకుంటోంది.

మతం అడ్డుగోడల్ని కూల్చి, కులం సంకెళ్లను తెంచి, కేవలం భారతీయుణ్ణనే అంకిత భావంతో బతికే మనిషినీ,సమాజాన్నీ నా దేశం ఏనాటికీ అందివ్వలేక పోయింది. నాల్గు పుష్కరాల సుదీర్ఘకాలానంతరం, ఈ స్వతంత్ర భారతం 'నీవు-నేను' అన్న భేదభావాన్నుండి 'మనం' అన్న ఐక్య భావానికి మనిషిని తీసుకు రాలేక పోయింది. అందుకని వాళ్లడిగిన ప్రశ్నలన్నిటికీ నా అభీష్టానికి వ్యతిరేకంగా మనసు చంపుకుని సమాధానాలు చెప్పవలసి వచ్చింది.

నీదే 'కులం' అన్నప్పుడు 'భారతీయుణ్ణి' అంటే నాది తలబిరుసు సమాధానం అంటారు. పొగరు బోతుగా జమకడతారు.

నీదే 'మతం' అన్నప్పుడు 'భారతీయుణ్ణి' అంటే నా మీద కళ్లెర్రజేసి 'కులం, మతం

లేకుండా మనిషి ఎక్కడైనా వుంటాడా ఈ దేశంలో' అని తిరిగి ప్రశ్నిస్తారు.

నీదే 'ప్రాంతం' అన్నప్పుడు 'భారతీయుణ్ణ'ని అంటే అది తమ ప్రశ్నకు సమాధానం కాదంటారు. నాకేసి అనుమానంగా చూస్తారు. ఏ దేశద్రోహిగానో, అంతకన్నా నీచంగానో పరిగణిస్తారు. కొందరికది నేరంగానూ అనిపించవచ్చు. మరి కొందరి కది విపరీతంగానూ వినిపించవచ్చు. అలాంటప్పుడు నేను భారతీయుణ్ణన్న నేరానికీ, నా తలబిరుసు సమాధానానికీ నేను నిలుచున్న నేలకింది మట్టినీ, నేను పీల్చి వదిలిన గాలినీ ఏలినవారు పరీక్షకై పైకి పంపించనూ వచ్చు.

అందుకని 'భారతీయుణ్ణ'న్న సమాధానం చెప్పి నేరస్థుణ్ణి కాదలచుకోలేదు. వినమ్రుడనై అడిగిన ప్రతిదానికీ వాళ్ల అభీష్టం మేరకే సమాధానం చెప్పాను.

కానీ అన్ని తత్వాలకూ ఆలంబనైన ఈ గడ్డమీద అంత తేలికా ఓ ఉద్యోగం రావడం–

నా ఉద్యోగాన్వేషణలో నేనీ భారతావనిలో తిరగని దిక్కుల్లేవు. చూడని ఎల్లల్లేవు. కార్బను పేపరుతో దేశపటాన్ని దిద్దినట్టే మళ్లీ నా దేశ పటాన్ని ఈ రూపేణా నేను మరోసారి కాళ్లకు బలపాలు కట్టుకుని పూర్తిగా దిద్దాను.

ముక్క చెక్కలైన ఈ దేశాన్ని తిరగడానికే ఇంతకాలాన్నీ, ధనాన్నీ వ్యర్థంగా వెచ్చించవలసి వస్తే, ముక్క చెక్కలు గాని ఆ నాటి అఖండ భారతమే నేటికీ వుంటే, నేనింకెంత వ్యయప్రయాసలకు లోనై ఇంకెంత కాలాన్ని ఇలా వృధా చేయాల్సి వచ్చేదో కదా అనుకున్నాను.

నిజమే! నేను నా ఉద్యోగాన్వేషణలో పొందిన అసంతృప్తినీ, అలసటనీ అంత తేలికగా కొట్టిపారేయ తగింది కాదు.

తరిగిపోయిన నా భారతదేశం ఈ రకంగా నాకు ఊరట కల్గించడం ఏమాత్రం సంతోషించ తగిన విషయం కాదని నా మనసుకు తట్టి, నా సంకుచిత భావానికి సిగ్గు పడ్డాను. కానీ ఇంకా సిగ్గు పడాల్సినవి జీవితంలో ఎన్నో జరిగాయి.

నాకు ఉద్యోగం దొరికింది.

ఏటికి ఎదురీది ఓడిపోయిన వాళ్లకు నలుగురు నడిచిన త్రోవే మంచిదనిపించడంలో ఆశ్చర్య మేముంది?

నేనూ ఉద్యోగం చేస్తున్నాను.

నెల నెలా నాకు నెల జీతం అందుతోంది. కుటుంబం కొదువ లేకుండానే ముందుకు సాగుతోంది.

కానీ ఈ ఉద్యోగంలో నేనేపాటి సుఖపడుతున్నాను?

ఈ అసంతృప్తికి గల కారణం ఏమిటి?

'జాబ్ ప్లజర్' అనేది ఏ కొద్ది మందికో తప్పించి మిగతా వాళ్లెవరికీ అందని అపురూప వస్తువీనాడు.

ఈ వ్యవస్థలో సిన్సియారిటీకి గుర్తింపు లేదు.

ఓ చెల్లని రూపాయికున్న విలువ చెల్లే రూపాయికి లేదు.

పని దొంగలకీ, లంచగొండులకీ, అసమర్థులకీ... వాళ్ల వాళ్ల కులాలు కవచకుండలాలు– వాళ్ల వాళ్ల ప్రాంతీయ తత్వాలు కంచుకోటలు.

వాటిని పరిరక్షించుకోవడం కోసం నిత్యం నిప్పులు చెరుగుతూ, కత్తులు నూరుతూ రావణ కాష్టంలా కాలుస్తుంటారు.

మానవుడే మరొక మానవుడి భవిష్యత్తుకు పునాది వేయాల్సిన ఈ తరుణంలో ఈ నా దేశంలో జరుగుతున్నదేమిటి? కేవలం నీతి నియమాలని ఏడ్చేవాళ్లు తప్ప మిగిలిన వాళ్లంతా హాయిగా జీవించడం తప్ప–

మిత్రుడా నీ వెందుకు ప్రేమిస్తున్నావంటే... నా కులం వాడవని – సోదరీ నీ వెందుకు ప్రేమిస్తున్నావంటే .. నా మతం వాడవని – మరి నీ వెందుకు ద్వేషిస్తున్నావంటే నా కులం వాడవు కాదని – ఇక నీ వెందుకు ద్వేషిస్తున్నావంటే... నా మతం వాడవు కావని– ఈ దేశానికి స్వతంత్రం ఎందుకు వచ్చినట్టు!

ఈ నలభై ఏళ్లలో ఏలినవారు ఏం సాధించినట్టు –

మిసైల్ రాకెట్టులా...? మిలిటరీ ప్లైటూనులా?

రూర్కెలా, భిలాయిలా? భాక్రానంగల్, నాగార్జునసాగరులా? ఆకాశ హర్మ్యాలా, ఆనకట్టలా, ఆటంబాంబులా, అణురియాక్టరులా? ఈ దేశం సాధించిన పరమార్థం ఏమిటి? ఏ స్వప్నం నిజం కావడానికీ స్వాతంత్ర్యం – ఈ దిగ్విజయం?

నేను ఉద్యోగానికి రాజీనామా సమర్పించాను.

నిర్మాణాత్మక శక్తిగా వుండాల్సిన నేను ఇంటిలో ఏకాకితనం అనుభవిస్తున్నాను.

అనైక్యత–

అనైక్యతలో ఎప్పుడూ ప్రమాదం పొంచే వుంటుంది. నా ఈ జాతి 'దేశభక్తి' అనే తలుపు తట్టే వరకూ ఈ దేశంలో ప్రశాంతత వుండదు.

సాయంకాలం నీ రెండ చల్లగా జారుకుంది.

నేను నా గదిలో కూచుని పుస్తకంలో మునిగిపోయాను. కారల్ మార్క్స్ రాసిన 'భారత తొలి స్వాతంత్ర్య సంగ్రామం' అది. కొందరు దీనిని 'సిపాయి మ్యూటినీ' అన్నారు.

నేను ఆలోచనలో పడ్డాను. "సిపాయిలు ఎందుకు కలహించినట్టు?" అని – అప్పుడు నన్ను ఓ రెండు చేతులు వెనగ్గా వాటేసుకున్నాయి. మృదువుగా... మెత్తగా...

ఆ స్పర్శిస్తున్న చేతులు ఎవరివో నాకు తెలుసు. ఆ చేతులు నన్నెప్పుడూ అలానే లాలనగా స్పర్శిస్తూ వుంటాయి.

వాడు మా చిన్న కొడుకు – నాల్గో తరగతిలోకి వచ్చాడు.

వాడు తన పాఠ్యపుస్తకాన్ని తెరిచి నా ముందుంచాడు. అందులోని పటాన్ని నన్ను గీసి పెట్టమన్నాడు.

నేను వాడి కళ్లల్లోకి చూశాను. ఆ కళ్లల్లో అచంచలమైన విశ్వాసం- వాడు భారతదేశ పటాన్ని నా ముందుంచాడు.

నేనా 'భారతదేశం' వైపు తిరిగాను.

ఎప్పటివో అనేక జ్ఞాపకాల దొంతర్ల అట్టడుగున ఓ చిన్న నిప్పు రవ్వలా ప్రజ్వరిల్లుతూ ఆ నాటి నా హృదయాన్ని కలచి వేసిన సంఘటన-ఇప్పుడు మళ్ళీ గుర్తు కొచ్చింది.

నిప్పుకణం నివురు కప్పి వున్నా.. పైకి ఏమీ లేనట్టే కనిపిస్తున్నా, ఏ చిరుగాలికో రాజు కుంటుంది. ఏసుడిగాలికో ప్రజ్వరిల్లుతుంది. ఏ ప్రభంజనానికో పరిసరాల్ని దహించి వేస్తుంది.

జ్ఞాపకాలూ అలాంటివే-

వాడు నా ముందుంచిన దేశపటాన్ని చూస్తున్నాను. వయసు మీద పడ్డంతో చూపు కాస్త సన్నగిల్లింది. కళ్లద్దాలు సరిచేసుకుని, ఆ పటం కేసి దృష్టి సారించాను.

అయినా నా దేశం ఇంకా అలుక్కుపోయే కనిపిస్తోంది.

ఎన్నో అనుభవాల మధ్య... ఎన్నో జ్ఞాపకాల మధ్య...

ఎన్నో చేదు నిజాల మధ్య నా భారతదేశం-

పంజాబులో-కాశ్మీరులో-

దృఢంగా కదిలే నా చేయి కొంచెం వణుకుతోంది... ఏదో అనుమానంతో వెనకాడుతోంది. నా భారతదేశ పటాన్ని నేను మళ్లీ గీయడానికి-

** 8-3-91 ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక*

***రాజమండ్రి***
***30.1.1990***

# దృష్టి

ఒకప్పుడు వాళ్ళిద్దరూ ప్రేమికులు.

ఆ తర్వాత భార్యాభర్తలు.

ఏడేళ్ళ కొడుక్కీ, ఐదేళ్ళ కూతురికీ నేడు అమ్మానాన్నలు.

ప్రస్తుతం వాళ్ళొక ఇంటివాళ్ళు...(ఇల్లు గలవాడేనట ఒక ఇంటివాడు)

ఆ ఇల్లు కొత్తదీ, అందమైనదీ...

చూడ చక్కని లాన్‌లో, ముచ్చటైన ప్లాన్‌తో, అన్ని హంగుల్తో, అతి సుందరంగా, ఆసాంతం మాడరన్‌గా వుంది.

వాళ్ళు కింద షాబాత్ ఫ్లోరింగ్ చేయించారు. గోడలకు పాలరాతి అంటింపులు అంటించారు. సింగిల్ లీఫ్ డోర్స్నూ, గ్లాస్ విండోసూ పెట్టించారు. వాటికి అందమైన కర్టెన్లు వేలాడదీశారు. ప్రతి బెడ్‌రూమ్‌కీ అటాచ్డ్ బాత్‌రూమ్ లున్నాయి. ఓవర్‌హెడ్ టాంకుంది. గదిగదికీ సింకులున్నాయి.

అందానికి లోటేమీ లేదు.

వచ్చినవాళ్ళా యింట్లో ఆశ్చర్యంతో నోరు వెళ్ళబెట్టారు.

వాళ్ళిద్దరూ ఒకే యూనివర్శిటీలో ఒకే సంవత్సరం-

ఆమె ఎమ్మే; అతను హౌస్సర్జన్-

అందుకని ఆ యూనివర్శిటీ నుండి వాళ్ళు ఒకే సంవత్సరం డిగ్రీ తీసుకుని, ఒకే సంవత్సరం భార్యాభర్తలయ్యారు.

అలా అయ్యాక భార్య సొంతవూళ్ళో అతను ఓ పేరున్న డాక్టరు వద్ద ఏడాదిన్నర పాటు అసిస్టెంటుగా చేసి, ఆ వెనువెంటనే ఆ పక్క వీధిలో తన సొంత ప్రాక్టీసును ప్రారంభించాడు.

పెద్ద అనుభవం లేకపోయినా పెద్ద పేరు మాత్రం వచ్చేసింది.

నాల్గు చేతులా గడింపు...

అందుకని బ్యాంకు అకౌంటు పెరిగింది. అది అందమైన ఇల్లుగా మారింది.

---

అందులో...

ఆమె శశిబాల; అతను కిరణ్‌కుమార్.



శశిబాల అందమైనది.

ఆమె కళ్ళెప్పుడూ అందాన్ని గాలిస్తాయి.

అందం సుఖాన్నిస్తాదన్నది ఆమె విశ్వాసం. సుఖం అందంలోంచే పొందాలన్నది ఆమె సిద్ధాంతం.

కిరణ్‌కుమార్ బొద్దు మీసాల్తో, లావు కళ్ళద్దాల్తో అందంగా వుంటాడు. అతను తరచూ అమ్మాయిల్లో అందాన్ని వెతుకుతూ వుంటాడు. అలా వెతగ్గా, యూనివర్శిటీ కాంపస్‌లోనూ, రైలు కంపార్టుమెంటులోనూ, ఫామిలీ ఫ్రండ్ ఇంటిలోనూ శశిబాల దొరికింది.

ఆమె దొరగ్గానే అందాన్ని చూసీ, ఆమె వెనక ఆస్థిని చూసీ, అతని కళ్ళు మిలమిల్లా డాయి. ఆమెను పెళ్ళి చేసుకోలేకపోతే అతని బతుకు బతుకే కాదని మనసు విలవిల్లాడింది.

అందుకని అమాంతం ఆమెను ప్రేమించేసి, ఆ వెనువెంటనే ఆమెను పెళ్ళి చేసేసుకున్నాడు. అలా చేసుకున్నాక తన భార్యా, తన బిడ్డలూ, తన ఇల్లూ తప్ప వేరేదేదీ అతని దృష్టికి రాలేదు. అంటే అతని దృష్టి తన పేషంట్ల మీద ఏ మాత్రం లేదని దాని నిర్వచనం కాదు. అతని ప్రాక్టీసు దినదినాభివృద్ధి చెందుతూ మూడు పువ్వులూ, ముప్పయ్యారు కాయలూ కాస్తున్నాయంటే ప్రజల మీద ఓ కన్ను తప్పనిసరిగా వేయకుంటే ఆయనకు సాధ్యమయ్యే పనా యిది...

అక్కడికి వచ్చేవాళ్ళు ముక్కుతూ మూల్గుతూ వస్తారు. గుండెజబ్బు వాళ్ళూ, మామూలు జబ్బు వాళ్ళూ, బీపీ వాళ్ళూ, టీబీ వాళ్ళూ, వీడీవాళ్ళూ... ఒకరేమిటి - అందరూ వస్తారు.

వాళ్ళంటే అతని కెంతో యిది...

వాళ్ళని చూడాలేగాని, చూశాక అతని ప్రాణం లేచి వస్తాది. వాళ్ళు అర్ధరాత్రి వచ్చినా, అపరాత్రి వచ్చినా, విసుగనిపించకుండా ఎలాంటి నిద్రనైనా కాచి వాళ్ళకు సేవలందిస్తాడు.

ఎందుకంటే... వాళ్ళ వెనుక ధనరాశులుంటాయి. ఉన్నా లేకపోయినా అవి తప్పనిసరిగా కురుస్తాయి. అందుకని అతను వాళ్ళను చూస్తుంటే ముమ్మాటికీ అందమైన ముఖాల్ని చూసినట్టే ఫీలౌతాడు. వాళ్ళని చూడనినాడు ఆయన బిక్కచచ్చిపోతాడు... బెంబేలెత్తి పోతాడు... మరేమైనా అయిపోతాడు.

అందుకని శ్రీమతి శశిబాలకు గత పన్నెండేళ్ళ నుండీ ఈ విషయంలో కొంత అంతుబట్టీ, మరికొంత అంతుబట్టకా ఆమె గుండెల్లో ఏవేవో అనుమానాలు చోటు చేసుకున్నాయి. మరికొంతకాలం ఇలానే సాగితే ఈయన గార్కి ఆరోగిష్టి ముఖాల్లో తప్ప మరెక్కడా ఏ సుఖాన్నీ ఆశించలేరేమోననీ, ఏ అందాన్నీ ఆనవాలు కట్టలేరేమోనని అనుమానం కలిగింది. ఈ అనుమానం ఆమె మనసులో ఏ మూలనో చిన్నగా పుట్టినా అది

రోజురోజుకీ పెరిగి పెద్దదై జీవితాంతం వ్యాపించక ముందే ఆమె తన అభిప్రాయాన్ని తప్పనిసరిగా త్రోసిపుచ్చవలసి వచ్చింది.

ఎందుకంటే...

తాము కట్టుకున్న ఇంటిని అందంగా తీర్చి దిద్దాలన్న ఆమె కోర్కెను అతను ఓ.కే చేశాడు. అందుకోసం అతను ఎన్నో వ్యయప్రయాసలతో విలువైనవీ, అరుదైనవీ, అందమైనవీ, ఫర్నీచరూ వగైరాలు సేకరించి, వాటిని ఒక పద్ధతిగా, అతి సుందరంగా అమర్చాడు.

అందుకని ఆమె అతడిలోని ఈ గొప్ప సుగుణానికి మురిసి ముగ్ధురాలయింది. అలా ఆ కొత్త ఇల్లు కొత్త అందాల్ని సంతరించుకుంది. అయినా అందానికి హద్దెక్కడ? ఆ ఇల్లు మరింత అందంగా, మరింత కళాత్మకంగా రూపు దిద్దుకోవాలన్న ఆమె కోర్కెను అతను కాదనలేదు.

డాక్టర్లకు అందమైన ఇల్లు ఒక ఎసెట్...

అది పలుకుబడికీ, ప్రాక్టీసు పెరుగుదలకూ సరియైన మెట్టు-

అందుకని అతను ఆమెమాట ఎలా కాదనగలడు. అందుకే కిరణ్ కుమార్, శశిబాల రాజధానికి వచ్చి, ఓ అధునాతనమైన హోటల్లో దిగారు.

పన్నెండేళ్ళ తర్వాత మళ్ళీ వాళ్ళా నగరాన్ని ఆహ్లాదంగా చూస్తున్నారు. వాళ్ళక్కడ చదువుకున్న రోజుల్ని నెమరువేసుకుంటూ, పూర్వస్మృతుల్ని పునరావృతం చేసుకుంటూ, బిజీ సెంటర్లలోని షాపుల్ని ఒక్కొక్కటే దర్శించుకుంటూ, నచ్చిన వస్తువుల్ని ఖరీదు చేసుకుంటూ బిజీగా గడిపేస్తున్నారు.

ఇప్పుడా నగరంలో ఎటు చూసినా జనం-

రోడ్లన్నీ వెడల్పయ్యాయి... ట్రాఫిక్ పెరిగింది... దాని వేగమూ పెరిగింది.

అంతస్తుల మీద అంతస్తులు లేచి ఆకాశ హర్మ్యాలు ఆకాశాన్నంటాయి.

ఎప్పుడో ఫ్రాకుల్లో అమ్మాయి పదేళ్ళ తర్వాత వళ్ళంతా యవ్వనాన్ని నింపుకుని, చీరల్లో సొగసంతా సింగారించుకుని మళ్ళీ దర్శనమిచ్చినట్టు, ఆ నగరం మళ్ళీ వాళ్ళకు దర్శనమిచ్చింది.

అంత మాత్రాన అమ్మాయి రూపు రేఖలు మారనట్టే, ఆ నగరం రూపురేఖలు కూడా మౌలికంగా మారలేదు.

రోజూ సాయంకాలం అయ్యాక షాపింగ్ ముగించుకుని, ముఖ్యమైన స్నేహితులను విధిగా కలుసుకుని, అక్కడ ఓ పార్టీతోనో, పిక్చర్ తోనో, డిన్నర్ తోనో ఆ సాయంకాలాన్ని ఓ ఆహ్లాదకరమైన సాయంకాలంగా మార్చేసి, తిరిగి ఉదయం కాగానే మళ్ళీ షాపులకి బయల్దేరడం-

ఇలా మూడు రోజులు గడిచాయి.

ఈ రోజు తప్పనిసరిగా ఓల్డు సిటీకి వెళ్ళాలి...అక్కడ లాట్ బజార్ లో ఏంటిక్ వి, వాటి నమూనాలని అందమైనవి వుంటే ఖరీదు చేయాలి...

అందుకని వాళ్ళిద్దరూ సిటీబస్ ఎక్కారు. అది మెయిన్ రూట్లల్లో నున్నని ్పటి రోడ్లమీంచి వేగంగా పరుగులు తీస్తుంది. వాళ్ళిద్దరూ పక్కపక్కనే కూచొని లోంచి బయటికి చూస్తున్నారు. ఇరుపక్కలా లేచిన ఎన్నో గొప్ప కట్టడాలు వాళ్ళ న్నల్లో కదలాడి వెనక్కి జరిగిపోతూ కనుమరుగౌతున్నాయి.

శశిబాల తాను సంచరిస్తున్నంత మేరా పాతజ్ఞాపకాలతో ఉక్కిరిబిక్కిరి అవుతోంది. ్డ సిటీ బస్సుల్లో వెళ్తూ యూనివర్శిటీలో చదువుకుంటూ గడిపే రోజులు ్చాయి..

ఆ కవ్వించే కళ్ళూ...చిరునవ్వులు చిందించే ఆముఖాలూ ఆమె స్మృతి పథంలో ా నిన్నమొన్నటివి లానే ఫ్రెష్‌గా కదుల్తూనే వున్నాయి. ఇంకా తనని పలకరిస్తున్నట్టే యి.

వాళ్ళిప్పుడు ఎక్కడున్నారో....

శశిబాల కిరణ్ ప్రక్కనే కూచుని ఇంకా ఇలాంటివే ఏవేవో ఆలోచనలు సాగిస్తోంది. ో చెకింగ్ ఇన్‌స్పెక్టర్ వచ్చి టిక్కెట్లు చూపమని డిమాండ్ చేశాడు.

కిరణ్‌కుమార్ తాను తీసుకున్న టిక్కెట్లు ఇచ్చాడు.

శశిబాల ఈసారి మరింత ప్రత్యేకించి అతనికేసి చూసింది. ఇతన్ని ఎక్కడో ంట్టున్నానే అని అనుమానంగా అనుకుంది. కాని ఎక్కడ చూసినట్టు అతన్ని....

గుర్తుకొస్తోంది-

ఔను! అతనే... తాను యూనివర్శిటీకి వెళ్ళే రోజుల్లో రోజూ తానెక్కే సిటీబస్‌లో కండక్టరుగా వస్తుండే వాడు.

కాని శశిబాల తన కళ్ళను తానే నమ్మలేకుండా వుంది.

అతనిప్పుడు అతనిలా లేడు.

అతను కేవలం ఓ కండక్టరు మాత్రమే...కాని అందగాడు-

చలాకీతనం, చిలిపితనం అతని సొత్తులా వుండేవాడు. కళ్ళల్లో కొంచెం కైపూ, ొంచెం కవ్వింపూ వుండేవి. శరీరపు మెరుపో, యవ్వనపు సొంపో.... మొత్తానికి ికివారి చూపుల్ని శాసించేవి.

అలాంటి అతనేనా ఇతను-

అతనిప్పుడు అతను కాడు.

ఆ ముఖంలో ముక్కూ, నోరూ, కళ్ళూ, చెవులూ మినహా మరేమీ మిగలని ంర ముఖం-

జుట్టు కాస్త నెరిసింది. వళ్ళు కాస్త నలిగింది.

మొమ్మాటికీ అతనిప్పుడు అతను కాడు.

అందం ఉడిగిన దిగంబర ముఖాన్ని ఆమె చూస్తోంది.

ఆమె మనసు చివుక్కుమంది.

అందంపట్ల "ఓహో" అనటానికీ, అది వాడి వత్తలైతే "అయ్యో" అనడానికీ ఆ ం వాళ్ళ వాళ్ళ సొంతమే కానక్కరలేదు.

ఆమె తన చేతిలోకి కిరణ్ చేతిని తీసుకుని మరింత బలంగా అదిమి పట్టుకుంది.

కిరణ్ పక్కనే శశిబాల కూచున్నా అతను మాత్రం తన నర్సింగ్ హోమ్ గురించే తదేకంగా ఆలోచిస్తున్నాడు. అతనిన్నాళ్ళూ తన క్లినిక్‌ని మరచి ఎక్కడా ఉండలేదు. అందుకని అతనికి బెంగగా వుంది. అతనీ నగరంలో ఒకప్పటి తన మెడికోస్ ఈనాడెలా తన సొంత ప్రాక్టీసుల్లో డబ్బును చేతుల్లో పండించి, దోసిళ్ళలోకి ఎత్తుకుంటున్నారో కళ్ళారా చూసేసరికి, అతని బెంగ మరింత పెరిగింది.

ఓ డాక్టరు గొప్పతనాన్ని కొలిచే గొప్ప సాధనం అతనెన్ని వేల ప్రజలమీద గడించాడన్నాదే-

ఆ డబ్బు సంపాదించడానికి ఇక్కడ ఎన్నెన్ని మార్గాలున్నాయో, అవి ఎంత సులభ తరమో చూసి చకితుడయ్యాడు. అవన్నీ ఇప్పుడు అతన్ని ఉత్తేజితుణ్ణి చేస్తున్నాయి.

అందుకని అతనికి తన క్లినిక్ మీద బెంగతిరిగింది.

స్టేజి వచ్చింది.

ఇద్దరూ బస్ దిగి స్టేజిలో నిలుచున్నారు.

ఎదురుగా శతాబ్దాల నాటి కట్టడం.... ఒకప్పటి చక్రవర్తుల గాంభీర్యానికి అది ప్రతీక. దాన్ని తిలకించడం కోసం దేశ విదేశాలనుండి వచ్చి ఎందరో అక్కడ నిలుచున్నారు. వాళ్ళంతా కెమేరాలు తీసుకుని ఆ అపురూప సౌందర్యాన్ని దానిలో బంధిస్తున్నారు.

ఆమె మనసూ స్పందించింది.

ఆ పక్కనే వున్న ఆకాశ హర్మ్యాలు కూడా గొప్ప కట్టడాలే- అధునాతనంలో ఒకదాన్ని మించి ఒకటి పోటీలు పడుతున్నాయి. అయినా సరే, వాటికేసి ఆ అనుభూతితో ఎవరూ చూడరు... ఆ ఆశ్చర్యాన్ని పొందరు-

శశిబాల కిరణ్‌కుమార్‌లు లాట్ బజార్‌లో షాపులన్నింటినీ తరచి తరచి చూచి, నచ్చిన వాటిని ఖరీదు చేశారు. వాటిలో ఒకటి తైలవర్ణచిత్రం, మరొకటి పాలరాతి శిల్పం.

రెండూ గొప్ప కళాత్మకంగా మలచినవి....ఏంటిక్‌మాడల్స్‌వి...

వాటి ఖరీదు కాస్త ఎక్కువయినా గొప్ప అపురూపంగా వున్నవి.

ఆ సాయంత్రం వాళ్ళు ఈ నాల్గురోజులుగా ఖరీదు చేసినవన్నీ తమ ముందుంచుకున్నప్పుడు వాళ్ళల్లో గొప్ప సంతృప్తి కలిగింది.

అప్పుడు తిరిగి ఇల్లు గుర్తొచ్చింది

✿ ✿ ✿

నాల్గు రోజులు ఎంత హడావుడిగా గడిచాయి.

ఆ నాల్గు రోజులూ ఎంత హాయిగా, ఆహ్లాదంగా గడిచాయి.

ఇప్పుడు తన ఊళ్ళో....మళ్ళీ తన ఇంట్లో....

వాళ్ళు ఖరీదు చేసి తెచ్చినవన్నీ గతమూడు రోజులుగా క్షణం తీరిక లేకుండా ఒక్కొక్క గదిలోనూ ఆమె "డిస్‌ప్లే" చేసింది.

ఇక శశిబాలకు ఆ ఇంట్లో ఏమీ తోచనంతటి విరామం- తాను కాపురానికి

వచ్చినప్పటి నుండీ ఆ ఇంట్లో తనకు ఇలానే రాత్రింబవళ్ళూ కావలసినంత విరామం.

ఆ గదులన్నిటినీ కలయచూస్తుంటే ఆమె మనసు ఆనందంతో, ఆహ్లాదంతో దూది పింజలా పైపైకి ఎగసిపోయింది.

✿ ✿ ✿

శశిబాల కిరణ్ కోసం ఎదురు చూస్తోంది.

అప్పుడు రాత్రికి నిద్రొస్తున్నట్టూ-

శబ్దం మూగబోయినట్టూ-

చీకటి వంటరిదైనట్టూ-వుంది.

అవతలి బెడ్ రూమ్‌లో తన ఇద్దరు పిల్లలూ చదివి చదివి అలసటగా నిద్రిస్తున్నారు.

ఆమె తన బెడ్ రుమ్‌లో డబుల్ కాట్ మీద వెల్లకిలా పడుకుని హాయైన ఆలోచనలు సాగిస్తూ అతనికోసం ఎదురు చూస్తోంది.

ఆమె తన గది నంతనీ కలయచూసింది.

గదిలో సన్నని నీలపు కాంతి విచిత్రంగా పరుచుకుంది.

ఆమె దృష్టి ఎదురుగా పాలరాతి శిల్పంపై నిలిచింది.

లాట్ బజారునుండి ఏరికోరి తెచ్చిన అపురూప కళాఖండం-మచ్చలేని తెల్లని పాలరాతి శిల్పం-

ఆ ఉదయమే ఆమె దానిని తన బెడ్ రూమ్‌లో నిలువెత్తు అద్దం వున్న డ్రస్సింగ్ టేబుల్ పక్కన, లతలు చెక్కిన ఎత్తయిన రోజ్‌వుడ్ స్టాండు మీద అపురూపంగా ప్రతిష్టించింది. విద్యుద్దీపపు నీలపు కాంతి ఆ శిల్పం మీద జల్లులై కురుస్తోంది.

దానికేసి చూస్తూ ఆ నిశ్శబ్దంలో ఆమె అవాక్కయ్యింది.

ఆ శిల్పం నగ్నంగా వుంది.

అది కేవలం మృతప్రాయంగా గోచరిస్తున్నా, చలనం లేని జడపదార్థమే అయినా, ఒక్కసారిగా చైతన్యవంతమై ఆమె హృదయాన్ని స్పందింపజేసింది.

ఆ శిల్పం... ఓ అలౌకిక శోభ-

అదొక నవరస సృష్టి-

సృష్టి శీలతను సంతరించుకున్న రహస్యమయత-

ఆ సౌందర్యం శశిబాల ఆలోచనల్ని ఒక్కసారిగా లయతో స్పందింప జేసింది.

ఆమె లేచి డ్రస్సింగ్ టేబుల్ మీద నిలువెత్తు అద్దం ముందు బరువెక్కిన కళ్ళతో నిలుచుంది.

ఆమె చీరలో నిండుగా, హుందాగా, అందంగా, ఆరోగ్యంగా వుంది.

ఆ కనుతీరూ....

ఆ ముక్కుతీరూ....

కోర్కెలూరించే కటితీరూ....

అందానికి లోటేమీ లేదు....ఆమె నవనాగరిక రతీదేవి-

ఆ శిల్పం కేవలం నగ్నంగా వుంది.

కనీసం నూలుపోగయినా మొలమీద లేకుండా దిగంబరంగా వుంది.

అయినా ఎంతో అందంగా వుంది.

ఇంకా ఇంకా చూడాలనిపించే అందం ఆ శిల్పానిది-

అందం అశ్లీలం అవుతుందా?

ఏ అందమూ అశ్లీలం కాదు-

ఆ శిల్పంలో అందం గురించిన స్పందన తప్ప దిగంబరత్వం తాలూకు అశ్లీలం గోచరించదు-నగ్నత్వాన్ని చూసిన సిగ్గు ముంచుకు రాదు.

ఆ శిల్పంలో యవ్వనానికి శాశ్వతత్వం వుంది, దాని పరాకాష్ఠగా నిలిచిన అందానికీ శాశ్వతత్వం వుంది.

వయస్సు ఆ అందాన్ని ఏమీ చేయలేదు.

ఆమెకు బస్ కండక్టరు గుర్తొచ్చాడు-

కేవలం ముక్కూ, నోరూ, కళ్ళూ, చెవులూ మినహా మిగిలినదంతా హరించుకు పోయిన, కళావిహీనమయిన దిగంబర ముఖం ఆమె కళ్ళ ముందు నిలిచింది.

శశిబాల మరింత ముందుకు కదలి అద్దంలో తనని తాను నిశితంగా చూసుకుంది.

చంద్రుడిలోని మచ్చలాగా తన శరీరం మ్మీద కూడా కాలం వేసిన కాటు కనిపిస్తోంది.

ఒకప్పటి తాను తాను కదేమో నన్న అనుమానం-

ఆకళ్ళల్లో ఇప్పుడా తళుకేది?....ఆ వొంటికా మెరుపేది?....

పొత్తి కడుపు కొంత జారి....

చాలు.... అంత చాలు....

వయసు చీకట్లు ఆమెసౌంధర్య జీవన కాంతుల్ని క్రూడ మసక పరచక మానదన్న నిజాన్ని తెలుసుకోడానికి అంత చాలు-

ఆమె అద్దంలోని తన ప్రతిబింబం మీంచి చూపును తీసి శిల్పం మీద నిలిపింది. ఆ చూపు శిల్పం పైనుండి కిందివరకూ ఒక్కొక్కటే స్పృశించింది.

ఆ నుదురూ, కనుబొమలూ, కనులూ, కనుకొనలూ,

సన్నని కొనదేరిన పొడవాటి ముక్కూ -

అధరాలూ, చెక్కిళ్ళూ-

పొడవాటి మెడకట్టూ, నున్నని భుజాలూ, గుండ్రని వక్షోజాలూ,

నాభి, కటి, తొడలు, చీలమండెలు, అరికాళ్ళు-

ఒక్కొక్కటే ఓ కవితా సృష్టి!

లోకంలో ఏ స్త్రీ మూర్తికీ లభించనంత లావణ్యం-

ప్రకృతి మనకిచ్చే సౌందర్యం కంటే మించిన సౌందర్యాన్ని సాధించిన ఆ కళాకారుడెవరు?!

ఊహల కందని ఉన్నత స్థాయికి పయనిస్తూ లక్ష్యాన్ని సాధించిన ఆ దీక్షాపరుడెవరు?

ఆ శిల్పంలో ప్రతి అంగాంగం మీదా శిల్పి అనిర్వచనీయమైన అందాన్ని కప్పాడు. కనుక అక్కడ దిగంబరత్వం కనిపించదు.

శశిబాల తిరిగి అద్దంలో తనను తాను చూసుకుంది-

ఆమె అందమైన చీరలో నిండుగా వుంది. కాని ఆ కనురెప్పల కింద నల్లని చీకటి రేఖ- పమిట కింద బిగితప్పిన గుండెలు -

ఇక్కడ ఈ నూలు వస్త్రం తొలగిందా... అంతా దిగంబరత్వమే- వయసు తన శరీరం మీది అందమనే అపురూప వస్త్రాన్నుండి తనను క్షణ క్షణం వివస్త్రను చేస్తున్నట్టే వుంది. తానుఅందరిలా రహస్యం పరిమితిని పెంచుకుంటూ, నగ్నత్వాన్ని కప్పుకుంటూ జీవిస్తున్నట్టే వుంది -

అసలు ఈ లోకంలో అసమాన్యుడెవరన్నా వున్నారనుకుంటే, అతనొక్క కళాకారుడు మాత్రమే అయ్యుండాలి... అనుకుంది.

ఆమె కిరణ్ కోసం నిద్రకాచి ఎదురు చూస్తోంది.

❀ ❀ ❀

గదిలోని చల్లని నీలపుకాంతి చలువ చేసినట్టు ఆ శిల్పంపై మిలమిల్లాడుతోంది.

శశిబాల, కిరణ్ కుమార్ లిద్దరూ నైట్ డ్రస్‌లో రిలాక్స్‌ంగా తమ మెత్తని డబుల్ కాట్ మీద కూచుని వున్నారు.

అతని దృష్టి ఆ శిల్పం మీద అలానే నిలిచి వుంది. దానిమీంచి ఏమాత్రం మరల్చ లేని ఏకాగ్రత అది-

ఆమె మౌనంగా అతనిలోకి చూస్తోంది.

అతని జవాబుకోసం అలా ఎదురు చూస్తూనే వుంది.

కిరణ్ తన చేతిలోని కాగితాలూ, క్లినిక్ సంబంధించిన కొత్త ప్లానులూ పక్కనే పెట్టేశాడు.

అతని చూపును శిల్పం మీంచి మరల్చి పైని ఎక్కడో నిలిపాడు...

'ఉత్తమకళ' అంటే ఏదని ఎలా చెప్పడం-

'డబ్బు' ఈ లోకంలో చాలా అందమైన వస్తువు... దాన్ని సంపాదించడం ఉత్తమ కళ... సంపాదించడం కన్నా ఉత్తమకళ ఏది? అన్నాడు దృఢ విశ్వాసంతో-

ఆమెను మృదువుగా పక్కమీద వాల్చి, బెడ్ లైట్ తీసేసినప్పుడు ఆమె పెదవి మెదపలేదు.

** ఆంధ్రజ్యోతి 1991 దీపావళి ప్రత్యేక సంచిక **

*రాజమండ్రి*
*డిసెంబరు 1988*

# తెల్లవారని జీవితాలు

చలి చీకటిని కావులించుకుంది. చీకటి మరింత చిక్కబడి కరుడు కట్టేసింది. ఆ చీకట్లో రైలుస్టేషనుకు దూరంగా పల్లంలో చంద్రయ్య టీ కొట్టు ఆరిన కుంపటిలా వుంది.

చంద్రయ్య స్టేషనుకేసి అలవాటుగా చూశాడు. అతను ఆత్రంగా కూడా చూశాడు. అతను ఎదురుచూస్తున్న పాసింజరుబండి ఇంకా రాలేదు. అది వస్తే బేరం చూసుకుని కొట్టు మూసెయ్యాలనుకున్నాడు. పదకొండు గంటలకే రావలసిన బండి అర్ధరాత్రి దాటినా రాకపోయేసరికి చికాకువేసి 'ఛీ! దీనమ్మ... రోజూ యింతే-' అంటూ మరో రెండు బూతులుకూడా జోడించి కోపాన్ని దిగమింగుకున్నాడు.

అది నారాయణపురం స్టేషను.

నారాయణపురం అంతా కలిసీ ఓ వంద గడప కూడా ఉండదు. చుట్టు పక్కల పల్లెటూళ్ళకోసం మెయిన్ లైను మీద ఓ రైలు స్టేషను కట్టి దాన్ని నారాయణపురం స్టేషను అన్నారు.

నారాయణపురంలో పాసింజర్లు తప్ప ఎక్స్‌ప్రెస్‌లు ఆగవు. ఎప్పుడో తను పెళ్ళిచేసుకున్న రోజుల్లో చంద్రయ్య ఈ టీ కొట్టు పెట్టాడు. అక్కడ అతనికి స్టేషనుమాష్టరుతో పాటు ఓ నలుగురు సిబ్బందిదీ, మరో పదిమంది పాసింజర్లదీ తప్ప మరో బేరం వుండదు.

చంద్రయ్య కిప్పుడు నడివయసు దాటిపోయింది. ఒంట్లో సత్తువ తగ్గింది. రూపు రేఖల్లోకూడా ఎంతో తేడా వచ్చేసింది. ఇన్నేళ్ళు గడిచినా నారాయణపురంలో గాని, ఆ చుట్టు పక్కల గ్రామాల్లో గాని ఎలాంటి మార్పూ రాలేదు.

చంద్రయ్య రైలు కోసం స్టేషను మీద ఓ కన్నేసి వుంచాడు. గంటమోగిన అలికిడి ఎక్కడా లేదు. అతనికి కునికిపాట్లు మరీ ముంచుకొస్తున్నాయి. కొట్టు మూసెయ్యాలనిపించింది. పాసింజరు బండి రాకుండా తానెన్నడూ కొట్టు మూసెయ్యలేదు. ఈ రోజు మూసెయ్యాలంటే ఏదో వెలితిగా అనిపించి మరోసారి బయటకు చూశాడు. చల్లగాలి విసురుగా లోనికి తోసు కొచ్చింది. పైని తాటాకుల మీద చినుకుల అలికిడై మరుక్షణమే

ఆగిపోయింది. అది వర్షమో కాదో చంద్రయ్యకు తెలీదుగాని చావులా చల్లని గాలి వీచింది.

అతను తడికె దగ్గరకు జేరేసి గోనె పట్టా దించేశాడు. బల్లలు రెండూ దగ్గరకు జేర్చి దానిమీద నడుంవాల్చి ముసుగారా కంబళి కప్పుకున్నాడు.

చంద్రయ్య పక్క వేశాడన్న ధీమాతో నారిగాడు కూడా పొయ్యి దగ్గిర ఓ మూలగా మెలికేసి పడుకున్నాడు. వాడికి నిండా పదేళ్ళు లేవు. వేలెడంత మనిషి. ఈ మధ్యనే చంద్రయ్య వాణ్ణి పనికి తెచ్చి పెట్టుకున్నాడు.

చంద్రయ్యకు బెంచీమీది పక్క వీపుకు ఒత్తుకుంటోంది. వెంటనే అతనికి నిద్రపట్టలేదు. వీలుకోసం అతను అటూ యిటూ దొర్లుతూవుండగా ఎక్కడో దూరాన్నుండి నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ రైలుకూత వినిపించింది. స్టేషనులో గంట కూడా అప్పుడే మోగింది.

చంద్రయ్య ముసుగు తీసి కటకటాల తడికెలోంచి ఔటర్ సిగ్నల్ కేసి చూశాడు.

'ఒరేయ్! నారిగా లేలే! బండి సైటయ్యిందిరా-లేచి నిప్పుల్రాజెయ్-లె గొస్-' అన్నాడు.

అప్పటికే నారిగాడికి నిద్ర బాగా పట్టేసింది. బలవంతంగా కళ్ళు తెరిచినా వాడి రెప్పలు మళ్ళీ వాలిపోతున్నాయి. వాడికి నిస్పృహ ఆవరించింది. వాడు అన్నిటినీ యీసడించుకుంటూ బొగ్గుల సంచికేసి నడిచాడు.

పాసింజరు బండి పెద్ద ఆర్భాటంతో స్టేషనులోకి వచ్చి అంత ఆర్భాటంతోనే వెళ్ళిపోయింది. గంటల తరబడీ కని పెడుతూ కూచున్న బండి కనిపెట్టినంత సేపు లేదు వచ్చిపోవడానికి.

చంద్రయ్య గోనెపట్టా ఎత్తేసి తడికె బార్లా తీసాడు. తాడుకు వేలాడుతున్న హరికేను లాంతరును విప్పేసి బల్లమీద పెట్టి వొత్తి పెద్దది చేశాడు. ఓ నలుగురన్నా పాసింజర్లు వస్తే ఓ నాలుగు టీలన్నా కరుసైతే ఓ పావలా డబ్బులు వస్తాయన్న ఆశతో కూడిన ఆలోచన అతనిది. అతని కిలా ఆలోచించడం కొత్తమీ కాదు. సంవత్సరాల తరబడి అయాచితంగా వస్తున్న ఆలోచనది. అతని బతుకంతా అలవాటైన ఆలోచనది. అందుకని చంద్రయ్య చూపంతా కాలిబాట మీదనే వుంది. చూపంతా చీకటిని చీల్చుకుంటూనే పోతోంది.

పాసింజరు బండి వెళ్ళిపోయికూడా ఎక్కువసేపే అయింది. ఎవరైనా బండి దిగివుంటే ఈపాటికి కొట్టు ముందుకు వచ్చేవాళ్ళేనని తెలుసు. ఇంకెవ్వరూ రారన్న అనుమానంతోనే మరోసారి దారికేసి చూశాడు.

నారిగాడు కాసిన్ని బొగ్గులు తెచ్చి పొయ్యి దగ్గర పెట్టి పొయ్యి వెలిగించే ప్రయత్నంలో వున్నాడు.

'ఒరేయ్! బొగ్గులెయ్యకురా-- బేరాల్లేవు-' అన్నాడు చంద్రయ్య. నారిగాడు కాసేపు కూచుని నెమ్మదిగా ఇందాకటి చోటుకే పోయి మెలికేసి పడుకున్నాడు.

చం(దయ్య చుట్ట ముట్టించి బల్లమీద నడుం వాల్చాడు. ఇప్పుడిక బేరం కోసం ఎదురు చూడవలసిన అవసరం గానీ అలా ఎదురు చూడ్డంలో కలిగే అలసట గానీ లేదు.

కాలుస్తున్న చుట్ట సగం పైగానే తరిగిపోయింది. మనసు తేలికపడింది. ఆ కటకటాల తడికెలోంచి రైలు స్టేషనూ దానికి అవతలి ఔటరు సిగ్నల్‌నూ చూస్తూ మనసు మరింత తేలిక పరుచుకున్నాడు.

చం(దయ్య కాలుస్తున్న చుట్ట ఒకటి రెండుసార్లు వేళ్ళ సందుల్లోంచి జారి పోయింది. చుట్ట పూర్తిగా కాలకముందే ని(ద ముంచుకొచ్చేసింది. అందుకని చుట్ట బొడ్డును గోడకు రాసేసి బెంచి కింది కోడుకు జేరబెట్టాడు. వెళ్ళి తడికె జారేసి గోనెపట్టా దించేశాడు.

వాకిట్లో ఎవరో వచ్చిన అలికిడి.

'టీ దొరుకుద్దయ్యా-'

చం(దయ్య కాస్త నిదానించాడు. ఆరిపేయబోతున్న హరికేను లాంతర్ను బల్లమీద పెట్టేసి గోనెపట్టా పక్కకు నెట్టి చూశాడు.

ఎవరో మనిషి! రైల్లోంచి దిగిన పాసింజరులా లేడు. అతని చేతిలో మరీ పాత సైకిలొకటి వుంది. ఆ సైకిలు టైర్లకు బాగా పట్టిన కంకర దుమ్ము ఆ దీపం వెలుగులో స్పష్టంగా కనిపిస్తోంది. అతను గుమ్మం ముందు ఆగి టీ వుందా అని మళ్ళీ అడిగాడు.

చం(దయ్య వుంది అన్నాడు.

అతను సైకిల్ని పాకకు జేరేసి లోని కొచ్చాడు.

చం(దయ్య నారిగాడి వంక చూశాడు. పాపం వాడు బాగా అలిసిన మీదట వొళ్లెరగ కుండా ని(దోతున్నాడు.

చం(దయ్య పొయిలో బొగ్గుల్ని రేకుకాడతో కెలికాడు. అడుగున ఒకటి రెండు నిప్పులు కనిపించాయి. మిగిలినవి కాలి నుసైపోయాయి. బూడిద కిందికి దులిపేసి రేకుచేటలో బొగ్గుల్ని పొయిలో పేర్చి విసనక(రతో కాస్సేపు విసిరాడు. అవి నెమ్మదిగా రాజుకున్నాయి. పాలకాగును దాని మీద పెట్టాడు.

చం(దయ్య ఆ చుట్టుపక్కల పల్లెవాళ్ళందరినీ కొద్దో గొప్పో ఎరుగును. కాని ఈ వచ్చినతన్ని ఎక్కడా చూసిన గుర్తు లేదు. మరోసారి అతనికేసి నిదానించి చూశాడు. దూరాన్నుండి రావడం వల్ల కాబోలు అతనిలో బాగా అలసట కనిపిస్తోంది. తొందరగా వెళ్ళి పోవాలనే ఆదుర్దా కూడా కనిపిస్తోంది. మరొకప్పుడైతే అతను ఎవరైనదీ, ఎక్కణ్ణించి ఎక్కడికి ఏం పనిమీద వెళ్తున్నదీ అడిగి అతని ఆచూకీ తీసేవాడే- కాని చం(దయ్య కీరోజు అలసటగా వుంది. అందుకని ఏమీ అడక్కుండానే బల్లమీద కూచొని వస్తున్న ఆవులింతల్నీ, ని(దనీ ఆపుజేసుకుంటున్నాడు.

'అయ్యా! సానా సేపయ్యింది-' అన్నాడతను.

'పాలు కాగొద్దా మరి-'

'బేగీ ఎల్లాలయ్యా--'

చంద్రయ్య లేచాడు. నిజానికి పొయ్యి మీద పాలు పెట్టి చాలసేపయింది. ఈపాటికి కాగాలి కూడా. కాని కాగలేదు. కింది బొగ్గులు సరిగా రగులు కోకపోవడం చంద్రయ్య కానుకోలేదు. పాలమీద మూతేసి కాసేపువిసిరాడు. బొగ్గులు ఎర్రబడ్డాయి. కణకణలాడుతున్నాయి.

'టీ ఎంతండీ?' అన్నాడు ఆ వచ్చినతను.

'ముప్పై పైసలు-' అన్నాడు చంద్రయ్య.

'అరటీ దొరుకుద్దా?' మళ్ళీ అడిగాడు.

'ఆ-' అన్నాడు చంద్రయ్య.

'ఎంత?'

'ఇరవై పైసలు.'

'అర టీ చెయ్యండి.'

చంద్రయ్య పైకేమీ అనలేదు. రాజుకుంటున్న బొగ్గొకటి చిటపటా పేలిచంద్రయ్య చేతి మీద చురక వేసింది.

'అర టీ బేరమా-'మనసులోనే అనుకున్నాడు.

చంద్రయ్య పాలు కాగాక పాలు దించేసి గుడ్డలో మిగిలిన టీ సుద్దను గ్లాసు మీదుంచి అరకప్పు టీ వడపోశాడు. దాన్ని చంద్రయ్య పట్టుకొస్తుంటే 'పంచదార కాస్త ఎక్కువేశా రండీ-' అని అడిగాడు.

చంద్రయ్య తిరిగి వెళ్ళి టీలో మరికాస్త పంచదార కలిపి పట్టుకొచ్చాడు. దాన్నిబల్ల మీద పెట్టేసి తొందరగా కొట్టు మూసెయ్యాలన్న ఆదుర్దాతో బొగ్గులు ఆరిపేయడానికి వెళ్ళాడు.

అతను టీని చప్పరించి 'అయ్యో!టీ వేళ్ళేదు - సల్లగుంది' అన్నాడు.

చంద్రయ్య తాను చేయబోతున్న పని ఆపి నిలబడిపోయాడు. వెంటనే బొగ్గు లారిపేయనందుకు రక్షించావురా దేవుడా అనుకున్నాడు. అతను టీని తిరిగి వేడి చేస్తుండగా తనకున్న ఆ కాస్త ఓపిక కూడా తగ్గిపోయింది. టీని వేడి చేశాక దాన్ని అతని బల్లమీద పెట్టేసి, ' నా పేణాలు తోడెయ్యడానికొచ్చావురా' అని లోలోనే గొణుక్కున్నాడు. ఆ తర్వాత దోసెడునీళ్ళు బొగ్గులమీద పోసి దీపం వత్తి అమాంతం దిగేశాడు.

అతను టీ తాగి ఇరవై పైసలిచ్చేసి 'ఇక్కడికి పాలెం ఎంత దూరమండీ-' అని అడిగాడు.

'రెండు కోసుళ్లుంటుంది-' అని ముక్తసరిగా చెప్పాడు చంద్రయ్య.

'కాస్త దారి వొయినం సెప్పండి- కొత్త-సీకటికాడ తెలీటం లేదు-' అన్నాడతను.

చంద్రయ్య అతనితోపాటు బయటకు వచ్చాడు. అతను పాకకు జారేసిన సైకిల్ని అందుకుని దారి వైనం కోసం చంద్రయ్య దగ్గరకొచ్చాడు.

'ఏ వూరు బాబూ మనది?'

'ఏం? సిన్నాయి పురం-'

'అబ్బే ఏమీ లేదు- ఇంత అద్దరేతిరి కాడ ఏం పనిమీద వెళ్తున్నావా అని-'

'అద్దరేతిరే మరి - సావు కవురట్టుకెళ్తున్నాను-'

'ఎవరిది?'

'సిన్నని - ఇక్కడ పాలెంలో మాదిగ ఎంకమ్మ కూతురట-'

"ఏటి? సిన్నా... అరె..."

'నువ్వా పిల్ల నెరుగుదువా?'-

'ఆ....'

'ఎందుకు పోయిందిట పాపం?-'

'నాకూ అంతగా తెలీదుగాని - తీసి కెళ్ళినోడు చసి చెయ్యలేదట- అందుకే సచ్చిందంటున్నారు-'

చంద్రయ్యలో ఓ క్షణం ఆశ్చర్యమూ బాధా ముంచుకొచ్చాయి. అతని కళ్ళ ముందు సిన్ని మెదిలింది.

చంద్రయ్య అతనికి దారివొయనం చెప్పాడు. సైకిలెక్కి అతను వెళ్తుంటే అతను చీకట్లో కలిసిపోయేవరకూ అతనికేసే చూస్తూ వుండిపోయాడు.

అతను వెళ్ళిపోయాక చంద్రయ్య లోనికొచ్చి పక్కమీద వాలి కంబళికప్పుకున్నాడు. ఎదురుగా చిక్కని చీకట్లోంచి రైలు స్టేషనుకేసీ, ఔటరు సిగ్నలుకేసీ చూస్తూ వుండిపోయాడు. పాకలో వొత్తి దిగేసిన హరికేను లాంతరు సన్నగా వెలుగుతూ చీకటి ఆకాశం మీది నెలవంకలా వుంది. కాసేపటికది గుప్పు గుప్పున మండి అకారణంగా ఆరిపోయింది. ఒక్కక్షణం చిమ్మచీకటి ఆ పాకనిండా ఆవరించింది. మరో క్షణానికి గాని అతని కళ్ళు ఆ చిమ్మచీకటికి అలవాటు పడలేదు. పాకలో చీకటికి నిశ్శబ్దం కూడా తోడయ్యింది. ఎక్కడినుండో మిణుగురుపురుగు తడికెలోంచి లోని కొచ్చి అది వెళ్ళి వెళ్ళి గోడ దగ్గర మాయమయ్యింది.

సిన్ని ఎంత అందంగా వుంటుంది? బంగారపు బొమ్మ - అనుకున్నాడు.

ఆకాశంలో శీతాకాలపు మబ్బులలుముకున్నాయి. బయట ఆకు కదిలినా చప్పుడయ్యేంత నిశ్శబ్దంగా వుంది. లెవెల్ క్రాసింగ్ వద్ద గేటు జావాను ముసలికుక్క రోజూ ఓ ఝాము రేతిరి కాడ ఇదే సమయానికి మూల్గుతూ ఏడుస్తాది. అదలా ఎందుకు మొరుగుతాదోగాని అలా మూల్గుతూ మొరిగినప్పుడల్లా తన కడుపులో - ఏదో పేగు మెదిలినట్లే అనిపిస్తాది. ఈ రోజది ఎందుచేతనో గాని ఓ ఝాము రేతిరి దాటిపోయినా ఇంకా మూల్గి ఏడవడం లేదు.

చంద్రయ్యకు సిన్ని జ్ఞాపకాలు ఎప్పటివో ఓ సంవత్సరం క్రితంవి అలవోకగా గుర్తుకురావడం మొదలు పెట్టాయి. కాసేపటికి తన ఆలోచనల నిండా సిన్ని ఆక్రమించేసింది.

అతని నవనాడుల్లోనూ ఏదో నిస్సత్తువ పాకుతున్నట్టనిపించింది. చిన్న శబ్దానికి కూడా తన గుండె అదురుతున్నట్టు వుంది. దూరాన్నుండి క్రతో దేన్నో బాదుతున్న శబ్దం వినిపిస్తోంది.

ఏమిటది?

లెవెల్ క్రాసింగ్ వద్ద బరువు బండిని యీడ్చలేక మొండికేస్తే బండివాడు ఎడ్లను చితక బాదుతున్నాడు. బండి కదిలి బండిచక్రం రైలు పట్టామీద కిర్రున జారిన శబ్దాన్ని స్పష్టంగా చీకటి మోసుకొస్తుంటే, సిన్ని ఆ మొదటిరోజు తన పాకలో సామానుల గదిలో పుట్టెడు కోరికతో వీర్రాజుగాడి అక్కున జేరి ఉక్కిరి బిక్కిరై "అబ్బా" అన్న హీన స్వరం గుర్తుకొచ్చింది.

వాడు – అంటే వీర్రాజుగాడు లారీ యాపారం చేసేవాడు. ఆడు సిన్నిని అర్ధరేతిరి కాడ తీసుకొచ్చేసి 'మావా! నీవే దిక్కు – రాత్రికాడ పట్నం వెళ్ళాలంటే బండి లేదు. మాదిగగూడెం నుండి ఎవరొచ్చినా సిన్ని నాకు దక్కదు' అన్నప్పుడు –సిన్నిని చూసి – దాని అందాన్ని చూసి – గుండెల్లో దాగిన గుబుల్నీ, కళ్ళల్లో మిగిలిపోయిన కోరికల్నీ చూసి ఆ రాత్రికి తన పాకలోనే సామానుల గదిలో చోటిచ్చి పోనీలే సల్లగుండాల అనుకున్నాడు.

ఆ సిన్ని జీవితం ఎందుకిలా అయ్యింది?

గదిలో చీకటి మరింత చీకటిగా వుంది. ఇందాకటి మిణుగురుపురుగు గోడమీంచి లేచి తనకేసే వస్తోంది. లెవెల్ క్రాసింగ్ వద్ద గేటు జవాను ముసలికుక్క మూల్గుతూ ఏడ్చింది.

చంద్రయ్య మనసు దిగులుగా వుంది. తనకు ఏ సంబంధమూ లేకపోయినా చావు కబురు చావుకబురే – దానిప్రభావం అంతో యింతో మనసు మీద పడింది.

అతను లేచి కూర్చున్నాడు. స్టేషను కేసి చూశాడు. గుండెలో అలజడిలా స్టేషనులోని గంట మోగింది. ఔటరు సిగ్నలు మీద ఎర్రని దీపం చీకటి తెర మీద వాలికిన రక్తం చుక్కలా వుంది. అది కాసేపటికి చిన్ని నాచుమొక్కలా పచ్చని వెలుగును పుంజుకుంది. ఎక్స్‌ప్రెస్ గూడ్సు వేగంగా దూసుకుపోతూ పరిసరాల నిశ్శబ్దాన్ని బీభత్సం చేసేసి వెళ్ళిపోయింది. అది వెళ్ళిపోయినా దాని శబ్దావశేషాలు అతని చెవుల్నింకా తాకుతూనే వున్నాయి.

ఓనాడు సిన్ని కూడా తన బంధువుల్నీ, ఈడువాళ్ళనీ, తల్లినీ, ఊరునూ, ఆ పరిసరాలనూ అంతటినీ వొదిలేసి పరుగెత్తే కోరికల వెంట పరుగులు తీస్తూ తన పాకలో ఓ రాత్రి మజిలీచేసి కొత్తజీవితం కోసం ముందుకు వేగంగా దూసుకుపోయింది. ఆనాటి జ్ఞాపకాలింకా నిన్నమొన్నటివిలానే సజీవంగా అతని కళ్ళముందు కదుల్తున్నాయి.

ఆ రోజు సిన్ని జీవితం గురించి ఎంతగానో ఊహించాడు. సంకుచితత్వం చిర కాలంగా పాతుకుపోయిన ఆ పల్లెలనుండి బయటకు వచ్చేసిన సిన్ని జీవితం యిక ముందు ముందుకూడా ఎందరికో ఆదర్శంగా వుంటుందనుకొన్నాడు. కానీ ఇంతలోనే సిన్ని జీవితం ఎందుకిలా అయిందీ ఊహకందడం లేదు.

చం(దయ్య కళ్ళు పొడారిపోయాయి. అక్కడ దూరంలో - చీకట్లో - ఆ స్టేషనులోని విద్యుద్దీపాల కాంతి అడవి కాచిన వెన్నెల్లా నిరర్థకంగా వుంది. మరోవేపు ఆ ఔటరు సిగ్నల్ స్తంభం ఎత్తుగా ఆకాశంలోంచి దీపాన్ని చూపుతూ కలకాలం తన బాధ్యతలా అక్కడే నిలిచి పోయింది. అదిప్పుడు తన ప్రమేయం ఏమీ లేనట్టు ఆ చీకటిలో దాగుంది.

సిన్ని ఎందుకు చనిపోయింది?

ఆశ్రయం లేక ఆత్మహత్య చేసుకుంది కాబోలు -

ఆదరణ దొరకక దిక్కుమాలిన కుక్కచావు చచ్చింది కాబోలు -

ఏమైతేనేం - సిన్ని చనిపోయింది.

కనీసం అరటీనైనా కొనలేని అతను ఈ చావు కబురుతో ఈ అర్ధరాత్రిలో చలిలో చీకట్లో అలసటగా ముందుకు పోతున్నాడు. ఓ పావలా డబ్బులకోసం ఎదురు తెన్నులు చూస్తూ తాను ఆ స్టేషనునే ఆధారం చేసుకుని బతుకును యీడ్చు కొస్తున్నాడు.

చం(దయ్య కళ్ళముందు ఈ ఎదుగూ బొదుగూ లేని ఎందరివో బతుకులు నిలిచాయి. అప్పుడు చం(దయ్య అనుకున్నాడు గదా-

ఈ సీకటేటి? ఈ ఎలుగేటి?

ఈ సావేటి? ఈ పుట్టుకేటి?

తానెవరు? ఆ సిన్నెవరు! ఆ సావు కవురట్టుకెళ్ళే అతనెవరు?

అసలీ బతుకుల్లో ఎలుగుకీ సీకటికీ, సావు పుట్టుకలకీ ఏటి తేడా?

ఇంకా ఎన్నో ఆలోచనలొచ్చాయి చం(దయ్యకు.

చిక్కటి ఆ చీకటి ఆకాశం కింద ఎక్కడో వున్న ఆ పల్లెలు మరింత దిగులుగా తోచాయి. ఆ పల్లెలూ, అక్కడి ప్రజలూ, వాళ్ళ జీవనం - వేటిలోనూ ఏ మార్పూ కనిపించడం లేదు. నీళ్లు లేక ఎండిపోయే మొక్కలా... ఆ పరిసరాల మీద ప్రగతి గిడచ బారి పోయింది. తనూ అందులోని భాగమే ననుకొన్నాడు చం(దయ్య.

గదిలో ఎలకకోసమో, పాలకోసమో గాని గిన్నెలనన్నీ దభీమని పడవేసింది పిల్లి -

చం(దయ్య ఉలిక్కిపడ్డాడు. వచ్చే పగలుకోసం, కేవలం బతుక్కోసం రెక్కల్లో సత్తువను పోగుచేసుకోవాలి.

పొయ్యి దగ్గర మెలికేసి పడుకున్న నారిగాడు నిద్దట్లో కలవరించి ఓసారి మూల్గాడు.

చం(దయ్య ఆలోచించడం మానివేశాడు.

రేపు లేవడానికి అతను నిద్రపోవడం తప్పనిసరి.

'యువ' మే *1979* *

హైదరాబాద్
*13.1.1978*

లోకం చూశాక

# అంత్యేష్టి

జగం ... సగం నిద్రించీ, సగం మేల్కొనీ వుంది.

చీకటితో చెలిమి కోసం శీతవాయువు కమ్ముకొస్తోంది.

గదిలో గుడ్డి వెలుగు గోడలమీద వేలాడుతోంది.

అతని ముఖం మీద అలసట కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది.

అతను కుర్చీలో కూచుని, టేబుల్ మీది టెలిఫోన్ ల కేసి తన చూపంతా కేంద్రీకరించాడు.

ఆప్తులు ఓ అరడజను మంది బయట అరుగు మీద నిద్రనీ, సుఖాన్నీ ఈసడించు కుంటూ కూచున్నారు.

ధర్మరాజా గుమ్మం వద్ద నిలుచుని ఓ క్షణం తటపటాయించి, లోనికొచ్చాడు. 'తమరు కాస్త పక్కవాల్చి, కునుకు తీస్తారని వేచియున్నాను...' అన్నాడు.

'ధర్మరాజా! నా మిత్రుడు చనిపోగా నేను శవజాగరణ చేయాలి తప్ప సుఖం కోసం నిద్ర సాగించకూడదు...' అన్నాడు.

'మీ సేవకుణ్ణి! తమరి దుఃఖాన్ని ఎరిగిన వాడినేనని మనవి చేసుకుంటున్నాను... కానీ...'

'ధర్మరాజా! నా స్నేహితుడి చావు నన్ను అతలాకుతలం చేసేసింది. అతడి కోసం నా చేతుల మీదగా చేయాల్సిన పనులెన్నో మిగిలిపోయాయి...'

'చిత్తం!'

'ఈ చరమరాత్రి తెల్లవారకముందే అతని మరణవార్త బంధువులకూ, మిత్రులకూ, ఆప్తులకూ, అందరకూ తెలియ పరచాలి... వాళ్ళంతా ఎక్కడెక్కడో దూరదూరాల్లో వున్నారు.'

'చిత్తం! వారి పేరు ప్రతిష్టలు అందరూ ఎరిగున్నవే –'

'అందుకని రేపు జరగబోయే అంతిమయాత్ర గురించి స్వయంగా నేనే తెలపాలి... దేశం నలుమూలలకీ బుక్ చేసిన ట్రంకాల్స్‌ను అందుకోవడం కోసం ఈ రాత్రి

ఫోనుముందు కూచోక తప్పదు. అవతలి వాళ్ళు రిసీవరు ఎత్తగానే నా మిత్రుడి మరణవార్తను నా నోటి మీదగా వాళ్ళకు తెలియజేయాలి... వాళ్ళందరూ వచ్చాక ఇక్కడ అంతిమ యాత్రను కొనసాగించాలి... అందుకని ధర్మరాజూ! ఈ రాత్రి చివరకంటూ వుండి, ఈ పనిని పూర్తి చేసి లేస్తాను–'

'మీ సేవకుణ్ణి! తమరి గురించి ఆత్రుత తప్ప వేరే ఏముంటుంది నాకు... మీరు ఆదేశిస్తే ఏదయినా చేయడానికి మీ ఆప్తులు మీకోసం బయట వేచియున్నారు. కానీ... వాళ్ళకు మీరేమీ చేయమని చెప్పలేదట... ఇప్పుడు వాళ్ళంతా కూచున్న చోటే నిద్రలోకి జారిపోయారు.'

'ధర్మరాజూ! వాళ్ళంతా నిద్రలోకి జారిపోయినా నాకోసం నీవు మేల్కొనే వున్నావు... నీవు నా సేవకుడివి... నా అంతరంగ విషయాలు తెలుసున్న వాడివి... అందుకే నా చేతుల మీదగా జరగాల్సిన పనులెన్నో ఇతరులెవ్వరికీ చెప్పక, నీ చేతుల కప్పగించాను.'

'చిత్తం! ఆ సంగతి నేనెరిగిన వాణ్ణే... అందుకే తమరు చెప్పినట్లు అన్నీ సిద్ధం చేసి వచ్చాను. అంతిమ సంస్కారం రేపు సాయంత్రంలోగా జరగాలని మీరు నిర్ణయించిన మీదట నేనేదీ రేపటికంటూ వాయిదా వేయలేదు.'

'అయితే సంస్కారానికి అన్నీ సిద్ధమైనట్టేనా ధర్మరాజూ!'

'చిత్తం! అందుకోసం అన్నీ సిద్ధపరచాను–

బజారంతా వెదకించి, మంచిగంధపు చెక్కల్ని సరిపడా ఖరీదు చేశాను. ఊరేగింపుగా వెళ్ళడానికి పూల రథాన్ని పురమాయించాను. శవాన్ని అలంకరించడానికీ, దారిపొడవునా చల్లడానికీ పూల తోటల్లోని పూలన్నిటినీ గుత్తబేరం చేయించాను. మేళతాళాలతో ముందుకు సాగిపోవడం కోసం వాయిద్య గాళ్ళను రప్పించాను. ధూపధూమ సామగ్రినీ, అత్తరు పన్నీరునీ, ధవళ వస్త్రాన్నీ... అన్నింటినీ తెప్పించాను.'

'ధర్మరాజూ! నీ ఏర్పాట్లన్నీ నాకు సంతృప్తినిచ్చాయి... రేపటి అంత్యేష్టి కోసం ఇప్పటి నుండే నా దృష్టినంతా సమీకరిస్తాను. నా ప్రాణమిత్రుడు బ్రతికుండగా అతన్నుండి ప్రతీదీ నేను పొందడమే గాని, నా నుండి ఇంతవరకూ అతని కిచ్చిందేమీ లేదు. అతను బతికుండగా నాకా అవకాశమే ఇవ్వలేదు. అందుకని అతను చనిపోయాకయినా అతని అంత్యక్రియలు నా చేతుల మీదగా జరిపి నా స్నేహధర్మాన్ని నిలబెట్టుకుంటాను. లేకపోతే లోకం నాకేసి వేలెత్తి చూపుతుంది. స్నేహధర్మానికిది మాయని మచ్చ అవుతుంది. కనుక ధర్మరాజూ!... నీవు ఇంకేమేమి చేశావో అంతా చెప్పు–'

'చిత్తం! నేను ఖరీదు చేసిన మంచి గంధపు చెక్కల్ని ఈ సాయంత్రమే శ్మశానానికి తరలించి, చితిని పేర్చమని మనుషుల కిచ్చి పంపాను.'

'ధర్మరాజూ! నా అక్కరలేమిటో నాకన్నా నీకే బాగా తెలుసు...'

'మీ సేవకుణ్ణి... సదా మీ మన్ననలను అందుకుంటున్న వాణ్ణి... అయినా నన్ను కొన్నింటికి తమరు మన్నించక తప్పదేమో...'

'ఏమిటి ధర్మరాజూ! నిన్నా నేను మన్నించ వలసింది?'

'చిత్తం! ఎందుకంటే... నేను పంపిన మనుషులు తిరిగొచ్చి, అప్పటికే అక్కడ అతనికోసం అతని భార్యాబిడ్డలూ, అతని బంధువర్గం, అందరూ వచ్చి చితిని పేర్పించి వెళ్ళారట...'

'ధర్మరాజూ! ఏమిటి నీవంటున్నది?'

'అయితే నేను పంపిన మనుషులు వాళ్ళతో 'మేం రోజు కూలికి వచ్చిన పనివాళ్ళం,... మాకు అప్పగించిన పనిని మేం పూర్తి చేసుకుని వెళ్ళడం వరకే మా పని...' అని ఆ చితి పక్కనే చితిని పేర్చి, తమ వంతు పనిని పూర్తి చేసుకుని వచ్చారట...'

'భేష్! ధర్మరాజూ... నీవు నియమించిన మనుషులు సైతం నీలా కర్తవ్య మెరిగిన వాళ్ళు... నీవు తక్షణమే వెళ్ళి నీ యజమాని మాటగా అతని భార్యాబిడ్డల్తోనూ, బంధు వర్గంతోనూ చెప్పవలసిందేమిటంటే- ఇచ్చట అతని శరీరాన్ని పన్నీరుతో కడపటి స్నాన మాడించి, ఖరీదైన అత్తరులు వంటికి పూయించి, ధూప ధూమాన్ని వేసి, ధవళ వస్త్రాన్ని చుట్టి, పూలతో అలంకరించి, పరిమళాలను చిలకరించి, పుష్పవిమానం మీద ప్రతిష్టించి, దారి పొడవునా పూలజల్లుతో, వీడ్కోలు నినాదాలతో, మేళతాళాలతో శ్మశానం వరకూ ఊరేగించుకుంటూ తరలి వెళ్ళడానికి సకల ఏర్పాట్లూ చేశానని నా మాటగా వాళ్ళకు చెప్పు-'

'నేనా విషయాన్ని తమరి అనుమతిని తీసుకోకుండానే వెళ్ళి వాళ్ళతో చెప్పి వచ్చాను. తమరు ఇందుకు మన్నించాలి...'

'ఏమిటీ! వాళ్ళను కలిసి వచ్చావా?!'

'చిత్తం! మిత్ర వియోగం చేత దుఃఖితులైన మిమ్మల్ని ప్రతిదాన్నీ అడిగి ప్రతీదీ చెప్పించుకోవడం సేవకుడిగా నాకు భావ్యం కాదేమోనని అలా చేసి వచ్చాను-'

'ధర్మరాజూ! నీవు కేవలం నా సేవకుడివే కావు; నా ఆంతరంగికుడవు కూడా... నీకా స్వేచ్ఛ నేనివ్వకుండానే నీవు పొందగల సమర్థుడవు... ఇంతకూ నీవు ఎప్పుడు వెళ్ళినదీ, ఏం జరిగినదీ నాకు చెప్పనే లేదు -'

'నేను అక్కడకు వెళ్ళేసరికి అది పగలు గానీ, రాత్రిగానీ కాదు -

'అయితే ఆ రెంటికీ నడుమ వెలుగు నీడల సంగమ వేళ... మలి సంధ్యవేళ... నీవా ఇంటి వాకిలి చేరావన్నమాట-'

'చిత్తం! అప్పుడు కుంగిన సూర్యుడి కడపటి కిరణాల్లో, ఆ వాకిట ఓ ఎత్తయిన వేదిక మీద తమ ప్రాణమిత్రుని మృతదేహాన్ని చూశాను.'

'ధర్మరాజూ! మనం తయారు కాకముందే మన భవిష్యత్తు మన ముందుకు వస్తుంది. అందుకే జీవితం కష్టాలతో కూడి వుంటుంది- నా స్నేహితుని హఠాన్మరణమే అందుకు సాక్షి... ధర్మరాజూ! ఆ తర్వాత ఇంకేం చూశావు?'

'ఆ తర్వాత ఆ శవం చుట్టూ అశేష జనాన్ని చూశాను- వాళ్ళంతా విలపిస్తున్నారు... అతని భార్య అతని కోసం పరితపిస్తోంది; అతని బిడ్డలు రోదిస్తున్నారు, అతని బంధువులు దుఃఖిస్తున్నారు; వాళ్ళంతా నన్ను చూసి ఖిన్నులైనారు - అయినా నేను మీ ప్రతినిధిగా అక్కడ నిలుచుని, మీ మాటగా అంతా వివరించాను. అతని అంత్యక్రియలు మీ చేతుల

మీదగా జరగాలని మీ కోర్కెను తెలియ జెప్పాను.'

'నా ఆకాంక్ష అదే కదా! అప్పుడు వాళ్ళేమన్నారు?'

' ఆ సంగతి మీకు తెలియజేయడానికిది నడిరేయి దాటిన నిశాసమయం... జగత్తంతా నిద్రలో మునిగి, మీరు మేల్కొనీ వున్నారు; తమరు కూడా కాస్త పక్కవాల్చి, కునుకు తీసి, తెల్లవారగనే లేస్తే అంతా వివరంగా విన్నవించుకుంటాను-'

'ధర్మరాజా! నేనీ రాత్రి నిద్ర సాగిస్తే కదా లేవడానికి రేపనేది తెల్లవారేది... శవం ఉన్నంతవరకూ జాగరణ జరగాల్సిందే... చివరి వ్యక్తి వరకూ ఈ మరణవార్త నేనంద జేయాల్సినదే... అందుకని అక్కడ ఏం జరిగినదీ సందేహించక వివరించు-'

'చిత్తం! మీ మాటగా నేను చెప్పగా విని, అతని భార్య శవం వద్ద నుండి లేచి వచ్చి, నాతో "నేనూ, నా బిడ్డలూ, నా బంధువర్గం... అంతా కలసి అతని అంత్య క్రియలను మా చేతుల మీదగనే జరుపుకోవాలనుకుంటున్నాం.' అంది.

అప్పుడు మీరు చేసిన ఏర్పాట్లన్నింటినీ పూసగుచ్చినట్టు ఆమెకు వివరించి చెప్పాను..

ఆమె నా మాటను ఓ శకలంలా తీసిపారేసి, "మా మనిషి అంత్యక్రియను అతనెవడు జరపడానికి-" అని ప్రశ్నించింది.

అప్పుడు నేను మీ అనుబంధ బాంధవ్యాలనూ, వాటి ఔన్నత్యాన్నీ, యదార్థాలనీ ఆమెకు వివరించాను.

నీవు అతని తాలూకు మనిషివి; అతని పక్షం వహించడంలో నీ తప్పేమీ లేదుగానీ- కట్టుకున్న భార్యనూ, కన్న బిడ్డలనూ, పక్కన బెట్టి నిరంతరం అతనితోనే సాంగత్యం సాగించడం ఏ ఆడది సహిస్తుంది?... ఏ బిడ్డలు క్షమిస్తారు?... ఏలోకం హర్షిస్తుంది?

అతను బతికున్నంత కాలమూ అతని సాంగత్యంలోనే గడిపాడు. అప్పుడు ఆయన కోసం మేం ఏమి చేయడానికీ మాకు ఏ అవకాశమూ దొరకలేదు; కనీసం ఆయన చనిపోయాకయినా ఆయన అంత్యక్రియలను జరిపించే అవకాశాన్ని మేం జారవిడుచు కోలేం - అంది.

అప్పుడు నేను ఆమెతో అవకాశం గురించి మాట్లాడడం కోసం రాలేదు; అతని అంత్యక్రియని ఘనమైనదిగా జరపడం కోసం మీతో అంతా మాటలాడాలని ఆయన ప్రతినిధిగా వచ్చాను అన్నాను.

అప్పుడు ఆమె ముఖమెత్తి నన్ను తేరిపార చూసి, నీవు లోకం మంచి చెడ్డలు ఎరిగిన మనిషల్లే వున్నావు. అతని అంత్యక్రియ అతని భార్యాబిడ్డల చేతుల మీదగా జరగడం కన్నా లోకంలో మరెవరి చేతుల మీదగా జరగడం ఘనమైనదో నాకు చెప్పు... నేను ధర్మాన్నే ఆశ్రయిస్తున్నాను... లోకధర్మాన్నెరిగి నీవు నాతో చెప్పు... అంది'

'ధర్మరాజా! అంతా అర్థమయ్యింది... ఆమె ధర్మాన్ని గురించి నీతో ప్రస్తావించి నప్పుడు నీవు నోరు మెదపలేక అస్త్రసన్యాసం చేసి తిరిగి వచ్చేశావన్న మాట... ఈ భూమ్మీద ప్రతి ఆడదీ తన భర్త చుట్టూ పరిధిని నిర్మించి, తన హక్కులను చాటు కుంటుందే తప్ప, అతని అభిరుచులనూ ఆకాంక్షలనూ ఎందుచేతనో గౌరవించదు. నా

చేతుల మీదగా జరిగే ఈ అంత్యేష్టిని ఆమె ఆమోదించకపోతే ఆమె తన భర్త అభీష్టాన్ని ఆమోదించనట్టే.

'తమరు ఆవేశ పడకండి...'

'ధర్మరాజూ! నేనెవరిపై ఆవేశ పడాలి? ఆత్మీయుడు దూరమైనప్పుడు ఆ స్థితి మరణం కంటే కూడా బాధాకరంగా వుంటుంది. అంతే -'

'చిత్తం! మానవ జీవితంలో అన్ని వ్యవహారాలూ ఒక తరంగంలా వస్తాయి. అందులో పడి మనం సుఖం వైపో, దుఃఖం వైపో కొట్టుకుపోతాం-'

'నీవన్న మాటలు ముమ్మాటికీ నిజం... కానీ ధర్మరాజూ! నీవెలాంటి ఓదార్పు మాటలు చెప్పినా నా యీ దుఃఖాన్నుండి అవేవీ ఉపశమింప చేయడం లేదు ఎందు చేతనో...'

'తమరి ఆవేదన ముందు ఏ ఓదార్పు మాటలూ సరితూగవనే నేననుకుంటాను - మీ స్నేహ బంధం అలాంటిది మరి -'

'ఔనౌను! మా అనుబంధాలలాంటివే... ధర్మరాజూ, నీవా వాకిట నిలిచి అశేష జనాన్ని చూశావు కదా... వాళ్ళక్కడ ఏమేం అనుకుంటున్నారో నీవెరిగే వుంటావు-'

'చిత్తం! వాళ్ళా దుఃఖంలోంచి తేరుకుని, ఆయన కిష్టమయిన అతి స్వల్ప విషయాల నుండి అంతర్జాతీయ రాజకీయం వరకూ అసహజమైన వాతావరణంలో సహజమైన ధోరణితో ఒక్కొక్కటీ చర్చించుకుంటున్నారు... నోబెల్ శాంతి పురస్కారాల్నీ, కూలిపోతున్న సోషలిస్టు రాజ్యాల్నీ...'

'ధర్మరాజూ! అది సరే... లోకం మా గురించి ఏమనుకుంటోందోనని...'

'మీ సేవకుడను... తమరు మన్నిస్తే ఒక్క విషయం మనవి చేస్తాను. అర్ధరాత్రి దాటి చాలాసేపయింది. తమరు ఇకనైనా పక్కవాల్చి, ఓ కునుకు తీస్తే... మీకు తెల్లవారగనే అంతా వివరంగా చెప్తాను-'

'ధర్మరాజూ! పదే పదే నన్ను విశ్రమింపజేయాలని నీవెందుకు ప్రయత్నిస్తున్నావు? నా అభీష్టమేమిటో నీవెరుగవా?'

'తమరు లోకాభిప్రాయం కోసం ఎందుకింత తాపత్రయ పడతారు. మీ ఇరువురి స్నేహం నీవేనేనూ, నేనే నీవులా, నింగీనేలలా, నిరంతరం కలిసే వుంటుందని, మీ అను బంధం అద్వితీయమని లోకానికి ఏనాడో తెలుసును. అదే అనుకుంటోంది. కూడా-'

'చాలు! ధర్మరాజూ! అది చాలు... ఈ లోకం మా స్నేహానుబంధాలను శ్లాఘిస్తోంద నడానికి అంత చాలు... ఇంతటి దుఃఖ సమయంలోనూ నీ మాట నాకెంతో ఓదార్పు నిస్తోంది.'

'కానీ...'

'ఏమిటి ధర్మరాజూ?'

'ఈ లోకానికి ఓ ఆదర్శమంటూ లేదు; అదెప్పుడూ ఫలితాలను బట్టే తీర్పు నిస్తుంది-'

'ఇప్పుడు ఆ ప్రస్తావన దేనికి?'

'మీ మిత్రుడి చావుకు మీరే కారణమంటోంది...'

'ధర్మరాజూ!?'

'తమరు మన్నించాలి!'

'ధర్మరాజూ! ఏమిటి నీవంటున్నది? అతని చావుకు నేనా కారణం? అతను గుండె ఆగి చనిపోయాడని లోకానికి తెలియదా... దానికి సాక్ష్యాధారాలు లేవా?'

'అతడు గుండె ఆగి హఠాన్మరణం చెందడానికి కారకులు మీరేనని లోకం అంటోంది-'

'ఆ మాటన్న దెవరు?'

'అందరూ అన్నారు... అతని భార్య అంది; అతని బిడ్డలన్నారు; అతని బంధు వర్గం అంది - ఇంకా ఎవరనాలి? -'

'ధర్మరాజూ! ఏమిటీ అపభ్రంశ-'

'చిత్తం! ఆ మాటే నేనూ వాళ్ళతో అన్నాను... కాని వాళ్ళంతా ఆయన బతి కున్నంత కాలమూ దుర్మార్గుల్తో, దుష్టుల్తో, పాపుల్తో, పరమ నికృష్టుల్తో సాంగత్యం చేశాడని ఆయనపై అభియోగం మోపారు-'

'ఇంతకూ ఆ నికృష్టులెవరట?- ఆ పాపులెవరట-?

'వాళ్ళు మీరేనట...'

'నేనా?!'

'మీ అకృత్యాలను వెనకేసుకొస్తూ, మీ దుష్టత్వాన్ని సమర్థించు కొస్తూ, అతని జీవి తాంతం అశాంతితో ఒత్తిడికి లోనై గుండె పగిలి అకాలమరణం చెందాడట-'

'అది నీవు నమ్ముతున్నావా ధర్మరాజూ?'

'నిజాన్ని ఎప్పుడూ ఎవరూ తుడిచివేయలేరు; అయినా ఏ యజమానికీ తనసేవ కుడి నమ్మకాలతో ఏ పనీ వుండదు; నేను నమ్మినా, నమ్మకపోయినా ఈ లోకం నమ్ము తోందని మీకు తెలియ జేస్తున్నాను.'

'ధర్మరాజూ! సమయం ఆసన్నమైనప్పుడు నిజాన్ని నిజంలా ఒప్పుకున్నవాడే మనిషి...

ఈ లోకం కొందరి పట్ల కళ్ళుండి గుడ్డిది; చెవులుండి చెవిటిది; నోరుండి మూగది. నా మిత్రుడు బతికున్నంత కాలం నన్నెన్నడూ వేలెత్తి చూపని ఈ లోకం అతడు చనిపోగానే నన్నొక అపరాధిని చేయడానికి దాని సర్వశక్తులూ, సకల యుక్తులూ నా పైకి సమీకరిస్తోంది... అయినా నేను నిజాన్నే మాటాడతాను... ఎందుకంటే, నిజాలన్నీ మృత్యువనే న్యాయ స్థానంలో పరీక్షించబడతాయని మన పితరులనే వారు... కనుక నేను చెప్పదలచిన దేమిటంటే...

నేను అపరాధినే-

ఎలాంటి అకృత్యాన్నయినా చేసి నేనతని నీడలో దాగుకునే వాడిని - నా అపరా ధాలన్నీ అతని నీడలోనే కనుమరుగయ్యేవి. అతని పేరు ప్రతిష్టల మాటున, వ్యక్తిత్వం నీడన, నా అకృత్యాలన్నీ అంతమయ్యేవి - ఎన్నో కుత్సితాలు, ఎన్నో కుతంత్రాలూ,

అరాచకాలు, మోసాలు, దౌర్జన్యాలు అతని నీడ చాటునే కనుమరుగయ్యాయి - ఎందుకో తెలుసా... వ్యక్తిత్వం అనేది ఒకానొక అనిర్వచనీయమైన శక్తి; అది తిమ్మిని బమ్మిని చేస్తుంది; బమ్మిని తిమ్మిని చేస్తుంది - అది మానవాత్మలపై అధికారం చెలాయిస్తుంది. అలాంటి వ్యక్తిత్వం గల నా మిత్రుడు అజేయుడు; అసామాన్యుడు; అందుచేతనే, నేనాతనిని ఆశ్రయించాను-

అతడు నా అపరాధాల గురించి నన్నెన్నడూ ప్రశ్నించలేదు; ఏనాడూ మందలించ లేదు. నన్ను చూసీ చూడనట్టు, నా పొరపాట్లు తెలిసీ తెలియనట్టు ఊరకుండి మా మిత్ర త్వానికి తెగని బంధం వేశాడు.

ధర్మరాజూ! వటవృక్షంలా నా మిత్రుడు తన పచ్చని కొమ్మల్ని నా జీవితాంతం మేరా విస్తరించి, అపరాధాలతో అలసిపోయిన నాకు తన చల్లని నీడనిచ్చి సేదదీర్చాడు.

అలాంటి నా మిత్రుడు కేవలం నాకు మిత్రుడు మాత్రమేనంటావా? కాదు... అతడు నా 'గాడ్ ఫాదర్'... ఎందుకలా ఆశ్చర్యంతో చూస్తావు? అతడు ముమ్మాటికీ నాకు 'గాడ్ ఫాదర్'...

ఇంకా చెప్పమంటావా?...

నేను ఎందరినో దోచుకున్నాను - అతని పక్కన నిల్చున్న నన్ను ఎవ్వరూ వేలెత్తి చూపలేదు.

నిజానికి నేను హంతకుణ్ణి - ఎన్నో హత్యలు చేసి అతన్ని ఆశ్రయించే వాడిని... అతని అభయహస్తం నా భుజం మీదుంచి, నా వదనాన్ని ప్రసన్నం చేసి, నన్ను వేదికల వద్దకు కొనిపోయేవాడు. ప్రజలు మాకు స్వాగత వచనాలు పలుకుతూ, అతనితో పాటు నాకూ వేదికపై ఉన్నతాసనం వేసి, అతని పక్కనే నన్నూ కూచుండ బెట్టి ఘనపరిచే వారు - కనుక ధర్మరాజూ!...'

'చిత్తం! తమరు ఇంత చెప్పాక నేను ఏదీ దాచవలసిన అవసరం లేదు-'

'ఔను! నీవు నా సేవకుడివి... నా ఆంతరంగికుడివి... లోకం ఏమనుకున్నా నీకు తెలిసిన దేదీ నా నుండి గోప్యంగా వుంచకూడదు-'

'చిత్తం! లోకాని కేముంది... అది ఏదయినా అనుకుంటుంది-'

'ధర్మరాజూ! నీవు నా సేవకుడివి...'

'మీ సేవకుడనే... నేను మీకేదీ మరుగు పరచడం లేదు... ఇంతకాలమూ మీ మిత్రుడు, కోడి తన పిల్లల్ని రెక్కల కింద కాపాడి నట్టు మిమ్మల్ని మీ శత్రువుల బారి నుండి కాపాడు కొచ్చారట... అతడు ఎలాగూ గతించాడు... ఇక మీ అకృత్యాల నుండి మిమ్మల్ని ఏ శక్తీ కాపాడ లేదట- ఈ అసూయలూ, అత్యాశలూ, అత్యాచారాలూ, దోపిడీలూ, దమన కాండలూ ఏవీ ఇక ఈ లోకం సాగనివ్వదట... ఇంతకాలమూ సాగిన అక్రమాల నన్నిం టికీ సంజాయిషీ అడుగుతుందట... అందుకని మీ అకృత్యాలకి ఇకపై ఆటకట్టట-'

'ధర్మరాజూ! పో...! ఈ గడప దాటి బయటికి పో!'

'తమరి సేవకుడను... నేనెక్కడికి పోతాను?!'

'ధర్మరాజూ! నిన్ను బయటికి పొమ్మని ఆజ్ఞాపిస్తున్నాను. నా నుండి తక్షణమే ఎక్కడికైనా పో!'

'తమరి ఆజ్ఞను శిరసావహించగలను... కానీ మిమ్మల్ని ఈ సమయంలో ఒంటరిగా వదిలి వెళ్ళడం సేవకుడి ధర్మం కాదని సంశయిస్తున్నాను. మీ శరీరం మీది స్వేద బిందువులు ధారాపాతమౌతున్నాయి. మీ శ్వాస తెగిన గాలిపటంలా ఊగిసలాడుతోంది... పగిలిన నావ మునుగుతున్నట్టు మీ శరీరం కుంచించుకు పోతోంది... నేనిప్పుడు మీకోసం చేయగలిగిన సేవ ఏమున్నదో సెలవీయండి-

ధర్మరాజూ! నీవింకా నా గుమ్మం ముందే వున్నావా! మౌనంగా నా పిలుపు కోసం వేచియున్నావా! ముమ్మాటికీ నీవు నా సేవకుడివి... నా అక్కరలన్నీ నాకంటే ముందుగానే ఎరుగున్న వాడివి... ఈ లోకాపవాదుల నుండి నన్ను సంరక్షించే వాడవూ నీవే... రా.. నీవు తొందరగా వచ్చి నా గుండెను హత్తుకుని గట్టిగా ఆలింగనం చేసికో... జారిన క్షణం నాదికాక పోవచ్చును... రా!.. ధర్మరాజూ! రా...' అని కుర్చీ మీదుండి వాలిపోయాడు.



ఒకదాని పక్క ఒకటి... రెండు చితులకూ ఒకేసారి నిప్పంటుకుంది.

ప్రాణ మిత్రులంటే ఇలా వుండాలన్నారు అంతా-

మిత్రుడి మరణవార్త విని ప్రాణాలు విడిచిన మిత్రుడట... ఎంతటి గొప్ప అను బంధమో అన్నారు మరికొందరు...

అటు శ్మశానం నుండి వెళ్తూ ఎవరో ధర్మరాజు వద్దకు వచ్చి, "నీవు అతడి సేవ కుడివే కదూ... అతని చితిని అతనే పేర్చుకున్నాడట... అతని అంతిమ యాత్ర అతనే, నిర్దేశించుకున్నాడట... ఏ గడ్డ మీద పుట్టాడో ఆ గడ్డ మీదనే అతని అంత్య క్రియ జరుగు తోందట కదా...' అని అడిగాడు.

'దానిలో ఆశ్చర్యమేముంది... ప్రతివాడూ తన చితిని తానే పేర్చుకుంటాడు... తన అంతిమ యాత్రను తానే నిర్దేశించుకుంటాడు...'

'నీవు నమ్మకమైన సేవకుడివని విన్నాము... అక్కడ అంతిమ సంస్కారం జరుగుతూ వుంటే మరి నీవీ నాలుగు రోడ్ల కూడలిలో ఎవరికోసం ఎదురు చూస్తున్నావు?'

'మృతునకు నేను చేయగల సేవలు ఏముంటాయి. నన్ను గుర్తించగల యజమాని కోసం వెదుకుతున్నాను...' అని కనులెత్తి చూశాడు.

రాజమండ్రి
*27.11.1991*

---

లోకం చూశాక

# డిస్కవరీ

అతను-

అందంగా, పొడుగ్గా, ఎర్రగా వున్నాడు.

పదిహేడేళ్ల ఎత్తూ,నూనూగు మీసాలంత ఎరుపూ, యవ్వన మంత అందంగానూ వున్నాడు.

అతను వంకీల జుట్టును మెడవరకూ పెంచుకుని, మంచి స్టయిల్లో మరింత ఆధునికమైన ఊహల్లో వున్నాడు.

వస్తున్న యవ్వనాన్ని వొళ్లంతా కప్పుకుని, కళ్లల్లో కలల్ని నింపుకుని జీవితాన్ని అతి సుందరంగా అద్దం ఫ్రేములో యిముడ్చుకున్నాడు.

అతని కలలన్నీ యవ్వనానికి సంబంధించినవే – నిరంతరం అందమైన అమ్మాయిలు ఆ కలల్లో నాట్యం చేస్తుంటారు; మైమరచి కౌగిలిని కూడా యిస్తుంటారు.

అందుకని అతనికి ప్రతి మిట్ట మధ్యాహ్నం అందమైన వెన్నెల్లా హాయిగానూ, ప్రతి నడిరేయీ ఒక మండు వేసవి గాడ్పులా అలసటగానూ గడుస్తుంది.

అతను ఆ రోజు ఏదో పనిమీద బయల్దేరాడు. అప్పుడు నడి నెత్తిన సూర్యుడు మండి పడుతున్నాడు. అదీ మిట్ట మధ్యాహ్నమే- కాని అతనికి అలవాటైన వెన్నెలది.

అతను సైకి లెక్కాడు.

సైకిలు మీద అతను ఎక్కుపెట్టిన విల్లులా వున్నాడు. అతని గురించి అతని కెప్పుడూ ఊహ కందలేదు. పదిహేడేళ్ల వయసులో యవ్వనంలో అతని గురించి అతనికి ఊహకందవలసిన అవసరం ఏ మాత్రమూ లేదు.

అందుకే అతని అరిచేతిలో కొండంత బలాన్ని ఇముడ్చుకున్నాడు. 'తను' అన్న శబ్దం సర్వస్వం అనుకున్నాడు. 'తను' అన్న శబ్దం ఎదురులేనిది అనుకున్నాడు.

అతను రోడ్డుమీద సైకిలు మీద వున్నాడు.

రోడ్డుమీద నడుస్తున్న నక్షత్రాలు మనోహరంగా వున్నాయి.

రోడ్డుమీద పుష్పిస్తున్న కుసుమాలు కోమలంగా వున్నాయి.

సైకిలు సరసరా పోతోంది.

అతడు దూరాన్ని ఎన్నడూ ఆలోచించడు, మీట నొక్కితే లైటు వెలిగినట్లా, బెల్ మోగినట్లా - ఊహ జనిస్తేచాలు, అనుకున్న చోట వాలి పోవాలి-

అతను నడి రోడ్డున మిట్ట మధ్యాహ్నం సైకిలు మీద లాగి వదలిన బాణంలా వున్నాడు. ఎదురొచ్చే బస్సుల్నీ, కారుల్నీ, సైకిళ్లనీ ఎలుకల్నీ, పులుల్నీ, ప్రభుత్వ భవనాల్నీ ఎద్దుల్నీ పెద్దల్నీ ... అందరినీ, అన్నిటిని తప్పించుకుంటూ ముందుకు దూసుకుపోతున్నాడు.

మంచి నేర్పరి -

అక్కడ ఆ వెడల్పాటి రోడ్డుకి టర్నింగొచ్చింది. అక్కడ వాహనాలు కాస్త జాగ్రత్తగా నడవాలి - నడపాలి.

చిత్రమేమిటంటే -

ఆ టర్నింగ్ దగ్గరే చుట్టూ పాతేసిన స్తంభాల మీద పెద్దపెద్ద సినిమా వాల్ పోస్టర్లున్నాయి. అందులో అప్పుడే దిగుమతైన ఓ విదేశీ వాల్ పోస్టరు అతన్ని అతి ఆదరంగా ఆహ్వానించింది.

అప్పుడు అతనివొళ్లంతా కళ్లయ్యాయి. ఆ కళ్లన్నీ ఒక్కసారిగా మిరుమిట్లు గొల్పాయి - అప్పుడే వొళ్ళు కూడా "చార్జి" అయ్యింది.

అతను అందం గూర్చి ఎన్నెన్నో కలలు గన్నాడు. ఆ అందాన్ని యింత వరకు ఊహించుకోవడమేగాని కళ్లతో ఎప్పుడూ స్పృశించలేదు. ఇప్పుడా అందాన్ని కళ్లతో పాటు కోర్కెల్తో కూడా స్పృశిస్తున్నాడు.

ఇప్పుడా అందం గూర్చి అందమైన పులకింత -

అవి దర్శన మివ్వాలే గాని సృష్టిలో రహస్యాలన్నీ అందంగానే వుంటాయి మరి-

అతని కళ్లిప్పుడు ఆ వాల్‌పోస్టరులోని అందం యొక్క అంగాంగాన్నీ తడమి వాటేసుకుని ముద్దాడుతున్నాయి.

ఫలితం?

ఏక్సిడెంట్ -

ఆటో కాస్త దెబ్బతిని సొట్టబడి అటు పక్కగా ఆగిపోయింది. రోడ్డు మధ్య సైకిలు ముందు చక్రం ఎనిమిదంకె వేసి కుప్పగా కూలింది. సైడు కెనాల్‌కి అవతల ఎర్రని గుడ్డల్లో తడిసి తానున్నాడు.

ప్రభుత్వం వారి జనరల్ ఆస్పత్రిలో నాల్గు రోజుల తర్వాత అతనికి మళ్ళీ స్పృహ వచ్చింది.

నాల్గు రోజుల తర్వాత అతను అందంగా లోకాన్ని చూశాడు. అందమైన లోకాన్ని ఆశ్చర్యంగా చూశాడు. తెల్లని వస్త్రాల్లోంచి కోమలమైన హస్తాలు అతనికిప్పుడు పరిచర్యలు

చేస్తున్నాయి. ఏ స్పర్శ కోసం యింతకాలం అతను అనుక్షణం తహతహలాడిపోయాడో ఆ స్పర్శ యిప్పుడతనికి అనుకోకుండానే చేరువయింది. కోరకుండానే స్పృశిస్తోంది. ఉపశమనం కలిగిస్తోంది –

ఇంతకూ వాళ్లంతా ఎవ్వరు?

యూనిఫారంలోని నర్సులా–?

కాదేమో!

అబ్బే – కాదు? మల్లెపూవులు – తెల్లని మల్లెపూలు.

అతి సుందరంగా నవనవలాడుతూ కోమలంగా వున్న మరు మల్లెలు – విరులు, ఝరులు, విరజాజులు –

అక్కడ ఫినాయిలు కంపు ఏ మాత్రమూ కొట్టడం లేదు. సన్నజాజులు, విరజాజులు, బొండు మల్లెల మదపు వాసనలు వున్న మేరంతా వెదజల్లుతున్నాయి.

అక్కడ ఆక్రందనలు వినిపించడం లేదు. హృదయాల్లో వీణాతంత్రులు మంద్ర స్థాయిలో మీటుతున్నాయి. ఆ మృదువైన స్పర్శ గాయమైన కోర్కెలకు ఉపశమనం కలిగిస్తోంది.

అయినా తాననుభవించాల్సింది యింకా మిగిలిపోయే వుంది. అందమైన ఆ రాత్రి కోసం తన ప్రైవేట్ వార్డులో ఆ నాలుగ్గోడల మధ్య ఎదురుచూస్తూనే చాలా రాత్రులు గడిపాడు.

అతను!!!.....?

తనమీద తనకు పూర్తి విశ్వాసమున్న వాడు.

ఓ రాత్రి ఝామున అందరూ నిద్రలో మునిగి నప్పుడు ఆ తెల్లని వస్త్రాల్లోని కోమలమైన ఓ శరీరం అతనికి అతి చేరువుగా వచ్చింది.

అతను ఆమె కోసం రోజూ మెలకువగానే వుంటున్నాడు.

ఆమె అతని పెదవుల్ని మృదువుగా తాకి వాటి మధ్య థర్మామీటరుంచింది. అతని జీవనాడిని తాకి తన మునివ్రేళ్ల మధ్య బంధించుకుంది.

అతను పెంపరేచరు కాబోలు అనుకున్నాడు.

అతను కాసేపు అచేతనుడయ్యాడు.

అతను ఆ కాసేపూ అవాక్కయ్యాడు.

ఆ కారణంగానే కాబోలు అతని చూపు ఎదురుగా గోడమీద వేలాడుతున్న ఓ పెద్ద ఫోటో మీద తప్పనిసరై నిలిచి పోయింది. తెల్లని జుట్టూ అంతకన్నా ఎక్కువ ముడతలు పడ్డ ముఖం అతనిది – ఎవరతను?

వృద్ధుడా నీ వయస్సెంత అని ఓ పురాణ పురుషుణ్ని ఓ మహాకవి ప్రశ్నించి నట్టు అతని కళ్ళు ఫోటోలోని వృద్ధుణ్ని ప్రశ్నించాయి?

అప్పుడా ఫ్రేములోని వృద్ధుడు చిన్నగా చిరునవ్వు నవ్వి ఊరుకున్నట్టనిపించాడు.

అతను తత్తర పడ్డాడు.

ఆ చిరునవ్వు తనకు బాగా పరిచయ మున్నదే -

ఆ చిరునవ్వులో పదిహేడేళ్ల యవ్వనం యింకా ఉట్టి పడుతూనే వుంది.

అరే! ఆ చిరునవ్వు తనదే - ఆ ఫోటోలో వ్యక్తి కెలా వచ్చింది?

ఆమె టెంపరేచర్ చూసింది.

ఆమె కూడా మనిషే - ఆడది.

ఆమెకూ కోర్కెలుంటాయి!

తెల్లని మల్లెపూలు మత్తయిన వాసనలిస్తాయి.

అతను కలల్తో, కోర్కెలతో వేదనతో, వ్యసనంతో గడిపిన ఎన్నో గడియలిక పరిసమాప్తి కాబోతున్నాయి.

అతనింతవరకూ దర్శించనిది దర్శించబోతున్నాడు.

అతనింతవరకూ ఛేదించనిది ఛేదించబోతున్నాడు.

అతనింతవరకూ అనుభవించనిది అనుభవించబోతున్నాడు.

అలాంటి మధుర క్షణాలలో అకారణంగా అతనికి ఆ తెల్లని గోడ మీది ఫ్రేములో బంధించబడిన ఆ వృద్ధుని చిత్రపటం గుర్తొచ్చింది.

"అతను ఎవరు?" - నోటి వెంబడి వచ్చేసింది - అకారణంగానే - కాని ఇదా సమయం? రహస్యాన్ని దర్శించే గొప్ప తరుణంలో ఆ ఫోటో మీదికి దృష్టిపోవడ మేమిటి?

అతను ఎవరు?... అన్నదానికి ఆమె ఉలిక్కిపడి దిక్కులు చూసింది. కాని ఎవ రుంటారు కనుక...?

ఆమె తన కనుపాపల్లోకి లాక్కుని, 'ఎవరూ లేరు - నీవూ నేనూ తప్పించి-' అంది.

తుమ్మెద రెక్కల చాటునా, నూనూగు మీసాల మాటునా ఆ మల్లె మొగ్గ ఎర్ర బారింది.

గోడమీది ఫ్రేములో ఆ వృద్ధుడు అలానే అదే మందహాసంతో చూస్తున్నాడు.

ఎవరతను?

లూయీ పాశ్చరా?-

డార్విన్నా?-

ఆల్బర్ట్ ఐన్‌స్టీనా!-

ఆ వృద్ధుని ముఖంలో మళ్ళీ అదే చిరునవ్వు. ఆ చిరునవ్వులో నూనూగు మీసాల వెనుక పదిహేడేళ్ళ యవ్వనం ఎప్పట్లా తొంగి చూస్తోంది.

అతను ఈసారి మరీ తత్తరపడ్డాడు.

ఆ ఫోటో తనదే-

ఆ ఫోటోలోంచి తను ఆమెకేసి తృప్తిగా చూస్తున్నాడు.

ఆమె ముగ్ధమోహనంగా వివస్త్రయై శయనించింది. రహస్యాన్ని ఛేదించిన ప్రకృతిలా- ఆమెను వివస్త్రను చేసింది తనే - క్రొత్త సృష్టికి బీజాన్ని నాటింది తనే - అతను ఏక్సిడెంటును తిట్టుకోడు.

(కొందరి మేధస్సు పదిహేడేళ్ళ తొలి యవ్వనపు బిగిలాంటిది. వాళ్ళ నిరంతర ఆలోచనలూ, తృష్ణా "టు అన్ ఫోల్డ్ ది సీక్రెట్స్ ఆఫ్ ది నేచర్ -" వాళ్ళు నిరంతరం కలలుగనే ఆ తేజస్సు కోసం మార్గంలో ఒక చోట దెబ్బతిన్నా మరో చోట ప్రతిఫలించడం జరుగుతుంది.)

*'జ్యోతి,' దీపావళి ప్రత్యేక సంచిక 1980 **

హైదరాబాద్
***4.4.1980***

# కబురు

అతను బతికుండగా నేనా యింటి గడప తిరిగి తొక్కనని బయటికి వచ్చేశాను.

అతను చనిపోయాడన్న కబురు వచ్చింది.

ఈ రెండు సంఘటనల మధ్యా ఓ నాల్గు సంవత్సరాల కాలం మూగగా నడిచింది. కాని నాకింకా నిన్నమొన్న జరిగినట్టే అనిపిస్తుంది.



నేను రైలు దిగి ఇంటికి వచ్చేసరికి తెలతెలవారుతోంది.

నేను తలుపు తట్టేనో లేదో, పక్కమీంచిలేచి మా వాళ్ళు తలుపు తెరిచేలోగా మా పిల్లి కిటికీ వద్ద నాకోసం నానా హంగామా చేసింది. తలుపు తెరిచాక నా మీదకురికి, నాకాళ్ళకడ్డంబడి 'మ్యావ్' అంటూ హడావుడి చేసింది. నేను దాన్ని అంతగా ఖాతరు చేయలేదు గాని, అది మాత్రం నానా హంగామా చేసింది.

మావాళ్ళు నా ఇంటర్వ్యూ గురించి అడిగారు.

మా చెల్లాయి హైదరాబాద్ విశేషాల గురించి కుతూహలంగా అడిగింది.

నేను జరిగింది ముక్తసరిగా చెప్పేసి, అక్కడ నా ఉద్యోగావకాశాల గురించి మాత్రం ఏవేవో కొన్ని చెప్పాను. అక్కడ మా పిన్ని నన్నక్కడే వుండి, ఉద్యోగ ప్రయత్నాలు చేసుకోమందని వాళ్ళతో చెప్పాను. నేను త్వరలో ఓ ఉద్యోగస్తుణ్ణి కావాలన్న ఆత్రుత మావాళ్ళల్లో కూడా ప్రబలంగా ఉండడం వల్ల నేను చెప్పింది శ్రద్ధగా విని......' అలాగే చెయ్ నీ యిష్టం' అన్నారు.

ఆ రోజంతా మా పిల్లి నేనెటువెళ్తే అటు వచ్చేది. నేను టవల్ తీసుకొని స్నానం కోసం బాత్‌రూమ్‌కి వెళ్తే, అది నాకోసం వచ్చేవరకూ గుమ్మం వద్ద కాచుక్కూచునేది. డైనింగ్ టేబుల్ వద్ద టిఫిన్ తింటుంటే అది టేబుల్ కింద తచ్చాడేది. నా కాళ్ళల్లో మెలికలు వేసుకుంటూ, 'మ్యావ్' అంటూ నా ముందు తచ్చాడుతూ తిరిగేది.

నేను వచ్చినప్పటి నుండీ దాని హడావుడే వేరైపోయింది.

పిచ్చిముండ! నేను పదిరోజులు కనపడకపోయేసరికే ఇంతహడావుడా అని చేతుల్లోకి తీసుకుని దాని ఒళ్ళంతా నిమిరాను.

ఈసారి హైదారాబాద్ వెళ్తే ఎప్పటికి వస్తానో-

✿ ✿ ✿

నేను హైదారాబాద్ వచ్చి నాల్గు నెలలు గడిచాయి.

మా పిన్ని నా పట్ల ఎనలేని ఆదరాభిమానాలు చూపిస్తోంది, నాలుగయిదు ఇంటర్వ్యూలు చూశాను. ఓ పదిమంది పెద్దల్ని కలిశాను. అన్ని చోట్లా ఆశకన్నా నిరాశే ఎదురౌతోంది.

ఈ ఆశనిరాశల మధ్య ఈ నాల్గు నెలలూ నాలుగుయుగాల్లా గడిచాయి.

ఇంకెన్నాళ్లకు నాకో ఉద్యోగం దొరికేను-

ఇంటర్వ్యూల్లో ఉద్యోగాలను అరిచేతుల్లో ఉండగానే 'గద్దలు' తన్నుకు పోతున్నాయి. గద్దెమించి 'రాబందులు' మెడలు వంచి సగం చచ్చిన ఆప్లికెంట్సువేపు ఉత్తర దక్షిణాలు చూస్తున్నాయి. ఇక ఈ ఇంటర్వ్యూల కెళ్ళడం శుద్దదండగని పించింది.

ఇక్కడ నా మజిలీ ఇంకెన్నాళ్ళు-

చదివాను కనుక ఏదో ఉద్యోగం చూసుకోవడం తప్పదు మరి-

అందుకని మా అన్నను వాళ్ళాఫీసులో ఏదయినా చిన్న టెంపరరీ పోస్టు వుంటే చూడమని అడిగాను.

మా అన్న అంటే... స్వయానా మా పిన్ని పెద్దకొడుకు. నా కంటే రెండేళ్ళు పెద్దవాడు. నేను వచ్చాక నా మీద ఎంతో అభిమానం చూపించినవాడు, వాళ్ళ డిపార్టుమెంట్లో వాళ్ళ ఆఫీసరుకీ, కొలీగ్సుకీ పేరు పేరునా నన్ను ఘనంగా పరియచం చేసినవాడు. నన్ను తమ్ముడని చెప్పుకోవడంలో అంతో ఇంతో గర్వంగా ఫీలైన వాడు. అలాంటి మా అన్నను పరిచయం చేయవలసి వస్తే..

అతను నిజానికి చాలా అదృష్టవంతుడని చెప్పాలి-

ఎందుకంటే... మా అన్న చదివింది కేవలం ఎనిమిదవ తరగతిలో సగం వరకే- అక్కడ ఆగిపోయిన చదువుకి మెట్రిక్‌తో మెట్టెక్కించాలనుకుంటే సింగిల్ డిజిట్ మార్కులు ప్రత్యక్షమయ్యాయి. అందుకని ఓ ఫోర్తుక్లాస్ ఎంప్లాయిగా జాయినయ్యి ఈ మధ్యనే తన సీనియారిటీతో వర్క్‌షాపులోని ఓ సెక్షన్‌కి ఇన్‌చార్జి అయ్యాడు.

కాస్తమాటకారి... కొలీగ్సు ముందు కాలరెత్తుకుని, ఆఫీసరు తలలో నాలుకలా మసలుకుని... తనదైన ప్రాపకాన్ని సంపాదించుకున్నవాడు.

అందుకని అతన్ని నా ఉద్యోగం గురించి అడిగాను.

అతను నామాట ఖాతరు చేసినట్టు లేదు.

నేను వాళ్ళ ఆఫీసుకు వెళ్లి మరోసారి గుర్తుచేశాను.

ఉన్నట్టుండి - ఉద్యోగమూ... మా ఆఫీసులోనా... నీలా ఎమ్.ఏ చదివినవాళ్ళు లోకం మీద చాలా మంది వున్నారు.

వాళ్లందరికీ ఉద్యోగాలివ్వడానికే మే మున్నామా? ఎమ్.ఏ చదవటం గొప్పేమీ కాదు... ఏదన్నా టెక్నికల్ కోర్సంటే ఉద్యోగాలు దొరుకుతాయ్- అన్నాడు.

నేను మౌనంగా విన్నాను.

ఒకప్పుడు ఆకాశానికెత్తేసిన తనే ఇప్పుడిలా తుంచి పడేయడానికి కారణ మేమిటి?- నాకు అన్నగా చెప్పుకోవడం తన గౌరవ ప్రతిపత్తిగా ఎంచుకొనే తాను ఇలా కించపరచడానికి కారణమేమిటి?-

అయినా నేనతనికి బదులు చెప్ప లేదు. ఆ అవహేళనను మాత్రం దిగమింగుకున్నాను. నేనా రోజునుండి ఏనాడూ నా ఉద్యోగం గురించి అతని ముందు ప్రస్తావించలేదు. అతని అంతరాత్మ నాముందు బట్ట బయలయ్యింది. అంతేచాలు-

కాని నా మీద అతనలా ఈర్ష్య చెందడానికి గల కారణమేమిటన్న ప్రశ్న ఆనాటి నుండీ నన్ను హాంట్ చేసింది.

నా మనసు కలత చెందింది.

✿ ✿ ✿

ఆ ఇంట్లో ప్రేమాభిమానాలకు లోటు వుండదు.

ఆమాట తీరూ, కలుపుగోలు తనం నిజంగా శ్లాఘనీయం.

అందుచేత మా పిన్నివాళ్ళ ఇంటికి బంధువులూ, స్నేహితులూ తరచూ వస్తుంటారు. కొన్ని కుటుంబాలయితే ఓ వారానికి పూటయినా అక్కడ గడిపేందుకు వస్తుంటాయి.

నేను మొదట్లో వాళ్ళను చూసి కాస్తదూరంగా మసలే వాణ్ణి. కాని మా పిన్ని ఊరుకునేది కాదు. నాకు పరిచయం చేసి బంధుత్వం కలిపేది. తర్వాత తర్వాత, నేనూ వాళ్ళతో చనువుగా వుండడం తప్పనిసరి అయ్యేది. ఈ నాలుగు నెలల్లో నాకు అలా చాలా మంది పరిచయం అయ్యారు. అయితే కేవలం పరిచయమే కాకుండా కాస్త సన్నిహితం అయిన వాళ్ళు రజని, రమణి అని చెప్పవచ్చును.

ఇద్దరూ అక్కచెల్లెళ్ళు-

ఓ అమ్మాయి ఎమ్.ఎ. లిటరేచర్ చదివింది.

మరో అమ్మాయి ఎమ్.ఎ. ప్రీవియస్ చేస్తోంది.

రజని, రమణిలు అందమైన వాళ్ళని నేననను. నేనే కాదు. చాలా మంది అనరు. కాని అందగత్తెల్ని సయితం కాదని, వాళ్ళనే ఎక్కువగా కోరుకునే ఆకర్షణలనేకం ఆ ఇద్దర్లోనూ ఉన్నాయి.

రజని ఎప్పుడూ కాటన్ చీరలే కట్టేది.

రమణి అప్పుడప్పుడూ మాక్సీలు కూడా వేసేది.

చక్కని కాన్వెంటు ఇంగ్లీషులో వాళ్ళు మాట్లాడుతుంటే నేను తరచూ ముగ్ధుణ్ణయ్యే వాడిని-

మా మాటలు కాస్త ప్రత్యేకంగా ఉండేవి. సాధారణంగా లిటరేచర్ మీదా, ఎడ్యుకేషన్ మీదా, ఎంప్లాయ్‌మెంటు మీదా సాగేవి.

నేనూ రమణి అప్పుడప్పుడూ వేళాకోళానికి దిగేవాళ్ళం-

కాని రజని ఆ ఛాన్సు ఇచ్చేది కాదు. మాటల్లో ఎక్కడా తొణికిసలాడేది కాదు. గౌరవ ప్రదమైన సంభాషణ; అందుకని నేను కూడా ఆమెపట్ల మర్యాదగానే మసలేవాణ్ణి, వాళ్ళక్కడకి రావడంతోనే అందరినీ వదలి నాతోనే మాటలు మొదలు పెట్టేవారు. నేను కాస్త విస్తృతంగా చదవడం వల్ల మామాటలు ఎంతకూ తరిగేవి కావు. అలా మేం మాట్లాడుతున్నంతసేపూ మా పిన్నీ, మా అన్నా కేవలం ప్రేక్షకుల్లా మిగిలిపోయేవారు. మా మాటలు పూర్తయ్యేసరికి కాలాతీతం అవుతూ ఉండేది. అలాంటప్పుడు కేవలం వీడ్కోలు మాటల్తోనే వాళ్ళు సరిపెట్టుకోవలసి వచ్చేది.

అలా ఈ నాలుగు నెలలూ గడచిపోయాయి.

ఓ రోజు మా అన్న రజనీ, రమణిల గూర్చి ఏవేవో చెప్పడం ప్రారంభించాడు. రజని ఎవరినో ప్రేమించిందనీ, పెళ్ళిచేసుకోబోతోందనీ, అతను ఫలానా కన్‌సర్న్‌లో... ఫలానా... అంటూ చాలావరకు వివరాలు చెప్పాడు.

మొదట నేను ఆశ్చర్యంగా, ఆతర్వాత మౌనంగా విన్నాను.

మా అన్న సంగతేమో అలా వుంటే, ఇటు రజని కూడా ఏవేవో మాటల్లో నా వివాహాన్ని గురించి ప్రస్తావించింది.

నేను నా భావాల్ని వ్యక్తం చేశాను.

ఆమెనా కోసం ఎవరో అమ్మాయిని ప్రపోజ్ చేసింది. ఆమె తన ఫ్రెండ్ అట... అందమైనదట... తెలివైనదట. తన క్లాస్‌మేట్ అట.... నా భావాలకు దగ్గరిదట.. ఆమెను ఒకసారి పరిచయం చేస్తానని కూడా నాతో అన్నది.

ఇవన్నీ నాకిప్పుడు గుర్తుకు వస్తుంటే ఎవరూ ఏవీ వ్యర్థంగా మాటాడరనీ, ఏదో ప్రయోజనం కోసమే చెబుతారనీ అనుకుంటున్నాను.

మా అన్నకు నామీద ఒక పక్క కొంత సదభిప్రాయం వున్నా రజని జీవితం గూర్చి నాకలా చెప్పడంలో అతని అంతరార్థం వేరు- మా ఇద్దరి మధ్యా వున్న సన్నిహితత్వం ఏనాటికైనా దాని 'పేరు' మార్చుకుంటుందేమో నన్న అనుమానం. ఆ ఊహ అతన్ని పట్టి పీడించడంలో సందేహించవలసిందేమీ లేదు.

రజని కూడా నాపట్ల ఎంతో కొంత గౌరవ ప్రతిపత్తిని కలిగివున్నా నేనెక్కడ ఆమెపై ఆకర్షణలు పెంచుకొని, అనవసరమైన పరిస్థితుల్లోకి నిస్సహాయంగా నెట్టబడి నాతో రచ్చకెక్కవలసి వస్తుందోనని ఆమె భయపడి వుండవచ్చు-

ఎవరికి వాళ్ళు తమ తమ ఉనికిని బలపర్చుకుంటున్నారు.

నేను ఇద్దర్నీ మౌనంగా విన్నాను.

మా అన్న నానీడను చూసి భయపడుతున్నాడు. రజని తన నీడను తానే చూసి భయపడుతోంది- అని మాత్రం నేను గ్రహించుకున్నాను.

మా అన్న అందగాడు... మాటల నేర్పరి.

అతని ప్రేమ వ్యవహారాలను గూర్చి నేను కూడా కొంత విన్నాను. ఆ అనుభవాల నుండి అమ్మాయిలపట్ల కొన్ని నిశ్చితాభిప్రాయాలు ఏర్పడి పోయాయి. కాని అవి అందరి పట్లా నిజం కావన్నవి ఏనాటికీ అతను ఆలోచించలేడు..

అందుకని అతని ఇంట్లో నా ఉనికి ఇబ్బంది కలిగిస్తోంది.

ఇంతవరకూ అతనిని అభిమానంతో పలకరించేవాళ్ళు ఇప్పుడు నన్నుకూడ తనతోపాటు అంత అభిమానంతోనూ పలకరిస్తున్నారు.

రజని, రమణి లాంటివారు ఇప్పుడు కేవలం నన్ను కలవడానికే వస్తున్నారేమో నన్న అనుమానం కూడా వస్తోంది.

అతన్ని ఏదో కాంప్లెక్స్ కుంగదీస్తోంది. తనదైన దేదో తన చేయిజారిపోతున్న బాధ అతన్ని దహించి వేస్తోంది.

అతను కొన్ని రోజులు ముభావంగా గడిపాడు.

ఆ తర్వాత ఓ రోజు సాయంత్రం మా పిన్నితో గొడవ పడ్డాడు. విషయం చాలా చిన్నది. అసలు చెప్పుకోవడానికి ఏమీ లేదు.

ఆ రాత్రి ఇంటికి రాలేదు. మా పిన్ని అతనికోసం దిగులుగా కూచుండిపోయింది.

అతను తిరిగి మూడవరోజు వచ్చి మళ్ళీ పెద్దగొడవ పెట్టుకొని వెళ్లిపోయాడు. అతను వస్తున్నది కేవలం గొడవ పెట్టుకోవడానికేనని తేట తెల్లమౌతోంది. కాని ఎవరూ ఆ విషయం ఎత్తకుండా ఎవరిలో వాళ్ళు మథనపడసాగారు.

మా పిన్ని ఏ విషయాన్నీ మింగలేక కక్కలేక నాముందు నిస్సహాయంగా నిలబడింది. ఆమె పట్ల నాకు ఏదో తెలియని అభిమానం. ఎప్పుడన్నా కన్న తల్లి నన్న పార్థం చేసుకున్నా మా పిన్ని మాత్రం ఏ విషయంలోనూ నన్నెన్నడూ అపార్థం చేసుకోదని ఈనాటి వరకూ గట్టి నమ్మకం.

ఆమె చివరకు అసలు విషయం బయట పెట్టింది.

మీ చిన్నాన్నగారు రిటైరయ్యినప్పటి నుంచీ మేం వాడి మీదనే అధారపడి వున్నాం. వాడు జీతం తెచ్చి మమ్మల్ని పోషిస్తున్నాడు. ఇప్పుడు నీ గురించి వాడు ఏదో కష్టపెట్టు కున్నాడు. వాడి గుణం నాకు బాగా తెలుసు. మీ చిన్నాన్నకు ఎందులోనూ తీసిపోడు. ఇందులో నీ తప్పేమీ లేదు... అంటూ మిగతా విషయాలు చెప్పడానికి తటపటాయిస్తోంది.

అప్పుడు నేను కొంత డబ్బు తీసి మా పిన్ని చేతిలో పెట్టి, ఈ సాయంత్రం నేను ఇల్లు మారుతున్నాను పిన్నీ.. అన్నాను.

ఆమె ఎలాంటి అభ్యంతరమూ తెలుపలేదు. నేనిచ్చినది ఆమెచేతిలోనే ఉంచుకొని నీకీ డబ్బు ఎక్కడిది అని అడిగింది.

ఇంటి నుండి తెప్పించాను. అన్నాను.

ఇల్లెప్పుడు చూసుకున్నావ్- అంది.

పదిరోజుల క్రితమే... అడ్వాన్సు కూడా ఇచ్చేశాను. కాని నీ మనసు కష్ట పడుతుందేమోనని ఇంతవరకూ ఆగాను. ఇప్పుడు ఇక తప్పని సరి గనుక ఈ రోజే వెళ్తున్నాను. ఇందులో నా తప్పేమీ లేదన్నావు- నేనా ఒక్క మాటకోసమే ఇన్నాళ్ళూ ఆగి వున్నాను- అన్నాను.

ఆమె మౌనంగా వుండిపోయింది.

నేనూ ఆ తర్వాత ఏమీ మాట్లాడలేకపోయాను. మా అన్న కాసేపటికి వచ్చాడు. వస్తూనే మా పిన్నితో తగాదాకు సరంజామా సిద్ధం చేసుకుంటున్నాడు. ఈ వారం రోజుల నుండీ అతను ఎంత రభస సృష్టిస్తున్నప్పటికీ నన్ను మాత్రం ఒక్కమాట కూడా అనటం లేదు. అలాంటప్పుడు నేను కలిపించుకోవడానికీ, సమాధానం చెప్పడానికీ ఆస్కారం లేకపోయింది.

నేను లోనికెళ్ళి నాపెట్టె, బెడ్డింగుతో బయటికి వచ్చేశాను.

మా పిన్నితో వెళ్తున్నాను పిన్నీ- అన్నాను.

మా అన్నతో వెళ్తున్నాను.. అన్నాను.

ఇంతవరకూ నా వాళ్ళు అనుకున్న వాళ్ళు ఇప్పుడు పరాయి వాళ్ళల్లా చూస్తున్నారు. నన్ను వేరుచేయడానికి నరకాన్ని సృష్టిస్తున్న మా అన్న... అన్నీ ఎరుగుండి, ఏదీ కాదనక మౌనం వహించిన మా పిన్ని...

నేను మెట్లు దిగుతుండగా మా అన్న ఏదో అనబోయాడు.

నేనాగి 'నీకే అనుమానమూ అక్కర్లేదు. నీవు బతికుండగా నీ ఇంటి గడప నేతొక్కితే నన్నప్పుడడుగు...' అని వచ్చేశాను.

ఈ లోగా నాలుగేళ్ళు గడిచాయి.

అతని గురించిన మంచి చెడ్డలు ఎవరు ప్రస్తావించినా చెవులు మూసుకున్నాను. అతని గురించి నాకెందుకు కావాలి?... ఒకసారి కాదనుకున్నాక-

అతను చనిపోయాడన్న కబురు విన్నాక నేను నిశ్చేష్టుడనయ్యాను. అతనేమిటి... ఇలా ఇంతలో చనిపోవడమేమిటి అని-

అతను చనిపోయాడన్న వార్త ఎక్కడోవున్న మా తల్లిదండ్రులకు తెలిసింది. కాని అదే వూళ్ళో ఉన్ననాకు అతని అంత్యక్రియలు అయిపోయిన మూడవరోజున తెలిసింది. అదయినా మా తల్లిదండ్రులు నా అడ్రస్ ఇస్తే దాని ప్రకారం అప్పుడా కబురు వచ్చింది.

నేను దుఃఖాన్ని దిగమింగుకోలేక పోయాను. ఎంతయినా నాకు అన్నే కదా... ఇంకా

పెళ్ళయినా కాలేదు... అనుభవించవలసిన జీవితం ముందున్నవాడు... దానికోసం అర్రులు చాస్తున్నవాడు.

ఎవరి అంత్యక్రియలు ఎవరిచేతుల మీదగా జరగాలో ఆ తల్లిదండ్రుల చేతుల మీదగనే ఇప్పుడతని అంత్యక్రియలు జరిగిపోయాయి.

లోకంలో బాధాకరమైన సంఘటన-

ఎవరూ ఓదార్చలేని ఆక్రందన-

కన్నవాళ్ళు క్రుంగి కృశించే ఆవేదన-

నేనా నాలుగు రోజులూ మా పిన్నిని ఓదార్చడమే సరిపోయింది. మా పిన తండ్రిగారి మనసూ, వాక్కూ, ఆలోచనా... అన్నీ మూగబోయాయి. ఆయన అందరి వంకా నిర్జీవపు కళ్ళతో చూస్తున్నాడు.

ఎన్నో ప్రలోభాలకు లోనైన మా అన్న తన జీవితంలో ఏమి సాధించినట్టు? ఈ భూమ్మీద తనకు ఎవరూ సమకూర్చలేని, తానెన్నటికీ తిరిగి అందుకోలేని అతి విలువైన ప్రాణాన్ని తాను పోగొట్టుకున్నాడు. అందుకే అతని చావు గురించి దుఃఖం ముంచుకొచ్చింది.

ఓ పదిరోజుల పాటు ఓదార్పుకోసం మా తల్లిదండ్రులు అక్కడే వుండి పదకొండవ రోజున తిరిగి ప్రయాణం కట్టారు. నేను వాళ్ళను సాగనంపడం కోసం రైల్వే స్టేషన్‌కు వెళ్ళాను. అక్కడ ఆ ప్లాట్‌ఫామ్ మీద మా అమ్మ నన్ను పక్కకు పిలిచి అడిగింది. నీకూ మీ అన్నకూ వచ్చిన స్పర్థల్లో నీదే తప్పట... ఆడపిల్లల విషయంలో నీవు మరీ అలా వుండకూడదట... సంసారపక్షంగా లేవట.. మీ అన్న నీ విషయంలో అందుకే కష్టపెట్టు కున్నాడట.. అలా అని మీ పిన్ని మిగతావాళ్ళతో అంటోందట.. అంది.

ఈ అభియోగానికి నేనేం బదులు చెప్పను- నిశ్చేష్టితుడనై శిరసువంచుకున్న వాణ్ణే అలానే మౌనం కూడా వహించాను.

✿ ✿ ✿

మా అన్న చనిపోయి నెలయినా కాలేదు.

అతను గుర్తొస్తే మనసు కాస్త బాధపడుతోంది. ఆ తర్వాత ఆ బాధ నెమ్మదిగా మరుగున పడుతుంది.

మనిషికి మరుపనేది ఈ సృష్టి శీలతలో ఓ ముఖ్యాంశం కాకపోతే ఈ రాగద్వేషాల మధ్య మనిషి జీవనం ఎంతటి దుర్భరమయ్యేదో తెలిసింది. బాధనీ, క్రోధాన్నీ, అసూయనీ మరుపు జయించి, మనిషిని మనిషిగా నిలబెడుతుందని నేను మొదటిసారిగా గ్రహించాను.

అలాంటి సమయంలో మా ఇంటి నుండి ఉత్తరం వచ్చింది.

ఉత్తరం నిండా ఇంటివిషయాలే.. ప్రతీసారీ రాస్తున్నవే... కానీ చిట్ట చివరిగా మా 'పిల్లి' ని గూర్చి రాశారు. ఏమి రాశారో యింకా చదవక ముందే నా మనసేదో కీడును శంకించింది.

ఎప్పుడూ ఉత్తరాల్లోకి రాని మా పిల్లి ప్రస్తావన హఠాత్తుగా ఈ ఉత్తరంలో చోటు

చేసుకోవడంతో నేనలా ఆలోచించాను. ఉత్తరం చివరలోనే రాసినా, ఆ ఉత్తరం కేవలం మా పిల్లిని గూర్చి వ్రాసిందేనని దాన్ని పూర్తిచేశాక అర్థమయ్యింది.

అయితే నేనేదయితే శంకించానో అదే జరిగిపోయింది.

మూడు రోజుల క్రితం ఎక్కడికో వెళ్ళిపోయిన మా పిల్లి ఇంతవరకూ తిరిగి రాలేదట. ఇంటిల్లిపాదీ దానికోసం ఆ మరుసటి రోజునుండే వీధి వీధికీ తిరిగి అంతటా వెతికారట..

ఇంతకూ మా పిల్లి ఏమైనట్టూ అని ఉత్తరాన్ని హడావుడిగా తిరిగేశాను.

ఈ వర్షాలకది కరెంటు స్తంభాలవద్ద చేరి దీపం పురుగుల్ని తిని సయించక అక్కడే కక్కుకోడం మొదలు పెట్టిందట... దాన్ని ఇంటికి పిలుచుకువస్తే ఆ తర్వాత అది అక్కడ నుండి మరెక్కడికో వెళ్లిపోయిందట... అది అలాంటి ఇతరత్రా పనులు దూరంగా వెళ్ళి ఎక్కడో చేసి వచ్చేది. కాని ఈ సారి అలా వెళ్లిపోయిన మా పిల్లి మళ్లీ ఇంటికి తిరిగి రాలేదట.

మా అమ్మ దానికోసం దిగులుతో వుందనీ, మా నాన్నగారు వెతికి వెతికి అదే దిగులుతో ఇక వెతకడం, ఎదురు చూడడం మానివేశారనీ రాశారు. ఇంట్లో ఏ మూల ఏది కదిలినా అదే వచ్చిందేమోనని మా అమ్మ ఇంకా భ్రమ పడుతూనే వుందట.

అది బతికే వుంటే ఇంటికి రాకుండా మూడు రోజుల వరకూ ఎక్కడా వుండదు నాయనా. అని రాశారు.

ఉ త్తరంలోని ప్రతి అక్షరంలో ఎంతటి దిగులు దాగుందో నా హృదయానికి తెలుసు.

మా ఇంట్లో దానికి సమయానికి కాస్త తిండి పడేస్తే బావుండును. కాని దాని ఆలనా పాలనా ఎవరికి కావాలి? మనిషిని సతమతం చేసే ఎన్నో సమస్యలు తనవీ, తన కుటుంబానివీ, తన చుట్టు పక్కలివీ అనేకం వున్నప్పుడు ఓ అల్పజీవి ఆకలి గురించి ఎవరంతగా పట్టించు కుంటారు. ఏదో గుర్తున్నపుడు దానికి కాస్త పెడతారు... గుర్తు లేనపుడు లేనట్టే... కాని ఆకలితో అది ఎంతగా నకనకలాడినా మ్యావ్ మ్యామ్ అంటూ వెంటాడుతుందే తప్ప అందుబాటులో వుందని ఇంట్లో దేన్నీ ఎన్నడూ ఆరగించదు. ఆ పాటి నీతి బుద్ధిజీవియైన మనిషికీ వుంటుందా అని ఇంటిల్లిపాదికీ ఆశ్చర్యం వేసేది.

కిందట ఏడాది అలానే ఓసారి అల్లరి చేస్తూ నాకాళ్ళల్లో పడసాగింది. దానికి ముద్దొచ్చినపుడు కూడా ఇలానే చేస్తుంది కనుక నేను నా పనిలో దాన్నేమీ పట్టించుకోలేదు. అది చివరికి నా కాళ్ళ కడ్డంబడింది 'మ్యావ్, మ్యామ్' అంటూ అలజడిగా అరిచి, నా కాలిపిక్క మీద కరిచింది.

నేను తత్తరపాటుతో అరచి, కాలు విదిల్చాను. నేను వేసుకున్న పాంటు కాస్త దళసరిది కావడంచేత దాని కోరలు నా శరీరంలోకి దిగలేదు.

అది చేసినపని పొరపాటని దానికీ అర్థమయ్యిందో ఏమో.. వెంటనే నా పిక్కవదలి

అక్కడ నుండి ముందుకు ఒక గెంతు గెంతి, నాకేసి బేలగా చూసింది. ఆక్షణంలోనే అది నా ముందు నిలవలేక మరెక్కడికో వెళ్లిపోయింది. అప్పుడు దాని ముఖంలో సైతం ఏదో కలవరం చోటు చేసుకోవడం నేను చూశాను. ఆ రోజంతా నాకది కనిపించలేదు. ఆ మరసటి రోజు ఉదయం మా యింట్లో అది చాలా దీనంగా, మౌనంగా, నాకు కాస్త దూరంగా తిరగసాగింది.

నేను ఊరు నుండి ఆరునెలలకో, మూడు నెలలకో తిరిగి వస్తే, తలుపన్నా తెరువ ముందే, కిటికీలోంచి బయటకు దూకి, నా మీదకు ఎగ బ్రాకి ఆనందంతో పరవళ్ళు తొక్కే మా పిల్లి అలా నన్ను కాలిపిక్క మీద ఎందుకు కరిచింది."

అర్ధరాత్రో, అపరాత్రో లేచి, చీకట్లో ఆ బాత్ రూమ్ కేసి బయల్దేరితే మనిషితో పాటే నడిచివెళ్ళి, అక్కడే గుమ్మం వద్ద కాపలా కూచుని తిరిగి మనిషితో పాటే నడిచి వచ్చి, కంటికి రెప్పలా తిరుగాడే మా పిల్లి ఇలా చేసిందంటే నా కళ్ళను నేనే నమ్మలేక పోయాను.

"అప్పుడు నాకనిపించింది – మాటల్తో పరిష్కరించుకోవలసిన నోరున్న మనమే 'కాటు' వేసుకుంటున్నప్పుడు నోరు లేనిది, ఆకలితో అలమటిస్తూ తనను ఎవరూ పట్టించుకోకుంటే, తిండి కోసం మరోరకంగా ఎలా చెప్పగలదు– అని.

కాని మనిషి ఆకలిని మనిషే పట్టించేకోలేని దుస్థితిలో ఓ పిల్లి ఆకలిని పట్టించుకోవటం అన్ని వేళలా, అందరికీ సాధ్యమయ్యే పనికాదేమో నన్న భావం నాలో కలిగి ఇంట్లో వాళ్ళకి నేను రొక్కించి ఏదీ చెప్పలేకపోయాను... వేళకు దానికి కాస్త ఏదయినా పడెయ్యండని.

ఇప్పుడు ఏమనుకుంటే ఏం లాభం.

అది ఆకలిని తట్టుకోలేక దీపం పురుగులతో క్షుద్బాధను తట్టుకుందామనుకుని వాటిని తిని అరుపుకోలేక అతలా కుతలమై ప్రాణం మీదకు తెచ్చుకుంది.

నేనేమిటి! ఓ పిల్లి చావు కబురుకు ఇంతగా చలించి పోవడమేమిటని మొదట్లో అనుకున్నాను.

పదిరోజులు గడిచాయి.

జ్ఞాపకాలు నెమ్మది నెమ్మదిగా మరుగునపడి, బాధను మరచిపోవాల్సినదిపోయి, జ్ఞాపకాలు మరింత ఎక్కువై మింగుడు పడని బాధ గొంతులో అడ్డుపడుతోంది. ఇప్పుడు దాని గాజుకళ్ళల్లోని బేలచూపులు నన్ను మరింతగా వెంటాడి, ఎక్కడ ఏపిల్లి కనిపించినా మాపిల్లే గుర్తుకు వచ్చి నా గొంతులో తడారిపోతుంది.

మా అన్నా చనిపోయాడు... అతని చావూ నన్ను బాధించింది. వేదనగా నాలోనేను మథనపడ్డాను. ఏకాంతంలో కళ్ళు చెమర్చాను. కాని మా అన్న చావువల్ల కలిగిన ఆవేదన కన్నా ఇది నివురుకప్పిన నిప్పులా పైకేమీ కనిపించక పోయినా ఎన్నో రెట్లు బలీయంగా, మనసును కలచి వేసేదిగా నా అనుభవానికి తెలుస్తోంది. లోలోన కుములుతోంది.

ఓమనిషి చావు ఓ పిల్లి చావుకు సమం ఎన్నటికీ కాదని అందరికీ తెలుసును.కాని

ప్రతిదానికీ ఒక హేతువు వుంటుంది.

ప్రస్తుతం ఈ ఆవేదనకూ ఒక హేతువు వుండే వుంటుంది.

మా పిన్నీ మాఅన్నా నన్ను ప్రేమగానే చూశారు.

మనుషులందరూ ఏదోరకంగా ప్రేమలను వొలకబోసుకుంటూనే వుంటారు.

కాని మనుషుల ప్రేమ ఏపాటి- మనిషికుండే స్వార్థహృదయంతో ఏపాటి ప్రేమను మనిషికి అందించగలడు.

నేను కాగితం కలం తీసుకున్నాను.

నేనూ అందరిలాంటి వాడినే కనుక, మొదట మావాళ్ళ యోగక్షేమాల్ని అడిగి, ఆతర్వాత నా యోగక్షేమాల్ని రాసి, చివరిగా పిల్లిని గూర్చిన ప్రస్తావన తెచ్చాను.

ఏమని అంటే--

అమ్మా! మీరు మరో పిల్లిని పెంచవద్దు-కళంకం లేని ప్రేమని భరించడానికి మనిషికి పెద్దగుండె లేదు-- అని.

ఉత్తరం పూర్తిచేసి ఇంటికి పోస్టు చేశాను.

ఆ ఒక్కమాటా రాశాక నా మనసు కాస్త ఊరట పడింది.

** 17 మార్చి 1991, తూర్పుతీరం. **

హైదరాబాద్
*26.8.86*

# ఋతువు

మిత్రుడూ, నేను... అటు ఎదురుగా నది.

నది జీవితంలా వుంది. ఊపిరిలా ప్రవహిస్తోంది.

నేనూ, నా మిత్రుడూ గట్టు మీద నిల్చున్నాం.

నా మిత్రుడు అంతు దొరకని బ్రహ్మాండమైన ఆ వెడల్పాటి నదికేసి చూస్తున్నాడు.

నేను నా మిత్రుడి కివ్వవలసిన ఆతిథ్యం గురించి ఆలోచిస్తున్నాను. నేనతని రాకకోసం చిరకాలంగా కన్న కలలకిప్పుడు సరైన రూపకల్పన జరగాలి – తగిన ఆతిథ్యం ఇవ్వాలి.

నా మిత్రుడు నా ఆహ్వానాన్ని అందుకున్న వెంటనే రెక్కగట్టుకుని ఇక్కడికొచ్చి వాలాడు. అతను వచ్చినప్పటి నుండీ మేమిద్దరం ఎన్నెన్నో ఊసులు చెప్పుకున్నాం ఊరంతా తిరిగాం.

ఈ ఊరు గురించి నేను వేరే చెప్పవలసిందేమున్నది? రాజరాజనరేంద్రుడు ఏలినదీ, సారంగధరుడు మెచ్చినదీ ఈ నేల... నన్నయ, చిలకమర్తీ, కందుకూరీ కూర్చిన కవిత ఈ నేల....

అందుకని ఈ ఊరు గురించి నేను ప్రత్యేకించి చెప్పవలసింది ఏమీ లేదు; అంతా చరిత్రే చెబుతుంది.

నా మిత్రుడు ఊరును చూసి చాలా ఆనందించాడు. నదిని చూసి ఉద్వేగంతో ఉద్రూత లూగాడు.

ఈ నది ప్రత్యేకతే ఇది కాబోలు.

మేమిద్దరం ప్రవాసులుగా వున్న రోజుల్లో నేనతినితో ఈ నదిని గురించి చేసిన బాసలీనాడు మళ్ళీ నా స్మృతి పథంలో నిలిచాయి. అప్పుడే నా ఆతిథ్యం గురించి నేనెన్నెన్నో ఊహలు అతనిలో రేకెత్తించాను. ఇప్పుడు అతన్ని ఆనందంలో ముంచి తేల్చ

వలసిన బాధ్యత నా మీద ఎంతయినా వుంది. అందుకని నేనతని రాకకు చేయవలసిన ఏర్పాట్లన్నీ చేశాను. దేని విషయంలోనూ వెనకాడలేదు - చేయదలచిన దేదీ మానలేదు.

ఈ వెలుగు నీడల సాయం సమయంలో, నేనూ నా మిత్రుడూ కలిసి ఈ నదిగట్టు మీద అందుకోసమే నిలుచున్నాం - మేమిద్దరం నావకోసం నిరీక్షిస్తున్నాం - నావ వచ్చాక మేం అవతలి వేపు దీవికి వెళ్తాం.

ఆ దీవిలో అతనికోసం నే నేర్పాటు చేసిన స్వర్గసుఖాలన్నీ వేచి ఉంటాయి.

పడమటి ఆకాశం మీది చివరి వెలుగు కిరణాన్ని సైతం నది మింగేశాక, నా మిత్రుడు ఆకాశం కేసీ, చీకట్లో కలిసిపోతున్న నదికేసీ దీర్ఘంగా చూశాడు.

'అదిగో..... మనకోసం నావ వస్తోంది-' అన్నాను.

అతను నది మీంచి దూరతీరాల వరకూ తన చూపును సారించాడు. చీకటి యోనిలోంచి బయట పడ్డ శిశువులా నది మీంచి నావ వస్తోంది.

నా మిత్రుడు గట్టుమీంచి వెనుక ఉన్న ఊరుకేసి మరోసారి చూశాడు. భూమ్మీద నాటిన ఇనుప మొక్కలు ఊరు నిండా వెలుతురు పుష్పాలను పూశాయి. ఆ వెల్తురు కింద ఊరు సజీవంగా కళకళలాడుతోంది.

'కీర్తీ! చీకటి పడింది కదా.... ఇప్పుడీ నదీ ప్రయాణం దేనికి...' అన్నాడు నాతో... అతనికి నా ఆతిథ్యం గురించి అంతా తెలుసుండీ ఏమీ తెలియనట్టు నన్ను తిరిగి ప్రశ్నిస్తుంటే నేనేమనుకోవాలి-

నా మనసు గర్వంతో ఉప్పొంగింది.

"మనం వెళ్ళదలచిన సమయం ఇదే.. ఈ సమయంలో నదీ ప్రయాణం ఓ కొత్త అనుభవం.ఓ కొత్త అనుభూతి.. ఎ థ్రిల్ -" అన్నాను.

నా మిత్రుడు గట్టుమీంచి మరోసారి వెనక్కి తిరిగి ఊరు కేసి చూశాడు. ఇప్పుడిది చరిత్ర కెక్కిన ఆనాటి ఊరు కాదు. ఇది సమకాలీన సమాజానికి చక్కని ప్రతిబింబం.

ఇక్కడ వ్యాపారముంది... డబ్బుంది.

డబ్బు విచ్చల విడిగా రెండు చేతులా చెలామణిలో వుంది. దానితో కొనుక్కోవ డానికి కావలసినన్ని ఆనందాలు రోడ్ల పక్కల కుప్పతెప్పలుగా పడి వున్నాయి. వాటిని జుర్రుకోవడం కోసం అప్పటికే ఊరు హడావుడిగా వుంది.

అయినా నా మిత్రుడు అందుకోబోయే ఆ ఆనందాల ముందు ఇవి ఏపాటి? వాటి స్వరూప స్వభావాలు వేరు కాకపోవచ్చును... కాని అనుభవించే తీరు మాత్రం వేరు -

మేమిద్దరం గట్టుమీంచి దిగి స్నానాల రేవులో కడపటి మెట్టుమీద కొచ్చి నిలు చున్నాం. నదిలోని అలలు మాపాదాలను సుకుమారంగా తాకుతున్నాయి. ఆ హాయైన అనుభూతికి అతను క్షణక్షణం పరవశిస్తున్నాడు.

అతను నదివంక పులకింతతో చూస్తున్నాడు.

నది అతన్ని నిండుగా, హుందాగా పలకరిస్తోంది.

కీర్తీ! నీవన్నది నిజం సుమా.... నేనింత బ్రహ్మాండమైన నదిని ఎన్నడూ చూడలేదు. నిజంగా ఎ థ్రిల్... అన్నాడు.

ఔను ఉజ్వల్! ఈనది నీలో గొప్ప థ్రిల్ కలిగించడంలో ఆశ్చర్యం లేదు. ఇది నీ కెప్పుడోగాని కనిపించని విలువైన అతిథిలాంటిది. నాకిది నేను వెంటాడే అత్యంత ఆత్మీయుడయిన మిత్రుడు లాంటిది. నా ఇన్స్పిరేషన్...

కనుకనే... నేనీ నది మధ్యలో, అందమైన దీవిలో, విశాలమైన ఆకాశం కింద, మెత్తని ఇసుక తిన్నెల మీద, ఆరుబయలు వెన్నెట్లో, హాయిగా, ఆహ్లాదంగా, అనుభవాలకి కాణాచిగా, నీకోసం ఓ ఆనంద దాయకమైన పార్టీని ఏర్పాటు చేశాను ఉజ్వల్ అన్నాను.

నా మాటల్లోని లోతుపాతుల్ని ఎరిగినవాడు ఉజ్వల్ -

ఆ నావ అందాలనీ, ఆనందాలనీ, మత్తునీ, మురిపాలనీ, కైపుల్నీ, కోరికల్నీ... అన్నిటినీ ఆ దీవికి చేరవేసి మా కోసం తిరిగి వస్తోంది.

నా మిత్రుడు వాటిని అనుభవించే ఊహల్లో తేలిపోతున్నాడు. అలా అతను తానందుకోబోయే దాన్ని గురించి ముందుగానే ఊహల్లో తేలిపోవడం నాకు మరింత ఆనందాన్ని కలిగించింది.

నా ఆతిథ్యం గొప్పదై య్యుండాలి... విలువైనదై య్యుండాలి... అరుదైనదై య్యుండాలి. అతను దాన్ని పూర్తిగా అనుభవించాలి-

అందుకే... ఊరుకు దూరంగా, జనానికి దూరంగా, కేవలం స్వర్గసౌధాలకు మాత్రమే దగ్గరగా ఏర్పాటుచేశాను.

నా మిత్రుడు వాటిని అందుకోవడం కోసం తహతహలాడుతున్నాడు. ఇప్పటికే అతని బుగ్గలు కెంపులు దేరాయి. వేడిశ్వాసలు ప్రారంభమైనాయి. అతనికి ఆలస్యం ఏ మాత్రం రుచించడం లేదు.

నదిమీద నిశ్శబ్దంగా చీకటి తన పక్కు వాల్చుకుంది. నగరం మీది విద్యుద్దీపాల కాంతి అలల మీద పడుతోంది.

నేను నావ ఎక్కి అతనికి చేయి అందించాను.

అతను గట్టుమీంచీ కాలుతీసి నీటిలోకి వేయసాగాడు.

"జాగ్రత్త!" అన్నాను.

అతను ఉలిక్కిపడ్డాడు.

మనం నావలోకి కాలు వేయాలి తప్ప బయట నీటిలో వేయకూడదు. ఈ నది అగాధ మైనది... అనూహ్యమైనది... అన్నాను.

నా మాటల్లో కొంత పరిహాసం కూడా ధ్వనించింది. కాని అదే అతని మనసులో ముల్లై కలుక్కుమంది. అతను భారంగా ఊపిరి వదలి నావలోకి కాలు పెట్టాడు.

నేల నుండి నీళ్ళలోకీ,
వెలుగు నుండి చీకట్లోకీ,
స్తబ్దత నుండి చైతన్యం లోకీ,
అన్నిటినీ మించి అనిర్వచనీయమైన కోర్కెల్లోకీ బయలుదేరింది మా నావ –

ఇక నదిమీద ప్రయాణం –

సరంగు మనతో రావడం లేదా కీర్తీ...! అన్నాడు.

అతనెందుకు మన మధ్య.... ఈ రాత్రంతా మనం ఆ దీవిలోనే వుంటాం. అక్కడ స్వేచ్ఛగా గడుపుతాం.... అన్నాను.

అక్కడ మనకోసం ఆనందాల్ని పంచివ్వడానికి స్నేహపాత్రమైన లేగుండెలు కొన్ని ఆరాటపడుతున్నాయని నే చెప్పనవసరం లేదు.

నావ నెమ్మది నెమ్మదిగా గట్టుకు దూరంగానూ, నదిలోకి దగ్గరగానూ జరుగుతోంది.

మా నావ మసక మసకగా వెలుగుకి దూరంగానూ, చీకటికి దగ్గరగానూ జరుగుతోంది.

'కీర్తీ! నాకీ చీకట్లో ఏమీ కనిపించడం లేదు...' అన్నాడు.

మనకళ్ళు ఇంతవరకు వెలుగుకి అలవాటు పడ్డాయి... కాసేపటికవి చీకటికి అల వాటు పడతాయి అన్నాను.

'కీర్తీ! ఈ చీకట్లో నీకు దారి కనిపిస్తుందా?....' అన్నాడు.

నేనేమని దీనికి సమాధానం చెప్పను?... నీటి మీదా, ఆకాశంలోనూ దారి ఉండదు ఉజ్వల్... కేవలం నేలమీద నడిచే వాడికే దారి. మనం ఇప్పుడు దిశను బట్టి ప్రయాణం సాగించాలి గాని దారిని వెతక్కూడదు... అన్నాను.

మనతో సరంగుకూడా వుంటే బాగుండును–

ఎందుకు ఉజ్వల్? నేనీనది మీద ఈ నావను నడపలేనన్నా నీ అనుమానం? నా శక్తి మీదా, నా సామర్థ్యం మీదా ఆ మాత్రం నమ్మకమే లేకుంటే, నావనెక్కి చుక్కాని పట్టి నిన్నిలా ఒంటరిగా తీసుకుని బయల్దేరగలనా... నీవు నా ప్రాణానివి ఉజ్వల్! అన్నాను.

కీర్తీ! నా కిదంతా అగోచరంగా వుంది. మనం ఎటుకేసి ఎక్కడికి వెళ్తున్నామో కనీసం ఊహించలేకుండా వున్నాను... ఏమిటిదంతా?

ఔను ఉజ్వల్... నీకా అనుమానం రావడం సహజమే... గట్టుమీంచి మనం ఆ దీవిని ముక్కుసూటిగా చూశాము. మనం ముక్కుసూటిగానే ప్రయాణం చేస్తే నదీ ప్రవాహం మనల్ని మరో చోటుకు తీసుకుపోతుంది. అందుకే నదీ ప్రవాహంలో మనం మన గమ్యాన్ని చేరాలంటే ప్రవాహానికి కొంత దూరం ఎదురేగవలసిందే... ఇప్పుడు నేనీనావను తెడ్లు వేసుకుంటూ, అటు ఎగువ కేసి తీసుకు వెళ్ళి అక్కణ్ణించి వాలు వేపు వదిలేస్తాను. ఆ తర్వాత నావమీద కూచొని చుక్కానిని కాస్తాను. అప్పుడు ఈ నదీ ప్రవాహమే మనల్ని ఆ దీవికి క్షేమంగా చేరుస్తుంది.... అన్నాను.

కీర్తీ! ఈ చీకటి సమయంలో.... ఈ సుడులు తిరిగే నది మీద ఇలా ప్రయాణం దేని కోసం చేస్తున్నట్టు? దీనిలో నిజానికి ఏం సుఖముంది? ఇదా సుఖమంటే-

ఇదా సుఖమంటే నేనేం చెప్పగలను ఉజ్వల్... అయినా ఈ రాత్రి నీ జీవితంలో మరువరానిదిగా మిగిలిపోతుంది. కాలంలో ఒక అనిర్వచనీయమైన ఘడియ జీవితానికి అటూ ఇటూ వ్యాపించి పోవడమే సుఖమంటే - నీటిలో రాయివేస్తే అన్నివేపులకూ వ్యాపించినట్టు.... అన్నాను.

అతను మౌనం వహించాడు.

అది అంగీకారమో, అనంగీకారమో నాకు తెలీలేదు. అయినా ఎంతో గుంభనంగా వుండే మనిషి ఇలా ప్రశ్నలపై ప్రశ్నలు కురిపిస్తుంటే అతనిలో ఏదో అనుమానం చోటు చేసుకుందని ఊహించాను.

ఇక నా మిత్రుణ్ణి ఆలస్యం చేయకుండా వీలైనంత త్వరగా ఆ దీవికి చేర్చాలని తెడ్లజోరు ఎక్కువ చేశాను.

తెడ్ల జోరుకూ, అలల తాకిడికీ నావ ఊగిసలాడ సాగింది. అయినా నేనలా తెడ్లను వేగంగా వేస్తూనే వున్నాను. నావ ఆ చీకటి నదిమీద పగబట్టిన కోడె(త్రాచులా, అలల్ని తోసుకుంటూ పాయల్ని చేసుకుంటూ ముందుకు సరసరా పోతోంది. తెడ్లజోరుకు నీళ్ళు చేసే చప్పుడూ, నావను తాకిన అలల చప్పుడూ తప్ప ఆ నది మీద మరో చప్పుడు వినిపించడం లేదు.

నా శక్తినంతా రెక్కల్లో కూడగట్టుకుని తెడ్లను మరింత బలంగా వేశాను. నావ మునుపటి కన్నా వేగంగా పోతూ మరింత ఊగిసలాడ సాగింది. కుడి ఎడమలకు ఊగుతూ, నీటి అంచులు తాకుతూ ఏ క్షణాన్నయినా మా పడవ ఆ నదిలో పల్టీ కొడుతుందేమో నన్న భయాన్ని కలిగిస్తోంది.

అయినా నా విశ్వాసం నాది -

ఆ నదిమీద చుట్టూ ఎక్కడా జీవన సంచారమే లేని ప్రపంచం మా ముందు ప్రత్యక్షమయ్యింది. నేనూ, నా మిత్రుడూ, మమ్మల్ని మోసుకుపోతున్న ఆ నావ మాత్రమే మిగిలాం-

ఇప్పుడు నాకూ ఈ నది వింతగానే తోస్తోంది.

ఈ అనంతమైన ఆకాశం కింద, చుట్టూ పెనవేసుకున్న చీకట్ల మధ్య, దిక్కులు మూగబోయిన నిశ్శబ్దాల మధ్య తన గాంభీర్యాన్ని నిముష నిముషానికీ వామనమూర్తిలా పెంచుతూ, భయభ్రాంతులను సృష్టిస్తూ సాగిపోయే ఈ అగాధజల సమూహాల మధ్య మేం ప్రయాణం సాగించడం నాకూ సాహసంగానే అనిపించింది.

ఉజ్వల్! చూశావా?.... ఈ క్షణం నీకేమనిపిస్తోంది? అన్నాను.

నిజానికి నేను అతన్నుండి ఏ జవాబునూ ఆశించలేదు. నాలో ఏదో విజయోత్సాహం పెల్లుబికింది.

ఉజ్వల్! మనిషి గాంభీర్యాన్ని ప్రేమించాలి.... అన్నాను.

ఉజ్వల్ నావలో అవతలి చివరన కూచున్నాడు. మా ఇద్దరి మధ్యా మసక వెల్తురు తచ్చాడుతోంది.

మనిషి గాంభీర్యాన్ని ప్రేమించడమే కాదు. అధిగమించాలి కూడా... ఈ నదిని చూడు ఉజ్వల్... ఈ చీకట్లో, ఎంత గంభీరంగా హృదయాల్ని తత్తరపెడ్తూ, గుండెల్ని పగులగొడ్తూ సాగిపోతుందో.... ఈ గాంభీర్యాన్ని మనిషి అధిగమించినప్పుడు పొందే ఆనందం, అనుభూతి అద్వితీయం ఉజ్వల్-

అతను మరింత మౌనం వహించాడు -

అతను నిజానికి నా మాటలు వింటున్నాడన్నది కూడా అనుమానాస్పదమే - అయినా నేనతనితో చెప్తూనే వున్నాను.

నా రెక్కల్లోని శక్తినంతా కాలమూ, దూరమూ హరించివేశాయి.

నేను తెడ్లను పైకి తీసి నావలో పెట్టి అలసటగా కూచున్నాను. అలసట తీరాక దిక్కుల్ని పరికించి చూశాను.

నేను నెమ్మదిగా నావపైకి జరిగి, చుక్కాని పట్టుకుని, ఆకాశంలోకి చూశాను. నక్షత్రాలు కన్నుల విందులు చేస్తున్నాయి.

నా చుట్టూ నిశ్శబ్దంగా అనంతంలోకి సాగిపోయే సృష్టినీ, సర్వలోకాలనీ మంత్ర ముగ్ధతతో చూస్తూ మైమరచి పోయాను. ఆ సృష్టి యొక్క హాయైన స్పర్శ నా శరీరాన్నంతా మృదువుగా తాకుతోంది. ఓ అనిర్వచనీయమైన నాదమేదో నిశ్శబ్దంలోంచి వచ్చి నా శరీరాన్ని మీటుతోంది...

ఉజ్వల్! చూడు.... నీ ముందు నమ్రతగా నిలిచిపోయిన ఈ ప్రపంచాన్ని చూడు... నది గాంభీర్యాన్ని చూడు... ఆ గాంభీర్యం వెనుక చెలరేగే ఆరాటాన్ని చూడు.... ఇదంతా నీకోసమే.... ఈ థ్రిల్ కోసమే, ఈ అద్భుతమైన అనుభవం కోసమే నేనీ సమయంలో ఈ నదిమీద ఈ ప్రయాణం ఏర్పాటు చేసాను.

నేను కూడా అరమోడ్పు కన్నుల్తో, ఆనంద పారవశ్యంతో కొంతసేపు అలానే ఉండి పోయాను. ఆ తర్వాత కన్నులు దించి చీకట్లో కదలాడుతున్న నీటిలోకి నా చూపుల్ని గుచ్చి గుచ్చి చూశాను. ఎన్నో అర్థం కానివి ఆ అగాధాల్లో వున్నట్టు తోచాక నేను వాటి జోలికి పోకుండా తిరిగి ఆకాశంకేసి కన్ను లెత్తాను.

చీకటి తొలగిపోతోంది-

వెన్నెల కాంతి మెల్లగా ఆకాశం నుండి దిగి కెరటాల మీద ఊయలలూగ సాగింది.

నీటి అలలమీద మానావ తేలియాడుతోంది.

ఉజ్వల్! చూడు.... ఈ నది అసలు ప్రవహిస్తుందో, లేదో కూడా నీవు చెప్పలేవు. అది నీ మౌనం కన్నా మౌనంగా ప్రవహిస్తోంది. ప్రవహిస్తూ దాని ప్రవాహపు వాలులో అది

మనల్ని మన గమ్యానికి చేరుస్తుంది. ఉజ్వల్! నీవు నీ ఆలోచనల్తో ఉక్కిరి బిక్కిరి ఔతున్నావో, నది భీకరత్వానికి కలవర పడుతున్నావో తెలియడం లేదు... అన్నాను.

అతనలా నావలో కూచున్న చోటే కూచోవడం నాకేమీ బాగా లేదు... అనుభవించి పరవశించవలసిన వేళ కదా ఇది – మరి దేనికీ మౌనం అనుకున్నాను.

అప్పుడు–

తూరుపు ఆకాశం మీది విదియనాటి చంద్రుడు మసక చీకటివేళ విచ్చుకున్న మల్లె మొగ్గలా నవనవలాడుతున్నాడు. ఆ చంద్రుణ్ణి వదిలి విశ్వాసం లేని ప్రేయసిలా వెన్నెల నదిమీద శయనించి, క్షణకాలం లేచిపడే కెరటాల్తో క్షణిక సుఖం కోసం దోబూచు లాడుతోంది.

ఎంత మనోజ్ఞమైన క్రీడ!

దీనికి పాపం అంటగట్టగల వాళ్ళెవ్వరు?... నిజం సుమా! ... వెన్నెలకు పాపం అంటదు.

ఉజ్వల్! చూడు, చూడు... లేచి చూడు–

ఉజ్వల్ ఏదో అన్నాడు. అతని స్వరం నెమ్మదిగా వినిపిస్తోంది. కాని అతను లేచి దేన్నీ చూడలేదు–

నా మిత్రుడిలో ఏదో హఠాత్పరిణామం కలిగి వుంటుంది. నేను క్షణం కలవర పడ్డాను. కాని మరుక్షణమే నవ్వు వచ్చింది. అతను ఆ దీవికి చేరాక ఇవన్నీ తృటిలో మరచి ఆ ఆనందాల్లో పులకించి పోతాడు – కనుక ఇప్పుడతని గూర్చి ఆలోచించవలసిన దేమున్నదిలే అనుకున్నాను.

అతని మనసుని ఎరిగిన వాణ్ణి నేను....

అతను కోరుకునే అందాలు ఎలాంటివో నాకు తెలుసు– అతను కోరుకునే ఆనందాలు ఎలాంటివో కూడా నాకు తెలుసు –

మల్లెపూవులకన్నా, సన్నజాజుల కన్నా సుకుమారమైన నా మిత్రుని మనసు హింసల్తో, రక్తపాతాల్తో కూడిన ఆనందాలను ఎన్నడూ కోరుకోదు. శాడిస్టులానూ వుండవు.

నా మిత్రుడు గొప్ప సరసుడు.

నీతి వస్త్రాలు ధరించడు; లక్ష్మణరేఖలు గీయడు.

అతని దృష్టిలో పాపమనే దేదీ లేదు; ఉంటే అది 'పొరపాటు' మాత్రమే నని నమ్మిన వాడు. ప్రేమ నిచ్చి ప్రేమను పుచ్చుకునే వాడు–

అందుకనే అతననుభవించదగినవన్నీ అతనికోసం ఆ దీవిలో వుంచాను. అనాది నుండీ మగవాడిని లాలించి పోషించిన స్త్రీత్వపు సొగసుల్ని ఏరి ఏరి ఎంపిక చేసి వుంచాను. ఆ దీవిలోకి నా మిత్రుడు అడుగు పెట్టగానే ఆ ఇసుక తిన్నెల మీంచి, వెన్నెల మైదానం మీంచి, కాంతి తరగల్లోంచి తెల్లని జలతారు వస్త్రాల్లోని కోమలమైన ఆ యౌవ్వన శరీరాలు

వచ్చి అతన్ని వాటేసుకుని, అతని అధరాలను చుంబించి, మధువును అందించి, అతన్ని తన వస్త్రాల భారాన్నుండి విముక్తుడిని చేస్తూ, తమ తెల్లని చీరలను వదలి, వెన్నెల వలువల్ని సవరించుకుని, అతని మేనిలోని కోర్కెలకు సమిధలై, పొందులో పునీతలై, ఈ రాత్రికి సరియైన అర్థాన్ని చేకూర్చుతారు.

గొప్ప అందాన్ని చూసినకళ్ళు వాటంతటవే మూతలు పడతాయి.

అతనా మధువును ఆస్వాదించి, దించి... దిగంబరంగా ఇసుక తిన్నెలపై మైమరచి పడివుంటే, ఉషస్సు తొలికిరణానికి ఏ సీతాకోక చిలుకో ఎగిరి వచ్చి, అతని మీద వాలి సిగ్గుబిళ్ళలా అతన్ని అతుక్కుపోతే, ... అతనిలోని మదపు వాసనలకీ ఏ తుమ్మెదకో మత్తెక్కి అది ఝుమ్మని నాదం చేస్తుంటే అతను లేచి... అరమోడ్పు కన్నుల్తో రాగరంజిత మైన ఆ పెదవులందించే అమృతాలను తిరిగి అందుకోవడం కోసం వ్యర్థ ప్రయత్నం చేస్తో... అప్పటికే తన నరాల సత్తువ యావత్తూ కోల్పోయి కూడా అతను మళ్ళీ మళ్ళీ తన ఓటమిని అంగీకరించడానికే సిద్ధపడతాడు.

ఉజ్వల్, లే!...... నావ దీవికి చేరువౌతోంది-

అతను లేవ లేదు.

ఉజ్వల్, లే!....... నావ నేలను తాకింది - అన్నాను.

నేను చుక్కానిని వదిలి ఒడ్డు మీదకు చెంగున దూకాను. నా పాదాలకు నీళ్ళు తాకాయి. మెత్తని ఇసుక నాకాళ్ళకింద సన్నగా ఒత్తిగిలింది. నా ఆనందానికి అవధుల్లేవు-

ఆ పరిసరం కడిగిన గాజు పలకలా తేటగా వుంది. తెల్లని వెన్నెల పూర్తిగా ఒలికినట్టు ఆ ఇసుక తిన్నె వెలిగిపోతోంది. తీరం వెంబడే చుట్టూ నిలువెత్తు లేచిన రెల్లుగడ్డి సందుల్లోంచి ఆ విశాలమైన దీవి శోభనపు పాన్పులా మిసమిసల్తో దివ్యంగా వుంది. మాకోసం వేచియున్న వాళ్ళంతా ఆ ఇసుకతిన్నెల మీద పడుకుని ఆకాశపు హొయల్ని ఆస్వాదిస్తూ మారాకను కూడా తెలుసుకోలేదు. తెలిస్తే వాళ్లంతా ఎదురేగి వచ్చేవాళ్ళే-

నేను నావను నెమ్మదిగా ఒడ్డుకు చేర్చాను. నేలమీదకు బాగా పైకి లాగాను.

ఉజ్వల్ లే!... ఎక్కడికొచ్చామో చూడు అన్నాను.

'కీర్తీ...' అన్నాడు చాలాసేపటికి-

దృఢంగా వినిపించే అతని స్వరం, నూతిలో గొంతులా హీనంగా వినిపించింది. అది అతనిలో చెలరేగిన ఆందోళననీ, భయాన్నీ వ్యక్తం చేస్తోంది.

నేను క్షణం పాటు నిర్ఘాంతపోయాను.

ఏమిటి ఉజ్వల్! నీవేనా...?

నేను నా మిత్రుడి కోసం తిరిగి నావలోకి దిగి, అతన్ని నా చేతుల్లోకి తీసుకున్నాను. అతని శరీరం వెచ్చగా కాలిపోతోంది. అతనికి ఉష్ణం వచ్చేసింది.

ఉజ్వల్ అపస్మారకంలో వున్నాడు.

నేనతన్ని ఎత్తుకుని నావలోంచి గట్టుమీదకు చేర్చాను. కాసిన్ని నీళ్ళు చేది అతని ముఖమ్మీద చల్లాను. పల్చటి నా చేతిరుమాలు తడిపి అతని నొసటమీదుంచాను.

కీర్తీ! మనం...మనం... అంటున్నాడు అపస్మారకంలోనే-

మనం క్షేమంగా దీవికి చేరాం ఉజ్వల్.... నిజం.... మనం క్షేమంగా దీవికి చేరాం... అన్నాను.

అతను చావు గూర్చి భయపడి వుంటాడు. జీవితం మ్మీద ఆశున్నవాడు; చావును ఎలా ఆహ్వానించగలడు? ప్రాణాన్ని అసహాయంగా ఈ అగాధ జలసమూహాలకీ, చిక్కటి చీకట్లకీ, ఎలా అప్పగించగలడు?

బతుకు చివరికి ఆఖరయిపోతున్న నిస్పృహేదో అతన్ని ఆవహించింది.

నా మనసంతా వికలమయ్యింది.

చూడు.... మనం నిలుచున్న ఈ దీవికేసి ఒక్కసారి చూడు ఉజ్వల్... అన్నాను.

ఉజ్వల్ ఏదో కలవరించాడు...

మూల్గు కన్నా హీనస్వరంతో అతను కలవరించాడు.

నాకు అంతా అర్థమయ్యీ, ఏమీ అర్థంకాక అతని పక్కనే కూలబడ్డాను. అతని నొసటి మీది తడిగుడ్డను తొలగించి అతన్ని తేరిపారా చూశాను. నాలో ఆశ్చర్యమూ, ఆవేదనా, నిస్పృహ... అన్నీ ఏకమైన క్షణకాలపు అనుభవం.

అతనిలో అనూహ్యమైన మార్పు –

ముడతలు పడ్డ ముఖ కవళికల్తో, తెల్లగా నెరిసిన జుట్టుతో ఎన్నో యేళ్ళ వృద్ధుడయ్యాడు.... ఈ నది దాటేలోగా.... ఈ తీరాన్ని చేరేలోగా –

నే చేసినవన్నీ వ్యర్థమే-

హైదరాబాద్
*10.7.86*

# గోధూళి

అది గోధూళి వేళ కాదు-

అక్కడ రేగిన ధూళికీ, ఆ ఊళ్ళో పెరిగే గోవులకీ ఎక్కడా ఏ సంబంధమూ లేదు.

అయినా ఆ రేగిన ధూళి గోధూళిలానే ఉంది.

గోధూళి అంటే మనకు వెంటనే కనిపించేదీ, వినిపించేదీ, తప్పనిసరిగా మనసులో స్ఫురించేదీ ఓ పౌరాణిక కాలంలో ఓ సాయం సంధ్య వేళ అని -

కాని ఆ వేళ సంధ్యవేళ కాదు... దానికింకా కొంత సమయం మిగిలివుంది.

ఆ కాలం పురాణ కాలం కాదు; మనిషి పురోగమించి, అత్యాధునిక ప్రపంచాన్ని ఆవిష్కరించిన కాలం అది-

అయినా అక్కడ ఓ వంద పూరిళ్ళు బిక్కుబిక్కుమంటూ బిక్కచచ్చి వున్నాయి.

అప్పుడు అక్కడ రేగిన ఆ దుమ్మూ, ధూళిలోంచి కనుచూపు మేరలోంచి, వెలుతురు మరకల్లోంచి, వెలుగు నీడల్లోంచి, మసక మసగ్గా జీవం పోసుకుంటున్న ఆకారం ఓ 'జీపు'దని ఆనవాలు కట్టారు ఆ ఊరు జనం.

అలా ఆనవాలు కట్టాక 'జీపురో' అన్న కేక పక్క పదిళ్ళకీ వినిపించింది.

రాజయ్య కేక విని జేరేసిన తలుపు నెట్టి నిటారుగా చూశాడు.

జీపు ఎత్తు పల్లాల మీద ఊగిసలాడుతూ గతుకుల బాటమీంచి వేగంగా ఇటే వస్తోంది.

రాజయ్య వీధిలో కొచ్చి చెట్టుకింద నిలుచున్నాడు.

ఆ చెట్టు రమారమి ఆకులుడిగినది. ఎవరికీ నీడ నివ్వకపోయినా, ఆ ఊరిజనం అలవాటుగా దాన్నే ఆశ్రయించి, రాత్రింబవళ్ళూ అక్కడే మందగొడిగా తమ రోజుల్ని జరుపుకొస్తున్నారు.

వాళ్ళు దారికేసి రెప్పేయ్యకుండా చూసి "దొరొస్తుండు... లెగుండ్రి" అన్నారు.

అంతా లేచి పరికించి చూసేసరికి, ఆ జీపొచ్చి వాళ్ళముందు ఆగింది.

జీపులో డ్రైవరు కాక మరో ముగ్గురున్నారు.

జీపులోంచి డ్రైవరు తప్ప మరెవ్వరూ కిందికి దిగలేదు.

జీపొచ్చిన సందడికి అక్కడున్న చిన్నా చితుకూ వచ్చి దాని చుట్టూ చేరారు. వాళ్ళ కళ్ళల్లో వింత చూపులు వికసించాయి. వాళ్ళమొల మీద నిండైన గుడ్డల్లేవు. ఉన్నా అవి మాసి చినిగినవే గాని ఉతికినవి మాత్రం కావు.

జీపులో ఎదర స్టీరింగ్ పక్కన పదిలంగా రెడ్డిసాబ్ కూచున్నారు. వెనుకసీట్లో మిగత ఇద్దరూ కాగితాల్ని హడావుడిగా తిరిగేస్తున్నారు.

రాజయ్య గుండెల్నిండా భయమూ, బానిసత్వమూ చోటు చేసుకుని, 'బాంచెను దొరా...' అని దణ్ణం పెట్టాడు.

రెడ్డిసాబ్ తిరిగి నమస్కరించలేదు గాని, ఆయన తల కాస్త కదిలినట్టు సూచన ప్రాయంగా కనిపించింది. అయితేనేం, 'దొర....' అనుకున్నాడు రాజయ్య.

ఒక్క రాజయ్యేగాదు... ఆ చుట్టూ మూగిన ఆ ఊరిజనం అంతటికీ అదే భావన, అదే భయము, అదే భక్తి, అదే బానిసత్వపు ఆలోచన-

రెడ్డిసాబ్ నివురు గప్పిన ఆకాశం కేసి చూశారు. ఆ తర్వాత వెనక సీట్లో తమ పనిలో మునిగిపోయిన ఇద్దర్నీ, కింద నిలుచున్న డ్రైవర్నీ చూశారు. చూసి....

'జర మంచినీళ్ళు తేరాదురా....' అన్నారు.

ఆ ఇద్దరి తలలూ ఒక్కసారిగా పుస్తకాల్లోంచి పైకి లేచాయి. అది చూసిన డ్రైవరు రాజయ్య కేసి చూశాడు. రాజయ్య పక్కనున్న పోరడి కేసి చూశాడు.

"ఒరె! గట్ల జూస్త వేందిరా? దబ్బున బోరా... లోటాల నీళ్ళేసుకురా...పో" అన్నాడు.

రాజయ్య చెప్పినట్టు ఆడు అక్కణ్ణుండి దబ్బుననే ఉరికాడు. వాడి అమ్మ ఎప్పుడో తెల్లగా తోవిన సరపతో నీళ్ళు తెచ్చింది. గాజు గ్లాసులో కొంచి, దొరగారి కిచ్చింది.

దొర అందుకుని నోటికాడికి చేర్చి ఎనక్కి తీసేశాడు. ఆ తర్వాత గ్లాసులోకి చూశాడు. ఎదర మడుసుల కేసీ అట్లాగే చూశాడు.

ఏందిరా ఇయి.. తాగటానికేనా... ఏందీ నలకలూ, ఏందీ రంగూ, అని తపాలున కింద పారబోశాడు.

గ్లాసెడు నీళ్ళు నేల పాలయ్యేసరికి ఆ పోరడి తల్లి విలవిల్లాడిపోతూ, 'అయ్యో! అయ్యో!!' అని దీర్ఘాలు తీసింది.

మీరు మడుసులు గాదురా?.... ఏందా నీళ్ళు,.... పచ్చగా లేవురా?.... పురుగు లుండవురా?.... తాగితే బీమారై చచ్చిపోర్రా?.... అన్నాడు దొర.

రాజయ్య "బాంచెను దొరా... పోరి సరిగా జూడక తెచ్చింది గావాల్ను ఏదే సరవా..." అని గదమా యిస్తూ సరవాను లాక్కున్నాడు. కాని రాజయ్యకు తెలియందేమీ లేదు. అయినా ఆ సమయానికి అలా అనక తప్పింది కాదు.

దొరలు ఊళ్ళు వస్తారు; వెళ్తారు- కాని ఆ ఊరు గురించి ఎవరూ పట్టించుకోరు. పట్టించుకోవాలన్న ఎలెక్షన్లు రావాలి, పోవాలి... ఈ మధ్య కాలంలో ఆ దొరలకు ఎన్ని పనులో... ఆ దందాల్లో ఈ ఊరు గురించి ఏం గుర్తుంటది...

అందుకని నిత్తె మనమే ఆల్లకు తెలీసెప్పాల-

గంత మాత్రాన మనకు అదిగావాల్న... ఇది గావాల్న అని అడగ్గాడదు. అడిగితే "గిట్టడుగు తున్నారేంద్రా" ని రెడ్డిసాబ్ కోపం జేస్కుంటడు. దొరలు మనకిచ్చినప్పుడే మనం దీస్కోవాల్న... గంతే అనుకున్నాడు రాజయ్య.

రాజయ్య ఓ క్షణం నీళ్ళు నమిలాడు. అయినా తప్పదు గదా అనుకుని మొదలు పెట్టాడు.

"దొరా! తమరికి ఎరికే గందా... రెండేళ్ళ నుండి ఆనలు పడవక పాయె.... ఈ ఊరుకున్న ఈ ఒక్క చెరువూ ఎండిపాయె... ఇగ నీళ్ళెక్కడ దొరుకుతయి దొరా... కూర్మాటోల్ల బాయిల ఇంక తోడెమన్ని నీళ్ళున్నాయి. అయిగూడా నాచు గట్టినయి... పచ్చగా అయినయి. అయితప్ప ఈ ఊరి జనానికి మరెక్కడా నీళ్ళు లేవు. రేపో మాపో గదీ ఎండిపోతది. అది ఎండిపోయినాక ఎక్కడికి పోవాలె? పక్క ఊళ్ళో బోరింగున్నది గాని, అక్కడికి మమ్మల్ని రానిస్తరా... అది ఆల్లకే సరిపోదాయె... బోరింగు నీళ్ళయితే నలకలుండవు... తేట గుంటయి. కాని ఈ ఊల్లే నీ కియ్యడానికి బోరింగు లేదు దొరా..."

రెడ్డి సాబ్ చూపును నిర్లిప్తంగా గాలిలోకి సారించాడు. వెనుక సీట్లోని ఇద్దరూ వాళ్ళ పుస్తకాల్లోని, పేజీల్లోని పేర్లను బిజీగా లెక్కిస్తున్నారు. పేరు పేరునూ ఎంచుకుంటూ లిస్టు ప్రకారం కేటాయిస్తున్నారు.

రెడ్డిసాబ్ తన సీట్లోంచి ఇబ్బందిగా కదిలాడు.

ఆయనకి దాహం - దాహం- దాహం.

కాని ఆయన తాగడానికి ఆ ఊళ్ళో నీళ్ళు దొరకలేదు.

"దొరా! మడుసుల ముచ్చటకేం గాని, పశువుల సంగతి మరింత కష్టంగా వుంది దొరా-

నీళ్ళూ, మేతా లేక పశువులు సచ్చిన కాడికి సచ్చినయి. మిగతయి రైతులు అయిన కాడికి ఏ కటికోడికో తెగనమ్ముకున్నరు దొరా... అదేందిరా అంటే ఎట్లాగైనా సచ్చేయేగంద, ఎక్కడ సత్తె ఏందని పారెల్లినారు దొరా... గింతూరికి పాడి పశువు లేదాయె.... కిందటి చవితికి పండక్కి మున్నూరోళ్ళ సుగుణమ్మ ఉతకాలాండింది. గిప్పుడు సంటి పిల్లకు పాలు దొరక్క ఈ ఊరునుండి పారెల్లిపోయింది- దొరా! ఓ బోరింగయినా వుంటే పశువులు నీళ్ళయినా తాగి బతికేటివి; ఆటితో పాటే మేమూ బతికేటోల్లం..." అన్నాడు.

అప్పుడు ఎనక సీట్లోని రెండు తలలూ వాళ్ళు చూస్తున్న పుస్తకాల పేజీలల్లోంచి,

కూడికలూ, హెచ్చివేతల లెక్కల్లోంచి, పైకిలేచి, నీవు రాజయ్యావు గదూ అని పలకరించాయి.

"ఔ!" అన్నాడు రాజయ్య.

అయిదేళ్ళ నుండి ఈ నాటికీ గుర్తున్నందుకు రాజయ్య గుండెల్నిండా ఆనందం పొంగులు దేరింది. వొళ్ళంతా పులకించింది.

రెడ్డిసాబ్‌కు దాహం - నాలిక పిడచకట్టుకుపోయే దాహం-

ఎక్కడన్న 'చా' దొరకుతాదిరా... రెడ్డిసాబ్ ఇబ్బందిగా అడిగాడు.

రాజయ్య పక్కకు తిరిగి... "పోరడేడి... అరేయ్, జల్దిరా... సాబ్‌కు 'చా' పెట్టించి తేవాలి... దా, 'చాపత్తీ' తీస్కపోదువు..." అంటూ రాజయ్య హడావుడి చేసి అక్కణ్ణించి వాడితోపాటు నడిచాడు.

కిరాణా కొట్టువద్ద చాపత్తీతో పాటు కాస్త చక్కర కూడా తీసుకుని ఇంటికేసి నడిచాడు. పోరడి కిచ్చి, తాను వచ్చేవరకూ అక్కడే కూచోమన్నాడు. రాజయ్య మనసు పీకుతూనే వుంది. తాను చేస్తున్నదంతా వట్టి హంగామాయేనని... అందుకే తాను అంతా యాంత్రికంగా ముగించుకుని జీపు దగ్గరి కొచ్చాడు.

అప్పుడు ఆకాశం మీది మబ్బుతునక పడమటికేసి జారింది.

రెడ్డిసాబ్ ఆ జనం కేసి చూస్తున్నారో చూడ్డం లేదో ఎవరికీ అంతుబట్టకుండా వుంది.

రాజయ్య ధ్యాసంతా ఊరు గురించే -

ఊళ్ళో అందరూ ఉన్నట్టేగా... అని వెనక సీట్లోని గుమస్తా లిస్టులోంచి ముఖం పైకెత్తి రాజయ్యను అడిగాడు.

"ఈసారి ఓటెయ్యడానికి మున్నూరోళ్ళ కోడలు ఆండాలు లేదుగదా..."

రెడ్డిసాబ్ అకారణంగా రాజయ్య కేసి చూశారు.

"పాపం, ఆ ఆడకూతురు సానా బికారు సావు సచ్చింది దొరా... ఇద్దరు బిడ్డలు తల్లి... పెసవించ లేక బాధతో మెలికలు తిరిగిపోతుంటే ఏమీ చేయలేక ఊరు కళ్ళప్పగించి చూసింది దొరా... ఏం చేస్తది? ఏముంది కనక - ప్రసవానికి మంత్రసాని గావాల్నంటే దాని మొగుడు పొద్దుగాల బోయి మబ్బుగాల దిరిగొచ్చిండు. అప్పటికే దాని బతుకు బండలై పోయింది దొరా... అందరూ చూస్తుండగనే దాని బతుకు సీకటైపోయింది దొరా...

ఆ పిల్ల సావు గురించి దాని మొగుడు కుమిలికుమిలి ఎడుస్తుంటే, బంధువులు సోకాల్దీస్తుంటే ఊరంతా ఓదార్చలేకపోయింది. సోకాలు దీస్తే సచ్చిన పిల్లొస్తదా... పోనీ ఆస్పత్రొస్తదా... ఆడోళ్ళ దవాఖానా వస్తదా... ఏదొస్తది?! ఏదీ రాదు.

కనక ఏడవ కండని ఊరు జనం ఓదార్చారు.

ఆ తర్వాత నేనడిగినా...

ఏందిరా పొద్దుగాల్నే బోయినోడివి గిట్లా మబ్బుకాడనంటరా వచ్చేది అని- కాని

ఆడు మా(త్రం ఏం జేస్తడు?..... ఆ మం(త్రసాని దొరికే తలికే బారెడు పొద్దెక్కిందట - ఈ ఊరు పేరు చెప్పే తలికి ఆమె రానంటే రానందట... ఐదు కోసుళ్ళ దూరం ఎట్లగొస్తది. పాపం... రిక్షగట్టిస్త చేతిల పైసలు పెడ్త.... నీ కడుపులో తల బెడ్త... అని బతిమాలుకున్నాడట. 'సరే' అనే తలికి మిట్ట మద్యాన మాయెట... అయితే రిక్షోడెవడూ ఇక్కడికి రానన్నాడట... ఈ ఊరికి రోడ్డా ఏమన్నానా? ఆడు మా(త్రం మడిసిగాడూ... రోడ్డుమీదే గింత దూరం లాగడం కష్టమయ్యే... గసొంటప్పుడు ఈ గతుకుల్ల బడి, ఈ మట్టిన బడి ఈ ఊరికి ఎవరొస్తరు?

కాని ఎవరో పున్నాత్ముడు చివరకు గట్టిండట.... కాని ఆల్లు వచ్చే తలికే యిక్కడ అంతా అయిపోయింది. ఇప్పుడు ఎవర్ని ఏమని లాభం... రోడ్డు బడేవరకూ ఈ ఊరి కష్టాలు యిలాగే వుంటాయి-"

రెడ్డిసాబ్ జనం మీంచి చూపును తీసి శూన్యంలోకి వదిలారు.

కాని ఆయనకు ఒహటే దాహం-

అందుకని రాజయ్యకేసి చూశాడు.

"ఔను! పోరడింక రాడేందిరా... సానాసేపయ్యింది... చా తెస్తడాలేదా?"

"ఇంటికాడనే కాయిస్తుండ దొర... అచ్చేస్తడు."

"గట్లని జెప్పు.... చేతులూపుకుంటూ వచ్చిన వేందిరా అనుకున్న... అయిన ఎంతసేపయి బట్టె..."

రాజయ్య గుండెల్లో గుబులు రేగింది. దొర తనంతటతాను నోరు విడిచి అడిగినప్పుడు తాను లేదు అనడానికి మనసొప్పలేదు. కాని ఊళ్ళో ఒక్క పాడి పశువు కూడా లేదాయె.... తానెలా 'చా' తెచ్చి దొర కివ్వగలడు. ఇవ్వలేనని తెలిసి కూడా తాను తెస్తానని దొరముందునుంచి వెళ్ళి వచ్చాడు.

ఇప్పుడు రాజయ్యకు దిక్కుతోచకుండా వుంది.

రెడ్డిసాబ్ వెనక్కి తిరిగి చూశాడు.

ఆయన చేతికి ఫైలు అందింది. ఆ రోజు ఎక్కడెక్కడ ఎంతెంత పంచారో వాటి లెక్కలన్నీ అందులో వున్నాయి. ఇక్కడ ఇవ్వవలసిన లెక్కలు కూడా అదే కాగితంలో వున్నాయి.

అప్పటికి సూర్యుడు మరింత కిందికి జారిపోయాడు.

రెడ్డిసాబ్ మనీబాగ్‌లోంచి నోట్లకట్టలు బయటకు తీసి ముందు పెట్టుకున్నాడు. కాని ఆయనకు దాహం తీరలేదు.

ఆయనకు దాహం తీరే మార్గం కూడా ఏదీ కనిపించడం లేదు.

"ఏందిరా! 'చా' అని పోయినోడు ఎంతకీ రాడు... గిసుమంటి ఊరేందిరా... నీ

యవ్వ చాయి దొరకదుర గీ ఊల్లె...."

రాజయ్య ఇంకా అక్కడ ఉండబట్టలేకపోయాడు-

ఆ ఊరి జనం కోసం నోట్ల కట్టలు.. రెడ్డిసాబ్ వాటిని ఎంచడం ప్రారంభించాడు. జనం కళ్ళనిండా....

డబ్బు... డబ్బు... డబ్బు!

రాజయ్య లేనితనాన్ని బలహీన పరచింది, బానిసత్వాన్ని బలహీన పరచింది. అందుకని రాజయ్యలో మరింత కృతజ్ఞత చోటు చేసుకుంది. అతను అక్కడ నుండి ఒక్క ఉదుటున బయల్దేరాడు. పోరడి దగ్గర కొచ్చాడు. రాజుకున్న పొయి మీద చాపత్తీ వేసి పోరణ్ణి పొయ్యి విసరమని పురమాయించాడు. అతను అక్కడ నుండి కిరాణా కొట్టుకీ, కిరాణా కొట్టు నుండి ఇంటికీ పరుగులు తీశాడు.

వస్తూ ఆ కొట్లోంచి ఓ ఖాళీ కప్పును తెచ్చాడు.

కిరాణా కొట్టుకూడా ఆ ఊరుకు సెంటరే.... యువకులక్కడ ఏ సిగరెట్టో ముట్టించి ముచ్చట్లు పెట్టుకుంటారు. ఆ రోజు పక్క ఊరునుండి మరో నల్గురు అక్కడికి రావడంతో యువకులంతా అక్కడే చేరారు.

జీపొచ్చిన కారణంగా ముచ్చట్లన్నీ ఎలెక్షన్ల మీదికే మళ్ళాయి. ఇంతకాలం ఎలా జరిగినా, ఇప్పుడు డబ్బిచ్చి, ఓట్లు కొనుగోలు చేసి ప్రజాస్వామ్యానికి ద్రోహం చేయడం అక్కడ ఆ యువకులెవ్వరికీ నచ్చలేదు. ప్రజల సమస్యలు అప్రధానమై, గెలుపు మీదే ఆసక్తి ప్రధానమై నీతి నియమాలకు స్వస్తి చెప్పే ఈ పెద్ద మనుష్యులపై అసహ్యం కలిగింది.

అంతలో రాజయ్య టీ కప్పుతో జీప్ కేసి వెళ్ళడం వాళ్ళ కళ్ళ బడింది.

ఓ క్షణం వాళ్ళు అవాక్కయ్యారు; ఆశ్చర్య పడ్డారు; ఆలోచనలో పడ్డారు.

ఓ గొడ్డుగానీ, గొర్రెగానీ, పాలిచ్చే మేకగాని ఏదీ మిగలని ఆ ఊళ్ళో దొరకోసం టీ ఎలా వచ్చింది!

రాజయ్య టీ కప్పుతో జీపు వద్దకు చేరాడు.

యువకులంతా రాజయ్య ఇంటికి చేరారు.

రాజయ్య గుండెల్లో మునుపటిలా ఇప్పుడు ఆ గుబుల్లేదు; తానిప్పుడు చా కప్పును దొరకు అందించాడు.

ఇస్తూ...

ఇది కేవలం నీళ్ళల్లో ఉడికించిన చాపత్తీ మాత్రమే కాదు. ఇది మా రక్తమాంసాలు పిండిన కషాయం కూడాను.... అనుకున్నాడు.

అప్పుడు రాజయ్య మనసు ఆర్ద్రమయ్యింది. బాధ దిగడక గొంతు ఎండి పోయింది.

అప్పుడు సూర్యుడు మరింత కిందికి జారిపోయాడు.

మరోమూల నించి ఎర్రని పరదా పడమటి ఆకాశాన్ని కప్పుతోంది.

రాజయ్య కండువాలో కొత్త కరెన్సీ నోట్లు...

రాజయ్య జీప్ మీది గుర్తుకేసి చూసి, అట్లాగే దొరా... పెద్ద దొరకే మా ఓట్లేసి మల్లా గెలిపించుకుంటాం దొరా... అన్నాడు రాజయ్య.

రాజయ్య కోసం వాకిట్లో ఎదురు చూస్తున్న యువకులకు ఆ పూరింటిలోంచి పసిపాప ఏడుపు వినిపించింది.

వాకిట్లోంచి వెళ్ళి తలుపు దగ్గర 'చంద్రక్కా' అని పిలిచారు.

పసిపాప ఏడుపు మరింత ఎక్కువై గుక్క పడుతోంది.

ఓరగా వేసిన తలుపు నెమ్మదిగా నెట్టి చూశారు.

ఆ గదిలో ఓ మూల వెలిగి వెలిగి కుమిలిపోయిన పొయ్యి... దాని పక్కనే చాపత్తి ఉడికించిన గిన్నె-

చంద్రక్క మంచమ్మీద పడుకుని వుంది.

చంద్రక్క పచ్చి బాలింత.... రిక్తస్తనాలపై ఆ పసిపాప ఎగబ్రాకుతోంది.... ఏడుస్తూ; గుక్క పెడ్తూ...

అంతా అర్థమయ్యింది.

వాళ్ళంతా ఆవేశంతోఆ ఇంటి మలుపు తిరిగేసరికి, అక్కడ ఆ చెట్టుకింది 'జీప్' కదిలింది.

రాజయ్య చేతులు జోడించగా, ఆ జనం అటుకేసి నమ్రతగా చూశారు.

సూర్యుడు పూర్తిగా కిందికి జారిపోయాడు.

రెడ్డిసాబ్ వెళ్తున్న 'జీప్' వేగం అందుకుని ముందుకు దూసుకుపోయింది.

యువత అక్కడికి పరుగున పరుగున వచ్చే సరికే, ఆ జీపు కనుమరుగవుతోంది.

ఒక్కసారిగా వాళ్ళంతా పిడికిళ్ళు బిగించారు.

కిందికి వంగి చేతికందిన దుమ్ము తీసి అసహనంగా కనుమరుగయ్యే జీప్ మీదకు విసిరారు.

ఆ ధూళి చుట్టూ కమ్ముకుని ఒక్కసారిగా ఆకాశానికి లేచింది.

సందె చీకటి చిమ్ముకొచ్చింది.

రాజయ్య పట్టుకున్న నోట్లకట్టల్తో నివ్వెరపోయి చూస్తున్నాడు.

అప్పుడది గోధూళి వేళ-

ఆ లేచిన పిడికిళ్ళు గోవుల గిట్టల్లా వున్నాయి.

అప్పుడు ఆ లేచిన ధూళి..... గోధూళి-

రాజమండ్రి
*10.2.1989*

** 14-8-92, ఆంధ్రజ్యోతి సచిత్ర వార పత్రిక **

# కల్కి

అక్కడ వెలుగు మూర్ఛపోయింది. చీకటి ముద్దాయిలా మౌనం వహించింది.

వాళ్ళల్లో కోరిక ఆవహించినపుడు ఆమె నవనాగరిక ప్రపంచంలా దర్శన మిచ్చింది.

వాళ్ళప్పుడు దర్శించిన దేమిటి?

✿ ✿ ✿

అది ఆనంద నిలయం-

అందులో ఓ నాలుగ్గదుల్లో నల్గురు మేధావులున్నారు. ఆ నల్గురూ యవ్వనంతో మిసమిస లాడుతున్నారు.

ఆ ఆనంద నిలయానికి పశ్చిమాన మరో మైలు దూరంలో విశాలమైన మైదానంలో పచ్చని లాన్‌ల మధ్య బకింగ్‌హామ్ పేలస్‌లలా, బెర్లిన్ నగరంలా, క్రెమ్లిన్ బిల్డింగుల్లా కనిపించే అతి విలువైన డిపార్టుమెంటు బిల్డింగులున్నాయి. మరో పక్క తుంబా, శ్రీహరి కోటల్లా విలువైన లేబరేటరీలున్నాయి.

అక్కడ మేధావులంతా రీసెర్చి చేస్తారు. అత్యాధునిక విషయాల్ని కనిపెట్టి, పరుగులు తీసే నవనాగరిక ప్రపంచానికి మరింత వేగాన్ని పెంచుతారు. ప్రకృతికి కొత్త అర్థాన్ని చేకూర్చడమే జీవితాశయంగా వాళ్ళు రాత్రింబవళ్ళూ ఊపిరులు పీలుస్తారు.

ఆనందనిలయంలోని ఆ నల్గురూ ఆ రీసెర్చి సెంటర్లో నిరంతరం విజ్ఞాన శాస్త్రాన్ని అధ్యయనం చేస్తూ జీవితంమ్మీద గంపెడాశ పెట్టుకున్నారు.

భవిష్యత్తును పాలించాలంటే మాటలా మరి-

ప్రస్తుతం వాళ్ళు ప్రతి క్షణం జ్ఞానాన్నీ, జ్ఞాపక శక్తినీ కవాతు చేయిస్తున్నారు. వాళ్ళు రీసెర్చి చేస్తున్న టాపిక్ మీద చివరి అధ్యాయం రాయడానికి వాళ్ళ మెదడుల్లోని కంప్యూటర్లు అలసిపోయాయి.

అలా అలిసిపోయిన వాసు రెండవ నంబరు గదిలో తన మంచంమ్మీద నడుం

---

లోకం చూశాక

వాల్చాడు. ఇప్పుడిక ఏమి చదివినా బుర్రలోకి వెళ్ళేట్టులేదు. బుర్ర వేడెక్కిందట - గ్లాని కాబోలు.

అతనికి అమాంతం అతని రీసెర్చిమీదా, అతని ఒంటరితనం మీదా ఏవగింపు కలిగింది.సంసార జీవితం మీద కోరిక పుట్టుకొచ్చింది. ఏవేవో కోరికలు పిచ్చిపిచ్చిగా అతన్ని వాటేసుకుంటే అతను ఉక్కిరిబిక్కిరై పోయాడు.

అతనికి రిలీఫ్ కావాలి -

రిలీఫ్ కోసం అతను ఏం చేయాలి?

చేతి కందిన మాగజైన్ అందుకున్నాడు.

టేబుల్ లైట్, ఎప్పట్లా వెల్గుతోంది.

కిటికీ సగం మూసీ, సగం తెరిచీ వుంది.

ఆమె నగ్నంగా నిలబడి అతనికేసే చూస్తోంది. కోరికతో, కైపుతో వగలు పోయే సోగ కన్నుల్తో, సిగ్గుతో మరీ చూస్తోంది.

అతను అక్కడినుండి చూపును మరల్చుకోలేకుండా వున్నాడు.

అతనిలోంచి గాడ్పులాంటి వెచ్చటి శ్వాస.... ఏదో ఉద్రేకపు జల్లు...

మరో నిముషంవరకూ అలానే దానిపై చూపును నిలిపాడు. నున్నని ఆర్టు పేపరుపై ఆ అందమైన అమ్మాయి నూడ్ ఫోటోను అతని మునివేళ్ళు మృదువుగా తాకాయి.

పేజీ తిప్పేశాడు ...

రిలీఫ్ కోసం బయటికి వచ్చాడు.

జీవితం ఏమిటిలా వెర్రిగా వుంది.. అనుకున్నాడు.

✿ ✿ ✿

పక్క గదిలో మూర్తి వున్నాడు.

అతని చేతిలో చదివి మడతపెట్టిన లెటర్సున్నాయి. అతనికి ఎదురుగా టేబుల్ మీద ఫిజిక్స్ బుక్ అలసిపోయిన ఆడదానిలా చెల్లాచెదురుగా పడి వుంది.

అతను ఆ ఉత్తరాల్లోని అందమైన అక్షరాల వెనుక అమ్మాయిల ఆంతర్యాలను ఆలోచిస్తున్నాడు.

సుజాత రాసిన ఒక్కొక్క ఉత్తరం పైనుండి కిందికి ఎన్నిసార్లు చదివాడో... కాని ఈ రోజు "మూర్తీ! యు ఆర్ ఎ చైల్డ్..." అంది. ఈ రోజు అన్న మాటకీ, ఆ ఉత్తరాల్లోని అక్షరాలకీ ఎంత తేడా....

మూర్తికి ఆ గదిలో ఊపిరి సలపడం లేదు. గొంతులో దిగడని బాధేదో అతన్ని ఉక్కిరి బిక్కిరి చేస్తోంది.

అతను వరండాలోకి వచ్చాడు.

✿ ✿ ✿

రాధాక్రిష్ణ ప్రతి శనివారం సాయంత్రం ఇంటికి వెళ్ళి తిరిగి సోమవారం ఉదయాన్నే వచ్చేస్తాడు.

సూర్యుడు ప్రతి సాయంత్రం అస్తమించి తిరిగి ఉదయాన్నే ఉదయిస్తాడు. ఈ రోజు కూడా సూర్యుడు సజావుగానే ఉదయాన్నే ఉదయించి సాయంత్రం అస్తమించాడు.

కాని రాధాక్రిష్ణ మాత్రం ఈ వారం ఇంటికి వెళ్ళలేదు.

నీవు నీ రీసెర్చి వర్కు తొందరల్లో పూర్తిచేసి రావాలి కనుక అక్కడే వుండి థీసిస్ సక్రమంగా జరిగేలా చూసుకో... అని అన్నగారి వద్ద నుండి నిన్ననే ఉత్తరం వచ్చిందట -

పాపం రాధాక్రిష్ణకు ఈ రోజంతా తన వదినే మనసులో మెదిలింది.

ఆ కారణంగానే కాబోలు రాధాక్రిష్ణకు లోకమంతటిమీదా కోపం వచ్చేసింది. వెల్గుతున్న లైటు పీక నొక్కేసి, బయటి వరండాలోకి వచ్చేశాడు.



ఐదో నంబరు గది మూసే వుంది. అందులోని బెడ్ లైట్ చిత్తుగా తాగిన పక్కా తాగుబోతు కన్నులా ఎర్రగా వెల్గుతోంది-

సత్యం కళ్ళు కూడా అంత ఎర్రగానూ వున్నాయి.

సత్యం తాగలేదు -

సత్యం తాగుబోతుకాడు -

ప్రతిరోజూ రీసెర్చికోసం రాత్రింబవళ్ళూ నిద్రకాసినా... అందువల్లా కాదు.

అతని కళ్ళు ఎర్రబడ్డానికి కేవలం అమాయకమైన ఓ ఆవేదన వల్ల -

ఉదయం అతను భవానీ రూమ్‌కు వెళ్ళకపోతే ఇంత ఆవేదన కలిగేదే కాదు.

భవానీ అతని కో రీసెర్చి స్కాలర్... అతని ఫ్రెండ్... అతనితో కలిసి ఎన్నెన్నో సినిమాలు చూసింది; ఎన్నో షికార్లు చేసింది. అతని జీవితంలో ఎన్నో అనుభవాలకీ, మరెన్నో కలలకీ ఆమె ఆలంబనయ్యింది. తన ప్రేమ వాకిలికి ఆమె తొలిసారిగా తలుపును ఓరగా తెరిచింది.

ఆ రోజు లోకానంతటికీ కొత్త సంవత్సరం.

ఆ రోజు ఆ యిద్దరికీ కూడా కొత్త సంవత్సరం.... ఎందుకంటే.

సత్యం ఆమె గదికి వెళ్ళేసరికి ఆమె ఒంటరిగా వుంది.

సత్యం గ్రీట్ చేశాడు. ఆమె కూడా మరింత చనువుగా అతనిదగ్గరకొచ్చి గ్రీట్ చేసింది. చిలిపిగా అతని కళ్ళల్లోకి చూసింది. ఆమె కళ్ళల్లో పిచ్చెత్తించే మత్తు...

సత్యం భవానీ భుజంమ్మీద చేయివేశాడు.

ఆమె మౌనంగా చూపును నేలమీదకు దించేసి వేడి శ్వాసను వదిలింది. టేబుల్ మీది వాజులోని చామంతి పూవును చిదిమి ఆ పూరేకులను అతని జుత్తుమీద పరవశంగా జల్లింది. ఆ రోజు సత్యానికి లోకమంతా రంగురంగులుగా, అందంగా, హాయిగా కన్పించింది.

కాని ఆ సత్యానికే ఈ రోజు లోకమంతా ఏదో పిచ్చిగా, దగాగా, మోసంగా కన్పిస్తోంది. ఏదో అపశ్రుతి -

ఓహో! భవానీ? వేదనగా మూల్గాడు.

సత్యం పక్క మీద దొర్లాడు. అయినా అతనికా పక్క సుఖమిచ్చినట్టు లేదు. అతను వరండాలోకి వచ్చాడు.

✿ ✿ ✿

'అయామ్ బోర్డ్ టెరిబిల్లీ...' వాసూ డిక్లేర్ చేశాడు.

'ఫర్ వాట్....'

'ఫర్ బ్లడీ రొటీన్ లైఫ్....'

'ఇట్స్ట్రూ.....'

'ఈ పుస్తకాలూ, ప్రయోగాలూ, ఈ బయస్కోపులూ, మైక్రోస్కోపులూ.... మై హెవెన్స్... దీజ్ రియాక్టర్స్.... బోర్డ్ విత్ బ్లడీలైఫ్....'

'రియల్లీ....'

'ఎ ఛేంజ్ మస్ట్ బి దేర్....'

'ఔనౌను!....'

'నేనూ బాగా అలిసిపోయాను-'

'నీవన్న మాటేమిటి?... ఇన్ ఫేక్ట్ - నేనూనూ.....'

'ఐ టూ....'

'అయితే మనమంతా కాసేపు అటు టౌన్ సెంటర్‌కు వెళ్తే...'

'దట్స్ గుడ్....'

'బట్ ఇట్స్ ఎ మేటర్ ఆఫ్ టూ మైల్స్-'

నల్గురూ సైకిళ్ళు ఎక్కారు.

కాలాన్ని అదుపులోకి తెచ్చుకునే చిన్న సాధనం -

'బట్ టైమీజ్ గోల్డ్....'

'నో!... ఇట్స్ మోర్‌దేన్ గోల్డ్... ఇట్స్ ఏజ్ ప్రెషస్ ఏజ్ ఎన్‌రిచ్డ్ యురేనియం-'

వాళ్ళంతా నిరంతరం విజ్ఞాన శాస్త్రాన్ని అధ్యయనం చేస్తూ జీవితంమ్మీద గంపెడాశ పెట్టుకున్నారు.

కనీసం కాలాన్ని కాలెండర్‌తో సైతం కొలవరు. సాధించిన సమస్యల్తోనూ, కనుగొన్న కొత్త సిద్ధాంతాలతోనూ కొలుస్తారు.

నెపోలియన్‌కు కాలం విలువ తెలుసు -

కాలం విలువ హిట్లర్‌కు తెలుసు -

ఈనాడు ప్రపంచాన్ని తన సొంతం అనుకున్న వాళ్ళందరికీ కాలం విలువ తెలుసు.

అయితే కాలమనే ఫోర్తు డైమెన్షన్‌లోనే వీళ్ళ గమనం -

కాని ప్రస్తుతం వీళ్ళకు రిలీఫ్ కావాలి... స్వేచ్ఛనే స్పేస్‌లో కొంతసేపు విహరించాలి -

సెంటర్‌లో నియాన్ లైట్ల వెల్తురు పట్టపగల్లా వుంది. అది జనంతో కిటకిట లాడుతోంది. ప్రయోగశాలల్లోని టెస్ట్ ట్యూబ్‌ల్లోని గోల్డెన్ స్పేంగిల్స్‌లా ఆ జనంలోని అమ్మాయిల యవ్వనాలు మెరుస్తున్నాయి.

ఆనందించడానికి అందం, వయసు, యవ్వనం, ఆకర్షణ... ఏది దొరికినా ఆస్వాదించే వయస్సది. అందాన్ని ఏ కోణంలోంచయినా చూడగలిగే యవ్వనమది. అందుకని అంత వరకూ దొరికిన అందాల్ని కళ్ళల్తో ఎత్తేసుకుని గుండెల్లో దాచేసుకున్నారు.

అలా అంతవరకూ కిటకిటలాడే సెంటర్ చూస్తుండగానే తిరిగి నిర్మలంగా తయారైయ్యింది.

టైమెంతైంది మూర్తీ-

ఓ మైగాడ్..ఎలెవన్....

ఈరోజు నేచేసిన చిట్ట చివరి ప్రయోగం చరిత్రాత్మకమైన విజయాన్ని సాధించ వచ్చు.... దాని రిజల్ట్సు వెంటనే చూడాలి-

సైకిళ్ళూ....చక్రాలూ...భూమి

అన్నీ చలనంలో వున్నాయి-రెలిటివిటీ-

మనిషి కేవలం వేగాన్ని పెంచితే చాలదు.... వీలైనంత దూరాన్ని తగ్గించాలి.

సెంటర్ నుండి, చీకటి సందుల్లో నుండి కోర్టు వెనుక సన్నని రోడ్డు మీదకు వచ్చారు. అది ఆనంద నిలయానికి దగ్గరి మార్గం. దగ్గరి మార్గాన్ని ఎందరో ఎన్నుకుంటారు. మరో రిక్షా వాళ్ళను దాటి ముందుకు పోతోంది -

దగ్గరి మార్గమే కాదు! చీకటి మార్గం కూడా ఎన్నుకుంటారు.

రిక్షాలో వెల్తురు లాంటి చీకటి! ఆ చీకటిలాంటి వెల్తురులో రిక్షాలోంచి బయటకు రెపరెపలాడే చీరకొంగు-

చీరకొంగు ఎర్రగా లేదు. చీకట్లాంటి వెల్తుర్లో నలుపును పులుముకున్న ఎరుపు కాబోలు - దానిమీద తెల్లతెల్లని పూలు-

ఎవరో అమ్మాయి....

ఔను చాలా రాత్రయింది - ఒక్కతీ.

స్త్రీ ఈనాడు స్వేచ్ఛాజీవోయ్...

మూర్తికి సుజాత గుర్తొచ్చింది.

రాధాక్రిష్ణకు వదినె గుర్తొచ్చింది.

సత్యానికి భవానీ గుర్తొంచ్చింది.

అందరి మనసులూ ఇంతకుముందు ఒకేలా డిస్టర్బయ్యాయి - ఉదయం నుండీ

సత్యం భవానీ గురించే ఆలోచిస్తున్నాడు. ఎంత మరవడానికి ప్రయత్నించినా భవానీ - వెంకట్రావ్‌లే అతని కళ్ళముందు కదులుతున్నారు.

సత్యం ఉదయమే భవానీ కోసం రూమ్ కెళ్ళాడు. అక్కడ అతను భవానీతో పాటు వెంకట్రావ్‌ను చూశాడు. వెంకట్రావ్ ఆ క్షణంలో కొంత తత్తరపడి మరుక్షణమే సంబాళించుకుని, డిపార్టుమెంటులో కలుసుకో... కావలసిన పుస్తకాలిస్తాను అని చెప్పి, సత్యాన్ని భుజమ్మీద తట్టి అతను నెమ్మదిగా బయటకు వెళ్ళి పోయాడు.

వెంకట్రావ్ ఈ మధ్యనే పోష్టు పి.హెచ్.డి. చేసి, విదేశాలనుండి తిరిగి వచ్చి డిపార్టుమెంటులో జాయిన్ అయ్యాడు.

సత్యం మౌనంగా నిలుచున్న చోటే నిలుచుండిపోయాడు.

భవానీ అవకతవకల ప్రసంగం మొదలు పెట్టింది.

'నా జుట్టు అందంగా వుందన్నారు... నిజంగానా అన్నాను ఆయనతో - ఔను! పూలు పెట్టాలనిపిస్తోంది అన్నారు - ఓస్సింతేనా... మీది మరీ చిన్న కోరిక అన్నాను. అయినా ఓ పువ్వు సిగలో పెట్టినంత మాత్రానికే ఏంపోతుంది సత్యం... కిందికెళ్ళి ఓ గులాబీని తుంచి తెచ్చాను. ఆ పువ్వును పెడ్తూ మురిసిపోయే అతన్ని చూడాలనే పిచ్చికోర్కె తప్ప మరేం లేదు సత్యం - అయినా మగవాళ్ళంతా ఒకటేనేమో....'

సత్యంలోని మౌనం సడలిపోలేదు - జీవితం గూర్చి రంగురంగుల కలలు కంటున్న తనకి భవానీ మంచి ధోకా యిచ్చింది. పూవును పురుగు తొలిచేస్తున్నట్టు భవానీ గురించి తన ఆలోచనలు ఉదయం నుండీ తన మెదడును తొలిచేస్తున్నాయి.

అనుభవంలో జీవితం వేరు -

ఇన్నాళ్ళూ అతనికి సౌందర్యం ఒక ఆరాధనా విశేషం. కాని ఈ చేదు నిజం తరువాత దాని నిర్వచనం పూర్తిగా తారుమారై పోయింది.

తనకి రిలీఫ్ కావాలి...తనకి తెలీని ఆనందం కావాలి. అందుకే సత్యం రిక్షావేపు చూశాడు.



రాధాక్రిష్ణ మనసు పరవళ్ళు తొక్కుతోంది. యవ్వనం, కోరికా అతన్ని పూర్తిగా ఆవహించాయి. అలాంటి సమయంలో అతనికి అతని వదిన గుర్తుకు రావడం పరిపాటి-

ఆ రోజు-

ఆ చిన్ని తడికెల మడుగులో కూచొని నెత్తిమీద నీళ్ళు గుమ్మరించుకుని సిగను ముడుచుకుంటోంది వదిన -

శబ్దం చూపుడు వేలు-

అనాలోచితమే కావచ్చును....కాని సౌందర్యం.

కాంక్షల తలుపుల్ని పగులగొట్టి విజృంభించే ఆనందావేదన-

అయినా కొర్కెల్ని నిర్దాక్షిణ్యంగా ఉరితీస్తూ నిలుచున్నకాడే నిలుచుని తన కళ్ళల్లో ఆ అందానికి పాన్పు పరిచాడు.

ఆమె అతన్ని చూసి కెవ్వుమంది.

ఆమె చీర కట్టుకుని, కుంకుమ దిద్దుకుని, జుట్టు సరిచేసుకుని వచ్చేసరికి రాధాక్రిష్ణ మంచంమీద పడుకుని బలవంతంగా కళ్ళు మూసుకున్నాడు.

అతనిలో అపశృతి-

'రాధా...' అంది వదిన; పొదలమాటున క్రిష్ణుణ్ని పలకరించినట్టు-

రాధాక్రిష్ణకు మాట పెగల్లేదు. యవ్వనోద్రేకంతోనో, పొరపాటు జరిగిందన్న భయంతోనో తాను ఆమెకేసి చూడలేకపోయాడు.

'పిరికిపందా...! ఈ మాత్రానికేనా?....'

ఆమె బలహీనత తెలియనివాడుకాడు. అతను నెమ్మదిగా కళ్ళు విప్పాడు.

'రాధా! నేను వదినను... నా దగ్గర భయమెందుకు? లోకం నన్ను తల్లితో సమానురాల్ని అంటుందిగా...' అంది.

వదిన అలా ఎందుకంది? అతనికి ఆ మాటలు ఎప్పటికీ అర్థంకాలేదు-కానీ...

తాను పిరికివాడు కాడనీ...ఆనాటి జ్ఞాపకాల ఉరులనుండి విముక్తి పొందడానిక తనకి ధైర్యం వుందనీ నిరూపించుకోవాలనుకుంటున్నాడు.

అందుకే రాధాక్రిష్ణ రిక్షావేపు చూశాడు.



మూర్తీ! ఏమాలోచిస్తున్నావ్...

అతను పెదవి విప్పలేదు. కాని... లోకంలో ఆడవాళ్ళంతా సుజాతలే అయితే... అని మాత్రం ఆలోచిస్తున్నాడు.

సుజాత మళ్ళీ మొదలు పెట్టింది...మూర్తీ! చనువుగా తిరిగితే ఇలాగనే ఎందుకనుకోవాలి?... అయినా తెలిసో తెలియకో తిరిగాం...పిచ్చి పిచ్చి వాగ్దానాలు చేసుకున్నాం... కాని నిజం చెప్పాలంటే నాతో నీవేం సుఖపడగలవు? నా మనసెలాంటిదో నీకెలా తెలుస్తుంది... తెలిస్తే నిజానికి నన్ను హేట్ చేస్తావేమో కూడా... కాని... యు ఆర్ ఎ చైల్డ్... ఇలా అంటున్నానని బాధపడకు.... నా వివాహం మరొకనితో నిశ్చయమైంది! ... అతను విదేశాల్లో మంచి బిజినెస్ మాగ్నట్ అట.... పెద్దలే చూశారనుకో... నేనెలా కాదనగలను.... నా వల్ల తప్పిదమే వుంటే సారీ -

సుజాత వెళ్ళిపోయింది-

మూర్తికి ఈ రోజంతా సుజాత మాటలే పదేపదే గుర్తొస్తున్నాయి.

ఎంత మరవాలన్నా మరపు రాకుండా వున్నాయి. ప్రేమను పొట్టి వాగ్దానంగా కొట్టివేయడం - ఒక్క సుజాతకే తెలుసేమో... అంతకన్నా అంతరాత్మలోని ఆఖరి

అంధకారం మరొకటేముంది కనుక.

మూర్తి రిక్షావేపు చూసాడు.

✿ ✿ ✿

రిక్షా జిల్లాకోర్టు వెనుక చీకట్లోంచి మెయిన్ రోడ్డు వేపు మళ్ళి రోడ్డెక్కింది. మెయిన్ రోడ్డు మీది ట్యూబ్ లైటు కాంతి దారినిండా వున్నా... రిక్షాలో లేదు.

వెనకాతల నాలుగు సైకిళ్ళమీదా నలుగురు.

రిక్షావేగం పెరుగుతోంది-

వాసూ!....ఎవర్రా?

నాకూ అనుమానంగానే వుంది.

రిక్షా మెయిన్ రోడ్డును క్రాస్ చేసి మరో చిన్న వీధిని పట్టింది.

వెనకాతల నాల్గు సైకిళ్ళమీదా నల్గురు.

రిక్షావేగం మరింత పెరిగింది-

సైకిల్ ఫెడల్ మీది కాళ్ళు మరింత బలంగా పడ్డాయి. రిక్షా పక్కనే సైకిళ్ళు... ఎడం ఎడంగా, దగ్గర దగ్గరగా పోతున్నాయి. పోటీ పడుతున్నాయి -

రిక్షా టాప్‌వల్ల లోపల కమ్ముకున్న చీకటి ఆమె ముఖాన్ని కప్పేసింది.

రిక్షావాడు వెనక్కి చూసి ఏమీ అనలేదు. రిక్షాలో అమ్మాయి తొట్రుపాటుతో కనీసం కేకయినా పెట్టలేదు.

ఒక్కొక్కరే వెనక్కి తగ్గారు - ఆలోచన కోసం.

ఎవర్రా వాసూ?

ఏమో! ఎవరో అమ్మాయే-

అది తెలుస్తూనే వుంది.

రిక్షాలోంచి చీరకొంగు రెపరెపలాడుతోంది-

రిక్షావేగం పెరిగింది.

ఆమెను చూడాలన్న కోర్కె అందరిలోనూ నాటుకుపోయింది. అయినా అలవాటు లేని పని. సభ్యత అసలే కాదు - జీవితం మీద గంపెడాశతో నిరంతరం జ్ఞానాన్ని సమకూరుస్తూ, జ్ఞాపకశక్తిని కవాతు చేయిస్తూ కొత్త ఆలోచనలకు ఊపిరులు పోసేవాళ్ళు- ఎవరో అపరిచిత వెనుక కేవలం ఒంటరితనాన్ని ఆసరా చేసుకుని వెంటబడడం సభ్య లోకానికి సభ్యత కానేకాదు.

కాని వాళ్ళల్లో వెలితి-

కాని వాళ్ళల్లో ఆవేదన-

ఎప్పుడూ ఏదో పోగొట్టుకుంటున్న వాళ్ళల్లా లోకానికి దూరంగా, అందులోని ఆనందానికి నోచుకోని అభాగ్యుల్లా అనుమానంగా, అసహనంగా జీవితాన్ని గడుపుతున్నారు.

ముందు రిక్షా - అందులో ఓ ఆడది.

ఆ ఆడది చిగురించిన కొత్త కోరిక... జీవితంలో కొత్త అనుభవాలకి తొలిపంట-

ఏదో అలికిడికి కలత నిద్దర్లోంచి మేల్కొంది యవ్వనం.

ఆ అలికిడి రిక్షాలో ఆడది-

అయితే ఇప్పుడేం చెయ్యాలి -

పువ్వును నలిపి పారెయ్యాలి. పంచశీలను చించి పారెయ్యాలి-

భవానీ! సుజాతా!!... ప్రేమకీ, ఆరాధనకీ కళంకం.

రిక్షాలో ఆడది - రెమ్మల్నుండి వేరయిన పువ్వు.

రిక్షా రోడ్డు మలుపు తిరిగింది. కుటుంబాన్నీ సమాజాన్నీ కాదని ఒంటరిగా చీకట్లోకి వెళ్తుంది. ఆ సమయంలో ఊరవతల పొలిమేర తార్రోడ్డు మీద ఎవరుంటారు గనుక-

దారిపొడవునా యవ్వనం పరిచి వుంది.

గతుకులు గతుకులుగా తార్రోడ్డు... అది తప్పనిసరిగా నది ఒడ్డుకు చేరుస్తుంది. అక్కడ ఆ నల్గురూ...

వాసూ! ఏమాలోచిస్తున్నావు?-

ప్రేమంటే జీవితపుటెడారిలో ఎక్కడో కనిపించే ఒయాసిస్సని... మిగిలిందంతా ఎండమావి అని -

సత్యం, రాధాక్రిష్ణమూర్తీ! ఈ చీకట్లో... ఈ నిబిడాంధకార నిశ్శబ్దంలో మీరు దేనికోసమో వెదుకులాడుతూ వెళ్తున్నారు-

ఔనౌను! ప్రేమకోసం-

యవ్వనం దారంట వెళ్ళాల్సిందే కదా ప్రేమంటే.. అదే దాని పరాకాష్ట- యవ్వనాన్ని కదపాలే గాని ఎండా, వానా, చలీ, చీకటీ, వర్షం, తుఫాను.. ఏదీ పట్టదు. కనుక చెలరేగిన లేత కోర్కెలతో అనుభవాన్ని పంచుకోవాలి-

రిక్షా తార్రోడ్డు మీంచి తిన్నగా నదికేసి వెళ్తోంది.

జగత్తంతా నిద్రలో నిద్రిస్తోంది.

ఆకాశం మసిలో ఎక్కడో తెల్లని చుక్కలు.

నారాయణ బాబూ - నీవన్నది ముమ్మాటికీ నిజం. చీకటి శరీరంమ్మీద మశూచి కుండలు నక్షత్రాలు.

జగత్తంతా నిద్రలో నిద్రిస్తున్నట్టు నటిస్తోంది. పడగ్గదుల్లోని గోడగడియారం పెద్ద ముల్లు నెమ్మదిగా జరిగి చిన్న ముల్లుతో ఏకమైపోవడానికి ఆరాటపడుతోంది.

రిక్షా కిర్రు శబ్దం, మరో నాల్గు గుండెల ఆరాటపు చప్పుళ్ళూ ఆ నిలుచున్న నిశ్శబ్దాన్ని ఛేదిస్తున్నాయి.

ఎవరికి అర్థమౌతుంది ఏ యే రాత్రి ఎలా అంతమౌతుందో... ఏ యే అనుభవం ఎలా ప్రత్యక్షమౌతుందో...

ప్రేమంటే అనర్థాన్ని కోరి వరించడం... దారి కాని దారిని వెళ్తున్నారేమో...

చక్రాల్ తిరుగుతున్నాయ్-

కోర్కెలు తిరుగుతున్నాయ్-

న్యూక్లియస్ చుట్టూ ఎలక్ట్రానులు.

రిక్షాలో న్యూక్లియస్... కోర్కెలనే నాల్గు ఎలెక్ట్రానులు దాని చుట్టూ...

భ్రమణ పరిభ్రమణాల మధ్య, ఆకర్షణ వికర్షణల మధ్య, కర్మక్రియల మధ్య... దీని వేడి అదుపులో పెట్టగల నయాగరా జలపాతాలేవి?

దారి పొడవునా కాంక్షలు - కోరికలు

దారి పొడవునా ఆరాటపు ఆలోచనలు.

దారి పొడవునా దిగంబర అవయవాలు... మరుక్షణం అందుకోబోయే ఆనందపు నిచ్చెనలు.

రిక్షా తన గమ్యాన్ని చేరింది.

నది గట్టు మీద తాడిచెట్టు గుబురుగా పెరిగి ఎండి వ్రేలాడుతున్న ఆకుల్తో ఋషి లానో, పిశాచిలానో సహజ లోకానికి అసహజంగా వుంది. అది నిటారుగా ఆకాశానికెదిగి భూమి కేసి చూస్తున్నట్టుంది. చీకట్లో ఎన్నో యుగాల నుంచి అక్కడ నిలుచుని దేనికోసమో నిరీక్షిస్తున్న దానిలా మౌనంగా వుంది.

దాని కింద రిక్షా - రిక్షాలో ఆమె.

ఆమె చుట్టూ అలుముకున్న చీకటి.

ఇప్పుడు మనిషి చీకటిని ప్రేమిస్తాడు.

ఇప్పుడు మనిషి ముమ్మాటికీ ఇరులను ప్రేమించి, వెలుగును ద్వేషిస్తాడు.

నదికి ఇవతల ఆ దారిపక్కన దేదీప్యమైన ఆ వెలుగుకింద నగ్నంగా వెల్లికిలా పడుకుంది - ఇనుప కండరాల్తో, ఆరాటపు ఆవులింతల్తో, శివమెత్తిన చప్పుళ్ళతో, స్తంభించిన అవయవాల్తో, మూర్ఛనలు పోయి, మైమరచి, ముక్కు పుటాల్లోంచి వేడి శ్వాసను నిరవధికంగా వదుల్తో మైకంలో వుంది ఓ అటామిక్ రియాక్టర్...

అటు నదికవతల ప్రొహిబిటెడ్ ఏరియాలో ఉక్కు నరాల మధ్య నిటారుగా లేచి నిలిచిన రాకెట్... ఇటు నదికివతల ఆ వెలుగు కింద అణు రియాక్టర్ దిగంబరవయవాల మధ్య స్తంభించిన పొగగొట్టం.

ఫ్రాయిడ్! నీ వన్నది నిజం. నీవన్నది ముమ్మాటికీ నిజం - నిజం సుమీ...

ఆ రియాక్టర్ గుండెల్లో ఎక్కడో, ఏ రక్తనాళంలోనో, ఏ కొవ్వు కణంలోనో, ఏ ఇంద్రియ జీవంలోనో ఎప్పట్నించో భద్రపరిచే పరమాణువులో ఏ న్యూట్రానో ఇప్పుడు నిరాఘాతంగా దాని స్వేచ్ఛను అది కోరుకుంటుంది.

ఏ క్షణాన్నయినా కోర్కెలు నిజం కాబోతున్నవి.

భవానీ! సుజాతా!! ప్రతి స్త్రీలోనూ మిమ్మల్ని దర్శిస్తాను.

రిక్షాలో ఆమె ఒక్కతే... ఏమనుకుంటుందో ఏమో-

ఆమె ఒక్కమాటైనా అనలేదు. కనీసం ఆమెలో కాస్త తొట్రుపాటైనా కనిపించలేదు.

ఉచ్ఛ్వాస నిశ్వాసాల మధ్య... వేడి ఊపిరుల మధ్య ఏదో అలజడి.

ఆ తాడి చెట్టు మొదలంటూ ఊపేసిన అలికిడి. ఆ చెట్టు మీద గుబురుగా వ్రేలాడే ఎండుటాకుల గలగల చప్పుడు.

నది నీటితో నిండుగా, హుందాగా ప్రవహిస్తోంది.

ఆ చీకటి జలముల మీద సృష్టికర్త ఆత్మ అల్లల్లాడెనట...

నలభై దివారాత్రులు ఏకధాటిగా కురిసిన కుంభవృష్టికి భూమి జలమయమై సృష్టి వినాశనం జరిగిందట.

నీరు ప్రాణం పోస్తుంది; నీరు ప్రాణం తీస్తుంది.

నీరు ప్రక్షాళన గావిస్తుంది-

క్రీస్తును శిలువ కప్పగించిన పిలాతును ప్రక్షాళన గావించింది. ఆ పాపం తన కంటకుండా పరిశుభ్రమైన నీటితో తన రెండు చేతులూ కడుక్కొని తెల్లని వస్త్రంతో తుడుచుకున్నాడు.

రిక్షావాడు రిక్షానీ, అందులోని స్త్రీని గట్టు మీద వదిలి నదిలోకి దిగి తన రెండు చేతులూ కడుక్కున్నాడు.

తాడిచెట్టు గలగల మంది - ఆ వేళాడే ఎండుటాకుల మధ్య అలికిడి దేనికోసం-

సత్యం! మూర్తీ! వాసూ! రాధాక్రిష్ణా!... అనుభవయోగ్యమైనది కదా ఈ రాత్రి! అపస్వరాలు వినడం ముమ్మాటికీ జరగకూడదు. ఈ క్షణం మీది. అదిగో మీ కోసం... ఎదురుగా ఆమె - ప్రకృతికి కొత్త అర్థాన్ని చేకూర్చండి.

నగరానికి మరో మూల మూసుకు వస్తున్న నల్లని మబ్బుల్లో తళుక్కుమంది మెరుపు.

ఇనుపడేగలు ఆకాశాన్ని ఆవరించుకున్నట్టు నగరాన్ని మబ్బు కమ్ముకొస్తోంది. శతఘ్నుల దాడిలా... మెరుపు.

భూమ్మీద ఫ్లాష్ లైట్లు.

ఎక్కడో పిడుగు బద్దలైంది.

నగరం దద్దరిల్లింది.

ఆమెను చూడ్డం కోసం నల్గురూ రిక్షాని ఆక్రమించారు. ఆమెను తమ కరాల్లోకి లాక్కోవడం కోసం... బాహువుల్లో బంధించడం కోసం... తమ సార్వభౌమత్వాన్ని ప్రకటించుకోవడం కోసం-

కాని ఆమె చుట్టూ బ్లాక్ ఔట్ చేయబడ్డ చీకటి.

ఓ కవీ... ఓ గాయకుడా... అంతరిక్షాల్ని ఛేదించే ఓ సైంటిస్టూ... మీ అంతరాంతరాల్లో వెదుక్కునే ఆనందాలు మీకు తెలీకుండానే ఏ క్షణాన్నయినా మిమ్మల్ని పాదాక్రాంతుల్ని చేస్తుంది.

ఆమెను చూడ్డం కోసం ఏ అగ్గిపుల్లో వెల్గక మానదు. ఏ న్యూట్రానో చలించక మానదు.

ఆ తాడి చెట్టు మీద కల్కి... మెఫెస్టోఫిలస్...

ఏదో కూలిన దృశ్యం ...

ఆమె పిడుగుపాటుగా దర్శనమిచ్చింది.... బ్రద్దలైన అగ్ని పర్వతంలా-

ఆమె ముఖమంతా కత్తిగాట్లు...లావాలా ప్రవహించి కరుడు గట్టిన రక్తపు చాళ్ళు-

రిక్షావాడు తన రెండు చేతులూ నదిలో కడిగి నిర్లిప్తంగా గట్టు మీంచి ఎక్కడికో సాగిపోయాడు.

బీభత్సమైన... నికృష్టమైన... అనూహ్యమైన... అసహజమైన చావు. వాళ్ళంతా మేథస్సునే యవ్వనం వేడితో వెంటాడిన చావు.

ఆమె నవనాగరిక ప్రపంచంలా దర్శనమిచ్చిన చావు.

ఆ తాడి చెట్టు మీద కల్కి....

ఆ ప్రగతి సాధించిన నగరం మీద మెపెస్టోఫిలస్....

ఆ క్షణం ఎవ్వరిదీ కాదు.

** 13–5–1988 ఆంధ్రజ్యోతి సచిత్ర వార పత్రిక **

హైదరాబాద్
*జనవరి 1980*

# కాబరే

లైట్లు డిమ్మయ్యాయి.

ఆకాశంలో నక్షత్రాలు ఆ హాల్లోకొచ్చి వేళ్లాడుతున్నట్టు - ఎర్రగా, పచ్చగా, పసుపు పచ్చగా, నీలంగా, వినీలంగా.... వింతగా-

ఆ మత్తెక్కిన, ఎరుపెక్కిన అనేక కళ్ళకి ఎంతో తమాషాగా-

అనౌన్సర్ ప్రోగ్రాం స్టార్ట్ కాబోతున్నట్టు చెప్పాడు.

స్టేజి మీదకు మిస్ జాస్మిన్ వచ్చింది.

మిస్ జాస్మిన్ మైకును బింకంగా పట్టుకుంది. ఫ్రీగా చూపుల్ని విసుర్తోంది. అందంగా పాటపాడుతోంది. ఆమె పాటకు చక్కని ఆర్కెస్ట్రా వినిపిస్తోంది.

ఆమె పాడుతూ హాలంతా కలయచుస్తోంది. చూస్తూ చూస్తూ అకారణంగా నవ్వుతోంది. ఆ నవ్వు ఎందుకో ఎవ్వరికీ తెలియదు. ఆమె ఆలోచనలన్నీ పాటమీద- చూపులన్నీ జనం మీద-

ఆమె చిరుగాలికి తేలిగ్గా ఊగే సరుగుడు చెట్టులా పాటతో పాటు హాయిగా వూగుతోంది. జనం మీదుండి చూపుల్ని తీసి శూన్యంలోకి విసుర్తోంది... క్షణంలో శూన్యానికి నవ్వు అందిస్తోంది.... పాట ఆగిపోతుంది.

అనౌన్సర్ మళ్ళీ స్టేజి మీదకు వచ్చాడు.

మైక్ ముందు మళ్ళీ ప్రోగ్రాం నివేదించాడు.

ఆ హాల్లో ప్రతి టేబుల్ మీదా రెండవ రౌండు మొదలయ్యింది.

అప్పుడు జాజ్ మ్యూజిక్‌తో హాలంతా నిండిపోయింది.

స్టేజి మీదకు ఓ అరడజను అమ్మాయిలు.

గిటార్‌లూ, బాంగోలూ, ఎకార్డియన్‌లూ, డ్రమ్ములూ - మైకుల్ని అదరకొట్టేస్తున్నాయి, అన్నీ లయబద్ధంగా.... కాని ఏదో వింతైన, విలక్షణమైన శబ్దం-

ఖుషీలో వున్నారు జనం-

అమ్మాయిలు నాట్యం అర్ధనగ్నంగా చేస్తున్నారు.

---

క్షణాలు యుగాల్లా.... యుగాలు క్షణాల్లా...

గుండె గుబుళ్ళూ..... రగిలే కోర్కెలూ...

ఓ అరగంట అవిరామంగా.... ఆ తర్వాత అంతా చీకట్లో అదృశ్యమయ్యింది.

లైట్లు వెలుగును పుంజుకున్నాయి.

మొదటి రౌండు కాబరే పూర్తయింది.

టేబుల్ దగ్గరకు స్టైవార్డు వచ్చాడు.

ఆ టేబుల్ వద్ద ప్రముఖ హైకోర్టు న్యాయవాది రావుగారు కూచున్నారు.

రావుగారు ఆజానుబాహుడు. బంగారు ఛాయతో, నెరసిన తెల్లని జుట్టుతో, ఆకర్షణీయంగా వుంటారు. ఆయన అందమైన నవ్వుకీ, కళ్ళల్లో కాంతికీ, ఏభయ్యో పడిలో సైతం బుగ్గలమీద నిగ్గుదేరిన రోజా రంగుకి ఎదుటి వాళ్ళు ముగ్ధులౌతారు. పరువంలో వున్న పడుచు అమ్మాయిలు సైతం ఆయన్ని కోరుకుంటారు.

ప్రస్తుతం ఆయన పక్కన.... తెల్లగా, ఆకర్షణీయంగా... పేరు 'రోజీ' చూడ్డానికి ఆంగ్లో ఇండియనల్లే వుంది.

ఆమె రావుగార్కి నాల్గురోజుల క్రితం ఓ రాత్రి 'స్కైలైన్' బార్‌లో పరిచయం అయ్యింది.

ఒక్క రావుగారికే కాదు... ఆమె ఎవరికైనా, ఎప్పుడయినా ఆ బార్‌లో పరిచయం కావడం ఏ మాత్రం విశేషం కాదు.

'డు యు వాంట్ కంపెనీ....' అని అడిగిందా రోజా రోజీ –

రావుగారు ఓ క్షణం ముఖం పైకెత్తి ఆమె ముఖంలోకి చూశారు. రావుగారు అప్పటికి ఫస్టుపెగ్ మాత్రమే పూర్తి చేశారు. అందుకని ఆమె అందచందాలను అంచనా వేయడంలో ఏ మాత్రం పొరపాటు పడలేదు. ఆమె పెదవుల మీద తళుకు మనే నవ్వూ, గిలిగింతలు పెట్టే ఒంటివిరుపూ ఎంతటి వాడినైనా వివశుడ్ని చేస్తాయి. ఒక్క లిపిస్టిక్ విషయంలో తప్పించి మిగత మేకప్‌లో ఏమంత అతి లేదు. అక్కడ 'సెల్లార్' వద్ద కూచున్న అరడజను అమ్మాయిల్లో 'రోజీ' ఒకర్తని రావుగార్కి ఎవరూ చెప్పనవసరం లేదు.

'కమాన్...' అని ఓ థ్రిల్‌ఫీలై తన పక్క సీటు చూపించారు. అప్పటికే ఆమె ఓ కస్టమర్‌కి కంపెనీ ఇవ్వడం వలన కాస్త నిషాలో వుంది.

ఆమె కూచున్నాక రావుగారు ఆమెను నఖశిఖ పర్యంతం కళ్ళతో తడిమారు. ఆమె నిండుగా వుంది; బలంగా వుంది. అది తెలియడం కోసం ఆమె పై బటన్స్ రెంటిని వదిలి వేసింది.

రావుగారి చూపు అటుకేసి దొరలి నప్పుడు ఆమె దరహాస వదనంతో లావణ్యం వలకబోసింది.

'ఏం తీసుకుంటావ్... డిప్లమేట్ విస్కీ నాది....'

'మీ బ్రాండ్ మీరు కానివ్వండి. బేరర్... నాకో పెగ్ డ్రై జిన్ విత్ లెమన్ కార్డియల్...' అంది.

రావుగారు కొంత హుందాతనం, మరికొంత చిలిపితనం జోడించి గంటల్ని క్షణాల్లా గడిపేశారు. పెగ్గు మీద పెగ్గు రప్పించుకుని ఆమెతో పాటు ఖుషీ చేసేశారు.

అప్పుడు రావుగార్కి ఫుడ్ కావాలనిపించింది.

'వాట్ డుయువాంట్ రోజీ.... నే ఫుడ్ చెప్తున్నాను....' అన్నారు.

'మీరు కానివ్వండి.... నాకేమీ వద్దు...' అంటూ రోజీ తన లాస్టు సిప్ చేసేసి ఖాళీ గ్లాసు దించేసింది.

'నోనో .... యుమస్ట్ టేక్ ఫుడ్.... ఇప్పటికే నీవు ఎక్కువ తీసుకున్నా వల్లే వున్నావు.... కమాన్.... ఏం తెప్పించను.."

మీరు ఫుడ్ ఆర్డరిచ్చుకోండి.... తర్వాత నేచెప్తానులే...

రావుగారు రోజీ వంక చూశారు. ఆమెకు మందు ఎక్కువయ్యిందన్నది నిజం. అందుకని కాసేపాగి ఫుడ్ ఆర్డరిచ్చి రోజీ వంక మళ్ళీ చూశారు.

ఏం తెప్పించమంటావు.... అని మళ్ళీ అడిగారు.

ఆమె ఎక్స్‌ప్రెషన్ లేని నవ్వొకటి వొదిలేసి వూరుకుంది.

నీ వలా ఖాళీగా కూచోవడం ఏమంత బాగాలేదు. ఏదోఒకటి తెప్పిస్తాను... తినాలి – అన్నారు.

సరే.... మరో పెగ్‌తెప్పించండి.... మీ ఫుడ్ అయ్యేవరకూ కంపెనీ ఇస్తాను. బేరర్... తీసుకురా–

రావుగారు తెల్లబోయారు.

ఏం ఫరవాలేదు డార్లింగ్ – నాకలవాటే, ఇప్పుడు నేను ఫుడ్ తీసుకుంటే యింకా తాగలేను. మీరు వెళ్ళిం తర్వాత మరో కస్టమర్‌కి నేను కంపెనీ ఇవ్వాలి. కనీసం ఈ రోజు ముగ్గురికన్నా నేను కంపెనీ ఇస్తే మూడు పదులు ముప్ఫయి ముడుతుంది. రేపు మా ఇంటి ఖర్చులకు ఇబ్బంది వుండదు. అందుకని.... అంతే... అంది రోజీ–

రావుగారు ఫుడ్ కానిస్తున్నంత సేపూ 'రోజీ' గురించే ఆలోచించసాగారు. ఏమని అంటే–

ఇంట్లో సంపాదించే మరో దిక్కు లేకపోవచ్చును. వృద్ధులైన తల్లిదండ్రులూ, ఎదిగిన చెల్లెళ్ళూ, ఎదగని పిల్లలూ వుండొచ్చును. భర్త తాగుబోతు అయ్యుండొచ్చు. కాకపోతే ఏ అరిపేదవాడో, అర్భకుడో, అనామకుడో అయ్యుండొచ్చును. అందరికీ తానొక్కతే ఆధారం కావచ్చును. తాను తీసికెళ్ళిన రోజున తింటారు.... లేని రోజున పస్తు లుంటారు... అంటూ రావుగారు ఆలోచించసాగారు. ఆ సంగతే ఆమెను అడగ్గా ఆమె కూడా ఇంచుమించుగా అలాంటి కథనే చెప్పింది.

అందుకని రావుగారు ఫుడ్ తినేశాక, బిల్లు చెల్లించేశాక, స్టెవార్డుకు టిప్పు సైతం ముట్టచెప్పేశాక, రోజీ వంక సాదరంగా చూసి, రెండు పదులు పైకి తీసి ఆమె చేతిలో వుంచారు.

రోజీ తన చేయి వెనక్కి తీసుకుంది. ఆయనకేసి చూసి తల అడ్డంగా తిప్పింది. ఆ తర్వాత 'నో' అంది.

రావుగారు మోహమాటం పడుతుందేమోలే అనుకున్నారు.

నేనేదీ ఊరికే తీసుకోను... అంది అంతలోనే-

ఇంతవరకూ నాతో కూచుని కంపెనీ ఇచ్చినందుకు....పారితోషకంగా.. అన్నారు రావుగారు.

అందుకు బార్ వాళ్ళు నాకు పదిరూపాయలు చెల్లిస్తారు. దానికి మీరేమీ చెల్లించనవసరం లేదు.

ఇది కూడా అలాంటిదే అనుకో... నేనూ చెల్లిస్తున్నాను.

నో.... నేనలా తీసుకోను. ఒకే పనికి రెండు చోట్ల తీసుకోవడం అక్రమం. అయినా ఎవరివద్దా ఎవరూ ఊరికే తీసుకోకూడదు. ఎవరైనా ఊరికే ఇస్తారని ఆశించడం, దానికోసం ఎదురు చూడ్డం, ఇస్తే తీసుకోవడం నేనసహ్యించుకుంటాను. నిజానికి బెగ్గింగ్ లాంటిదది-

'వాట్-'

ఎస్! ముమ్మాటికీ అలాంటిదే - కేవలం అడుక్కోవడం లాంటిదే... అడుక్కోవడం కంటే నీచమైన వృత్తి ఈ లోకంలో మరొకటి లేదు... ఐ హేటిట్-

రావుగారు అదిరిపడ్డారు. కాని కొద్దిసేపట్లోనే తమాయించుకున్నారు.

ప్రిన్సిపుల్స్ వేరు, ప్రాక్టికల్ లైఫ్ వేరు... ఎందుకంటే, 'రేపు' అనే ఒక్క రోజు గడవడానికి నీవీ క్షణంలో ఎంత భయపడ్తున్నావో నేను చూస్తున్నాను. ఈ 'రేపు' గడవడం కోసం ఎప్పుడన్నా నీ దగ్గర ఏమీ లేకపోతే అప్పుడన్నా యాచించవలసి వస్తుంది రోజీ-

అప్పుడు కూడా యాచించను... ఆ యాచించడం కన్నా చావు మేలనుకుంటాను. కాని అది పిరికివాళ్ళ పని. నాలో అందం వుంది.... ఆరోగ్యం వుంది. ఈ శరీరాన్ని అమ్ముకునైనా సంపాదించుకోగలను.

వ్యభిచరించడమా?! నీచం కదా-

ఔను! అదే... అలాంటి పరిస్థితే వస్తే, అడుక్కోవడం కన్నా వ్యభిచరించి సంపాదించినదే మేలనుకుంటాను. ఎందుకంటే అది సంపాదన - యాచించడం వ్యభిచరించడం కన్న నీచం -

అలా అనుకోకు .... భైక్షుక వృత్తిని స్వీకరించిన ఉన్నత జాతులు ఈ దేశంలో అగ్రస్థానంలో వున్నారు.

నేనూ ఈ దేశంలో పుట్టినదాన్నే.... ఈ సామాజిక విలువలు నాకు తెలియనివి ఏవీ కావు.

నీకు తెలియవని నేను అనను గాని, అన్నీ అందరకూ తెలియాలనేది ఏమీలేదు. చాలా మంది తెలుసుకోడానికి ప్రయత్నించరు కూడా... అయితే వృత్తిరీత్యా నేను ప్లీడరుని... విలువల పట్ల నాకూ కొన్ని నిశ్చితాభిప్రాయాలున్నాయి. ఈ దేశానికీ,

సమాజానికీ, తోటి మానవుడికీ ఏరకంగానూ పనికిరాని వాళ్ళు యీ నాడు అనేక ముసుగుల కింద ఉన్నత జాతులై అగ్రస్థానంలో వున్నారు. వాళ్ళు విత్తరు, కోయరు, కాని పండించినది భుజిస్తారు. దేశ నిర్మాణానికి కారకులైన కష్టజీవులు రాత్రింబవళ్ళూ కాయకష్టం చేసి అంటరాని వాళ్ళుగానో, అతి తక్కువ జాతిగానో మిగిలిపోయారు.

పండించేది వాడే... పస్తులుండేది వాడే-

దేశ పురోగమనానికి పునాది రాయి వాడే - అంటరాని అతి తక్కువ జాతివాడూ వాడే...

మీ నోటి నుండి ఇవి వినడం మహదానందంగా వుంది. రియల్లీ యు ఆర్ గుడ్ డార్లింగ్.... కాని ఇవన్నీ సమయమొచ్చినప్పుడు మీరెందుకు నోరు మెదపకుండా స్తబ్ధతతో వుండిపోతారు.

రావుగారు చిరునవ్వు నవ్వి... రోజీ వంక చూసి, అక్కడ నుండి ఎటో చూసి, ఈ కుర్రది లీడింగ్ లాయరుకన్నా గట్టి ప్రశ్నే వేసింది అనుకుని, అలానే వుండిపోయారు.

రోజీ కూడా కాసేపు ఏమీ మాట్లాడలేదు. ఆయన చేతిలోని రెండు పదులు కూడా అలానే వుండిపోయాయి. వాటిని వెనక్కి తీసి జేబులో పెట్టుకోవడానికి మనస్కరించక ఆయన తటపటా యిస్తున్నారు.

అప్పుడు రోజీ జోగుతున్న కళ్ళతో, తూగుతున్న వొళ్ళుతో ఆయన మీదగా వాలి, ఆయన చేతి మీద చేయుంచి, ఇవి నేను తీసుకోబోతున్నాను. కాని రోజీ ఏదీ ఊరికే తీసుకోదు... ఇదీ ఊరికే తీసుకోవడం లేదు... మీ ఇష్టం వచ్చిన రోజున ఇక్కణ్ణించి ఫోను చెయ్యండి.... రోజీ మీకోసం ఏదైనా ఇవ్వడానికి సిద్ధంగా వచ్చేస్తుంది - అంది.

అలా నాల్గురోజుల క్రితం 'సైక్లెన్' బార్ లో కలిసిన రోజీ ఈ రోజు ఉదయం రావుగారు బుక్ చేసిన ఆఫీసర్స్ గెస్ట్ హౌస్‌లోని ఎ.సి. రూమ్‌లో ఏకాంతంగా కలిసి రావుగార్ని ముగ్ధుల్ని చేసేసింది.

అలా ఆ ఆనందధామంలో ఆహ్లాదంగా మునిగి తేలుతుండగా, అమాంతం ఆయనకు ఇక్కడి కాబరే గుర్తొచ్చి రోజీతో సహా ఇక్కడికి వచ్చేశారు.

ఇక్కడ కాబరే చూడాలనుకుంటే. రావుగారు లాంటి ప్రముఖులకోసం ఎల్లప్పుడూ ఓ టేబుల్ రిజర్వ్‌గా వుంటుంది. ఎందుకంటే అక్కడ ఆయన దానికి లీగల్ అడ్వయిజరు. పోలీసు కేసులన్నీ ఆయనే చూస్తారు. లైసెన్సు లావాదేవీల్లో ఆయన ప్రభుత్వోద్యోగులకీ, మేనేజుమెంటుకీ సంధానంగా నిలుస్తారు.

అందుకని ఆ ప్రత్యేకించబడిన టేబుల్ మీద రోజీ, తానూ కూచున్నారు.

రెండువ రౌండు పూర్తయి, మరోసారి 'మందు' సప్లయ్ జరుగుతోంది. అప్పుడు నిషా అందరినీ నవ్వుల్తో పలకరించుకుంటూ వచ్చి ఆ టేబుల్ మీద రావుగారి పక్కన కూచుంది. ఆమె రంగు రంగు తరంగాల మీద ఏర్పడిన నురుగులాంటి యవ్వనంలో

వుంది. ఆమెతో పాటు ప్రముఖ జర్నలిస్టు మూర్తిగారున్నారు. ఆయన అక్కడ అలా ఆమెతో కలిసి కనిపించడం రావుగార్కి కించెత్తు ఉత్కంఠ కలిగించింది.

ఎందుకంటే..... మూర్తిగారు మంచి మూర్తిగలవారు. ఆయన జీవితాంతం తన ఆలోచనల్నీ, అభిరుచుల్నీ, పత్రికకీ, దాని యాజమాన్యానికీ అవిచ్ఛిన్నంగా అమ్మేసుకున్న వారు కావడంచేత, ఎప్పుడూ నేలచూపులను మాత్రమే అలవాటు చేసుకుని, యాజమాన్యానికి గొప్ప నమ్మకస్తుడుగా వుంటూ, మంచి పేరును తెచ్చుకున్నారు. అందుకని ఈ మధ్యనే ఆయన ఉత్తమ జర్నలిస్టుగా ఎన్నిక చేయబడి రాష్ట్రస్థాయి అవార్డును అందుకున్నారు.

అందుకని రావుగార్కి కూడా మూర్తిగారి యెడల కొంత గౌరవం వుంది.

మిస్ నిషా ఆ టేబుల్ మీద మూర్తిగారిని ఆశీనులను గావించిన తర్వాత అక్కణ్ణించి లేచి, మిగత టేబుల్స్ మీది ఒక్కొక్కరి బుజాలనీ తడుతూ, నవ్వుల నందిస్తూ, హొయలు వొలికిస్తూ కనుమరుగయ్యింది.

మిస్ నిషా అలా రావడం కుషీలో వున్న జనానికి నిషా ఎక్కింది. ఆ వెనకే స్టెవార్డు వచ్చి మూర్తిగారి ముందు హాజరై ఆర్డర్ తీసుకున్నాడు. అలా ప్రతి టేబుల్ మీదా 'మందు' సప్లయ్ అయ్యాక స్టేజి మీద ఆర్కెస్ట్రా మళ్లీ మొదలయ్యింది.

మిస్ జాస్మిన్ మళ్ళీ స్టేజి మీదకు వచ్చింది.

లేతగులాబీ జార్జెట్ చీర... స్లీవ్‌లెస్ బ్లౌజ్...

బింకంగా చీరకట్టింది.... బిగుతుగా బ్లౌజ్ తొడిగింది.

తెలుగులో పాడ్డం మొదలుపెట్టింది.

పాట హుషారుగా సాగుతోంది.

మిస్ నిషాతో మూర్తిగార్ని చూసిన రావుగారు కించెత్తు కుతూహలం వహిస్తూ "ఏమిటి విశేషం....." అని ప్రశ్నించారు.

మిస్ నిషాతో ఇంటర్వ్యూ- రేపటి మా పత్రికలో ఆదివారం స్పెషల్లో వస్తోంది.

"ఈజ్ ఇన్ టిట్...."

ఓ కాపీ ప్రెస్ నుండి తెచ్చి ఇప్పుడే గ్రీన్ రూమ్‌లో ఆమెకిచ్చాను. ఆమె సరాసరి నన్నిక్కడికి తీసుకొచ్చింది.

అయితే మంచి హోస్టునే పట్టారు. మిస్ నిషా మంచి సివిలైజ్డ్ చాప్- ఓహ్! బ్రహ్మాండమైన ఆర్టిస్టు... అందుకే రోజీతో నీవు తప్పకా చూడాలని నాతో వెంట బెట్టుకుని తీసుకొచ్చాను.

ఇంతకూ ఇంటర్వ్యూ చేసిందెవరు? మీరేనా-

తప్పలేదండి,.... నేనే చెయ్యవలసి వచ్చింది. మా అసిస్టెంటును పంపడానికి మిగతవాళ్ళు ఒప్పుకోలేదు. నిజానికి సండే స్పెషల్ చూస్తున్నది కూడా నేనే కదండి -

ఇంటర్వ్యూ మీరే చేస్తే దానికి తిరుగేమిటండి?..... పాఠక లోకానికి ఎన్నో ఆసక్తి కరమైన విషయాల్ని అందించి వుంటారు. అయితే రేపు ఉదయం మీ వ్యాసాన్ని తప్పకా

చూడాలి.... జర్నలిజం భ్రష్టు పట్టిన ఈ రోజుల్లో మీలాంటి జర్నలిస్టులు పత్రికలకి ఎంతయినా అవసరం-

మీ ఒపీనియన్ ఫోన్‌లో తెలియజేస్తే మహా భాగ్యంగా తలుస్తాను.

ఎంత మాట!.... ఏదో కోర్టులో పందిని నందిని చెయ్యగలనేమోగాని మీవంటి ప్రతిభావంతుణ్ణి కానండోయ్ అయినా నా అభిప్రాయం తెలియజేస్తాను... ఔను! మీరు మందుతప్ప మరేం ముట్టడం లేదనుకుంటాను.. ఇక్కడ మటన్ ఛాప్స్ తప్పక ఆర్డరివ్వాల్సిందే... రియల్లీ డెలీషియస్... ఇంతకూ ఎన్. వి. అంటే ఆక్షేపణ లేదు కదా-

ప్రస్తుతానికి ఆమ్లెట్ చెప్పాననుకోండి... తర్వాత రౌండ్లో ఆర్డరిద్దాం-

ఇంతకూ మిస్ నిషా మీద... ఏజ్ ఎ జర్నలిస్టు... మీ ఒపీనియన్ ఏమిటి?

ఓ! రియల్లీ ఫెన్‌టాస్టిక్.... ఎ జీనియస్ లేడీ-

దట్స్ ఆల్... థాంక్యూ.... మీ ఓపీనియన్‌తో ఏకీభవిస్తున్నాను. మోస్ట్ సివిలైజ్డ్ లేడీ... మీ ఇంటర్వ్యూ కూడా ఆసక్తి కరంగా వుండి తీరాలి... ఐ హేవ్ దట్ కాన్ఫిడెన్స్ ఆన్‌యు-

స్ఫూర్తిగారు ఆ కాంప్లిమెంటును ఆనందంతో శిరసావహించి, అలవాటుగా శిరసు వంచేశారు.

అలా శిరసు వంచేసిన స్ఫూర్తిగారికి ఓనాల్గురోజులు క్రితం మిస్ నిషాతో ఆమె గదిలో జరిగిన ఇంటర్వ్యూ ఒక్క క్షణంలో కళ్ళముందు కదలాడింది.

అంటే ఆ రోజు అప్పటికి మధ్యాహ్నం పన్నెండు గంటలయ్యింది.

ఆమె గదిలో ఎప్పుడూ పన్నెండు తర్వాతనే తెల్లవారుతుంది.

ఆమె పక్కమీంచి లేచి స్నానం పూర్తిచేసి వచ్చేసరికి స్ఫూర్తిగారు ఆమెకోసం కనిపెడ్తూ కూచున్నారు.

ఆయన పేరు ఫలానా అనీ, జర్నలిస్టుననీ, ఫలానా పత్రికలో పని చేస్తున్నాననీ పరిచయం చేసుకున్నారు.

ఆమె నిర్లక్ష్యాన్నే ప్రదర్శిస్తూ సాదరంగా ఆహ్వానించింది. ఆయన తిరిగి కుర్చీలో కూచున్నాక....'వాట్ కెన్ ఐడూ ఫర్‌యు....' అంది.

మా పత్రికకోసం మీతో ఇంటర్వ్యూ తీసుకోవాలనుకుంటున్నాం.

మిస్ నిషా గుంభనంగా వుండిపోయింది.

మాది రాష్ట్రంలో మంచి సర్క్యులేషన్ వున్న డైలీ పేపరని మీరు వినే వుంటారు. పదేళ్ళుగా నేనందులో పనిచేస్తున్నాను. గత ఏడాది నుండి 'సండే స్పెషల్'కు ఇన్‌ఛార్జిని కూడా అయ్యాను.

'ఓ! నైస్-'

అఫ్‌కోర్స్....ఇది డైలీకి అనుబంధమేననుకోండి....కాని ప్రజల మన్నన ఎంతగానో పొందింది. ఈ అనుబంధం కారణంగా మరో లక్షవరకూ సర్క్యులేషన్ పెరిగిందంటే మేం

ఎంత శ్రద్ధ తీసుకుంటున్నామో మీరే ఊహించుకోగలరు.

రియల్లీ!....వెరీనైస్....

పాఠకులకు మంచి వ్యాసాలూ, ఇంటర్వ్యూలూ అందించడమే మా ధ్యేయంగా భావిస్తూ ఎన్నో విలక్షణమైన వ్యాసాల్ని ప్రచురించాం. పత్రిక కున్న ప్రమాణాలను జవ దాటకుండా కాపాడుకుంటూ వస్తున్నాం.

అసలు విషయం ఏమిటంటే-

ఇప్పటి వరకూ మేం ఏ కాబరే ఆర్టిస్టు గురించీ ఎలాంటి వ్యాసమూ ప్రచురించ లేదు. నేను ఇన్‌ఛార్జిని కాబట్టి కొన్ని సాహసాలు చేయదలచుకున్నాను. నా బాధ్యతతో నేను వాటిని ప్రచురించాలనుకుంటున్నాను. మీ ఇంటర్వ్యూతో పాఠకుల్లో కొత్త సెన్ సేషన్ తీసుకురావాలనుకుంటున్నాను.

అలాగా! అయితే మిమ్మల్ని తప్పకా అభినందించాల్సినదే- నా విషయంలో మిమ్మల్ని నిరుత్సాహ పరుస్తున్నందుకు క్షమించాలి - ఎందుకంటే, ఈ పత్రికలన్నా, వాటిలో ఇంటర్వ్యూలన్నా నాకెలాంటి ఇంటరెస్టూ లేదండి....రియల్లీ.

మీరు గొప్ప ఆర్టిస్టు.... మీరలా అనకూడదు. బొంబాయిలో మీరు ప్రోగ్రాం లిస్తున్న రోజుల్లో మీపై వచ్చిన వ్యాసాల్ని నేను చదివాను. బెంగాలీ నాకు రాదుగానీ, కలకత్తాలో కూడా మీ ప్రదర్శనలపై మంచి వ్యాసాలొచ్చాయని విన్నాను. మీలాంటి ఆర్టిస్టులను ఈ ప్రజల దృష్టికి తీసుకురావడం నా బాధ్యతగా తలుస్తాను- కాదంటారా?

థాంక్యూ....థాంక్యూ.... అయితే నా మీద వ్యాసాలు చూశారుగా.... ఇంకా మీకు కావలసింది ఏముంది. దాన్నుండి మీరు ఏదైనా రాసుకోండి. నేనేమీ అనుకోను. అయినా ఓ కాబరే ఆర్టిస్టు మీద వ్యాసం రాయాలంటే ఇంటర్వ్యూయే చేయాల్సిన అవసరం ఏమాత్రం లేదనే అనుకుంటాను.

అలా మీరనుకుంటున్నారా? ఎంతమాట! మా అసిస్టెంటుల నెవ్వరినీ పంపకుండా స్వయంగా నేనే వచ్చానంటే మీతో ఇంటర్వ్యూకి ఎంతటి ప్రాధాన్యతనిస్తున్నామో మేం వేరే చెప్పక్కర్లేదు - మేం తీసుకునే ఇంటర్వ్యూల్లో గానీ ప్రచురించే వ్యాసాల్లో గానీ మా సిన్సియారిటీని మేం ఎన్నడూ కోల్పోము. అది మా ప్రత్యేకతగా భావిస్తాం.

అలాగనే నేనూ అనుకునేదాన్ని.... కాని ఈ పత్రికల్లో వచ్చే వార్తలన్నీ నిజాలు కావనీ, నిజాలన్నీ వార్తల్లోకి రావనీ ఇప్పటి వరకూ నాకు అనుభవ పూర్వకంగానే తెలిసింది.

మీరు నన్నూ, మా పత్రికనూ ముందే శంకించడం భావ్యం కాదు. మీకు అభ్యంతరం లేకుండా, మాకు అభ్యంతరం రాకుండా నిజాన్ని నిప్పులా ప్రతిబింబింప జేస్తాను.

మిస్ నిషా బిగ్గరగా నవ్వేసింది.

నేను కాబరే ఆర్టిస్టుని.... నాకు అభ్యంతరకరమైనవి ఏముంటాయి- అభ్యంతరాలన్నీ మీవి.... అయినా నాకో మాట ఇవ్వాలి, మీకు మీరు ఏం రాసుకున్నా అభ్యంతరం పెట్టను. కాని నాతో ఇంటర్వ్యూ చేశాక మాత్రం నేను చెప్పినవన్నీ ఉన్నదున్నట్టుగానే రాయాలి.... అలా రాస్తానని మాటివ్వాలి.

మీరెందుకలా అనుమానిస్తున్నారు?!

మీ పత్రికలన్నా, మీరు చేసే ఇంటర్వ్యూలన్నా నాకు ఇంటరెస్టు లేదని ముందే మీతో అన్నాను. నిజానికి ఇంటరెస్టు లేకపోవడం కన్నా నమ్మకం లేకపోవడం ముఖ్యకారణం-

స్ఫూర్తిగారు మిస్ నిషా వంక వ్రాన్పడి చూశారు.

మిస్ నిషా వచ్చి స్ఫూర్తిగార్కి ఎదురుగా ఈజీ ఛైర్‌లో విలాసంగా కూచుంది. కేవలం రెండే రెండు బటన్సు తగిలించిన నైట్ సూట్‌లోంచి తెల్లని పలుచని బ్రా, అంతకన్నా సన్నని, చిన్నని అండర్ వేర్ ఆయన కేసి తొంగి చూస్తున్నాయి. అప్పుడు మిస్ నిషాని అలా చుడ్డానికి స్ఫూర్తిగారు ఒళ్ళంతా కళ్ళు చేసుకున్నారు.

అయినా స్ఫూర్తిగారు మంచి స్ఫూర్తి గలవారు- తాను వచ్చిన పనిని ఎన్నటికీ మరవరు.

అంతలో మిస్ నిషా కాఫీ ఆఫర్ చేసింది.

ఆయన ప్రశ్నల్లోకి దిగారు.

ప్రః ఎంతకాలం నుండి మీరీ వృత్తిలో వున్నారు.

జః గత నాల్గయిదేళ్ళ నుండి-

ప్రః ఈ వృత్తంటే మీ కిష్టమేనా?

జః ఇష్టం లేకేమి? అచంచలమైన విశ్వాసం కూడాను.

ప్రః మీరు ఏమాత్రం చదువుకున్నారు?

జః నేనేమీ చదువుకోలేదు.

ప్రః ఇంగ్లీషు ధారాళంగా మాటాడగల్గుతున్నారు కదా...

జః మరో నాలుగు భాషలు కూడా నేనిలాగే మాటాడగలను.

ప్రః మీరీ వృత్తిలో ప్రవేశించకముందు మీరేం కావాలనుకున్నారు?

జః నేనేమీ కావలనుకోలేదు... ఎందుకంటే నేనేమీ చదువుకోలేదు కనుక- చదువుకుని ఉంటే ఏ డాక్టరునో, యాక్టరునో కావాలనుకునే దాన్నేమో మరి.... అలా కలలు కనే అవకాశం నాకు లేకపోయింది.

ప్రః మీరేమీ చదవలేదంటే నమ్మమంటారా? మీ పక్కమీద....

జః ఓహో అదా... చదువుల్ని డిగ్రీలతో కొలిచే రోజుల్లో నేనేమీ చదవలేదన్నది ముమ్మాటికీ నిజం. ఇకదాని సంగతంటారా.... హెరాల్డ్ రాబిన్స్- 'దిలోన్‌లీ లేడీ' నా కిష్టమయిన రచయిత.... నేనతని నవలల్ని ఎక్కువగా చదువుతుంటాను-

ప్రః మీరు కాబరే నృత్యం ఏవయసులో నేర్చుకున్నారు. వృత్తిలో ప్రవేశించక ముందేనా?

జః నేను కాస్త చిన్నవయసులోనే ఈ కాబరే నృత్యాలు నేర్చుకున్నాను. పదిహాళ్ళ నా పదవ ఏటనే నాకీ నృత్యం అలవడి వుండాలి. అప్పటికింకా నేను కాబరే ఆర్టిస్టుని కాలేదు.

ప్రః కాబరే నృత్యం నేర్చుకోవాలన్న కోరిక మీకెలా కలిగింది?

జః ఎవరి ప్రోద్బలమూ లేదనే చెప్పాలి- అయితే ఓ ఆంగ్లో ఇండియన్ ఫామిలీ వల్ల నేనీ కాబరే నేర్చుకున్నాను.

అసలేం జరిగిందంటే-

నేను ఇంట్లో కాస్త మొండి ఘటాన్ని.... మా తల్లి దండ్రుల మాట లెక్క చేసేదాన్ని కాను. అందుకని ఇంట్లో తరచూ అలిగేదాన్ని- అలా అలిగినప్పుడల్లా అక్కడే దగ్గర్లో వున్న ఆ ఆంగ్లోఇండియన్‌ల వాళ్లింటికి వెళ్ళి వాళ్ళ అరుగుమీద చతికిలబడే దానిని, కాబరే నేర్పడం వాళ్ళ వృత్తి. వాళ్ళ జీవనాధారం. నాకూ నేర్వాలనే ఆకాంక్ష కలిగేది కాని నేర్పేదెవ్వరు? ఖర్చుతో కూడిన పని.... కాని నా ఉత్సాహాన్ని చూసి, నా నుండి ఏమీ ఆశించకుండానే నాకు నేర్పి, నన్ను చక్కని ఆర్టిస్టుగా మలిచారు. వాళ్ళు ఎంత సహృదయలంటే, నన్నా కుటుంబంలో ఓ వ్యక్తిగా కలుపుకుని, ఆదరించి, అనురాగం పంచారు. వాళ్ళే లేకుంటే, ఆ అనురాగమే నాకు కరువైయ్యుంటే నేనీ రోజున ఏమయ్యుండేదాన్నో నేనూహించుకోగలను.

ప్రః మీరు కాబరే ఆర్టిస్టు అయినందుకు ఎప్పుడయినా చింతించడం జరిగిందా?

జః నా వృత్తి పట్ల నాకు గౌరవం వుంది- ఎవరికైతే తమ వృత్తిపట్ల గౌరవం ఉండదో వాళ్ళే చింతించడం జరుగుతుంది.

ప్రః మీ వృత్తిపట్ల మీకు గౌవరం కలగడానికి గల కారణమేమిటి?

జః నా నిత్య జీవితాన్ని ఆవిష్కరించే అవకాశంగా నేనీ వృత్తిని భావించి స్వీకరించడమే- అందుకు నేనెప్పుడూ గర్వపడతాను.

ప్రః మీరు కాబరేల్లో నగ్న నృత్యాలు చేస్తారు కదా.... మానసికంగా ఎలా ఫీలౌతారు?

జః ప్రతి క్షణం ఒక ఆకర్షణగా, స్ఫూర్తినిచ్చే సంఘర్షణగా ఫీలౌతాను.

ప్రః 'కళలు' ఏరంగంలోనైనా అభిలాషణీయమే- అయితే 'కాబరే' యొక్క లక్ష్యం సమాజ శ్రేయస్సు యొక్క పరిధిని దాటుతుంది కనుక అది గర్హనీయం అంటారు- దీనికి మీ సమాధాన మేమిటి?

జః 'సమాజ శ్రేయస్సు' అనేది గొప్ప విలువైన మాట.... కళ ఏదీ సమాజ శ్రేయస్సును దాటిపోదు- అయితే నేటిసమాజంలో రోజు రోజుకూ పెరిగిపోతున్న ఈ హత్యలూ, దోపిడీలు, రేప్‌లూ.... వీటి నేపథ్యం మీకు తెలియనిదా-

రిగ్గింగులూ, కులరాజకీయం, ప్రాంతీయ వైషమ్యం, లంచగొండితనం, మ ందులివ్వని ప్రభుత్వ ఆసుపత్రులు, ఫైళ్ళు కదలని ఆఫీసులు, న్యాయం దొరకని కోర్టులు, ప్రేమ దొరకని మత సంస్థలు, రక్షణ లేని లాకప్పులు, రక్తాన్ని పీల్చే బ్యాంకు వ్యవస్థలు, అహంకారులైన అధికారులు, మాటవినని సబార్డనేటులు, ఎవరికీ అందని సబ్సిడీలు, కొందరికే అందే పదవులు, మరికొందరికే అందే సమన్లూ, నోటీసులూ, వారెంట్లూ, జప్తులూ, సస్పెండ్లూ, డిస్‌మిలూ... ఇవన్నీ సమాజ శ్రేయస్సును కోరేవే నంటారా-

కాబరే అనే ఓ నగ్న నృత్యం మీలో కామోద్రేకాన్ని రెచ్చగొట్టవచ్చు- దేశం మ్మీద

జరిగే ప్రతి పది నిమిషాల కొక్క రేప్ యొక్క నేపథ్యంలో వంద అత్యాచారాల్లో కనీసం ఒక్క అత్యాచారానికీ 'కాబరే' అనే నగ్ననృత్యం కారణం కాదన్నది మీరు గ్రహిం చాలి.... మరి ఏవి నేటి అనర్ధాలకి యదార్థమైన కారణం అన్నది ఈ సమాజ శ్రేయస్సును గురించి ఆలోచించే వాళ్ళకి పైవేవీ స్ఫురించవు-

ప్రః స్త్రీలు తల్లులైనా, శ్రామికులైనా, కష్టపడి పనిచేసే గృహిణులైనా, తమకంటూ ఒక ప్రతిపత్తిని సాధించవలసి వుండగా, కొంతమంది కాబరే నృత్యాలు చేస్తూ డబ్బుకు అమ్ముడు పోయి, నగ్నంగా, శృంగార సంకేతాలుగా మారి స్త్రీత్వానికి చెడ్డపేరు తెస్తున్నారని కొందరి వాదన- మీరేమంటారు?

జః ప్రతి స్త్రీ తన భర్తముందు నగ్నంగా, శృంగార సంకేతంగా మారిన నాడే కదా తల్లి అవుతుంది.... అలా కానినాడు సమాజ శ్రేయస్సే భంగపడుతుంది.

ప్రః మీరు శారీరక సంబంధాల్లో పురుషుల పట్ల బలహీనతను ఏమాత్రం చూపరనీ, ఈ నగ్న నృత్యాలు కేవలం వాటివరకే పరిమితమనీ నమ్మమంటారా?

జః నా శరీరానికి రహస్యాలు లేనట్టే, నా హృదయానికీ రహస్యాల్లేవు నాకు నచ్చిన వాళ్ళూ డబ్బున్న వాళ్ళూ, డబ్బుతో నన్నుకొనగల తాహతున్న వాళ్ళూ వస్తే నేనెన్నడూ కాదనలేదు. సెక్సు మీ ఆడవాళ్ళకు ఎంత అవసరమో నాకూ అంతే అవసరమని మీరెందుకు గ్రహించరు.

ప్రః నైతిక విలువలను బట్టి మీరు చేసేది 'వ్యభిచారం' అని మనసు సంకోచించదా?

జః ఈ విషయాన్ని హేతు బద్ధంగా ఆలోచించాలి- అంతేగాని, అనాదిగా సనాతన సంఘం వల్లెవేస్తున్న 'శీలం' 'పాతివ్రత్యం'.... అంటూ ఆ పడికట్టు పదాలను పట్టుకుని వేలాడకూడదు. స్త్రీ సర్వస్వం ఆమె భౌతికపరమైన శీలమేనని మీరెందుకింతగా అభి ప్రాయపడతారు? స్త్రీ పురుష సంబంధాలు అక్రమమనీ, సక్రమ మనీ నిర్ణయించే అధికారం వ్యక్తికిగాని, సంఘానికి గాని లేదని మనం ముఖ్యంగా తెలుసకోవాలి- 'శీలం పట్ల, పాతివ్రత్యం పట్ల, స్త్రీకుండవలసిన లక్షణాలు పట్ల మనకున్న అభిప్రాయాలన్నీ అర్థం లేనివిగా గుర్తించినప్పుడు మాత్రమే ఈ సంఘం మారడానికి అవకాశం వుంది.

ప్రః అయితే, భర్తకీ, విటుడికీ, తేడా లేదంటారా?

జః కాస్త విజ్ఞతతో చూస్తే ఈ రెంటిలోనూ ఒకే వ్యాపార సరళి కనిపిస్తుందని మీకే తెలుస్తుంది. మగాడు ఆడదాన్ని కొనుక్కుంటే అతడు విటుడు-

ఆడది మగాడినికొనుక్కుంటే అతడు మొగుడు-

ఒకటి జీవితాంతం గుత్త బేరం, మరొకటి ఏనాటికానాడు చిల్లర బేరం-

రెంటిలోనూ డబ్బూ, వ్యవహారం ఇవేకదా కనిపించేవి-

ప్రః కుటుంబ వ్యవస్థపై మీ అభిప్రాయాం ఏమిటి?

జః ఒకరితో జీవితం పంచుకోవడంలోని మధురిమను, కుటుంబంలోని ఆప్యా యతను స్త్రీ ఎప్పుడూ కాంక్షిస్తుంది. కుటుంబ వ్యవస్థను నేను గౌరవిస్తాను.

ప్రః మీరు వివాహం చేసుకుంటారా?

జః చేసుకోను, ఓ కాబరే ఆర్టిస్టుని పెళ్ళాడి కాపురం చేయడం అంత సులభమయ్యింది కాదు. ఆమె స్వేచ్ఛకు భంగం కలుగకుండా, వృత్తికీ, ప్రవృత్తికీ అడ్డురాకుండా వాటిని గౌరవిస్తూ పురుషుడు మనలేడు.

ప్రః మీ భావాలను గౌరవించి, మిమ్మల్ని అభిమానించి, ఓ కళాకారిణిగా మిమ్మల్ని ప్రోత్సహించి స్త్రీగా మిమ్మల్ని ప్రేమించి, మీ స్వేచ్ఛకు అడ్డురాక, మీ కార్యకలాపాలకు త్రికరణ శుద్ధిగా చేయూతనిచ్చే సహృదయుడు మీ జీవితంలో ఎప్పుడయినా ఎదురైతే మీరు పెళ్ళి చేసుకుంటారేమో-

జః నేను ఉటోపియాలో జీవించే వ్యక్తిని కాను... మీరు ఉపయోగించే పెద్దపెద్ద పదాలున్నాయే- అవి పట్టి మోసపూరితమైనవి- ఎ ట్రాష్.

ప్రః పోనీ మీ పెద్దలు మీకోసం ఓ సాంప్రదాయ వివాహం నిర్ణయిస్తే చేసుకుంటారా?

జః చేసుకోను... ఎందువలనంటే, 'సాంఘిక న్యాయం' జరగదు గనుక- ఎలా అని మీరు ప్రశ్నించవచ్చు- స్వాతంత్ర్యం సిద్ధించాక, స్వతంత్రులయ్యింది ఈ దేశంలో ఏ పాటి మంది? ఈ నాటికీ పాకీ పనిని ఓ కుల వృత్తిగా ఈ సంఘం కొందరి నెత్తిని రుద్దితే, మరోగత్యంతరం లేక దానినే వృత్తిగా ఆశ్రయించి, పదిలక్షల మంది వరకూ బ్రతుకుతున్నారంటే ఈ స్వతంత్రం దేశంలో సాంఘిక న్యాయం ఏపాటిది? గాంధీజీ ఓ చీపురకట్టా, ఓ రేకు బకెట్టూ తీసుకుని, తన దొడ్డి తాను తుడుచుకుని, ఇది అగౌరవమైన పని ఏమీకాదని చాటినంత మాత్రాన ఈ వృత్తికి కొత్త గౌరవం వచ్చి చేకూరిందా?-

మనిషిగా పుట్టి, ఆ పని ఎవరు చేసినా అది మానవ జాతికే అవమానకరం అని బాబాసాహెబ్ అంబేద్కర్ ఆనాడే గాంధీజీని ఎదుర్కొంటే.... మనిషి అనేవాడు ఈ సభ్య ప్రపంచంలో దానిని ఎవ్వడూ వృత్తిగా స్వీకరించకూడదని ఖండిస్తే.... నేటికీ పదిలక్షల మంది నెత్తిన ఎత్తుకుని తట్టమోస్తున్నారు. ఈ నా స్వాతంత్ర్య భారతానికి, నాగరిక ప్రపంచానికి ఇది అవమానకరం కాదు-

ఇది నేనెందుకు చెప్తున్నానంటే-

నేనేగాని పెళ్ళి చేసుకోవాలసి వస్తే- నా కులం వాళ్ళల్లో ఎవరినో ఒకరిని చేసుకోవాలి.... అలా చేసుకుంటే అతడితో పాటు నేనూ ఓ చీపురూ ఓ బకెట్టుతో ఇంటింటికీ బయలు దేరాలి.... అప్పుడు నన్ను గుమ్మం ముందు చూసి వీలైనంత దూరం జరిగి నేను తిరిగి వెళ్ళాక నీళ్ళు జల్లుకుంటారు.

కాని ఇప్పుడో....

ఇప్పుడు నేను కాబరే ఆర్టిస్టుని.

పత్రికల్లో చూసి, స్టేజి మీద చూసీ నా పరిచయం కోసం అంగలార్చేవారు నాకు చాలామంది వున్నారు.

వాళ్ళంతా పెద్దమనుషులు-

వాళ్ళు పెద్ద మనుషులు అవునో, కాదో ఖచ్చితంగా నేను చెప్పలేను కాని, డబ్బున్న

వాళ్ళు, దర్జావున్న వాళ్ళు, పేరు ప్రతిష్టలున్నవాళ్ళు, పదవులూ, పలుకుబడులూ వున్న వాళ్ళు.... ఈ సమాజంలో ఏ పనైనా చేసి సమర్ధించుకోగల సత్తా వున్నవాళ్ళు-

అందుకని నన్ను వందల్లో వేలల్లో కొనగల్గుతారు-

లక్షలు చెల్లిస్తేగాని ఒక ఆడదానికిమొగుడుగా దొరకని వాడు, నాకు ఎదురు చెల్లించి, సుఖాన్నిచ్చి పోతున్నాడంటే నేను గర్వించాలా? సిగ్గుపడాలా? వారం రోజులు తిండిలేనివాడు కూటికి ఎగబడినట్టు. ఎప్పుడూ పాయసం ఎరగని వాడు పాయసం తిన్నట్టు, ఆబగా ఓ పరాయి ఆడదాని మీదకు ఎగబడే వీళ్ళు, నన్ను తాకడమే ఓ అదృష్టంగా, ఓ పులకింతగా నా అంగాంగాన్నీ కౌగలించుకుని నా పాదాలను ముద్దిడుకుని, పాదా క్రాంతులైనప్పుడు నేను విజయ గర్వంతో ఉప్పొంగి పోతాను-

ఎందుకంటే....

కులరీత్యా, కుల వృత్తి రీత్యా ఎవరి నీడను సైతం చూసి పక్కకు ఆమడ దూరం తొలగిపోతారో ఆనా శరీరాన్ని తాకడం కోసం, దాన్ని అణువణువూ అనుభవించడం కోసం అంగలార్చుతూ మహాభాగ్యంగా తలపోస్తున్నారు-

అందుకే సామాన్య స్త్రీగా నేను సాధించ లేనిది ఓ కాబరే ఆర్టిస్టుగా సాధించ గలిగాను. నావృత్తంటే అందుకే నేనింతగా గర్వపడతాను.

ప్రః స్త్రీత్వంలోని పరిపూర్ణత మాతృత్వం లోనే సిద్దిస్తుందంటారు- మీ అభిప్రాయం?

జః ముమ్మాటికీ అది నిజం. తాను కన్న బిడ్డను ఒడిలో పెట్టుకుని ఆనందంతో పునీతలు కావాలని ఏ స్త్రీ కోరుకోదు?

ప్రః మరి మీరు మాతృత్వాన్ని కోరుకుంటారా?

జః కోరు కోను-

ప్రః ఎందువలన?

జః నాకు పుట్టిన బిడ్డ ఫలానా కులం అని పిలవబడడం నాకిష్టం లేదు. అలా పిలిపించి వాడి జీవితానికి ద్రోహం చేయలేను. ఇప్పటికే వున్న ఇన్ని లక్షల మందికి మరొకడిని చేర్చలేను.

ప్రః మీ నిర్ణయం మీవరకు సమర్ధనీయమే కావచ్చును. కాని మిగతావారి సంగ తేమిటి? వారికి మీరిచ్చే సందేశం ఏమిటి?

జః మిగతా వారికి నేనిచ్చే సందేశం కూడా ఇదే.... నా ఈ కులంలో ఏ ఆడదీ వివాహాన్ని చేసుకుని మరో బిడ్డకు జన్మనీయకూడదు. ఇచ్చి ఇప్పటికే ఈ వృత్తిలోవున్న వారికి మరొకణ్ణి చేర్చకూడదు. ఈ జాతికి విముక్తి కావాలంటే అవమానకరమైన ఈ వృత్తి ఈ తరంతోనే అంతరించి పోవాలంటే ఈ కులం యొక్క మనుగడనే సమూలంగా ఈ పృథ్వినించి తుంచి వేయాలి....

అందుకని ఈ భూమ్మీద మరో బిడ్డకు తావీయనని నా జాతి ప్రతీస్త్రీ ప్రతిన బూనాలి... దానికి నేనే ప్రతీకను-

ప్ర: జరుగుతున్న అన్యాయం పట్ల మీరు అధికంగా స్పందించారేమోనని అనిపిస్తోంది. దానికి మీరేమంటారు?

జ: అలాంటిదేమీ కాదు-

ఈ వ్యవస్థ యొక్క కుట్రను ఈ నాగరిక సమాజం చూస్తూ మౌనం వహిస్తోంది. నలభై యేళ్ళుగా ఏలుతున్న ఈ ప్రజాస్వామ్య ప్రభుత్వాలు ఏరకంగానూ దీనిని రూపు మాపక పోగా, చూస్తూ ఉదాసీనంగా వుంటున్నాయి.

మౌనం వహించడమంటే మార్పు ఇష్టం లేదనే కదా-

అందుకే నేనీ పరిష్కార మార్గాన్ని నా జాతి ముందుంచుతున్నాను.

ప్ర: ఒక ఉత్తమ కళాకారిణిగా, కేబరే ఆర్టిస్టుగా, నేటి యువతకు మీరిచ్చే సందేశం ఏమిటి?

జ: సమాజ శ్రేయస్సుకు నిర్ణయించినప్పుడు ఏ కళయినా తప్పు లేదనంటాను. కాని వాటి లక్ష్యం సమాజ శ్రేయస్సును దాటిన నాడు అవి తప్పని సరిగా గర్హనీయం అంటాను.

అలా ఆనాడు తాను చేసిన ఇంటర్వ్యూ తనకళ్ళముందు కదలాడుతూ వుంటే, ఆ టేబుల్ మీద స్ఫూర్తిగారు పరధ్యానంగా వుండిపోయారు. అప్పుడు ఆయన చేతిమీద ఓ సుకుమారమైన కరస్పర్శ కదలాడగా చటుక్కున ఇహలోకానికి వచ్చారు.

ఆ చేయి రోజీది. ఆమె మరింత సున్నితంగా ఆయన చేతిని నొక్కింది. రావుగారు కిసుక్కున నవ్వి... మటన్ ఛాప్స్ కూడా వచ్చాయి, మరో పెగ్ ఆర్డరివ్వండి స్ఫూర్తి గారూ.... అన్నారు.

ఆయన చిన్నగా నవ్వి, మరో సిప్ చేసి, 'అలాగే' అన్నారు.

స్టీవార్డు ఓ పెగ్ స్ఫూర్తిగారి ముందుంచి వెళ్ళిపోయాడు.

కాబరే చివరి రౌండ్ స్టార్టు కాబోతుందని అనౌన్సర్ డిక్లేర్ చేశాడు. అతని మాట ఈసారి మరింత బోల్డుగా వస్తోంది.

లైట్లు డిమ్మయ్యాయి-

సెక్సీ.... సెక్సీ.... సెక్సీ. డామ్‌సెల్ - మిస్ నిషా!!

ఒక్కసారి డ్రమ్ములు మోగాయి. బాంగోలు, గిటార్‌లు, అకార్డిన్‌లు.. అన్నీ కలసి మైకుల్ని అదరకొట్టేస్తుండగా 'నిషా' ఒక్కసారిగా స్టేజి మీదకు వచ్చి మెరుపులా మెరిసింది.

జాజ్ మ్యూజిక్ హాలంతా నిండిపోయింది. లయబద్ధమైన శబ్దం హాల్లోని జనం గుండెల్నిండా నిండి నాడుల్ని బిగబెట్టేసింది.

అందరికళ్ళూ ఆమెపైనే -

స్ఫూర్తిగారి కళ్ళూ, రావుగారి కళ్ళూ ఆమెపైనే-

ధగధగ మెరిసే ఖరీదైన కాస్ట్యూమ్‌లో నిండైన విగ్రహం-

హాలు మరింత చీకటయ్యింది... ఆమెపై ఫోకసౌతున్న లైటు మరింత కాంతిని పుంజుకుంది.

ఆమె విలాసంగా స్టేజి నలుమూలలకీ నడిచింది.. ఆడియన్స్ అందరినీ ఆమె పరికించి చూసింది. ఆడియన్సు అందరూ ఆమెను పరవశించి పలవరించి చూశారు.

సన్నని పొడవైన మెడ-

కళ్ళూ, ముక్కూ, పెదవులూ తీర్చి వున్నాయి.

మిగిలిన దంతా తాను వేసుకున్న కొత్తరకం కాస్ట్యూమ్‌లో దాగడిపోయింది-

కాని 'నిషా' తనదైన దేదీ తాను దాచుకోదు. దేనికీ తాను సిగ్గుపడదు. తనపై వున్న ఒక్కొక్కటీ వలిచేసి, జనం కళ్ళకి అందించేస్తుంది. తృటిలో రంగులు మార్చుకుని, హంగులు కూర్చుకుని, హడావుడిని సృష్టిస్తుంది.

అప్పుడు... యవ్వనం అందాలు ఆమెపై మెరుపు దాడులు చేస్తాయి. దిగంబరియై ఆమె మెరుపు తీగలా నాట్యం చేస్తుంది. కెంపులు దేరిన ఆమె దేహంమ్మీది స్వేద బిందువులు ముత్యాల్లా మెరుస్తాయి. ఆమె కుచద్వయం ఆహ్లాదంగా ఉరకలు వేస్తుంటే, కటిస్థానం కదలిక కలవరింతలు గొలుపుతాయి.

ఆనందంతో ఆమె నాట్యం చేస్తూ అందాన్ని అందరికీ అందిస్తుంది.

ఆ క్షణంలో అందరికీ తాము ఎక్కడున్నామా అన్న ప్రశ్నజనిస్తుంది- అత్యంత విలాసవంతమైనదిగా జీవితం ఒక్కసారిగా సాక్షాత్కరిస్తుంది.

అదో ప్రపంచంగా, అతిలోక వాతావరణంలో వాళ్ళను ఉక్కిరి బిక్కిరి చేయడమే లక్ష్యంగా ఆక్షణాలు గడిచిపోతుంటాయి.

ఆమె నృత్యం చేస్తున్నంత సేపూ కనురెప్పలు స్తంభించిపోతాయి. కనుపాపలు వాటి పరదాలు పక్కకు నెట్టేసి, ఆరు బయలు బహిరంగంగా విహరించసాగుతాయి.

ఆమె అలా నగ్నంగా నాట్యం చేస్తూ, గిరగిరా తిరిగి భూమ్యాకాశాలు ఏకమయ్యే పర్యంతం పరిభ్రమిస్తూ, తన నగ్నత్వాన్ని చీకటి చీరతో చుట్టేసుకుంటూ వుంటే వాళ్ళంతా ఆ క్షణంలో మంత్రముగ్ధులైపోతారు.

ఆమె రెప్పపాటులో ఆ చీకట్లో అంతర్ధానమౌతుంది.

అదే క్షణంలో-

పిడుగుల వర్షం లాంటి చప్పుడు మటుమాయమౌతుంది.

మాయ విడిన ఆకాశంలో అర్ధరాత్రి పన్నెండు కొడుతుంది.

కైపెక్కిన కళ్లకు కదలిక వస్తుంది.

జనం కిందికి దిగుతారు.

అందరికీ తెల్లవారు తెల్లారగనే తెల్లారుతుంది.

కాని మిస్ నిషాకి మాత్రం రోజూలానే తన గదిలో పగలు పన్నెండు గంటలకు మాత్రమే తెల్లారుతుంది.

ఆమె బెడ్ కాఫీతాగి, కాస్త బడలికగా ఒత్తిగిలింది.

పక్కలో రాత్రి తాను తెచ్చిన, స్ఫూర్తి రిచ్చిన పత్రిక నలిగిపోయిన జవరాలిలా

కనిపించింది. అత్యాచారానికి గురై దిగులుతో ముడుచుకు పోయిన ఆడదానిలా అది ముడతలు పడి ముడుచుకుపోయి వుంది.

ఆమె దాన్ని అందుకుని, ఆదుర్దాగా సెంటర్ స్ప్రెడ్ కోసం తిరగేసింది.

అందమైన తన ఫొటో - పేజి నిండా బ్లోఅప్ చేసిన ఫొటో-

ఆ పక్కనే తనతో ఇంటర్వ్యూ వుంది.

ఆమె గుండె ఉద్వేగంతో కొట్టుకోసాగింది.

ఉత్సాహంగా ఆమె ఆ అక్షరాల్లోకి వెళ్ళింది. కాని... కాని... ఎక్కడో, ఏదో అపనమ్మకం వెంటాడుతోంది.

కాని మూర్తిగారు మాటిచ్చారు.

ఆమె ఆ అక్షరాల్లోకి వెళ్ళక తప్పదు.

అది మరీ పెద్దవ్యాసం; తనకు మరీ ఆత్రుత -

ఇంట్రోలోని ముఖ్యాంశాలన్నీ బాక్సులు కట్టి వ్యాసంలో అవసరమైన చోటల్లా వుంచారు. ప్రతి బాక్సూ ఒక్కొక్క రంగు నేపథ్యంలో పెద్ద అక్షరాల్తో కనిపించాయి. ఆత్రుతతో ఆమె మొదటి విడతగా వాటిని చదువుకు పోయింది.

**నిషా అంటే యవ్వనానికి కుషీ -**

**అందాల హరివిల్లు; ఆనంద హేల**

మిస్ నిషా ఆనందంగా మిగతవాటిలోకి చూసింది.

**కళ కళ కోసమేనని కాబరే నేర్చుకుంది.**

**జీవన పరిస్థితులకు తలొగ్గి కాబరే నృత్యం చేస్తోంది.**

ఆమె మరో దానిలోకి చూసింది.

**కాబరే ఆర్టిస్టయినందుకు నిషా ఏనాడూ చింతించలేదు.**

**ప్రతి క్షణం ఓ ఆకర్షణగా,**

**నిత్య జీవితాన్ని ఆవిష్కరించే తరుణంగా దీన్ని భావిస్తోంది -**

ఆమె ఓ క్షణం ఆగింది. తాను ఏ అంశాలనయితే ముఖ్యంగా ఆ అక్షరాల్లో చూడాలనుకుందో, ఆ అంశాలకోసం, ఆ అక్షరాల కోసం ఆమె కళ్ళు గాలిస్తున్నాయి. అందుకోసం తిరిగి మరో దానిలోకి చూసింది. నీలిరంగు నేపథ్యంలోని తెల్లని అక్షరాలవి -

**ఆమె ఏ అందాన్నీ పురుషుడి నుండి దాచుకోదు.**

**ఆమె ఏ అందాన్నీ పురుషుడి కౌగిటకు అందివ్వదు.**

ఆమె తొట్రుపాటుతో దాన్నే మరోసారి చదివింది. ఆ తర్వాత పసుపు పచ్చని నేపథ్యం మీద ఆకుపచ్చని అక్షరాలున్న బాక్సులోకి చూసింది.

ఆమె మిగత భారత స్త్రీలలానే వివాహం పయినా,
కుటుంబ వ్యవస్థపయినా అచంచల విశ్వాసం చూపుతోంది.
వృత్తికీ ప్రవృత్తికీ అడ్డురాని వ్యక్తీ–
స్వేచ్ఛా స్వాతంత్ర్యలకు విలువ విచ్చే వ్యక్తీ–
జీవితంలో ఎదురైతే తప్పకా వివాహం చేసుకుంటుంది.

మిస్ నిషా కలవరపడుతూ మరో బాక్సులోని అక్షరాలకేసి చూసింది.

స్త్రీత్వంలోని పరిపూర్ణత మాతృత్వంలోనే సిద్ధిస్తుందని ఆమె విశ్వాసం
ఓ బిడ్డకు తల్లికావాలని ఆమె ఆకాంక్షిస్తోంది–

మిస్ నిషా చదవడం మాని, భంగపాటుతో ఆ వ్యాసాన్ని పై నుండి కింది వరకూ తరచి, తరచి చూసింది. తాను చదవాల్సిన పూర్తి వ్యాసం ఇంకా మిగిలిపోయేవుంది. తానిక ఏమీ చదవలేకపోయింది.... తానిక చదవాల్సినంత అవసరం కూడా ఏమీ లేదనిపించింది. హిపోక్రైట్‌గా తాను మిగిలిపోయానేమో అనుకుంది.

అయినా బాధ లేదు గాని– సమాజం ఏనాటికీ ఇలాగే వుండాలని ఎందుకీ ఆరాటం– 'మార్పు' అంటే ఈ మనుషుల కెందుకింత భయం– అనుకుంది.

వాస్తవాలన్నీ వార్తలు కావనీ, వార్తలన్నీ వాస్తవాలు కావనీ మరోసారి తన పట్ల రుజువయ్యింది.... చేతిలోని వ్యాసం కేసి అసహనంగా చూసి, పత్రికను పక్కకు విసిరేసి, బాత్‌రూమ్ కేసి నడిచింది.

ఆమె అద్దం ముందు కూచుని, జుట్టును సవరించుకొంటుండగా, బాయ్ వచ్చి ఏవో విజిటింగ్ కార్డులు ముందుంచి వెళ్ళాడు.

ఎవరో పత్రిక వాళ్ళు...
ఎవరో కంపెనీ అడ్వర్టయిజుమెంటు వాళ్ళు...
తానొక ఆర్టిస్టు.... వాళ్ళంతా వ్యాపారులు –
సంఘం వాళ్ళ దృష్టికి.... వ్యక్తి తన దృష్టికి–
తనకూ వాళ్ళకూ ఒకే ఎండ్స్.... గడింపు.
తనకూ వాళ్ళకూ ఒకే మీన్స్....... "ఉష్‌ష్‌... అది పైకి అనొద్దు –"

ఆమె వయ్యారంగా నిలుచుని, తన నైట్‌సూట్‌కి ఈసారి మరో బటన్ ఎక్కువ విప్పేసి, సోఫాలో హేలా విలాసంగా కూచుని అంది–

'కమ్ ఇన్ –'

రాజమండ్రి
*18.9.1990*

---

లోకం చూశాక

# ప్రశ్న

ఈ కథలో వ్యక్తులు కనిపించరు. వస్తువులు మాత్రమే కనిపిస్తాయి. వాటి కదలికలు కనిపిస్తాయి. ఆ కదలికల్ని బట్టి పాత్రల్ని, కథని ఊహించుకోవాలి-

దేశం స్వరాజ్యం కోసం పోరాడుతోంది.
ఫ్రేంలో ఖాళీ ఖద్దరు చొక్కా దర్జాగా నిలుచుంది.
దేశానికి సొరాజ్యం వొచ్చింది.
ఒకప్పటి పదెకరాల మాగాణీ ఇప్పుడు పురుగు వూదేసిన గింజ-
పక్కిళ్ళన్నీ పచ్చగా వున్నాయి.

✿ ✿ ✿

ఆ ఇంట్లో అందమైన ప్లాస్టిక్ బొమ్మ.... అది వారం క్రితం బజారులోని షోకేసు నుంచి ఇంటికొచ్చింది. అది ఇంట్లో రోజంతా గదులన్నీ తిరుగుతుంది. ఇనుప బీరువా కిందికి వెళ్తుంది. బూజులంటించుకుంటుంది. మంచం కిందికి వెళ్తుంది; ఏ మూలనో దాకుంటుంది. దాని చీరా, జాకెటూకాసేపుంటుంది; కాసేపుండదు.

ఆ రోజు ఉదయం ఆ బొమ్మ కాసేపు గాల్లో తిరిగింది; కాసేపు జేబులో ఇమిడింది. నేలమీదకు విసురుగా పడింది. మళ్ళీ గాల్లోకి వచ్చింది. అటూ ఇటూ గుంజాటన జరిగింది.

ఒక ఫ్రాకు జేబు నుండి మరో ఫ్రాకు జేబుకు... మళ్ళీ నేలమీదకు - విసురుగా....

పగల్లేదు గాని, పగిలినంత పనీ అయ్యింది.

హాల్లోంచి గుమ్మం వరకూ వెళ్ళింది - తిరిగి వెనక్కి వచ్చింది.

చివరకు గుమ్మం దాటింది..... పక్కింటికి వెళ్ళింది.

✿ ✿ ✿

ప్రపంచం చీకటి నీడలో దాక్కుంది. నిశ్శబ్దాన్ని కౌగిట్లోకి లాక్కుంది.

మేల్కొని నిరీక్షణతో చూస్తున్న గడియారం గుండె దిగులుగా కొట్లాడుతోంది..

మంచం మీద మరో రెండు చిన్ని ప్రతిబింబాలు... చిన్ని శ్వాసలు. నిన్నటి వరకూ ఆ ప్లాస్టిక్ బొమ్మ ఆ ఊపిరుల్లో ఊపిరి... ఆ మంచాన్ని అదీ ఆక్రమించేది. ఇప్పుడు పక్కింటికి వెళ్ళిపోయింది. ఉయ్యాల్లో పడుకుంది.

హాల్లో బెడ్ లైట్ ఏ ఆలోచనా లేక శూన్యంగా వుంది.

చీకటి వెల్తుర్ని మింగేసి మగత నిద్దర్లోకి జారుకుంది.

ఇక తెల్లవారే లోగా ఏ క్షణాన్నయినా గుమ్మం తెరుచుకోవచ్చును- సారాయి కంపుకు అలవాటైన కాలం మళ్ళీ పునరావృతం కావచ్చును-

కాలం గొప్పది. దాని సహనమే సహనం...

ఏనాడూ ఈ సృష్టి మీద ఏవగింపుతో ఆగిపోలేదు..... దాని పని అది రోజూ రొటీన్ లో చేసుకుపోవడానికి అది ఏనాడూ మొనోటనీ ఫీలవ్వలేదు.

అందుకే కాలం గొప్పది.

విశాలమైన ఇంటిలో బెడ్ లైట్ కళ్ళు బాగా ఎర్రబడ్డాయి.

అన్ని గదుల్లోనూ విషాదాన్ని వెదజల్లుతున్నాయి.

వంటగదిలో ఏదో అలికిడి.

ఉండుండి మళ్ళీ అలికిడి..... ఏదో తచ్చాడుతున్న అలికిడి.

ఏమయ్యింటుంది?

హాలుకీ, వంటగదికీ మధ్య గుమ్మానికి వేలాడిన కర్టెన్ పక్కకు తొలగి గాజులు గలగలమన్నాయి. కింద గడపకు తగిలిన మెట్టెలు టిక్, టిక్ మన్నాయి. కర్టెన్ గుమ్మాన్ని మళ్ళీ మూసేసి హుందాగా ఊగిసలాడింది.

ఎదురుగా డైనింగ్ టేబుల్ మీద సన్నగా పడుతున్న వెల్తురు....

ఆ వెల్తురులో.....

వెలుగు చీకటైపోయింది-

---

ఆకాశ [illegible] తిరిగిపోయింది-

భూమి [illegible]క జారిపోయింది-

అప్పుడు...

పళ్ళెంలో అన్నం చిందరవందరగా కదుల్తోంది. హడావుడిగా ఓ ముద్ద పైకి లేచి సగంలోనే ఆగిపోయింది. ప్లేటులోకి కూర వొంపుతున్న గరిటె త్రుటిలో జారి పళ్ళెంలో పడిపోయింది. మరుక్షణం ఆ అన్నం ముద్దా రాలిపోయింది-

ఆ క్షణం కేవలం నడుస్తున్న టీవీ తెరమీద స్థంబించిపోయిన బొమ్మలా....

ఆ డైనింగ్ టేబుల్ వద్ద ఓ కుర్చీలోంచి లేచి నిలిచిన, చినుగుపాతల మురికి చొక్కా.... దాన్ని అంటిపెట్టుకున్న లాగూ... డొక్కాచ్చేలా వున్నాయి-

అప్పుడు మధ్య అంతా అనూహ్యమైన శూన్యం- అగోచరమైన అగాధం-

ప్రార్థన...

ఆ గదిలో క్షణాలు ఆగిన నిశ్శబ్దం-

ఆ గదిలో కాలం నిలిచిన నిశ్శబ్దం-

ఎక్కడా చైతన్యం లేని చీకటైన నిశ్శబ్దం-

కాని ఎదురుగా ప్రార్థన...

మూగగా... దీనంగా... వేడికోలు; దిక్కుమాలిన వేడికోలు...

కిటికీలు మూసే వున్నాయి.

తలుపు గడియలు బిగిసే వున్నాయి.

ఈ పొరపాటెలా జరిగింది-!?

ఎదురుగా మెలికెలు తిరిగిన ఆకలి చేస్తున్న ప్రార్థన... వేడికోలు.

ఎక్కడి నుంచో మళ్ళీ చైతన్యం....

బెడ్ లైటులోకి ఎర్రని రక్తం జీర మళ్ళీ ప్రవహించింది.

గడియారం గుండె కొట్టాడడం మళ్ళీ వినిపిస్తోంది.

మళ్ళీ చైతన్యంలోకి వచ్చిన టీవీ తెరమీద బొమ్మలా....

పళ్ళెంలోని అన్నం ముద్దలై పైకి లేచి మరుక్షణంలోనే ఆత్రుతగా అంతర్ధానమై పోతోంది.... క్షణం, తర్వాత క్షణం.... మరో క్షణం... మరో క్షణం-

పళ్ళెం ఖాళీ అయ్యింది.

అవతలి వేపు తలుపు క్షణంలో తెరుచుకుంది. మరుక్షణంలో మూసుకుంది.

ఎంతపని జరిగిపోయింది!?

గొప్ప రిలీఫ్..... క్షణం క్రితం వరకూ గొప్ప టెన్షన్....

...... ఇప్పుడు మళ్ళీ తప్పదు మరి-

గాస్ స్టౌవ్ వెలిగింది - తపేలాలో నీళ్ళు మరుగుతున్నాయి.

కోడిగుడ్డు పగిలి పెనంలో పడి ఆమ్లెట్ అయ్యింది; ఫ్రిజ్‌లోని చికెన్ మళ్ళీ నూనెలో వేగుతోంది.

ఎసర్లోని బియ్యం కళపెళా కదుల్తున్నాయి.

గుండ్రని కేసులో భద్రంగా వున్న ఆటోమటిక్ కాలిక్లేటర్ పచ్చలైటు ఆన్ అయ్యే వుంటుంది.

ఫ్రేంలో ఖాళీ ఖద్దరు చొక్కా....

పక్కింటి ఉయ్యాల్లో ఇక్కడి ప్లాస్టిక్ బొమ్మ.....

దిక్కుమాలిన ప్రార్థన; వేడికోలు-

ఇంకా... ఇంకా...

ఎన్నో.... ఎన్నో....

బటన్ ప్రెస్ అయ్యింది-

దాని రిజల్ట్సు.... పురుగు ఊదేసిన గింజ-

అర్ధరాత్రి ఎప్పుడో దాటిపోయింది కనుక గాలి సారాయి కంపునూ, కిళ్ళీ సువాసనల్నీ ఏ క్షణాన్నయినా ఆ గదిలోకి మోసుకొస్తుంది.

కాలానికి తెలుసు.... క్షమ ఎలాంటిదో-

అది ఏనాడూ దాని విధి నిర్వహణలో వెనక్కిపోలేదు.

లోకానికి స్వాతంత్రం వొచ్చింది.

పక్కిళ్ళన్నీ పచ్చగా వున్నాయి.

అసలు ఈ లోకంలో ఏది కరెక్టు? ఎవరిది కరెక్టు??

హైదరాబాద్
*29.3.87*

# కల

**జీవితం** కలలా సాగి పచ్చి అబద్ధంలా ముగుస్తుంది.

జీవన్ ప్రయాణం చేస్తున్నాడు.

రైలు తాను ఎక్కడ ఎక్కాడు- తాను ఎక్కడ దిగాడు?

జీవన్‌కు దిగులేసింది. మింగుడుపడని బాధేదో అతని గొంతులో ఇరుక్కుపోయింది.

అతని దిగులుకు కారణం, తాను ఏ ఊళ్ళో అయితే రైలు ఎక్కాడో, అదే ఊళ్లో తాను రైలు దిగాడట. రాత్రంతా ప్రయాణం చేసి ఎక్కిన చోటే తానెలా దిగుతాడు?

అసలిలా జరగడానికి ఏ ఆస్కారమూ లేదు. ఇది ప్రపంచం మీద ముమ్మాటికీ సాధ్యమయ్యే పని కాదు. అందుకే అతని కడుపు చెరువై పోయింది.

అతనిప్పుడు ఆ మహానగరం గుండెల్లో ఓ రైల్వేస్టేషన్‌లో పదో నంబరు ప్లాట్ ఫామ్ మీద దిగులుగా కూచుని వున్నాడు.

ఇంకా రాత్రి కొంత మిగిలి వుంది.

కళ్లల్లో యింకా కలలకి మరికొంత సమయముంది.

ఆ కలల్లో... మళ్లీ జీవితం-

ఆమె వచ్చింది.

కాని ఆమె వచ్చినప్పుడు సొంతదయిన తన చిన్న ఊళ్లో.... తన చిన్న ఇంట్లో... తన చిన్న గదిలో మంచం మీద పరిచిన తెల్లని పరుపుమీద నైట్‌డ్రస్‌లో పడుకుని వున్నాడు. ఆమె ఎప్పటిలా వస్తుందని తెలుసు-

ఆమె వచ్చింది. తన ముగ్గురు పిల్లల్నీ జోకొట్టి నిద్రపుచ్చి వచ్చింది. అందంగా వుతికిన నేత చీరకట్టుకుంది. తలంటుకున్న కురులను సవరించుకుని, మల్లెపూలు తురుముకుని, అందంగా తయారై పిల్లిలా నడచివచ్చి తలుపు చప్పుడు కాకుండా నెట్టి నెమ్మదిగా అతని పక్కమీద వాలింది.

అతను ఏమీ చలనం లేకుండానే ఆమెను గుండెలకు చేర్చుకున్నాడు. ఆమె

అతనిపై ముద్దుల వర్షం కురిపించింది.

ఎవరూ పెదవి విప్పరు.... వాళ్లకి కావలసిందేదో వాళ్లకు తెలుసు.

ఆమె అతని పెదవుల మీంచీ పెదవులు తీసి అతనికేసి చూస్తోంది- ఆమె అతని ఉంగరాల జుట్టులోకి మునివేళ్లను చొనిపింది. తన పెదవులను నెమ్మదిగా అతని చెవికి చేర్చి చెవిలో అంది-

'నా మాట వినరూ....' అని.

అతను ఆమెను తన బిగికౌగిలి నుండి వదిలిపెట్టాడు.

ఆమె పక్కకు జరిగింది.

కాని అతని కళ్లల్లోకే చూస్తోంది.

అతని సమాధానం కోసం ఎదురు చూస్తోంది.

అతి దీనంగా, ప్రాధేయపూర్వకంగా చూస్తోంది.

అతను ఆమెను పక్కకు నెట్టేసి, సర్దిన పెట్టె అందుకుని బయల్దేరాడు.

రైలు ప్రయాణం....

పదిహేనేళ్లుగా... ఇలానే రైలు ప్రయాణం.

పెళ్లయి పదేళ్లయింది.

ఇలానే రైలు ప్రయాణం.

ఆరేళ్ల క్రితం కొడుకు పుట్టాడు. ఆ తర్వాత ఇద్దరు కూతుళ్లు పుట్టారు. ఇప్పుడామె ముగ్గురు పిల్లల తల్లయింది.

ఒంటరిగా పిల్లల్ని చూసుకుంటూ, బడికి పంపుకుంటూ, ఇంటిచాకిరీ చేసుకుంటూ, వృద్ధులైన అత్తమామలకు సేవలు అందించుకుంటూ... యంత్రంలాంటి జీవితం ఆమెది-

నేనూ మనిషినే.... ఆడదాన్ని... ఇంత బాధ్యతని ఒక్కదాన్నీ మోయలేను. మీరు లేకుండా నేనిక ఏ పనీ చేయలేను. ఈ ఒంటరి తనాన్ని భరించలేను. ఈ నైరాశ్యాన్ని తట్టుకోలేను....

ఆమె కళ్లల్లో నీళ్లు తిరుగుతాయి.

నన్ను... నన్ను.... మీరర్థం చేసుకోలేరు-

నన్ను.... నన్ను... మీ రెన్నటికీ అర్థం చేసుకోలేరు-

అతను అన్నీ వింటాడు. ఎన్ని విన్నా... అవి గుండె బరువుకే- బరువెక్కిన గుండె చేత బట్టుకుని రైలెక్కుతాడు. మళ్లీ గుండె చేతబట్టుకునే తన చిన్న ఊళ్లో, చిన్న స్టేషన్‌లో రైలు దిగుతాడు.

ఆమె ఆ నాల్గు రోజులూ...... తలంటుతుంది.

రాత్రి తెల్లని చీరలో ప్రత్యక్ష మౌతుంది.

ఆ రాత్రి తెల్లని చీర నలగదు... ఆ రాత్రి మల్లెపూలు నలిగిపోతాయి. ఏదో రాత్రి

మళ్ళీ బరువెక్కిన గుండె చేతబట్టుకుని అతను పబ్లిరి రైలుబండి ఎక్కుతాడు.

అతనికి ఎన్నోసార్లు అనిపించింది... ~~ఇది జీవితమా? అని~~

కాని ఈ ప్రశ్న అతని జీవితంలో ఏనాటికీ చోటు చేసుకోకూడదు. చోటు చేసుకుంటే అది అతని ఆలోచనల్ని పురుగు పూవుని తొలిచినట్టు తొలిచేస్తుంది. చిన్నగాయం రోజు రోజుకూ పెద్దదై జీవితాన్ని పరిసమాప్తి కావిస్తుంది. అకాల మరణమో, ఆత్మహత్యో తప్పనిసరిగా జరిగిపోతుంది.

అందుకని ఈ ప్రశ్న తన ఆలోచనల్లో ఎన్నటికీ తలెత్తకుండా, ఈ మహానగరం జీవన్‌ని క్షణం క్షణం రక్షించుకొస్తోంది.

ఏదో గోడమీద నగ్నసుందరి... 'ఎ' సర్టిఫికెట్‌తో దర్శనమిస్తుంది. అతను విధిగా దాన్ని దర్శిస్తాడు. జీవితం ఆ క్షణాల్లో ఆనందోత్సాహాల్తో ఉర్రూతలూగుతుంది.

అతను ఏ బారుకో వెళ్లవలసివస్తే తట్టుకోగల నెలసరి జీతం ఎలానూ వుంది కనుక అతనాకాసేపూ జీవితం మీద భయాన్నీ, ఉద్యోగం వల్ల సంక్రమించిన నంగితనాన్నీ తన్ని తరిమేసి, స్నేహితుల్తో ఆనందిస్తూ జీవితాన్ని ఓ శకలంలా చూడగల్గుతాడు.

అతనెప్పుడో చూసిన కేబరేల్లోని కళ్లు చెదిరిన దృశ్యాలు నేటికీ అతని కళ్లముందు కదుల్తూ కొత్త ఉత్సాహానికి ఊపిరులు పోస్తూ ఆ కళ్లకి కామెర్ల కళ్లద్దాలు తొడిగితే అతనీ నగర జీవితాన్ని ఎన్నటికీ ఆ రంగుటద్దాల్లోంచే చూడగల్గుతున్నాడు.

అతను ఎడెన్ గార్డెన్ అనే రెసిడెన్షియల్ కాంప్లెక్స్‌లో ఆరవ ఫ్లోర్‌లోని మూడు వందల ఒకటో ఫ్లాట్‌లోని బాత్‌రూమ్ పక్కన ఒకే ఒక్క తన చిన్నగదిలోని అద్దాల కిటికీ ముందు కూచుని ఏమీ తోచక సాలోచనగా కిందికి చూస్తే, కింద రోడ్డు మీద పోయే రంగురంగుల భూతాల్లాంటి కార్లు చిన్న చిన్న పురుగుల్లానూ, మనుషులు చలిచీమల్లానూ కనిపిస్తుంటే... ఆ కాసేపూ అతనిలో ఏదో వింతైన తృప్తి...

అయినా అతనా ఇరుగ్గదిలో అలసటగా కాలం గడుపుతూనే వున్నాడు. అలాంటి అలసట జీవితానికి అతని ఆఫీసులోని రిసెప్షనిస్టు శ్రీమతి సుగుణా శ్రీనివాసన్ లేకపోతే యవ్వనం వల్ల అతనికి కలిగే అసౌకర్యానికి అతనేనాడో చిక్కిశల్యమై పోవును. ఆ వడగాడ్పుకి కోర్కెల లతవాడి వత్తలై పోవును.

ఆమె అతని రూమ్‌కి వస్తుంది.

ఆమె అందగత్తె ఔనో కాదో జీవన్ ఈనాటికీ చెప్పలేడు.

ఆమె కళ్లకన్నా... కనుబొమల కన్నా... ఎప్పుడూ లిప్‌స్టిక్‌తో పండిన దొండపండల్లే మిసమిసలాడే ఆమె అధరాలకన్నా... నిరంతరం కాస్మటిక్స్‌తో నునుపెక్కుతున్న చెక్కిళ్లకన్నా ఆమె దేహంలోని పొందికైన అవయవాల సొంపే అతనికి ఆనందాన్నిస్తాయి... ముగ్ధుణ్ణి చేస్తాయి.

ఆమె వస్తూనే... అబ్బ! నీ రూమ్‌కి రావాలంటేనే చెడ్డ భయం అంటుంది.

'ఏం? ఇక్కడెవరూ లేరుగా...' అంటాడు జీవన్.

కాదు... తెలిసినవాళ్లెవరైనా ఇక్కడికి రావడం చూస్తే... రిస్క్ కదా... అంటుంది.

జీవన్ ఆమె కేసి చూస్తాడు... లేకుంటే ఎటో చూస్తాడు.

ఆమె అలసిపోయినదానిలా రెండు చేతుల్లోకీ చీరకొంగు తీసుకుని విసురుకోవడం మొదలు పెడ్తుంది.

"నేను త్వరగా వెళ్లిపోవాలి" అంటుంది అంతలోనే...."

"ఎందుకు?......' అంటాడు జీవన్.

మావారు ఈ రోజు ఆఫీసుకు వెళ్లలేదు.... నా కోసం చూస్తూ ఉంటారు.

అయితే మరెందుకొచ్చావ్....ఆయన నీకోసం ఎదురు చూస్తారేమో... అంటాడు ఎదురుగా కిటికీలోంచి ఆకాశంలోకి సమాంతరంగా చూపును సారిస్తాడు.

రమ్మన్నారుగా... రాకపోతే కోపం వస్తుందేమోనని... సరే చెప్పండి.... నన్నెందుకు రమ్మన్నారు.

అతను ఆ కిటికీలోంచి ఆకాశంలోకి చూస్తూనే నవ్వుతాడు.

ఆమె కోపం నటిస్తుంది- "మీకంతా వేళాకోళంగానే వుంటుంది. ఆడవాళ్ల జీవితాల్తో ఆడుకోవడం మీకు బాగా అలవాటైపోయింది..." అంటుంది.

అతను ఆమె కళ్లల్లోకి చూస్తాడు.

నేనిలా వస్తున్నానని తెలిసిపోతే నేనేమైపోవాలి?-

అతను కిటికీ ఓరగా మూసివేస్తాడు.

ఆమె మంచం మీద మరింత ధీమాగాకూచుంటుంది. "నాతో ఏం పని? త్వరగా చెప్పండి... మళ్లీ ఎందుకు రమ్మన్నారు....' అంటుంది.

అతను ఆమె పక్కన కూచుంటాడు. అతని బాహువుల్లోకి అతి లాఘవంగా చేర్చుకుని మల్లెపూవును తాకినట్టు మృదువుగా ఆమెను తాకుతాడు. ఆమె అతని బాహువుల్లో ఇమిడి పోయి పక్కమీదకు వొరిగిపోతుంది.

చుంబించే అతని పెదవులమీంచి ముఖాన్ని జరిపి అతనిలో చెవిలో 'ఛీ! పాడు... ఏమిటిది? అంటుంది. అతనికి ఆకారణంగా అతని భార్య గుర్తుకువస్తుంది. ఆమె అతని గుండెలకు మరింత చేరువై గోడకు అతుక్కున్న బల్లిలా ఆమె అతని బాహువుల్లో అతుక్కు పోతుంది. అప్పుడు మధ్యాహ్నం పన్నెండు గంటలు సాయంత్రం ఆరు గంటలుగా మారిపోతుంది-

ఆమె సింక్ దగ్గర ముఖం కడుక్కొని, చీర సరిచేసుకుని, బొట్టు దిద్దుకునేసరికి ఎప్పటిలా తిరిగి ఫ్రెష్‌గా నిగ్గుదేరి కనిపిస్తుంది.

ఇందుకేనా నన్ను రమ్మన్నది... అంటుంది.

అతను మళ్ళీ ఎప్పుడొస్తావ్... అంటాడు.

ఛీ! నేనింకెప్పుడూ రాను.... అంటుంది.

అతను నవ్వుతాడు-

ఆమె మీ డే ఆఫ్ ఎప్పుడని అడుగుతుంది-

అతను నవ్వుతాడు... మళ్లీ అదే నవ్వు...

ఆమె ఎన్ని సంవత్సరాలుగా వస్తున్నా... ప్రతిసారీ ఇవే ప్రశ్నల్తో ఇలానే ప్రారంభమై ఇలానే ముగుస్తుందా గదిలో-

ఆమె తిరిగి ఎప్పుడొస్తుందో అతనికి తెలియదు.... వారానికో, నెలకో... ఎప్పుడో ఒకప్పుడు, ఆమె అవసరం అనుకున్నప్పుడు వస్తుంది. అప్పటివరకూ ఈ ఇరుగ్గదిలో ఒంటరిగా, అలసటగా కాలం గడుపుతూ వుంటాడు. ఎడారిలో ఒయాసిస్ కోసం ఎదురు తెన్నులు చూస్తూ ప్రయాణం సాగించినట్టు ఆమె రాకకోసం అక్కడున్నంత కాలం ఎదురుచూస్తూ కాలం గడుపుతాడు. ప్రయాణమంతా ఏవో గుక్కెడు నీళ్లతో సరిపెట్టుకున్నట్టు అతను ఆ ఒక్క గుక్కెడు అనుభవంతోనూ తన జీవితాన్ని సరిపెట్టుకుంటాడు.

కనుక ఈ నగర జీవితం ఒక కల.

ఏవేవో పాత్రలు వస్తాయి. కాసేపు కామాన్నో, క్రోధాన్నో, ప్రేమనో, భయాన్నో సృష్టించి, ఏదో రసాన్ని పోషిస్తాయి. అర్ధాంతరంగా ఎక్కడో మాయమైపోతాయి. కల కరిగిపోతుంది.... అప్పుడర్థమౌతుంది.... జరిగిందంతా అబద్ధమేనని-

కనుక ఇది జీవితమా?

ప్రవాహంమ్మీద నిస్సహాయంగా సాగిపోయే ఎండుటాకులా తన జీవితానికి ఏ గమ్యమూ లేదని తెలిసింది. ఇప్పుడీ నగర జీవితం ఓ ప్రశ్నలా తనముందు నిలుచుంది. ఇప్పుడతనేం చేయాలి-

అతనీ చదువులు చదవకుంటే.... ఈ డిగ్రీ రాకుంటే తన సొంత ఊళ్లో, సొంత ఇంట్లో తన భార్యాబిడ్డలతో హాయిగా గడుపుతూ, వృద్ధులైన తల్లిదండ్రులకు కొండంత బలాన్నీ, ధైర్యాన్నీ యిస్తూ.... తన తాత, ముత్తాతల నాటి ఆ నాల్గెకరాల గరువు భూమినీ సాగుచేస్తూ, అలమో, ఫలమో పండిస్తూ జీవితాన్ని నిశ్చింతగా గడిపేవాడు.

కాని అతను చదివాడు.

చదివినందుకు డిగ్రీ యిచ్చారు.

కనుక.... జీవితాధారమనే ములగచెట్టునుండి ఉద్యోగమనే ఓ కొమ్మను డిగ్రీ గోడల్తో నరికి, ఈ మహానగరంలో ఓ ఆఫీసనే సుక్షేత్రంలో నాటి, జీతమనే నీరు నెలనెలా పోస్తూ చిగురింప జేస్తే.... మళ్లీ తిరిగి అది ములగచెట్టే అయి ములక్కాడలు కాస్తోంది. ఈ ములగచెట్టు నల్గురికి నీడనివ్వలేదు- కాస్త తిండిని మాత్రం యిస్తుంది.

అందుకని తన చిన్ని జీతంతో పెద్ద కుటుంబాన్ని ఈ మహానగరానికి తీసుకు రాలేదు. తీసుకువస్తే ఆ చిన్న వూర్లో తన చిన్న గూడు పాడుబడి నేలకూల్తుంది. నాల్గెకరాల మెట్టభూమీ మరో చేతికి మారుతుంది. అందుకని అతని తల్లిదండ్రులు ససేమిరా అన్నారు. ఆ వృద్ధులను కనిపెట్టుకుని వుండడం తన భార్యకు తప్పనిసరి అయ్యింది. ఉద్యోగాల కెగబడే ఈ రోజుల్లో ఉద్యోగం దొరకడమే గగనం... అలాంటప్పుడు

అతడు తన ఉద్యోగాన్నెలా కాలరాచగలడు-

అతను పదిహేనేళ్లుగా ఈ మహానగరంలో వుంటూ, తాను పొద్దుటే లేవడం... తన ముఖాన్ని తానే చూసుకోవడం. కాస్త గతికి ఆఫీసుకు పరిగెత్తడం- ఆఫీసయ్యాక మళ్లీ గదికి రావడం.... తనపక్క తానే వాల్చుకోవడం... దానిపై తానే పడుకోవడం-

ఇదా జీవితమంటే.....?

అతను జీవితాంతం గ్రామ్‌ఫోను రికార్డులా ఒకేపాట పాడుతున్నాడు. అతనిక ఆ పాట పాడలేదు.

✿ ✿ ✿

జీవన్ ఆ మహానగరంలో రైల్వే స్టేషన్‌లో పదో నంబరు ప్లాట్‌ఫామ్ మీద దిగులుగా కూచున్నాడు.

అప్పటికింకా తెల్లవారలేదు.

అతని కళ్లల్లో కలల కింకా సమయం పూర్తికాలేదు.

అయితే కలలన్నీ తీయగానే వుండాలనేదేమీ లేదు... చేదుగా, పచ్చి అబద్ధంలానూ ఉండొచ్చును-

ఆ కలలో మళ్లీ జీవితం-

అతను మళ్లీ తన సొంతవూళ్లో.... సొంత ఇంట్లో... తన చిన్న గదిలో ఆమెకోసం ఎదురు చూసి చూసి నిద్రపోయాడు.

ఆమె రాలేదు-

ఎప్పుడో అర్ధరాత్రి దాటాక అతను లేచి నెమ్మదిగా తలుపునెట్టి ఆమెకోసం మధ్య గదంతా కలయజూశాడు. ఆమె అక్కడలేదు. ఆమె తన ముగ్గురు పిల్లల్నీ నిద్రపుచ్చి వంట గది వరండాలో కూచుంది. ఆయాసపడుతూ, తెరలు తెరలుగా వచ్చే దగ్గును ఆపుకోలేక ఆమె మెలికలు తిరుగుతోంది. గొంతులో అడ్డుపడ్డ కళ్లె ఆమెను ఊపిరి సలపనివ్వడం లేదు. వుండుండి మళ్లీ గుండెల్ని పిండేస్తూ దగ్గు ప్రారంభమౌతోంది-

ఆ రాత్రంతా ఆమెకు ఆ కంటిమీద నిద్ర ఉండదు.

పగలంతా ఆమెకు ఇల్లూ... పిల్లలూ... వాళ్ల చాకిరీ-

కనీసం క్షణం తీరిక వుండదు. ఎన్ని మందులిస్తే మాత్రం ఏం లాభం- ఆమె జీవితానికి విశ్రాంతనేదే దొరకనప్పుడు-

జీవన్ అలసటగా, ఆవేదనగా తన గదిలోకి తిరిగి వెళ్లిపోయాడు.

రెండో రోజున ఆమె వచ్చింది.... తెల్లని నేత చీరలో-

ఆమె తలలోని మల్లెలు నలగలేదు... ఆమె ఈసారి మల్లెల్ని పెట్టుకోలేదు. ఆమె తెల్లని చీర నలిగిపోయింది.... ఆమె ఈసారి తన చీర విప్పలేదు.

ఆమె ఆ తెల్లని చీర ఇక విప్పదు-

ఎందుకంటే... అందులో ఆమె ఎముకల గూడు మాత్రమే మిగిలింది కనుక- అది

పూర్తిగా జీవన్‌కు తెలియడం ఆమెకు ఏ మాత్రం యిష్టం లేదు కనుక-

అయినా అతను ఆ ఎముకలగూడుతో మరింత ఉద్రేకంతో ఆడుకున్నాడు.

అయితే అతను కామాంధుడు కానే కాడు. కాని అంతకన్నా హీనంగా తానా ఎముకలగూడుతో ఆడుకున్నందుకు ఎవ్వరూ ఏమీ అనలేరు-

ఆమె కూడా ఏమీ అనలేదు. ప్రతిసారీ అతని మగసిరికి తిరిగి సమాధానమిస్తూనే వచ్చింది. ప్రతిసారీ ఆమె ఒక్కటే ఆలోచించింది.... తనకు దగ్గు రాకూడదు. మధ్యలో అతనికి నిరుత్సాహం కలగకూడదు. అందుకని ఆమె అన్ని విధాలా ప్రయత్నించింది.

అయినా ఆమెకు తెలీకుండానే అలసటవల్లనో, మరెందుకో ఆమె నిద్రలోకి జారిపోయింది... కాకుంటే అది అపస్మారకం అయినా కావచ్చును.

అలాంటి పరిస్థితిలో కూడా ఆమె మరిచిపోకుండా అతన్ని అర్థించింది. అతని చెవిలో ఆమె ప్రాధేయపూర్వకంగా నా మాట వినరూ... అంది.

అతని గుండెలు పిండినట్టయ్యింది.

ఆవేదనా, ఆక్రందనా అతన్ని నిలువెల్లా కుదిపేసింది.

ఆ బాధతో అతను ఆమెతో అన్నాడు.... నీ మాట తప్పకుండా వింటాను.... ఇంతకాలమూ నీ మాట వినకపోవడమే నేను చేసిన పొరబాటు.... ఇంతకాలమూ నీ పట్ల నేను నిర్దయుణ్ణి... నీ మాట తప్పకుండా వింటాను.... అన్నాడు.

అతను రైలెక్కాడు...

ఆ మహానగరంలో తన ఉద్యోగానికి రాజీనామా ఇవ్వడానికి చిట్టచివరిగా తాను రైలెక్కాడు.

అతను ఎక్కిన జనరల్ కంపార్టుమెంట్ కిటకిటలాడుతోంది- నుంచోవడానికి గానీ, కూచోవడానికి గానీ ఎక్కడా వీలుచిక్కని పరిస్థితిలో అతను రైలు ప్రయాణం చేస్తున్నాడు.

అలా తానెన్ని గంటలు ప్రయాణం చేయాలి?

అయినా ఇది చివరి ప్రయాణం.... పదిహేను సంవత్సరాలుగా నిరవధికంగా సాగి ఇకముందు పరిసమాప్తి కాబోయే చివరి ప్రయాణం.

అతను నెమ్మదిగా పైన మూటలు పక్కకు వొత్తిగించి చోటుచేసుకున్నాడు. ఆ చిన్న ఖాళీలోనే అతను నెమ్మదిగా ఇరుకున్నాడు.

రైలు వేగంగా పరుగులు తీస్తోంది.

కంపార్టమెంట్‌లోకి చల్లని గాలి వీచింది. కిటికీలు మూతలుపడ్డాయి. బయట వర్షం కాబోలు... భోరున కురుస్తున్న చప్పుడు.

రైలు గాలిలో తేలుతున్నట్టు హాయిగా పోతోంది-

జీవన్‌కి మనసు తేలిక పడింది. అతనికి కునుకు పట్టేసింది. అలసట నుండీ, ఆవేదన నుండీ తేలికైన మనసుతో సుఖమెరుగని నిద్ర పట్టేసింది. ఆ నిద్రలో తాను తన

కల

ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేశాడు. అతను తన తల్లిదండ్రులనూ, భార్యాబిడ్డలనూ కలుసుకోడానికి సంతోషంగా తిరిగి వస్తున్నాడు. అలా ఆ కల ఆ కలత నిద్దర్లో హాయిగా సాగుతోంది. అతనెరుగని ఆనందం అతన్ని ఉక్కిరిబిక్కిరి చేస్తోంది.

ఇంతలో కలత నిద్ర చెడింది.

రైలు స్టేషన్‌లో ఆగింది. అందరూ దిగిపోతున్నారు...

ఎవరో అతను... వచ్చేశాం దిగండి.... అన్నాడు.

జీవన్ కంపార్టుమెంటునుండీ ప్లాట్‌ఫారమ్ మీదికి దిగాడు. అతని కళ్లు ఇంకా నిద్రమత్తులోనే వున్నాయి.

అతని కళ్లను అతనే నమ్మలేకపోయాడు.

అతను తన చిన్న ఊళ్లో, చిన్న స్టేషన్లో దిగవలసింది. ఈ మహానగరంలో దిగడం ఎలా జరిగింది – ఏదో మోసంగానూ, శుద్ధ అబద్ధంగానూ అనిపించింది.

అందుకే అతని గుండె చెరువైపోయింది.

కాని కల వాస్తవం కాదు కదా....

ఈ మహానగరం తన సొంత ఊరు ఎలా ఔతుంది?

అతను పొంగివస్తున్న దుఃఖాన్ని అదుపు చేసుకుంటూ, ఆ ప్లాట్‌ఫారమ్ మీద కూచొని ఉదయం కోసం ఎదురుచూస్తున్నాడు.

అతన్ని ఎన్ని ఉదయాలు మోసం చెయ్యలేదు–

అతను చిన్నప్పుడు.... జ్వరం కాచి, పగలంతా తన హాస్టల్ గదిలో వొళ్లెరగక నిద్రపోయి లేస్తే....

బయట ఉదయించింది.

అందుకని అతను జ్వరం తగ్గిందనీ, బడికి వెళ్లొచ్చుననీ ఊహిస్తూ కుళాయి దగ్గర బ్రష్‌తో పళ్లు తోముకుంటుంటే ఉదయం మరింత చీకటై పోయింది.

అప్పుడు తెలిసింది. అది ఉదయం కాదనీ..... సాయంత్రమనీ–

ఇప్పుడు తూరుపున వెలుగు రేఖ కనిపించే సమయం కూడా వచ్చేసింది. మళ్లీ ఉదయం కాబోతుంది–

జీవన్ ఆ ప్లాట్‌ఫామ్ మీద నిలుచుని దిక్కు తెలియనివాడిలా జీవితం గురించి ఒకసారి వెనక్కి ఆలోచించాడు.

అతను ఉద్యోగానికి రాజీనామా యిచ్చేస్తే...

రేపు పెరిగి పెద్ద కావలసిన తన బిడ్డలున్నారు. వాళ్లకు తిండీ, బట్టా, చదువూ కావాలి–

నిరంతరం శ్రమించి కేవలం ఎముకల గూడును మాత్రమే మిగుల్చుకున్న తన భార్య వుంది. ఆమెకు మందూమాకూ కనీసమైనా ఇవ్వాలి–

వృద్ధులైన తల్లిదండ్రులున్నారు. చివరిదశలో వాళ్లకు కనీసం గుక్కెడు గంజినీళ్లయినా పొయ్యాలి....

తను రాజీనామా చేస్తే... ఇవన్నీ ఎక్కణ్ణుంచి వస్తాయి?

తన సొంత ఇంట్లో.... చీకటి బోనులో నిల్చున్న పులిలా ఖాళీ ప్రేవుల్లో ఆకలి నిలుచుంటుంది.

జీవన్ ఇంకేమీ ఆలోచించలేకపోయాడు.

అతని భార్యకు మాట యిచ్చాడు. తాను ముమ్మాటికీ వచ్చేస్తానని. ఆమె కష్టాల్ని పంచుకుంటానని.... తన రెక్కల కింద ఆమెకు సేద తీరుస్తానని... జీవితంమ్మీద కాస్త నమ్మకం కలుగుజేస్తానని... తనే లేకపోతే ఆమె బతకదేమోనని-

ఈ ఉదయం మరోసారి తనని మోసం చేస్తోంది.

అతను రాజీనామా చేయలేదు.

అతను చేసి, చేయగల్గింది ఏమీ లేదు.

జీవితం పచ్చి అబద్ధంగా మిగిలిపోవడం తప్పించి.

** 5.6.1990 'సిరివెన్నెల' **

హైదరాబాద్
*6.8.1989*

# దేశం పిలిస్తే....

గొప్ప నిజాలు రాగూడని వాళ్ళ నోటినుండి కూడా వస్తుంటాయి.

ఉదయం ఎనిమిదిన్నరకు బెల్ మోగింది.

నేను మిలిటరీ డ్రస్ వేసుకుని, పాలిష్ చేసిన బూటు తొడుక్కుని, బెల్టు మరోసారి తుడిచి టైట్‌గా నడుంకు బిగించాను. అద్దం ముందు ఠీవిగా నిల్చుని హేట్ పెట్టుకున్నాను.

నేను హవల్దారుని.

ఉద్యోగ రీత్యా నేను నీటుగా వుండడం తప్పని సరి.

నేను అద్దం ముందు నిల్చుని, ముఖాన్నొకసారి చూసుకున్నాను. అప్పటికింకా పాతికేళ్ళన్నా లేవు నాకు-

నా ముఖం నాకే వింతగా తోచింది. ఓ నాల్గేళ్ళ క్రితం నేను మిలిటరీలో చేరాను. చేరకముందు ఇంటి నుండి రెండు వందల రూపాయల్తో పరారై, జీవితంలో ఏదో సాధించ గలనన్న పిచ్చి భ్రమతో, అర్థంలేని కలల్తో వచ్చేశాను. ఆ కలలకి సరైన రూపకల్పన జరగక నిరాశా, నిస్పృహ పొగమంచులా నన్నావరిస్తే మద్రాసు బీచిలో కూచుని అటు ఆకాశం లోకీ, ఇటు సముద్రంలోకీ చూస్తూ దారీ తెన్నూ తెలియక, కళ్ళల్లో కన్నీరు కమ్ముకొస్తే ఈ మిలిటరీ రిక్రూట్‌మెంటు వచ్చి మళ్ళీ నన్ను మనిషిగా చేసి భూమ్మీద నిలబెట్టింది.

ఆ నాటి నా ముఖంలోని బేలతనానికీ, ఈనాడు కరుడు కట్టిన ఈ కరకు దనానికీ ఎంత తేడా?

నేను అద్దం ముందు నిలుచుని మీసాలు మరోసారి పెనితిప్పాను. చిన్న ఫాల భాగం కింది కనుబొమల అడుగున గుంటకళ్ళ నడుమలోంచి పైకి లేచిన ఆ చిన్ని ముక్కూ, ఆ ముక్కు రంధ్రాలను మూసివేస్తూ పైకి పొడుచుకు వచ్చిన ఒత్తయిన నల్లని బొద్దు మీసాలూ, వాటికింద కనిపించకుండా దాగిన ఆ పలుచని పెదాలూ... ఇదంతా నా రూపమేనా?

ఓ పదిమంది శత్రువుల పచ్చి రక్తాన్ని అమాంతం తాగేసేలా వున్న ఆ పలుచని

పెదాలు నా బొద్దుమీసాల అడుగున ఎలా దాగున్నాయో చూస్తుంటే నా రూపం నాకే వింతగా తోచింది.

నేను రిక్రూట్ అయిన తర్వాత అంబాలాలో ట్రైనింగయ్యి రెండవ ప్రపంచ యుద్ధం కోసం సింగపూర్ వెళ్ళాను. కాని అక్కడనన్ను ఫ్రంట్‌లోకి పంపకుండానే తిరిగి అంబాలాకు పంపేశారు.

నేను అంబాలాకు వచ్చాక సిపాయ్ నుండి హవల్దారుకి ప్రమోషనిచ్చి కొత్త రిక్రూట్స్‌కు ఇన్‌స్ట్రక్టరుగా నియమించారు.

ఆ రోజుల్లో కొద్దోగొప్పో చదువుకున్న వాణ్ణి నేను. పైగా కాషన్సు బాగా ఇవ్వగలను. నా స్వరం పెద్దది. నేను అరిస్తే సునాయాసంగా నాల్గు ఫర్లాంగులు వినిపిస్తాది. అందువల్లపై ఆఫీసర్లు నాకీ ప్రమోషన్ యిచ్చారు.

నేను ఎనిమిదిన్నరకు బెల్ మోగాక, నా రైఫిల్ తీసుకుని పెరేడ్ గ్రౌండ్స్ లోకి మార్చింగ్ నేర్పడం కోసం వెళ్ళాను. సరిగ్గా తొమ్మిదికి విజిల్ వేశాను.

నా ముందు ఓ నలభై మంది ట్రూప్ నిలుచుంది.

రెండు నెలలుగా నేను వాళ్ళకు మార్చింగ్ నేర్పుతున్నాను. అందులో ముగ్గురు తెలుగు వాళ్ళు కూడా వున్నారు. నేనూ తెలుగు వాణ్ణి కావడం చేత అప్పుడప్పుడూ వాళ్ళు నన్ను 'సాబ్' అంటూ పలకరిస్తారు. నాలోనూ ఆ అభిమానం చావక వాళ్ళతో ఆప్యాయంగా మాట్లాడుతుంటాను.

ట్రూప్ ఫారం అయ్యాక నేను 'అటెన్‌షన్', 'స్టాండ్ ఎట్ ఈజ్' అంటూ ఓ గంట వరకూ రైఫిల్ డ్రిల్ చేయించాను. ఆ తర్వాత మార్చింగ్‌కు కాషన్స్ యిచ్చాను.

నా స్వరం ఉత్తేజంగా వస్తోంది.

రెండవ ప్రపంచ యుద్ధానికి సంబంధించిన విశేషాలు మా అందరినీ నిత్యం ఉద్రేక పరుస్తున్నాయి. రోజు రోజుకీ మా నవనాడుల్లోని రక్తాన్ని మరింత ఉద్రేక పరుస్తున్నాయి. అదే ఉద్రేకంతో నేను నా ట్రూప్ ముందు నిలుచుని మార్చింగ్ చేయిస్తున్నాను.

ఆ మార్చింగ్‌కు భూమి అదురుతోంది. స్టెప్స్ లయబద్ధంగా, బలంగా, కరెక్టుగా పడి మరింత ఉద్రేకాన్నిస్తోంది. ఓ పది నిముషాల తర్వాత పెరేడ్... హాల్ట్... అన్నాను.

ట్రూప్ అంతా నా కాషన్ విని ఠంచనుగా ఆగిపోయింది కాని ఆ మధ్యలో ఓ పొడుగాటతను వెళ్ళి ముందువాణ్ణి 'ఢీ' కున్నాడు. మొత్తం ట్రూప్ అంతా అలా టెన్‌షన్‌గా నిలుచుంటే అతనొక్కడూ వెళ్ళి ముందు వాడి మీద పడడం సహించలేకపోయాను.

నేనతని మీద కళ్ళెర్ర జేసాను. తిట్టాను; తుమ్మాను; కొప్పడ్డాను అతను తెలుగు వాడే అవటంచేత తెలుగులో నోటికొచ్చినట్టు అన్నాను.

మిలిటరీ వాళ్ళ మాటలు ఒక్కొక్కసారి ఎంత కటువుగా వుంటాయో, నేనతన్ని ఎంత కటువుగా అన్నానో ఊహించుకోవచ్చును. నేనేమన్నా అతను తలవంచుకునే ఉండిపోయాడు.

ఈ రెండు నెలల నుండీ నేనతన్ని ఓ కంట కనిపెడుతూనే వున్నాను. అతనికీ మిలిటరీ అన్నా, ఈ మార్చింగులన్నా ఏ మాత్రం ఉత్సాహం వున్నట్టు లేదు.

నేను మళ్ళీ మార్చింగు చేయించాను. మార్చింగుకు ఈ సారి భూమి మరింత లయబద్ధంగా అదురుతోంది. నేనలా మరో ఐదు నిమిషాల వరకూ చేయించి 'ట్రూప్...హాల్ట్...' అన్నాను.

కాషన్ రావడమే తడవు ట్రూప్ అంతా ఒక్క స్టెప్ ముందుకు వేసి ఆగి, మరో స్టెప్ కొట్టి అటెన్‌షన్‌లోకి వచ్చింది. ఆ సమయంలో ఆకాశం నుండి బాంబులు పడినా వాళ్ళు చెక్కు చెదరనంత దృఢంగా నిలుచున్నారు.

ఈసారి కూడా అదే అతను; ఇందాకట్లానే ముందువాణ్ణి 'ఢీ' కున్నాడు.

ఇప్పటికి రెండు నెలలయ్యింది. నా ట్రయినింగులో సిపాయిలు చాకుల్లా తయారవ్వాలనే నా ఆకాంక్ష ఒక్కసారిగా వమ్మయిపోయింది. ఇక నేనతన్ని క్షమించడం కూడా అన్యాయమే- నేనా క్షణంలో పూర్తిగా విచక్షణా రహితుణ్ణయ్యాను. అతనికేసి దూసుకు వెళ్ళి చెంపమీద ఛెళ్ళున చరిచాను. అటెన్‌షన్‌లో వున్న అతను నా చెంప దెబ్బకు ఒక్కసారిగా తల దించేసుకుని అవమానంతో కుంచించుకుపోయాడు.

నేను 'స్టేండ్ రైట్....' అని విరుచుకు పడ్డాను.

అతను అటెనషన్‌లోకి మళ్ళీ వచ్చాడు.

అప్పుడతని కళ్ళల్లో తిరిగిన కన్నీటి పొర నాకు తేటగానే కనిపించింది.

అతను చే యెత్తు మనిషి. మంచి బలశాలి-. ఈ మాత్రం దెబ్బకే కళ్ళల్లో నీరు తిరిగిందని నేననుకోను.

మనిషంత మనిషిని చెంపదెబ్బ కొడితే నలుగురిలో అవమానం కదా... అభిమానం దెబ్బ తినివుంటుంది. మనసు గాయ పడి వుంటుంది.

నేను మళ్ళీ మార్చింగ్ చేయించి, ట్రూప్‌ను డిస్‌పర్స్ చేశాను.

అతనక్కడ నుండి వంచిన తలను పైకెత్తకుండా వెళ్ళిపోయాడు.

నేను చేసింది మాత్రం ఏమిటి? మిలిటరీ రూల్సు ప్రకారం నాదీ నేరమే.... కాని తొందరపాటులో జరిగిన దాన్ని నేనేమాత్రమూ వాళ్ళముందు బయటపడకుండా జాగ్రత్త పడ్డాను.

జాగ్రత్త పడ్డానని అనుకున్నానే గాని నిజానికి అలా జరగలేదు. ఎవరికైతే నేను ఇలాంటి విషయాల్లో దొరకగూడదో వాళ్ళకే నేను దొరికిపోయాను. అప్పుడు మా కంపెనీ కల్నల్ నా వెనకాతల కొద్ది దూరంలో నిలుచుని నాకేసే చూస్తున్నాడు.

నాలో తొట్రుపాటూ, కలవరం, భయం - అన్నీ ఒక్కసారిగా ముంచుకొచ్చాయి. నేనెప్పుడు అటెన్‌షన్‌లోకి వచ్చానో, నేనెప్పుడు శాల్యూట్ చేశానో.... అంతలోనే ఆయన నన్ను దగ్గరకు రమ్మని పిలిచాడు.

అసలే బ్రిటిష్‌వాడు. పైగా కల్నల్... క్యాంప్ హెడ్- ఇక నేను తప్పించుకో గలిగిందేమీ లేదు. నాకు 'కోర్టు మార్షల్' పడడం ఖాయం-

'నిన్నెందుకు రమ్మన్నానో తెలిసే వుంటుంది.' ఇంగ్లీషులో అడిగాడు కల్నల్-

'ఎస్సార్!....' అన్నాను.

'నీ సంజాయిషీ ఏమిటి?....'

'నేను తప్పుచేశాను సార్'

'తప్పు చేసినప్పుడు శిక్ష విధించాలి కదా.... నిన్నెందుకు 'కోర్టు మార్షల్' చేయకూడదు?'

'నేనా శిక్షకు సిద్ధంగా వున్నాను సార్.... నేను చేసిన తప్పు ఒప్పుకోవడమే కాదు. అది సరైన శిక్షని అంగీకరిస్తున్నాను సార్,' అన్నాను.

'నీవు నా ఆఫీసులో వెంటనే కలుపు' అని వెళ్ళిపోయాడు కల్నల్-

నేను ఆయన ఆఫీసు చేరే సరికే నా కోసం ఎదురు చూస్తున్నాడు.

నేనా గదిలోకి వెళ్ళేటప్పుడు నా కాళ్ళాడలేదు.

బయట మాత్రమే సెంట్రీ కాస్తున్న సిపాయిలున్నారు గాని లోపల తానొక్కడే వున్నాడు. పెద్ద వెడల్పయిన పొడవాటి టేబుల్‌కి అవతలివేపు ఎత్తైన కుర్చీలో ఠీవిగా కూచున్నాడు.

నేను అటెన్‌షన్‌లోకి వచ్చి శాల్యూట్ చేశాను.

కాసేపు గడిచాక నాతో కల్నల్ అన్నాడు గదా- 'చూడు హవల్దార్ సాబ్.... శిక్ష విధించేది తప్పు తెలుసుకోవడానికే.... నీవు తప్పు తెలుసుకున్నావని నాకు అర్థమ య్యింది.నీకు కోర్టు మార్షల్ వెయ్యను.

కాని ఒక్కటి మాత్రం గుర్తుంచుకో..... ఈనాడు అతను న్యూ రిక్రూట్ కావచ్చును. కాని మరో నాల్గు నెలల్లో అతనూ ఒక సిపాయి ఔతాడు. అతని చేతికీ ఓ తుపాకీ వస్తుంది. ఈనాడు నీవు కొట్టిన దెబ్బ శరీరానికే తగిల్తే మరిచిపోతాడు. కాని మనసుకు తగిల్తే.... అది గాయపడితే.... అతనెన్నటికీ నిన్ను మరిచిపోలేడు.

రేపు నీతోపాటు అతనూ ఫ్రంట్‌లో నిలుచుంటాడు. అతని చేతిలోనూ, లోడ్ చేసిన ఓ గన్ వుంటుంది. అతని ముందు నిలుచున్న నీ పరిస్థితి ఏమిటో ఊహించుకో.... ఇందుకే నిన్నిక్కడకు పిలిపించాను. గాయపడ్డ మనసు తప్పకా ప్రతీకారం కోరుకుంటుంది.... అన్నాడు.

నేను చేసిన తప్పు మరోసారి నా కళ్ళముందు కదిలింది.

కల్నర్ లాంటి ఓ అధికారి నన్నలా క్షమించి వొదిలెయ్యడం ఆశ్చర్యం కలిగించింది. అది వాళ్ళ గొప్ప గుణానికి నిదర్శనమేమో అనిపించింది- నిజానికి నన్నా సమయంలో ఓ బ్రిటిష్‌కల్నల్ కాక, మరో భారతీయ కెప్టెనో, మేజరో చూసి వుంటే తప్పకా కోర్టు మార్షల్ వేసుండే వాడు.

అందుకే కాబోలు నా మనసు ఆక్షణంలో మా కల్నల్ పట్ల కృతజ్ఞతతో నిండిపోయింది.

నేను శాల్యూట్ చేసి వచ్చేశాను.

ఆ రోజంతా నన్నవే సంఘటనలు వెంటాడాయి.

బ్రిటిష్ వాళ్ళ గురించి నాకు బాగా తెలుసు. వాళ్ళు భారతీయుల్ని బానిసలనే భావంతో అసహ్యించుకుంటూనే మనతో మాట్లాడతారనీ, అసలు భారతదేశం రాకముందే వాళ్ళు మన భారతీయుల్ని అసహ్యించుకోవడం అలవాటు చేసుకుంటారనీ తెలుసు. అలాంటి ఓ బ్రిటిషరు ఓ మనిషి హృదయాన్ని గురించి ఓ భారతీయుడితో ఇలా మాట్లాడ్డం ఆశ్చర్యకరం అనిపించింది.

సాయంత్రం అయ్యాక నేను రిక్రియేషన్ హాల్‌కు వెళ్లాను

నేనెంత మిలిటరీ వాణ్ణయినా ఒక మనిషి హృదయాన్ని గాయపరచడం నాకూ బాధగానే వుంది. అతనెక్కడున్నా ఎదురు పడితే జరిగిన పొరబాటును ముఖాముఖిని ఒప్పేసుకుందాం అనుకున్నాను.

అతను ఎప్పుడోగాని రిక్రియేషన్ హాల్‌కు రాడని మరో కో్రైనీ నాతో చెప్పాడు.

ఆ రోజు తన కో్రైనీకి మనసేమీ బాగా లేదట- దానికి వేరే కారణాలున్నాయట-

పొరపాటు చేసిన ప్రతివాడూ ఏవేవో సాకులు చెప్పడం పరిపాటే.... నాకు తెలిసినంతవరకూ అతనికీ మార్చింగులన్నా, పెరేడ్ అన్నా శ్రద్ధ లేదు. నేను సర్వీసులో కొచ్చాక అనేకమంది ఇలానే చెప్పడం నేనెరుగుదును.

అతను బాగా ఉన్నవాడనీ, గౌరవంగా బతికినవాడనీ.... ఏదో బ్రతుకు తెరువు కోసం మిగత సిపాయిల్లా ఈ మిలిటరీలో చేరిన వాడు కాడనీ చెప్పాడు.

కాని నాకివేమీ నమ్మ బుద్ధి కాలేదు. ఇలాంటి పనికిమాలిన మాటలు చాలా మంది నుండి చాలా సార్లు నేను విన్నాను. ఇక్కడకు వచ్చాక ఎవడూ వాడి ఇంటి పరిస్థితినీ, పేదరికాన్నీ బయట పెట్టుకోడానికి ఇష్టపడడు. కూటికి లేని తనాన్ని కప్పెట్టుకునేం దుకు పలికే డాంబికాలే ఇవన్నీ..... అయినా అతను చెప్పున్న వన్నీ మౌనంగా వింటూనే వున్నా-

అతనిది తన వూరేనట... అతను వాళ్ళ ఊరి మునసుబు అట.... అతని తలిదండ్రులు వాళ్ళ వివరాలూ నాకు చెప్పసాగాడు-

బ్రిటిష్ వాళ్ళ హయాంలో మునసుబులు ఎంతగా అధికారాన్ని చెలాయించే వాళ్ళో నాకు బాగా తెలుసు. అలాంటి మునసుబు యుద్ధ సమయంలో మిలిటరీలో చేరడం, అది కూడా కేవలం ఓ సిపాయిగా చేరడం ఏ మాత్రం నమ్మశక్యంగా లేదు. ఇప్పుడతని మాటల్ని ఒట్టి మాటల్లా కొట్టివేయక లేకపోయాను..... ఆ మాటలు వెనుక ఏదో విశేషమున్నట్టే అనిపించింది.

---

అతనేదో హత్య చేసి, ఇలా మిలిటరీలో చేరాడట–

బ్రిటిష్ వాళ్ళ పాలనలో ఏదైనా చేసి తప్పించుకోగలడేమో గాని, హత్య చేసి తప్పించుకోలేడు.

అయితే ఈ రకంగా ఉరిశిక్షను తప్పించుకున్నాడన్నమాట...

ఔను మరి! సాధారణ పరిస్థితుల్లో ఎవడూ వచ్చి ఈ మిలిటరీలో చేరలేడు...

పరిస్థితుల ప్రభావం ఎంతటిదో నాకూ అనుభవంలోనిదే – నేనూ ఒకనాడు రెండువందల రూపాయల్తో ఇంటి నుండి పరారై కలలు కల్లలైనప్పుడు ఈ మిలిటరీలో కొచ్చి చేరిన పీడకల గుర్తుకొచ్చింది–

అతడీ హత్య ఎందుకు చేసి వుంటాడు?!

గాయపడిన హృదయమో.... తీరని అన్యాయమో... భరించరాని అవమానమో.... ఏదైనా కావచ్చును.

మేం కాసేపు మౌనంగా వుండిపోయాం–

మేమిద్దరం కలిసి అతన్ని చూడడం కోసం వాళ్ళ బేరెక్సుకు వెళ్ళాం–

నేను వచ్చిన కారణంగా అతను లేచి నిలుచున్నాడు. సాదరంగానే లోనికి పిలిచాడు. నేనతన్ని కూచో బెట్టి అతని బిస్తరు మీదే నేనూ కూచున్నాను.

పొరపాటు జరిగింది అన్నాను.

అతను ఏమీ అనలేదు.

నేనూ ఆ తర్వాత ఏమీ అనలేకపోయాను. కాని అతని ముఖంలో కొంత ప్రసన్నత కనిపించింది. నా మనసు కూడా కాస్త తేలిక పడింది.

నేను మా కల్నల్ అన్న మాటలను బట్టి అతను ముందు ముందు నన్నేదయినా చేస్తాడనే భయంతో అతని వద్దకు వెళ్ళలేదు. నా వల్ల అతనికి జరిగిన తప్పిదం ఏదైనా వుంటే అది అతన్ని మరింత కుంగదీయగూడదని అతని వద్దకు వెళ్ళాను. శాంతినీ, సుఖాన్నీ కోల్పోయి క్షణ క్షణం మానసికంగా ఉరితీయబడుతున్న అతన్ని మరింత క్షోభ పెట్ట కూడదని చూడడానికి వెళ్ళాను.

నేను వాళ్ళ బేరెక్సు నుండి తిరిగి నాక్వార్టర్సుకు వచ్చేశాక మా కంటోన్మెంటులో అలజడి–

అందరూ రహస్యంగా చర్చించుకునే వాళ్ళే....

నేతాజీ పిలుపు విని ఫిఫ్త్ ఆర్మీ రెజిమెంట్ యుద్ధభూమిలో శత్రువుల వైపు నుంచి తుపాకుల్ని తీసి బ్రిటిష్ వాళ్ళ మీదికి ఎక్కు పెట్టారట.

నాకు మా కల్నల్ మాటలు గుర్తొచ్చాయి.

గొప్ప నిజాలు రాగూడని వాళ్ళ నోటి నుండి కూడా వస్తుంటాయి.

నేను నా తుపాకితో అతని పిలుపుకోసం ఆనాడు ఎదురు చూశాను.

ఇప్పుడా మనుషులేరి?

నేను అద్దం ముందు నిలుచున్నాను.

ముడతలు తేలిన ముఖం - తెల్లని మీసాలుకింద పళ్ళూడిన బోసిపెదాలు - నిరీక్షణతో అలసిపోయిన నా కనురెప్పల కింద నల్లని చారలు-

నా ముఖం నాకే వింతగా తోచింది; ఒకప్పటి నారూపమేనా ఇది-

అయితే నేం!.... దేశవిముక్తికోసం నా తుపాకీతో ఆనాడు అతని పిలుపు కోసం ఎదురు చూసిన నేను ఇంకా ఎదురు చూస్తూనే వున్నాను.

*హైదరాబాద్*
*ఏప్రిల్ 1978*

---

*లోకం చూశాక*

# పసిమి

అనగనగా ఒక ఊరు.

ఆ ఊరు అడవిలో వుంది.

ఆ అడవి నిండా చెట్లూ చేమలూ వున్నాయి. ముళ్ళ కంచెలూ, గెచ్చ పొదలూ వున్నాయి. అది చీమ దూరని చిట్టడవి; కాకి దూరని కారడవి. ఆ అడవిలో జంతువులూ, క్రూరమృగాలూ విచ్చల విడిగా తిరుగుతాయి. అవి అప్పుడప్పుడూ రాత్రిళ్ళు ఊరు మీద పడి ఏ గొడ్డునో, గోదాన్నో నోటకరచుకుపోతాయి. ఆ ఊరు జనం కూడా రాత్రిళ్ళు ఆ అడివి మీద పడి ఏ జంతువునో చంపి, ఊళ్ళోకి తెస్తారు. నల్గురూ పంచుకుంటారు.

ఇలా ఆ ఊరు పుట్టినప్పటి నుండీ జరుగుతోంది.

ఇంతలో దేశానికి స్వరాజ్యమొచ్చింది.

దేశానికి స్వరాజ్య మొచ్చినా ఆ ఊరికేమీ సంబంధం లేకపోయింది. కనుక ఏళ్ళ తరబడీ, దశాబ్దాల తరబడీ ఆ ఊరు ఒకే రకమైన జీవన సరళితో నడుస్తోంది.

ఉన్నట్టుండి ఆ ఊరికో రోడ్డు పడింది.

ఆ రోడ్డు పడ్డ మరుసటి సంవత్సరం అక్కడికో ఎలిమెంటరీ స్కూలు వచ్చింది. ఆ తర్వాత ఆ బడికి ఓ మాష్టారు కూడా వచ్చాడు.

అతను అమృతరావు.

అతను తన భార్యనీ, ఏడాది కొడుకునీ, ఖాళీ పొట్టనీ, డియివో ఆర్డర్సునీ, పట్టుకుని వచ్చాడు.

ఆ ఊళ్ళో ఉద్యోగమంటే గోదావరి జిల్లాల నుండి ఎవరూ రాలేదు. మన్యం ప్రాంతాల్లో ఉద్యోగమంటే ప్రాణాల్తో చెలగాటమే మరి.... అయినా ప్రాణాలెలాగూ పోయే వాడికి, అది పామైతే నేం, తాడై తే నేం... అమృతరావు ఆ ప్రాంతం ఎలాటిదైనా జీవితాన్ని ఏదో రకంగా వెళ్ల మార్చాలి గనుక ఆయా పరిస్థితుల్లో ఆ ఊరు వచ్చాడు.

అలా వచ్చి అప్పుడే పన్నెండేళ్ళయ్యింది–

ఈ లోగా మరో అబ్బాయి, మరో అమ్మాయి పుట్టుకొచ్చారు. వాళ్ళంతా అతని

దగ్గరే, ఆ చిన్నబడిలోనే చిన్న చదువులు చదువుతున్నారు.

కాలంచిత్రంగా జరిగిపోయింది. కాలంతో పాటు ఆ పరిసరాలు కూడా చిత్రంగానే మారిపోయాయి. వాగుల కింది భూములు సాగయ్యాయి. బిడీవోల జీపులు తరచూవచ్చి వెళ్తున్నాయి. అగ్రికల్చర్ డిమాన్‌స్ట్రేటర్లూ, మెడికల్ డిపార్టుమెంట్లూ సందర్శించి వెళ్తున్నాయి.

ఆ ప్రాంతానికి స్వతంత్రం యొక్క ఛాయలు నత్తనడకనే వచ్చి పడినా.... ఆ ప్రజలు మాత్రం మెచ్చుకోదగిన మార్పే జరిగినట్టు సంబరపడ్డారు.

ఆ ఊరు దగ్గర్లో మరో చిన్న ఊరుంది. ఆ పల్లెకు పట్నం ముస్తాబు జరిగింది.

అక్కడికి తాలూకాఫీసు వచ్చింది. ఓ స్టేట్ బ్యాంకు బ్రాంచీ, మరో రూరల్ బ్యాంకూ వచ్చాయి. ప్రజల సౌకర్యార్థం ఓ గవర్నమెంటు ఆసుపత్రి వచ్చింది. పై చదువుల కోసం ఓ హైస్కూలు, అందులో చదువుకునే గిరిజనుల కోసం ఓ హాస్టలూ వచ్చాయి. ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్సు వారి ఆఫీసు కూడా అక్కడికే వచ్చింది.

అలా ఆ పక్క ఊరు రోజురోజుకూ పట్నం ముస్తాబు జరిగి టౌనయ్యింది. ఆ టౌనుకీ, తన ఊరుకీ ఓ ప్రయివేటు బస్ సర్వీసు ఈ మధ్యనే ప్రారంభమయ్యింది. అమృతరావు కిప్పుడు తన బిడ్డల భవిష్యత్తు మీద కొంత నమ్మకం కలిగింది. ఇంతకాలం అపనమ్మకంతో, నిరాశతో, నిస్పృహతో వాళ్ళనీ అరణ్యంలో పెంచుకొచ్చాడు. వాళ్ళకీ, చెట్టూ చేమా తప్పించి, నాగరిక ప్రపంచంలో ఏదీ తెలియదు. ఇంతవరకూ ఏ ప్రయాణ సౌకర్యమూ లేని ఊరు కనుక వాళ్ళను ఎక్కడికి తీసుకెళ్ళాలన్నా తనకో యజ్ఞం లాంటిదే-

అలాంటప్పుడు తన జీవితం తనముందు నిలిచేది.

అతను ఆనాడు తన భార్యగా తానిష్టపడిన అమ్మాయిని రిజిష్టరు మ్యారేజి చేసుకుని, ఊళ్ళో సంచలనాన్ని లేపి, పెద్దల్లో అభాసుపాలై, జీవితానికి తాడూ బొంగరం లేని స్థితిలో ఆకలితో మలమల మాడి ఒక ఊరుకాదని మరోక ఊరు పొట్టచేత బట్టుకుని, ఆత్మ స్థైర్యంతో తిరుగుతు వుంటే, చివరికి ఓ ఎలిమెంటరీ స్కూలు టీచరుగా యిక్కడికొచ్చి జీవితాన్ని సాగించవలసి వచ్చింది.

ఇక్కడి కొచ్చిన కొద్ది రోజులకే ఆ ప్రాంతాల మీద అతనికున్న అనుమానాలు మబ్బు విడిచినట్టు విడిపోయాయి.

లోయలూ, కొండలూ, పచ్చని పచ్చిక బయళ్ళూ, సెలయేర్లూ.... చుట్టూ అల్లుకుపోయిన చెట్టూచేమలూ.... వాటి తాలుకు హాయలూ అతన్ని నాగరిక ప్రపంచాన్ని పూర్తిగా మరపింప జేసాయి.

ఈ పన్నెండేళ్ళూ ఎలా గడిచినా ఏనాడూ తన భార్యా బిడ్డల్ని తమ సొంత వూరుకు తీసుకెళ్ళ లేదు. నెలనెలా ఆఫీసు పనిమీద టౌనుకు వెళ్తున్నా తనతోపాటు టౌనుకయినా ఎన్నడూ తీసుకెళ్ళలేదు. రెండెడ్ల బండిమీదా, కాలినడకనా రోజంతా ప్రయాణం సాగిస్తే

ఈ లోగా పసిపిల్లలు తిండికీ, నీళ్ళకీ, నకనకలాడి సొమ్మ సిల్లి పోతారని అతని భయం.

కాని దేశం మీద మార్పు ఎంతలో రావాలి?

ఆ ఊరునుండి ఇప్పుడు మూడు పూటలా కొత్త టౌనుకు బస్ సర్వీసుంది. అదెప్పుడూ జనంతో కిటకిట లాడుతూ తొక్కిసలాటతోనే బయల్దేరి తిరిగి అలానే వస్తుంది.

అయినా ఆ ఊరుకది ఎంతో సౌకర్యం–

ఆ ప్రజలు దాన్నొక వరంగా భావిస్తున్నారు.

అమృతరావు ఆ రోజు టౌను కెళ్ళాలి.... నెలాఖరు రోజు–ఆ ఎలిమెంటరీ స్కూలు మిడిల్‌స్కూలై దానికి అతను హెడ్ మాష్టరయ్యాడు. అందుకని అక్కడ పేబిల్ తాలూకు చెక్కుమీద ఇన్‌స్పెక్టరు ఆఫ్ స్కూల్స్ వారి సంతకం తీసుకుని స్టేట్ బ్యాంకులో దాన్ని ఎన్‌క్యాష్ చేసుకుని, తిరిగొచ్చి తతిమ్మా ఉపాధ్యాయులకు తాను జీతాలివ్వాలి–

అమృతరావుకు తన పిల్లల భవిష్యత్తూ, వాళ్ళ జీవితాలను దిద్దవలసిన బాధ్యతా గుర్తొచ్చింది. ఒక పక్క నాగరిక ప్రపంచం క్షణక్షణం మారిపోతుంటే తాను కళ్ళు మూసుకుని ఊరుకోలేడు. టౌను కన్నా తీసుకెళ్ళి మిగతా ప్రపంచాన్ని కొంతైనా పరిచయం చేయాలనుకున్నాడు.

అమృతరావు తన ఇద్దరు కొడుకుల్నీ, కూతుర్నీ వెంటబెట్టుకుని ఆరోజే టౌనుకు బయల్దేరాడు. ఎన్నడూ బస్ ఎక్కని ఆపిల్లలు బస్సెక్కడం కోసం పడే సంబరాన్ని చూసి కొంత ఆనందం కొంత ఆవేదనా చెందాడు.

ఆ రోజు ఫస్ట్ బస్ రావడం చాల ఆలస్యమయ్యింది. అది తిరిగి టౌను చేరే సరికి ఉదయం పూట ఆఫీసులు మూతపడ్డాయి.

ఇన్‌స్పెక్టరుగారు మళ్ళీ అంత తొందరగా తిరిగి రారని తెలుసు– ఏ మూడుకో, నాలుక్కో వస్తే ఇప్పుడొచ్చినట్టే లెక్క–

అందుకని అమృతరావు తన పిల్లల్ని వెంటబెట్టుకుని మెయిన్ రోడ్డు మీద దిక్కుతోచని వాళ్ళా ఆలోచిస్తూ నడుస్తున్నాడు. అతను వాళ్ళ కోసం ఏదన్నా చేయాలి–

నిజానికి అతను వాళ్ళకేమేమి చూపాలో ఓ పథకం ముందే వేసుకుని బయల్దేరాడు. కాని మొదట తన పని ముగించుకుని ఆ తర్వాతనే వాళ్ళకోసం మిగతా సమయాన్ని వినియోగించాలను కున్నాడు. బస్ లేటు కావడం వల్ల ఇప్పుడు అన్నీ తారుమారయ్యాయి.

కనుక ఏం చేయాలి?

రైసుమిల్లు ఈ లోగా చూపిస్తే బావుంటుంది–

రైసుమిల్లు ఆ టౌను శివార్లలో ఈ మధ్యనే వెలసింది. పేరుకు మాత్రమే అది టౌను కనుక వాళ్ళా రైసుమిల్లు చేరడానికి ఏమంత సమయం పట్టలేదు. అక్కడ

మేనేజర్నడిగి లోనికెళ్ళారు-

ఆ ముగ్గురు పిల్లలూ లోపల యంత్రాల కేసి ఆశ్చర్యంతో చూస్తూ నిలుచున్నారు. అమృతరావు స్వతహా ఉపాధ్యాయుడే కనక మిల్లు గురించి కాస్త వివరంగానే చెప్పుకుపోయాడు.

చిత్రమేమంటే.... ఆ రైసుమిల్లు తనకీ కొత్తగానే వుంది- ఎప్పుడో తన చిన్నప్పుడు తన ఊళ్ళో చూసిన ఆ రైసు మిల్లుకీ, ఈ రైసుమిల్లుకీ ఎక్కడా పోలికే లేదు. పెద్ద చక్రాలూ, బెల్టులూ.... వాటిని తిప్పటం కోసం పెద్ద శబ్దంతో నడిచే ఆయిలు ఇంజనూ.... ఇవేమీ ఇక్కడ లేవు. ఇక్కడ ఇవన్నీ కరెంటు మీద ఆటోమెటిక్‌గా నడుస్తున్నాయి.

అందుకని అమృతరావు కూడా ఆ మిల్లుకేసి అంత ఆశ్చర్యంగానూ చూశాడు. వేగంగా పరిగెట్టే వైజ్ఞానిక ప్రపంచం... అందులో మనిషి జీవన సరళి, అది మార్పు చెందే తీరూ.... ఇవన్నీ ఊహించుకుని అతను విస్మయం చెందాడు.

ఆ సన్నని రొదలో అతను ఏమి చెప్పాడో, వాళ్ళేమి విన్నారోగాని, ఆ లోపల ఉన్నంత సేపూ ప్రతిదాన్నీ కొత్తవలన, భయంతోనూ, విస్మయంతోనూ, వాళ్ళు నోరు వెళ్ళబెట్టుకుని చూశారు.

అమృతరావు అక్కడి యంత్రాన్ని చూశాక, అవతల మిగత విభాగాన్ని కూడా చూడ్డం కోసం మిల్లు బయటికి వచ్చాడు.

ఆ యంత్రాలు రొదనుండి విముక్తయిన చెవులకు బయట ఏదో హాయైన అనుభూతి కలిగింది.

మేనేజరు కనిపించాడు.

అమృతరావు తన పిల్లల్ని చూపిస్తూ.... నా పెద్దకొడుకు, ఏడో తరగతి, వీడు నా చిన్నకొడుకు- నాల్గోతరగతి, నడిపిది.... ఒక్కతే కూతురు- ఆరోతరగతి అన్నాడు.

మేనేజరు పెదాల మీదకు మందహాసం తెచ్చుకుని.... మీదేవూరు? ఏంచేస్తారు. అని సాదరంగా అడిగాడు. మాటలు కాసేపు ఒకదాని తర్వాత ఒకటి అలా ముందుకు దొర్లాయి. అమృతరావు అలా అక్కడ రెండు మూడు నిముషాలు అతనితో గడిపి మిగత భాగం చూడ్డం కోసం సిద్ధమయ్యాడు.

అతను వెనుదిరిగే సరికి తన పిల్లలెవ్వరూ తన దగ్గర కనిపించలేదు. వీళ్ళేరీ!... అంటూ చుట్టూ కలయ చూశాడు.

ఔను! ఇంతవరకూ ఇక్కడే నా వెనకాలే నిల్చున్నారు కదా.... లోనిగ్గాని వెళ్ళారేమో-

వాళ్ళు మిల్లులోపల ఎక్కడా కనిపించలేదు.

అతను బయటకు వచ్చి చుట్టూ మరోసారి కలయ చూశాడు. ఇంతలో ఏమైనట్టు? తనలో తాను గొణుక్కున్నాడు.

అలా మిల్లు బయటకు వెళ్ళారేమో....బొత్తిగా అదుపులోవుండరు....

అతను గేటు ముందుకు వచ్చి రోడ్డు వేపు చూశాడు. ఇంతలోనే ఏమైనట్టు?

ఆ చుట్టుపక్కల అంతా మైదానం కాబట్టి అతను తిన్నగావున్న రోడ్డు మీద కనుచూపు మేర వరకూ తన దృష్టిని సారించాడు. ఎక్కడా కనిపించలేదు.

అమృతరావు తత్తర పడ్డాడు.

అయ్యో! ఉన్నట్టుండి ఎలా మాయమయ్యారు వీళ్లు.... అసలేం జరిగింది?

అతని గుండెల్లో అలజడి ప్రారంభమయ్యింది.... ఆలోచనలు పరిగెత్త సాగాయి.

అతను మిల్లులోకి వెళ్ళి చూసిందే మరోసారి చూశాడు. అతను బయటికి వచ్చి గేటువద్ద నిలుచుని లోనికీ బయటికీ మార్చిమార్చి చూసి చివరికి ఆమైదానంలో ఆ తిన్నని రోడ్డు వెంబడి పరుగునీ, నడకనీ ఏకం చేసి కొంతదూరం వెళ్ళాడు....

అతనికి మధ్యలోనే అనిపించింది వాళ్ళిటు వచ్చుండరని-

అతనికి పిచ్చెక్కినట్టుయ్యింది.

మిల్లుకేసి నడిచాడు. ఈ శాన్య మూలలో నూతికేసి తొంగి చూశాడు. మోటారు పైపులు లోనికి దిగి వున్నాయి. నిశ్చలంగా వున్న నీరూ, దానిపై ఎన్నాళ్ళ నుండో కదలక పట్టిన నాచూ అలాగే వుండే సరికి అతనికి ఆ అనుమానమూ నివృత్తి అయ్యింది.

కాని అతని కాళ్ళల్లో నిస్సత్తువ....చేతుల్లో నిస్సత్తువ....

ఎవరన్నా వీళ్ళని యిక్కణ్ణించి ఎటైనా తీసుకు పోయారా?

అతను మేనేజర్ని అడిగాడు.... పనివాళ్ళ నడిగాడు....

ఎవరో అన్నారు.... అటు మిల్లు వెనక్కి వెళ్ళి చూశారా- ఆ గోడ సందులోంచి వెళ్ళి చూడండి అని-

అమృతరావు అటుకేసి కంగారుగా నడిచాడు.

అతను ఆ గోడ మలుపు తిరగే సరికి అతని కళ్ళు తన ముగ్గురు పిల్లలమీద నిలిచాయి.

అతను క్షణం ఆగాడు. గాబరానించి తేరుకుని ఊపిరిని గుండెల్నిండా తీసుకున్నాడు.

అక్కడ వాళ్ళ చేతుల్లో రాళ్ళూ, కర్ర ముక్కలూ వున్నాయి. వాళ్ళు అవతలివేపు గోడ కేసి నిక్కినిక్కి చూస్తూ గుసగుసలాడుతూ ఉల్లాసంగా కనిపించారు.

ఆ గోడమీద నాల్గు పందుకోతులున్నాయి. దాన్ని ఆనుకున్న చెట్టుకొమ్మ మీద కివి ఎగురుతూ, తిరిగి గోడమీదికి ఉరుకుతూ ఫీట్సు చేస్తున్నాయి. వాళ్ళకేసి పళ్ళికిలించి బెదిరిస్తున్నాయి.

అతను వాళ్ళను ఏమనాలి?

అమృతరావుకి నోటమాట పెగల్లేదు. ఆ క్షణం ఏం చేయాలో తోచలేదు. వాళ్ళకోసం ఇంతవరకూ పడ్డ హైరానా కారణంగా కాబోలు... ఏం చేస్తున్నార్రా యిక్కడ అని చిన్నగా గసురుకున్నాడు.

వాళ్ళు ముగ్గురూ చేతుల్లోని రాళ్ళూ, కర్రముక్కలూ కిందికి జారవిడిచేసి తండ్రి

దగ్గరకు పరిగెత్తుకొచ్చారు.

అమృతరావు మనసు కుదుట బడ్డా, కాళ్ళూ చేతులాడని నిస్సత్తువు నుండి మాత్రం తేరుకోలేదు.

అయినా అతను వాళ్ళకా మిల్లు మిగత భాగాన్ని చూపించడానికి తిరిగి సంసిద్ధుడయ్యాడు. అ పక్కనే వున్న ద్వారంలోంచి లోనికి తీసుకెళ్ళాడు.

ఇప్పుడు తన గుండెల్లో గాబరాకు మిల్లు రొదకూడా తోడయ్యింది.

ఎదురుగా మళ్ళీ యంత్రాలు-

వాళ్ళకేం చెప్పాలి? ఎలా చెప్పాలి?

ఆ చిన్న ముఖాల్లో అప్పటికే మళ్ళీ మునుపటి గాంభీర్యం చోటు చేసుకుంది. ఆ మెరిసే కళ్ళల్లో మళ్ళీ బితుకు బితుకుమనే భయం, భీతి,మరికొంత టెన్షన్-

అమృతరావుకు వాళ్ళ భవిష్యత్తు మీద ఆందోళన-

తాను ఆధునిక ప్రపంచానికి దూరంగా వాళ్ళను పెంచుతున్నానన్నవెలితి-

ఈ రూపంగానైనా కొంత విజ్ఞానాన్ని అందిస్తున్నానన్న తృప్తి-

కాని వీళ్ళేరి....

ఆ ముగ్గురూ అతని వెనుక లేరు-

అప్పటికే వాళ్ళు గుమ్మం దగ్గరికి చేరి మళ్ళీ ఆగోడకేసీ, ఆ కోతులకేసీ నిక్కినిక్కి చూస్తున్నారు.

కాంతి పుంజుకున్న కళ్ళతో కిలకిల నవ్వుతూ మరీ చూస్తున్నారు.

అమృతరావు ఒక్క క్షణం ఖిన్నుడయ్యాడు.

అతనికి కోపం వచ్చేసింది. అది ఎవరిమీదా కాదు. కాని కోపం మాత్రం వచ్చేసింది. ఆ కోపాన్ని దిగమింగుకుంటూ వాళ్ళ దగ్గరికెళ్ళాడు.

"కోతుల్ని మనూళ్ళో రోజూ చూట్టా లేదురా.... ఇక్కడా అవే చూడాలి రా... మీకు ---------- అన్నాడు.

కాని అతనికి తెలియని బాధేదో లోపల దేవినట్టయ్యింది-

"ఇక్కడ ఈ మిల్లూ, ఈ మిషన్లూ, చక్రాలూ... ఇవేవీ మీకంటికి నచ్చలేదురా..." అన్నాడు మరింత బాధను దిగమింగుతూ-

కాని వాళ్ళ కళ్ళల్లో పుంజుకున్న కాంతీ, వెల్లి విరిసిన ఆనందపు రేఖా అమృతరావు గమనించనివాడు కాదు-

అతనిలో పరాజయం లాంటి ఆవేదన చోటు చేసుకుంది.

అతను వాళ్ళని తీసుకుని గేటుదాటి మౌనంగా బయటికి వచ్చేశాడు.

పిల్ల వెధవలు, పిల్ల వెధవలు-

ఎంతైనా పిల్ల వెధవలు పిల్ల వెధవలే....

వాళ్ళకి విజ్ఞానం కన్నా వినోదమే ముఖ్యం-

ఈ యంత్రాల కన్నా ఆ కోతులే ముఖ్యం-

అతను మెయిన్ రోడ్డు మీద నడుస్తున్నంత సేపూ అతని ఆలోచనల్లో శూన్యం-

అతను అలా నిర్లిప్తంగా ముందుకు సాగుతూ టౌను సెంటరు చేరేసరికి ఆకలి అనిపించింది.

అరే! -...... వీళ్ళకు నేనేమీ తినిపించలేదు.... ఇంటివద్దయితే వాళ్ళమ్మ యీపాటికి... అంటూ వాళ్ళ ఆకలి గురించి ఆలోచించాడు.

'ఏమైనా తింటార్రా....'

ఇదేం ప్రశ్న! తింటారా అని అడగట మేమిటి?

అతను తిన్నగా హొటల్లోకి నడిచాడు.

అదొక బారు పాక... తాటి నిట్రాళ్ళతోనూ, వెదురుపేళ్ళ కటకటాల్తోనూ ఈ మధ్యనే లేచిన సరికొత్త హొటలు.

ఆ పిల్లలు వాళ్ళకు కావలసినవి తెప్పించుకుని ఆ బల్లచెక్క బెంచీల మీద కూచుని తినడం బహు సరదాగావుంది.

అమృతరావు కౌంటరులో బిల్లిచ్చేశాడు. ఆ సమయానికి ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్సువారు తిరిగి ఆఫీసుకు రావచ్చును. చెక్కుమీద ఆయన ఎండార్సుమెంటు తీసుకుని బ్యాంకులో ఎన్‌క్యాష్ చేసుకోవచ్చును.

అతను ఆ ఆలోచనల్తో హొటల్ బయటకు వచ్చాడు.

అతని కళ్ళముందు ఓ సినీ వాల్‌పోస్టర్....

అది బయట నల్గురికీ కనిపించడం కోసం పెద్ద తడికెకు అంటించి ఎదర ఆ హొటల్ కటకటాలకు జేరేశారు.

అమృతరావు కళ్ళు మిరిమిట్లు గొలిపాయి-

అతను దాన్ని పై నుండి కిందికి ఆశ్చర్యంతో మార్చి మార్చి చూశాడు. నమ్మకం కుదిరింది. అయినా వాళ్ళనక్కడే వదిలి అతను కౌంటరు దగ్గరకెళ్ళాడు.

"ఏ మండీ! బయట సినిమా వాల్‌పోస్టర్ ఉంది.... ఈ ఊరికి టూరింగ్ టాకీస్‌గాని వచ్చిందా?

"పదిరోజుల్నుండి ఆటేస్తుంటే..."

అమృతరావు మళ్ళీ వాల్‌పోస్టర్ దగ్గరకెళ్ళాడు.

ఎస్వీ రంగారావు... జి.వరలక్ష్మి... రేలంగి....

అతని మనసులో ఏదో తెలియని పులకింత... తాను మళ్ళీ కౌంటరు దగ్గరకెళ్ళాడు-

"సిన్మా ఎలా వుందండీ?.... చూశారా? బావుందా?...."

"బొమ్మకేం... బ్రహ్మాండంగా వుంది.... సరికొత్త బొమ్మ.. ఫుల్ కలెక్షన్లు...." అన్నాడు.

'హాలెక్కడండీ?...'

'కన్నమ్మ గుడికి ఎగువున.... ఈ రోడ్డమ్మటే ముందుకు వెళ్తే కుడివేపున కన్పిస్తుంది...'

అమృతరావు గడియారం చూసుకున్నాడు.

ఇప్పుడతనికి ఇన్స్పెక్టర్ ఆఫ్సూ్కల్స్వారు తప్పక దొరకుతారు. నలుగురితో పాటు అక్కడ తన పనీ పూర్తవుతుంది. స్టేట్ బ్యాంకులో ఎన్క్యాష్ కూడా చేసుకో వచ్చును... అన్నీ అయిపోతాయి.

కాని ఈ పనులన్నీ అయ్యేసరికి అక్కడ సినిమా టిక్కెట్లు దొరకుతాయన్న నమ్మకం లేదు-

ఎస్వీ రంగారావు... జి.వరలక్ష్మి... రేలంగి-

బొమ్మ బాగుందట... ఫుల్ కలెక్షన్లట-

అమృతరావు మళ్ళీ ఆలోచనలో పడ్డాడు-

సాయంత్రం ఏడు తర్వాత తన ఊరుకు మరో బస్ లేదు. మరో మార్గం లేదు. ఇక్కడ సహదేవుడనే మాష్టారున్నా ఏనాడూ అతనింటిలో రాత్రిపూట మజిలీ చేయలేదు. ఇంటివద్ద తన భార్య ఒకర్తే వుంటుంది-

పిల్లల కోసం ఎదురు చూస్తూ రాత్రంతా కునుకు రాక కూచుండి పోతుంది. ఆమె ఆందోళన పడుతుందో ఏమో... రేపు మిగత టీచర్లకి జీతాలు ముట్ట జెప్పాలి... ఈ ఇన్స్పెక్టరు ముండాకొడుకు సాడిస్టుగాడు...

ఈ ఒక్కరోజా దాటితే కావాలని నాల్గురోజులు ఎక్కడికో చెక్కేసి క్యాంపు అంటాడు.... ఓ రోజు లేటయితే ఈ టీచరు వెధవలు-

ఛ!

ఇవన్నీ ఇప్పుడెందుకు?

అసలు వీటి గురించే ఆలోచించగూడదు. ఆలోచించామా.... ఈ జీవితంలో మనం మనకోసం ఏమీ చేసుకోలేం-

'నాన్నా... మీరిక్కడున్నారా?... మేం రోడ్డుమీదకు వెళ్ళిపోయాం... మీరు కనపడక కంగారు పడిపోయాం... ఇక్కడేం చేస్తున్నారు. నాన్నా మీరు?....'

'నేనమ్మా... నేనూ...నేనూ... సినిమా వాల్పోష్టరమ్మా.... పోనీలే నేనిక్కడే వున్నాను కదా....'

'చిన్నీ ఏడ్చేశాడు నాన్నా....'

ఒరేయ్ చిన్నీ... అమ్మలూ... సిన్మాకెళ్దామ్రా?

అంటే ఏంటి నాన్నా....?

సరే నాతో పదండ్రా-

అతని నిస్తేజపు కళ్ళల్లో ఏదో వెలుగు.

అతను తన ముగ్గురు పిల్లల్నీ తీసుకుని టూరింగ్ టాకీస్ వేపు హడావుడిగా నడక సాగించాడు.

అమృతరావు నడుస్తున్న నడకలో ఇప్పుడు ఎంతో మార్పుంది. అది అతని పిల్లల నడకలా నమ్మకంతో, నిర్భయంతో పడుతోంది. అతను బాధ్యతలను పక్కకు నెట్టేశాక ఆ ముఖం మీద అలుముకున్న టెన్షన్ మబ్బు విడినట్టు విడిపోయింది. సాయం సంధ్యలో, వినీలాకాశంలో, మిణుకు మిణుకు మంటూ స్వచ్ఛంగా మెరిసే నక్షత్రపు కాంతిలా ఏ ఒత్తిడికీ ఆస్కారం లేని అమాయకమైన దరహాసం అతని ముఖంలో స్ఫురిస్తోంది.

ఆ కోతుల్ని చూస్తున్న పిల్లల అమాయకపు ముఖాల్లో మెరిసే మెరుపే అది-

హైదరాబాద్
*2.8.1986*

# గాలిపటం

శీతాకాలం నీరెండ-

విశాలమైన పచ్చికమైదానం చుట్టూ ఎత్తయిన బిల్డింగులున్నాయి.

అవి ఎమ్మెల్యే క్వార్టర్సు-

అన్ని కాలాల్లోనూ ఆ పచ్చిక మైదానం అందంగా, నవనవలాడుతూ పచ్చగా వుండడం కోసం ప్రభుత్వం వారి పనివాళ్ళు అక్కడ ప్రత్యేకించి వున్నారు.

అక్కడ గుంపులు గుంపులుగా పిల్లలు-

వాళ్ళ చూపులన్నీ ఆకాశం కేసి వున్నాయి. ఆకాశంలో గాలిపటాలెగురుతున్నాయి.

అవి ఆ ఎత్తయిన ఎమ్మెల్యే క్వార్టర్సు మీంచి ఎగరేస్తుంటే, ఎగరెయ్యని వాళ్ళు కిందనించి వాటికేసి ఆహ్లాదంగా చూస్తున్నారు.

అది శీతాకాలం సీజనల్ ఆట-

ప్రతి ఏటా సంక్రాంతి కొచ్చే పండగ ఆట-

రాయుడుగారు పచ్చిక మైదానంలోకి వచ్చారు.

ఆయన వచ్చింది, గాలిపటాలు ఎగరెయ్యడానికి కాదు, ఎగిరే వాటిని చూసి ఆనందించడానికీ కాదు. అయినా ఆ లాన్ లో కూచుని, ఆకాశంలోకి చూస్తూ ఆలోచనలు సాగిస్తున్నారు.

ఆయనతో పాటు తన కులం వాడూ, కొంత బంధుత్వం ఉన్నవాడూ, మరికొంత బంధుత్వం కలుపుకోబోతున్నవాడూ అయిన కేశవులుగారున్నారు. ఆయనగారు రాయుడుగారి పక్కనే చతికిలబడి పోయారు.

రాయుడుగార్ని ఆశ్రయించి, వాళ్ళరాకను తెలుసుకుని వచ్చిన ప్రకాశం మాత్రం పక్కన నిలుచునే వున్నాడు.

ప్రకాశం ఇంగ్లీషు చదువులు చదువుకున్నాడు. ఏదైనా ఉద్యోగం వస్తే పెద్దలకు విధేయతగానూ, అధికారులకు అణకువగానూ, తన ఉద్యోగానికి నమ్మకంగానూ, ఆపై సుఖ జీవనానికి తాను ప్రతీకగానూ, గడిపెయ్యాలన్న గుంపెడాశ ఉన్నవాడు.

అయితే ఎప్పటికీ రాని ఉద్యోగం కోసం మరెంతోకాలం గడపలేక రాయుడు గార్ని ఆశ్రయించాడు.

రాయుడుగారు పలుకుబడి వున్న పెద్దమనిషి-

ఆయన ఏమీ చదువుకోకపోయినా, చదువుకున్నవాళ్ళంటే ఆయనకు ఎనలేని అభిమానం-

ఆ కారణంగా ఆయన తన చిన్నదయిన పల్లెటూళ్ళో పెద్ద కాన్వెంటును కట్టించారు. విధవ కూతురుపేర రెసిడెన్సియల్ కాలేజీని స్థాపించి, అనునిత్యం వాటిని ఆయన తన కంటికి రెప్పలా కాపాడుకుంటున్నారు. ఎకరాలున్న అల్లుళ్ళను కాదని, ఎకరాలతో పాటు డాక్టరులైన అల్లుళ్ళను తెచ్చి విదేశాల్లో ఉద్యోగాలు చేయిస్తున్నారు.

ప్రస్తుతం ఆయన పూచికపుల్ల ఇవతలిది తీసి అవతల వేయకపోయినా, తాను గడించినదీ, పూర్వులు గడించినదీ అయిన ఆస్థి అధమం ఆరేడు తరాలకి అవలీలగా సరిపోతుందన్న ధీమా ఆయనకున్నది. అది పండించి పెట్టడానికి ఐదారూళ్ళ జనం ఆయనకున్నారు.

అందుకని ఆయన మాటంటే అందరికీ అంత గురి.

అందుకని ప్రకాశం ఆయన్ని ఆశ్రయించి, ఆయన రాజధానికి వచ్చినప్పుడల్లా వచ్చి ఆయన్ని కలుస్తుంటాడు.

ఇక్కడున్నన్ని నాళ్ళూ ప్రకాశం ఆఫీసులకు ఇంగ్లీషులో చేయవలసిన కరెస్పాండెన్సు లన్నీ చేసిపెడ్తాడు. అప్లికేషన్ లు టైపు చేయించటం, పోస్టాఫీసులో బిళ్ళలు అతికించడం, లాడ్జిలో పక్కలు సర్దడం, విస్కీలో ఐస్ ముక్కలు వెయ్యడం, కిందికెళ్ళి విల్సుపాకెట్ తేవడం లాంటవి ఎన్నో అతగాడే చేసిపెడ్తాడు.

రాయుడుగారు కేశవులు గారితో పాటు ఆ పచ్చని పచ్చిక మైదానంలో కూచున్నారు. ఆ లాన్ లో కూచోవడం ఎంత హాయైనదైనా ఇప్పుడా హాయి, హాయనిపించడం లేదు. ఆకాశంకేసి చూస్తున్నా ఆలోచనలన్నీ ఎదురుగా వున్న ఎమ్మెల్యే క్వార్టర్సులోని, ఒక్కొక్క గదిలో రహస్యంగా జరిగే రాజకీయ ఎత్తుడగల మీదనే వున్నాయి.

ఎందుకంటే-

రాజకీయాల్లో శాశ్వతంగా శత్రుత్వంగానీ, మిత్ర త్వంగానీ ఉండవట-

ఆయన తన మనుషులనుకున్న నలుగురైదుగురు శాసన సభ్యులు అసమ్మతి వర్గంలో చేరిపోయారు. సంతకాలు సైతంపెట్టి గవర్నరుకు పంపేశారు. అందుకని ప్రభుత్వాన్ని ఆదుకోవడం కోసం ఆయన్ను వెంటనే రమ్మని రాజధాని నుండిపిలుపు వచ్చింది పిలుపందుకుని వచ్చిన రాయుడు గార్కి ఇక్కడ ఈ రాజకీయా లేవీ కొరుకుడు పడ్డం లేదు.

మూడు రోజులుగా సాగుతున్న రాజకీయంఒక కొలిక్కి రాకపోగా, చినికి చినికి గాలివానైనట్టు, దాని స్వరూపస్వభావాలే మారిపోయాయి.

ప్రభుత్వాన్ని నిలబెట్టుకోవడ మన్నా, పవర్‌ని గుప్పిట్లోకి తీసుకోవడమన్నా మాటలా మరి-

రాయుడుగారు వెనుదిరిగి చూశారు.

ప్రకాశం అక్కడ కూచోవాలో అలా నిలుచునే వుండాలో తెలీక అంతవరకూ నిలుచునే వున్నాడు.

రాయుడుగారు వెనుదిరగడం చూసి, ప్రకాశం మరో అడుగు ముందుకు వేసి ఆయనగారి మాటకోసం అప్రమత్తమయ్యాడు.

'రెండు విల్సుపాకెట్లు.... ఫిల్టరువి... ఓ అగ్గిపెట్టె...' అంటూ పదిరూపాయల నోటును అందించారు.

ప్రకాశం గేటు దాటి, రోడ్డు దాటి కిళ్ళీకొట్టు చేరాడు.

రాయుడుగారి మాట మేరకు రెండు విల్సు పాకెట్లూ, ఓ అగ్గిపెట్టె కొని, తానూ ఓ సిజర్సు సిగార్ వెలిగించాడు. కాస్త దమ్ములాగి, ఎక్కడో దూరంగా దృష్టిని సారించాడు.

అక్కడ, ఆ ఎమ్మెల్యే క్వార్టర్సు కాంపౌండు వెలుపల ఎటు చూసినా గొప్పవాళ్ళుండే విలువైన గొప్ప కట్టడాలే. అవి....

ఆకాశాన్నంటే ఆనంద నిలయాలు- ఏసీరూమ్స్ వున్న స్వర్గసీమలు-

వాటికి పోటీపడుతూ మరోపక్క సచివాలయం, మిగిలిన ప్రభుత్వ భవనాలు-

వీటన్నిటినీ ఆలంబన చేసుకుని కళ్ళు మిరిమిట్లు గొలిపే వ్యాపార కేంద్రాలు.

అతను ఇంకా అలానే ఆ విలాసవంతమయిన భవనాలకేసి చూపు సారించాడు. చుట్టూ కనుచూపు మేర కలయ చూశాడు.

ఆ ఎమ్మెల్యే క్వార్టర్సుకు కాస్త దూరంగా, ప్రహరీ గోడకు వారన పల్లంలో ఆరిన కుంపట్లల్లే పూరిగుడిసెలు-

ఈ మహానగరం నడిబొడ్డున, ఆకాశహర్మ్యాల సరసన, ఈ పూరిగుడిసెలు- వాళ్ళ గుడిసెల మీద ఆకాశంలో ఎగిరే గాలిపటాలు.

అతను సిగరెట్టు పూర్తిగా పీల్చేసి, తిరిగి ఎమ్మెల్యే క్వార్టర్సు కేసి నడిచాడు.

అక్కడ ఆ గేటు పక్క గోడవార, చినిగిన చొక్కాల్లో, మాసిన శరీరాల్తో, ఆ హట్స్‌లోని కుర్రాళ్ళు గుంపులు గుంపులుగా చేరి అతనికి కనిపించారు. వాళ్ళు గేటులోంచి మైదానం లోకీ, ఆకాశంలోంచి ఎగిరే గాలిపటాలకేసీ ఆబగా, ఆశగా చూస్తున్నారు.

పాపం, వాళ్ళచేతికీ ఓ గాలిపటం అందకూడదూ....

ప్రకాశంగేటులోంచి ముందుకు నడిచాడు.... లాన్ లో రాయుడుగారూ కేశవులుగారూ రిలాక్సవుతున్నారు.

ప్రకాశం అందించిన రెండు విల్సు పాకెట్లూ, అగ్గిపెట్టె అందుకుని చెరొక సిగరెట్టూ ముట్టించి, హాయిగా దమ్ములాగి... 'ఏంచేద్దాం' అన్నారు కేశవులుగారితో-

కేశవులుగారు కాస్త రిలాక్సయి.... ఆలోచనలో పడి 'కాసేపు ఆగుదాం' అన్నారు.

ప్రకాశం తానక్కడ నుండి దూరంగా జరిగి కూచుండిపోయాడు. వెల్‌వెట్ లాంటి మెత్తని లాన్ చల్లగా తగిలి హాయి అనిపించింది. మేనువాల్చి హాయిగా పడుకోవాలన్నంత ఉత్సుకత లేచింది.

కాని ప్రకాశం అలా విశ్రమించ లేదు-

నిరుద్యోగం అతన్ని అలా విశ్రమించ నీయదు.

గత నాల్గేళ్ళుగా- అందరి దృష్టిలో అసమర్థుడిగా, పరాయి నీడను బతికే మనిషిగా ఇప్పటికే సగం చచ్చి బతుకుతున్నాడు. ఇంకెన్నాళ్ళిలా నిరుద్యోగిగా మిగిలిపోవాలి? అయోగ్యులు సైతం నేడు వాళ్ళవాళ్ళ ఉద్యోగాలను బట్టి యోగ్యులుగా గుర్తింపబడుతున్నారు. అన్ని విధాలా అర్హతుండి, యోగ్యత వుండి తాను వాళ్ళ కన్నా దిగదుడుపుగా బతుకుతున్నాడు. ఈ పరీక్షలూ, ఇంటర్వ్యూలూ తనలాంటి వాళ్ళకోసం కాదనీ తెలిసిపోయింది.

అందుకే ప్రకాశం రాయుడు గార్ని ఆశ్రయించాడు.

రాయుడుగారు అభయమిచ్చారు. ఇచ్చినట్టుగానే మినిష్టరుగారి పియ్యే చేత ఫోను చేయించా[illegible].

ఎటొచ్చీ ఉద్యోగమే దొరకటం లేదు.

వేకెన్సీలుఎన్నివున్నా కొత్త ఉద్యోగాలివ్వడానికి వీలులేని ప్రభుత్వ నోటిఫికేషనుంది. అందుకని సుదూరతీరాల్లో ఎక్కడా ఏ ఆశాకిరణం ప్రకాశానికి కనిపించడం లేదు.

రాయుడుగారు ఆ నోటిఫికేషన్‌లు మనకాదు లేవోయ్ అన్నారు.

అందుకని ప్రకాశానికి ఆశ చావలేదు.

రాయుడుగారు రాజధానికి వచ్చారని తెలిసి వచ్చిన ప్రకాశానికి ప్రస్తుతం ఏమి చెయ్యాలన్నదే సమస్య-

ప్రభుత్వాలు పడిపోయే ముందు ఎమ్మెల్యే క్వార్టర్సు ఇలా పొగలూ సెగలతో కుతకుతలాడిపోవడం ఏమంత అనూహ్యం కాదుగాని-

ప్రతి గదీ ఒక పంజరం- కాకుంటే ఒక బోను.

ఆ బోనులోకి ప్రవేశించాక 'కార్యసాధన' జరిగే వరకూ అందులో ఈ సభ్యులు విధిగా బందీలు.

వాళ్ళకు నీరూ, నిప్పూ, గాలీ వగైరా అన్నీ ఆగదిలోనే జరుగుతాయి.

అక్కడ కాకపోతే ఏ ఖరీదైన హొటల్లోనో, ఏ రహస్యపు ఆకాశ హర్మ్యాల్లోనో జరుగుతాయి.

అక్కడ విస్కీ, జిన్, రమ్.... ఏదైనా తాగవచ్చు, మేనకనైనా కోరవచ్చు-

అసలు మెజారిటీ సంఖ్యలో ఎమ్మెల్యేలు చేతికి చిక్కాలేకాని. ఏ రాష్ట్రానికైనా లేపుకుపోవచ్చు, దేశద్రోహి అన్న అభియోగం రాకపోతే పరాయి దేశానికైనా తరలించుకు పోవచ్చు-

ఎందుకంటే ఒక్కసారి మనిషి బోను బయటికి వచ్చాడా.... మనవాడు కాడు.

ఎందుకంటే ఇప్పుడు ఒక్కొక్క సభ్యుడూ లక్షలమీద పలుకుతున్నాడు- కోట్లమీద పెట్టుబడుల్తో రాజకీయ వ్యాపారం జరుగుతోంది-

ఎవడు ఏ పదవికి ప్లేటుఫిరాయిస్తాడో, ఎవడు ఎంతకు గడ్డికరుస్తాడో అంతుచిక్కని పరిస్థితిగా వుంది.

ఎందుకంటే- 'పవర్' అంత గొప్పది.

ఆ పవర్ చేతిలో వుంటే తన బావుటాను ఆకాశంలోచుక్కలు దాటేవరకూ ఎగరెయ్య వచ్చును.

అందుకే ఇక్కణ్ణించి కొందరు ఢిల్లీ పరుగిడితే.... ఢిల్లీనుండి మరికొందరు ఇక్కడికి పరుగెత్తుకొచ్చారు. వాళ్ళ వెనుక కరెన్సీలు పరుగెత్తుకొచ్చాయి. మందీ మార్బలం పరిగెత్తుకొచ్చింది.

అందుకని ఆ క్వార్టర్సు గదుల్లో, ఎన్నడూ లేనంత తాపం పెరిగింది..

కేశవులుగారు 'ఇప్పుడేం చేద్దాం....' అన్నారు.

రాయుడుగారు బరువుగా లేచి, కేశవులుగార్తో భారంగా ముందుకు నడిచారు.

ప్రకాశానికి వాళ్ళతో అప్పుడే వెళ్ళాలనిపించలేదు. నిజానికి ప్రకాశం కూడా రాయుడుగారితో పాటు క్వార్టర్సులోనికి వెళ్ళాలి. వాళ్ళ వాళ్ళ ఆదేశాల మేరకు తాను చేయవలసినవి చేయాలి-

ప్రకాశం మరికొంత రిలాక్సయ్యి ఆకాశంలోకి చూస్తున్నాడు.

ఆకాశంలో గాలిపటాలు ఎగురుతున్నాయి.

ఎన్నో గాలిపటాలు..... రంగురంగుల గాలిపటాలు పెద్దవీ, చిన్నవీ, అనేక రకాల గాలిపటాలు... ఎంతో ఎత్తున ఆకాశాన్నంటే గాలిపటాలు.

కాని అన్నింటికీ దారం ఆధారం-

ఆ దారం ఆ ఎమ్మెల్యే క్వార్టర్సు టెర్రస్ పైనున్న వాళ్ళ పిల్లల, వాళ్ళవాళ్ళ పిల్లపిల్లల గుప్పెట్లల్లో వుంది.

కాని అక్కడ పోటీ వుంది.

వీచే గాలికీ, లాగే ఊపుకీ ఉండుండి అవి పల్టీలు కొడుతున్నాయి. వేరే గాలిపటం మీదికి పోటీపడి, పల్టీలు కొట్టి యధాస్థానానికి వచ్చేస్తున్నాయి.

అది చూస్తున్న పిల్లల్లో ఉల్లాసాలు.

వాటిని ఎగరేసే వాళ్ళల్లో ఉత్సాహాలు.

అవి పల్టీలు కొట్టినప్పుడల్లా మిన్నంటే కేరింతలు.

ప్రకాశానికి కూడా వాటికేసి చూడడం ఉల్లాసంగా వుంది.

ఒకదాని మీద ఒకటి పడి, పల్టీలు కొట్టి మరొకదాన్ని కత్తిరించడమే దాని గెలుపు.

ఆకాశంలో ఓ గాలిపటం తెగిపోయింది.

తెగిన గాలిపటం రాలిన ఎండుటాకులా గాలి అలలపై సుడిగుండం తిరుగుతోంది.

టెర్రస్ మీది కుర్రాళ్ళు వేగంగా కిందికి దిగి లాన్‌లోకి వచ్చారు. లాన్‌లోని కుర్రాళ్ళు సైతం అటుకేసే పరుగులు తీసారు.

అందరూ ఆ తెగిన గాలిపటం కేసే పైకి చూస్తున్నారు.

గాలిపటం నేలకేసి నెమ్మది నెమ్మదిగా దిగుతోంది.

అంతలో గేటు తోసుకుని ఆ హట్స్‌లోని కుర్రాళ్ళు.... శరవేగంతో పరుగులు తీస్తూ లాన్‌లోనికి వస్తున్నారు. వాళ్ళ చేతుల్లో పొడవాటి కర్రలు.... ఆ కర్రల చివర ముళ్ళ కంపలు.... వాళ్ళంతా వాటిని చేత్తో పట్టుకుని పరుగులు తీస్తూ దాడి చేస్తున్నట్టు ఇటుకేసే వస్తున్నారు.

ప్రకాశం ఒక క్షణం తత్తర పడ్డాడు.

ఆ గాలిపటం ఎటుకేసి ఎక్కడ దిగుతుందో ఆ దిశగా అక్కడకు అందరూ పరుగులు తీశారు. దాన్ని అందుకోవడంకోసం తొక్కిసలాడుతూ మూకుమ్మడిగా అందరూ చేతులు పైపైకి చాచారు.

కాని ఎవరి చేతుల్లో కర్రలున్నాయో అవి మరింత పైకి లేచాయి. వాటి చివర కట్టిన ముళ్ళకంపలో ఆ దారాన్ని చిక్కించుకుని ఒకడు గుంపులోంచి ముందుకు పరుగులు తీశాడు. వాడి వెనకాల ఆ హట్స్ కుర్రాళ్ళంతా ఆనందంగా అనుసరించారు.

విజయ గర్వంతో వాళ్ళు ఒక్కుమ్మడిగా గేటువేపు నడిచారు.

ఎవరి చేతుల్లో కర్రలున్నాయో వాళ్ళే దాన్ని చేజిక్కించుకున్నారు.

ప్రకాశం అంతా చూస్తూనే వున్నాడు. కాని తానేమి చూశాడో తనకిప్పుడు బాగా తెలుసు

అందుకే అతనిలో అనేకమైన ప్రశ్నలుదయించాయి. అంతావిని రాముడికి సీత ఏమౌతుందని ప్రశ్నించినట్లు–

నేనెవరిని....

ఎందుకు పుట్టాను.

ఎందుకు చదివి ఏం సాధించాను? ఏమీసాధించలేని బతుక్కి నేనెంత వరకూ బాధ్యుడను... అనుకుంటూ ఎన్నో ఎన్నో ప్రశ్నలు–

ఎందుకంటే ప్రకాశం మూడురోజుల్నుండి ఆ ఎమ్మెల్యే క్వార్టర్సు కేసి చూస్తూనే వున్నాడు.

అక్కడ అధికారం కోసం జరిగే పోరాటం తనకి తెలియందేమీ కాదు. పదవిని గుప్పెట్లో బంధించుకోవటం కోసం, అధికారాన్ని ఆకాశంలోకి ఎగరెయ్యడం కోసం జరిగే అరాచకాన్నీ, అప్రజాస్వామ్యాన్నీ చూస్తూనే వున్నాడు.

ప్రతి ఒక్కరూ దేశానికి తానై ఓ నిర్మాణాత్మక శక్తిగా వుండాల్సిన తరుణంలో వ్యర్థంగా, నిరర్థకంగా, నిర్జీవంగా ఇంతమంది ఇలా బజారునపడి తిరగాల్సిన అగత్యమేమిటి?

తాను తన హక్కులకోసం పోరాడాల్సి వుండగా, ఎవరి దయా దాక్షిణ్యాల కోసమో పడిగాపులు పడుతూ యిలా పడి వుండడం దేనికి- అనుకున్నాడు.

అప్పుడు అతని కళ్ళముందు విజయగర్వంతో ఆహట్స్ కుర్రాళ్ళు ఒక్కొమ్మడిగా గేటు వేపు నడిచిపోవడం కదలాడింది.

అతను లేచి ఆదారినే నడిచి వెళ్ళి అదృశ్యమయ్యాడు.

** 16-2-1992 ఆంధ్రజ్యోతి ఆదివారం అనుబంధం. **

హైదరాబాద్
*26.8.1990*

లోకం చూశాక

# రాబడి

పొద్దు గుంకుతోంది.

వెంకన్న అప్పుడే కుప్ప నూర్పులనుండి వచ్చాడు.

అతని నెత్తినిండా, వంటినిండా చిన్ని చిన్ని గడ్డిపరకలూ, ధాన్యపు నూగూ వుంది. అతని చెవులమీదగా కారిన చెమట ఎండి మెడమీద చారలుచారలుగా తెట్టు కట్టింది. అతని చేతిలో ములక్కర్ర అరుగుకు జేరేసి అక్కడే చతికిలబడ్డాడు. పొగాకు చుట్ట చుట్టి ముట్టించాడు.

సూరమ్మ కోమటింటికని చిల్లరను గుప్పిట్లో బిగించి, ఓ చేత్తో యీనెల బుట్టా మరో చెత్తో నూనెసీసా తీసుకుని బయల్దేరింది. వెంకన్నను చూసి అగిపోయింది. అతని ముఖం రుసరుసలాడుతోంది. అతను ఎవరితో నన్న పోట్లాడాడేమోనని పలకరించడానికి జంకి నిలబడిపోయింది.

ఆ సమయానికే వాకిట్లోని ఊరకుక్క రామయ్య తోలుకొస్తున్న ఆవుపెయ్యను చూసి భొయ్యని మొరగడం మొదలుపెట్టింది. దాంతో ఆ ఆవుపెయ్య మరీ బెదిరింది. అది బుసలుగొట్టి, మెడను నేలవరకు వంచి వాకిలిని తొక్కేస్తూ రామయ్య చేతిలోని పలుపును విదిలించుకోబోయింది. సూరమ్మ వాకిలంతా తొక్కేసిందని రామయ్యను కేకలేసింది. 'గొడ్డుమోతు పెయ్యేమిటి రామయ్య మామా' అని అడిగేడు చిన్నోడు.

రామయ్య ఆ పూళ్ళో గొడ్లను కోసుకు బతికే మనిషి.

అతను ఆవు మెడకు తగిలించిన కన్నెతాడును వొడేసి పట్టుకుని దాన్ని అదలించమని చిన్నోడిని పిలిచాడు.

చిన్నోడు అన్నగారి దగ్గర ములక్కర్ర అందుకుని– 'ఓసి ముక్కా! తెగ మారాం చేస్తున్నావ్ – కోతకొచ్చేవులే నడు.' అని నడుమకడ్డంగా ఒక్కటందుకున్నాడు.

చిన్నోడు ఆవును తోలుకుంటూ వెళ్ళిపోయాడు. ఆ వెనకే సూరమ్మ కూడ కోమటింటికి బయల్దేరింది.

వెంకన్న కిదేం పట్టలేదు.

అతను కోతకోసిన వరిచేలమీంచి పశ్చిమ ఆకాశాన్ని చూస్తున్నాడు. ఆ ఆకాశం

మీద ఎర్రదనం, చిందిన రక్తంలా వుంది. అది క్రమేపీ గడ్డకట్టి నల్లబడిపోతున్నట్టు ఆకాశం నల్లబడిపోయింది.

సూరమ్మ కోమటింటినుండి తిరిగి వచ్చి పొయ్యి రాజేసి, వెంకన్నకోసం నీళ్ళు పెట్టింది. అంతవరకు అక్కడే కూచున్న వెంకన్న లేచి పేటలోకని బయల్దేరాడు. వాకిలి దాటుతుండగా సూరమ్మ పిలిచి నీళ్ళు కాగుతున్నాయి పోసుకు వెళ్ళమంది.

సూరమ్మ మాట విని ఆగిపోయాడు.

ఆమె నాజూకుగా లేకపోయినా సన్నని తీగలా బలంగా వుంటుంది. పొడవైన నున్నని మెడ, గుండ్రని బుజాలూ చూడ్డానికి ఆకర్షణీయంగావుటాయి. ఆమె తాటాకు మొరుజాలూ, కంపా, పొయ్యి ముందర వేసుకుని పొయ్యిలోకి ఎగదోస్తోంది. ఆ వెల్తుర్లో పొయ్యి సెగకూ, లేచేపొగకూ ఆమె కళ్ళు మిటకరిస్తుంటే వెంకన్నకు ఆమె మరీ అందంగా కనిపించింది.

సూరమ్మ నీళ్ళు కాగిన తరువాత రాతి బండ దగ్గర పెట్టింది. వెంకన్న చెమటతో తడిసిన బనీను విప్పేసి ఆ రాతిబండ మీద నిలుచుని నీళ్ళు పోసుకున్నాడు. అలా నీళ్ళు పోసుకున్నంతసేపు అతను ఆ వేడికి నోటితో ఎగవూపిరి పదేపదే పైకి లాగేవాడు. తొడలమీద. వీపుమీద పోసుకున్నప్పుడు అతనికెంతో హాయి అనిపించేది.

నిజానికి అతను రోజంతా రెక్కలు ముక్కలు చేసుకుని కుప్ప నూర్చేటప్పటికి వొళ్ళంతా అలసిపోయింది. వేసవి కావడం చేత ఆ రోజు ఎండంతా అతని శరీరాన్ని కాల్చి వేసింది. సూర్యుడి కిరణాలు అతని రక్తంలో కలసి ఇంకిపోయాయి. అతనిచెవుల మీదనుండి వీపు మీదగా చెమట నిరంతరం కారుతూనే వుంది. ఇద్దరూ ముగ్గురు చేయగల పని అతను సునాయాసంగా చేయగలడు. నిజానికి అతనిలా పనిచేయగల మనిషి ఆ వూళ్ళోనే కాదు, చుట్టుపక్కల మరెక్కడా లేరు.

పొలంలో బెల్లు తీసేటప్పుడు, నాట్లు వేసేటప్పుడు, కోతలు కోసేటప్పుడు, కుప్పలు నూర్చేటప్పుడు, గట్లు వేసేటప్పుడు. ఒకటేమిటి పొలం పని ఏదైనా సరే అతను విసుగూ విరామం లేకుండా చేస్తాడు.

వ్యవసాయమంటే వెంకన్నకు మహాప్రీతి. చిన్నప్పటినుండీ తండ్రితో పాటు తమ సొంత పొలంలో వ్యవసాయం చేశాడు. వాళ్ళకుండే ఆ కొద్ది నేల ఎలా పోయిందోగాని గత మూడేళ్ళుగా అతను కూడా కూలీనాలీ చేసుకోక తప్పింది కాదు. పోయిన పొలం గురించి ఎప్పుడైనా ప్రస్తావన వస్తే, ఆబోతుల కాళ్ళ దగ్గర లేగదూడలు మసల్లేవురా – ఎంతున్నా ఈ మడుసులు మోసంతోనే బతుకుతార్రా అంటాడే గాని, అతని తండ్రి అది ఎలాపోయిందో చెప్పడు.

అయినా వెంకన్న మనిషిమీదా, మనిషి కష్టంమీదా వున్న నమ్మకం పోగొట్టుకోలేదు.

చిన సోమయ్యగారు ఆ వూళ్ళోని రైతుల్లో మోతుబరి. ఆయన ప్రతి తొలి ఏకాదశికీ వెంకన్నకు కబురుపంపేవాడు. వెంకన్న వుంటే తన పొలంలో తప్పక బంగారం పండుద్దని ఆశ. అందుకే కూలిపనికి అక్కడిక్కడికి రోజూ వెళ్ళే బదులు మా కమతంలోనే ఉండ

రాదా- రెండు పుట్లు ధాన్యం. ఓ పూట భోజనం పెడతామని వెంకన్నకు ముందే మోజు చూపేవారు.

వెంకన్న ఆ పాలేరుతనానికి ఎన్నడూ ఒప్పుకోలేదు. అయినా చినసోమయ్యగారి పొలంలో పనుండగా యితర్ల పొలంలోకి ఎన్నడూ పోలేదు.

చినసోమయ్యగార్కి సుమారు నలభై యేళ్ళుంటాయి. అయిన పలుకుబడి కోసం, గౌరవం కోసం యీమధ్య ఖద్దరు వేస్తున్నాడు. ఆయన మామగారు సమితి ప్రెసిడెంట్ అయినప్పటినుండీ పలుకుబడి మరీ పెరిగింది. ఇంటివద్ద తరచూ ఏ బి.డి.వోయో, తహసిల్ దారో, ఆఫీసరో కలిసి ఆయనకి తీరిక లేకుండా చేస్తున్నారు. పైగా సిమ్మెంటు పర్మిట్లకనీ, ఎరువుల పర్మిట్లకనీ హైదరబాద్ చుట్టూ తిరగడంతోనే సమయమంతా సరిపోతుంది.

అందుకని వ్యవసాయం చూడ్డానికి క్షణం తీరికుండడంలేదు. ఈ కారణంగానే వెంకన్న కూడ పాలేరుగా వుంటే బావుండును అనుకున్నాడు. కాని అతను ఒప్పుకోలేదు. అంత మాత్రాన సోమయ్యగారి వ్యవసాయం అగిపోలేదు. మూడేళ్ళగా క్రిష్ణమూర్తి పాలేరుగా వుంటున్నాడు. ఉండి మంచి అనుభవం కూడా సంపాదించాడు. పైగా సోమయ్య గార్కి తలలో నాలుకలా మెలుగుతున్నాడు. గత రెండేళ్ళలోనూ అతను పండించినది పంటే పంట. కనుక తన వ్యవసాయంలో క్రిష్ణమూర్తి వున్నా యిబ్బంది లేదని తెలిసి సోమయ్యగారు ఇంటివద్ద కంటే హైదరాబాదు లోనే ఎక్కువ గడుపుతున్నారు.

ప్రస్తుతం చినసోమయ్యగారి వ్యవసాయం చూడ్డానికి కేవలం క్రిష్ణమూర్తి ఒక్కడే కాదు, బ్లాక్ నుండి అగ్రికల్చర్ డిమాన్ స్ట్రేటర్లున్నారు. ఆఫీసర్ల అండదండ లున్నాయి. పై నించి కావలసినన్ని ఎరువుల పర్మిట్లున్నాయి. ఇక క్రిష్ణమూర్తి అనుకున్నంత పంట పండించలేకపోవటం దేనికి. ఆ యేడు సారవా పంట ఎవరూ ఎప్పుడూ ఊహించ లేనంత పండింది.

అప్పుడు చినసోమయ్యగారు పంటను కంకెమీదుండగా చూసుకున్నారు. బంగారు వన్నెతో వంగిన కంకెలు నిగనిగలాడుతూవుంటే ఆయన తన కళ్లను మరల్చకుండా చేనుమీదనే నిలిపారు. ఆ తర్వాత క్రిష్ణమూర్తితో మనూరి పేరు ప్రతిష్టలు యీ పంట మీదనే వుందిరా - అని గర్వంగా అన్నారు.

క్రిష్ణమూర్తికి తెలీకుండానే ఏదో ఆనందం కలిగింది.

సారవా పంటలు గడిచి, తిరిగి దాళవా పంటలు కూడా చేతికివచ్చేసాయి. చిన సోమయ్య గారు మాత్రం ఎప్పటిలా హైదరాబాద్ వెళ్తున్నారు, వస్తున్నారు. ఆయనకు హైదరాబాదే ఓ సొంత వూరై పోయింది.

ఇప్పుడు యీ వేసంగి దాళవా పంటకూడా బాగానే పండింది. కోతలు ముగిసి వారం దాటింది ఇక కుప్పలు నూర్చడమే తరవాయి. ట్రాక్టరుతో నూర్చాలంటే ఎవడు బడితే వాడు సరిపోడు. కాస్త చెలాకీగా వుండాలి. అందుకని చీకటిపడేవేళ కూలివాళ్ళకోసం

క్రిష్ణమూర్తి పేటలోకి వెళ్ళాడు. మొదట వెంకన్న కోసమని యింటికి వెళ్ళి అతన్ని పిలిచాడు.

వాకిట్లోకి వచ్చిన వెంకన్నతో పొద్దుటేల కుప్పలు పడగొడుతున్నాం- పనిలోకి వస్తావా అని అడిగాడు క్రిష్ణమూర్తి.

వెంకన్న ఎంతమంది కావాలేటని అడిగేడు.

నీ సంగతి చెప్పు - అని క్రిష్ణమూర్తి వెంకన్న మాటకోసం ఎదురుచూస్తూ అక్కడే నిలుచున్నాడు. వెంకన్న వెంటనే సమాధాన మివ్వలేదు. ఓ నిముషం తచ్చాడి ఆ తర్వాత క్రిష్ణమూర్తిని ఉండమని పేటలోకి వెళ్ళాడు. తతిమ్మా వాళ్ళతో సహా వచ్చాక వెంకన్న 'కూలిపడి సంగతేటి- గిట్టుబాటైతే వస్తాం-' అన్నాడు.

క్రిష్ణమూర్తి కూలి పెంచమంటారన్న సంగతి ముందే గ్రహించాడు. అయినా మాట వరసకి - ఉళ్ళో రివాజు ప్రకారమే- 'తక్కువిత్తామేటి- మూడు రూపాయిలు గదా-' అన్నాడు.

ఆ కూలికైతే రామన్నాడు వెంకన్న. పక్కవూళ్ళో ఎంతిస్తున్నారో తెలుసా అని మిగిలిన వాళ్ళడిగారు.

'సరే- అవన్నీ తెలీకుండానే యెగసాయం సేత్తున్నారేటి రైతులు. ఏ వూరు రివాజు ఆ వూరిది. పోనీ మీరెంత అడగదల్చుకున్నారో ఆ ముక్క తేల్చండి- అడిగొస్తాను' అన్నాడు క్రిష్ణమూరి.

'మూడున్నరయితే వస్తాను-' అన్నాడు వెంకన్న.

క్రిష్ణమూర్తి అమాటే అడిగొస్తానంటూ వెళ్ళి ఓ అరగంటలో తిరిగివచ్చాడు. సోమయ్య గారు హైదరాబాద్ నుండి ఉదయానికల్లా వస్తారనీ, ఆయన వచ్చేక కూలి సంగతి మాటాడి చెబుతాననీ అన్నాడు. ఆయన మూడున్నరకు ఒప్పుకోకపోతే, కనీసం మూడుం పావలాకైనా ఏర్పాటు చేస్తానని చెప్పాడు. పని మాత్రం రేపు ఆగటానికి వీల్లేదని వాళ్ళ మాట కోసం ఆగాడు.

వెంకన్న సరేనన్నాడు.

అసలే ఆడపెత్తనం, సివర్న తిరికాసొత్తే పేచీలొత్తాయి- బంగారమ్మగారేమన్నారేటి- అని ఓ పెద్దమనిషి అడిగాడు.

ఆ! ఆవిడ మాటకేంలే- అంటూ ఆ విషయాన్ని కొట్టిపారేసాడు క్రిష్ణమూర్తి. ఆ తర్వాత ఎంతమంది పనిలోకి రావలసిందీ చెప్పేసి వెళ్ళిపోయాడు.

మరుసటి రోజు ఉదయం నాలుగ్గంటలకల్లా కళ్ళంలోకి బల్లలు మోసుకు వెళ్ళారు. ట్రాక్టర్లు వచ్చాక కళ్ళంలో కుప్పలు పడగొట్టారు. పని జోరుగా సాగింది.

వెంకన్న పనలను పైకెత్తి బల్లమీద బాది ట్రాక్టర్లు కిందికి చెలాకీగా విసురుతు వుంటే అతనే ఓ యంత్రంలా అనిపించే వాడు. అతనికి శ్రమించడం అలవాటై పోయింది. ఆ రోజు నూర్చవలసిన కుప్పలు పూర్తయినాయి.

---

సాయంత్రం అయ్యింది.

అన్న ప్రకారం చినసోమయ్యగారు ఆ ఉదయమే ఊరునుండి వచ్చేసారు. సాయంకాలం అయ్యాక ఆయన తన సరదాకోసం చేయించుకున్న అద్దాల సవారీ బండెక్కి కళ్ళంవద్ద దిగారు. ఎదురొచ్చిన క్రిష్ణమూర్తికి 'కేష్ బాగ్'ని అందించి, వెంకన్నను చనువుగా పలకరించి, నేరుగా ధాన్యం రాశికేసి నడిచారు. ఉదయం నుండీ కాపలా వున్న తన బావమరిదిని ఏ మాత్రం రాలుబడి అయ్యిందని అడిగారు. దానికి క్రిష్ణమూర్తి అంచనా వేసి చెప్పాడు.

అతని పెదాల మీద తృప్తిగా ఓ చిరునవ్వు మెదిలింది. జేబులోంచి ఘరో చుట్ట తీసి ముట్టించి, ఓ దమ్ములాగి కూలీల వంక చూశారు. క్రిష్ణమూర్తిని పిలిచి తలా మూడు కూలిచ్చెయ్యి అన్నాడు.

క్రిష్ణమూర్తి సోమయ్యగారి దగ్గరకు వెళ్ళి బంగారమ్మగారితో కూలి విషయం ఓ మాట చెప్పాను; మీతో చెప్పలేదా బాబూ- ఆళ్ళు యీ కూలి గిట్టదంటున్నారు అన్నాడు.

క్రిష్ణమూర్తి వంక ఓ క్షణం చూసాడు.

సోమయ్యగారి మాటకోసం క్రిష్ణమూర్తి అలానే నిలుచుండిపోయాడు. ఆయన చుట్ట బయటికి తీసి, చివరకొరికి, నమిలి, ఉమ్మి, మూడే ఇయ్యి అని చెప్పి చుట్టలోంచి మరో దమ్ములోనికి లాగారు.

క్రిష్ణమూర్తి కూలిపంచి పెట్టాడు. ఒక్కొక్కళ్ళు కూలి తీసుకుని వెళ్ళిపోయారు. వెంకన్న కూడ తీసుకున్నాడు. అందరూ అంతే తీసుకుంటున్నప్పుడు తను అడగడం దేనికని తనూ ఊరుకున్నాడు. అయినా సరైన కూలి నిర్ణయం కాకుండా మాట మీద రావడం తమదే పొరబాటని తెలిసింది. కష్టపడ్డ కష్టానికి ఓ పావలా డబ్బు లిమ్మన్నాముగాని దరమాని కివ్వమనలేదు. అని మనసులోనే తిట్టుకున్నాడు.

వెంకన్న ఇంటికి తొందరగా వెళ్లాలని పరిమళ్ళు దాటుకుంటూ అడ్డదారిని పేట వేపు నడక సాగించాడు. అతనితో మరో ఇద్దరు కూడా వున్నారు. వాళ్ళకి కూడ ఆ కూలి నచ్చలేదు. అందరూ అక్కడ కుక్కిన పేనులా నోరు మెదపకుండా కూలి తీసుకు వచ్చేసారు.

చినసోమయ్య గారి అద్దాల సవారీ బండి గజ్జల మోత దూరంగా వినిపిస్తోంది. అది పుంతలోంచి నేరుగా ఊళ్ళోకి పోతోంది. అటుకేసి ముగ్గురూ చూస్తూ ముందుకు నడక సాగించారు.

కళ్ళంలోకి వచ్చి, తలా మూడు ఇయ్యి అని నిలబడి ఇప్పించాడు చూడు. డబ్బంటే అంతగట్టి అని పక్కవాడు వెంకన్నతో అన్నాడు.

'ఉన్నవాడెప్పుడూ లేనోడికి పెట్టరు లేరా! వీలైతే ఆడిది కూడా ఏసుకోవాలనే సూత్తాడు.' అని రెండవ వాడన్నాడు.

వెంకన్నకు కూడా కడుపు మండింది.

రోజంతా రెక్కలు ముక్కలు చేసుకుని యీ కొడుకులకు గాదులు నింపితే మన కష్టాన్ని చూసైన ఓ పావల డబ్బులు ఇవ్వలేరని తిట్టాడు వెంకన్న.

ఆ వెనుకనే పిల్లిలా వస్తూన్న మునసబుగారి తమ్ముణ్ణి చూసి ముగ్గురునివ్వెరపోయారు. వెంకన్న ముందు వెనుకలు చూడకుండా మాట జారినందుకు గాబరా పడ్డాడు. పైగా మునసబు తమ్ముడు అంటే గాలికీ, ధూళికీ పోట్లాడే పేచీ కోరని అందరికీ తెలిసినదే-

అతను 'ఎవర్నిరా బూతులాడుతున్నావ్-' అంటూ ముందుకొచ్చాడు.

'మీ కెందుకు లెండి బాబు, మీ రెల్లండి- మా గొడవేదో మాది-' అంటూ తతిమ్మా యిద్దరూ సర్దబోయారు. కాని అతను వాళ్ళిద్దరినీ నెట్టి ముందుకొచ్చాడు.

వెంకన్న కాస్త తత్తరపడ్డాడు.

'ఎవడికిరా నీవు గాదెలు నింపేది. ఆళ్ళందరూ....'

'ఏమండోయ్, మీదిమీదికి రాకండి. నాకు తిక్క లేచిందంటే అసలు మంచోణ్ణి గాను. ముందర దారి తొలగండి-' వెంకన్న దురుసుగా అన్నాడు.

వెంకన్నను ఓ తోపు తోసేసి ఏం చేస్తావురా అంటూ తన చేతిలోని కర్ర వెంకన్న మీదికి ఎత్తాడు. వెంకన్న వెంటనే అది చూసుకోకపోతే అతని తల పగిలేదే. వెంకన్న ములకర్రతో దెబ్బను కాసుకున్నాడు. అతను మరోసారి కర్ర ఎత్తబోయాడు. వెంకన్న తన ములకర్రను అడ్డంగా తిప్పి అతని గుండెల మీద మోపి గెంటి పారేస్తే. అతను వెల్లకిల్లా

'లంజాకొడకా నన్ను కొడతావట్రా-' అంటూ దొరికిన మట్టిబెడ్డను తీసి వెంకన్న మీదకు విసిరాడు. అది వెంకన్న గుండెలమీద తగిలి పెచ్చులై యిసుకలా రాలి పడింది.

వెంకన్నకు కోపం ఆగలేదు.

అతని ములకర్రను బలంకొద్దీ పైకెత్తాడు. అది పడితే వాళ్ళ చిట్లీ కర్రతో పాటే ఊడొచ్చును. కాని పక్కనున్న యిద్దరూ అక్కడినుండి వెంకన్నను లాక్కుపోయారు.

ఈ గొడవ యింతటితో ఆగదనీ, కూలి గొడవ కాస్తా రైతులను ఎదిరించి, ఎదురు తిరిగి కొట్టారనే ఉదంతంగా మారిపోతుందనీ ఆ క్షణంలోనే వెంకన్నకు అర్థమయ్యింది.

✿ ✿ ✿

పేటకు ఓ ఏభై గజాల దూరంలో ఆరుబయలు రెపరెపలాడుతూ హరికేన్ లాంతరు వెల్తుతోంది. ఊరకుక్కలు అక్కడికి చేరి పారేసిన ఎముకల కోసం పనికిరాని మాంసపు ముక్కల కోసం తెగ కాట్లాడుతున్నాయి. జాపాచేసిన లబ్బీ సాయిబు మెత్తని గుడ్డతో కత్తిని చుట్టి కాళ్ళవద్ద పెట్టుకుని చూస్తున్నాడు. అక్కడికి మాంసానికని వచ్చిన మిగతా వాళ్ళు దాని చుట్టూ గుమిగూడారు.

రామయ్య కొద్ది నిషాలో వున్నాడు.

'రామయ్య మామా- నాకో రూపాయి వాటా ఇయ్యి- తొందరగ ఎళ్ళాలి-' అన్నాడు చిన్నోడు.

చిన్నోడంటే రామయ్యకు ఎక్కడలేని ప్రేమ. వాడికి నిండా పధ్నాలు గేళ్ళు లేవు.

వాడి చెలాకీతనం రామయ్యకు మహా యిష్టం

రామయ్య ఆ ఆవు చర్మం మీది పోగుల్లోంచి నచ్చిన ఒకదాన్ని ఎత్తి చిన్నోడి తపేలాలో వేసి, నీదేరా బోణీ అన్నాడు. చిన్నోడు దాన్ని అందుకుని తెగమురిసిపోతూ ఇంటికి పరుగుతీశాడు.

చిన్నోడు ఇంటికి వచ్చేసరికి అక్కడి వాతావరణం అంతా అయోమయంగా వుంది.

ఓ పదిమంది రైతులు వాకిట్లో నిలుచుని, వెంకణ్ణి బయటకు పిలవమని క్రిష్ణమూర్తితో అన్నారు క్రిష్ణమూర్తి తటపటాయిస్తూ అక్కడే నిలుచున్నాడు. అతను ఇలాంటి పరిస్థితుల్లో ఇక్కడికి రావడం మంచిదికాదని తెలిసినా తప్పింది కాదు. అవతలి పేటలో తన ఇంటికి వెళ్తున్న క్రిష్ణమూర్తిని రమ్మని, రానంటే కసిరి తీసుకొచ్చారు. అందుకని తప్పలేదు.

చిన్నోడు వాళ్ళందరి చేతుల్లోను లావు పాటి కర్రలను చూసి, ఏదో జరగబోతుందని ముందే గ్రహించి, భయంతో అలానే నిలుచుండిపోయాడు. వెంకన్న కూడా ఆ గొడవ జరిగినప్పటి నుంచీ ఇలా జరుగుతుందేమోనని అనుమానపడుతూనే వున్నాడు.

మునసబు తమ్మునితో వచ్చినవాళ్ళు పొగరు బోతులని తెలుసు. అందుకే వాళ్ళతో ఏం మాట్లాడినా లాభం లేదని ఇంట్లోకి వెళ్ళిపోయాడు. వెంకన్న ఇంట్లోకి వెళ్ళాడే గాని, అలా వెళ్ళడం అతనికి నచ్చలేదు. భయపడి ఇంట్లో దూరాడని అంటారని మనసు పీకింది. అతని ఇంటిముందు రభస జరగడం తనకి చిన్నతనం అని లోనికి వెళ్ళినా, జరగవలసింది జరగక మానదని వెంటనే బయటకు వచ్చేశాడు.

వెంకన్న అనుకున్నంత పనీ జరిగింది. అప్పటికే భయపడిన సూరమ్మ, మొగుణ్ణి కొట్టడంతో మరీ భయపడి గుండె బాదుకుంటూ పేటలోకి పరుగుతీసింది. అది చూసి చిన్నోడు కూడ భయపడ్డాడు. వాడి చేతిలోని తపేలాను అక్కడే పడేసి వచ్చిన దారినే వెనక్కి పరుగు తీశాడు.

క్రిష్ణమూర్తి కూడ దీన్ని సహించలేక పోయాడు. మనిషిలో ఏదైనా పొరపాటు వుంటే పంచాయితీ పెట్టి తప్పనిపించి, ఏ జరిమానా అయినా విధించాలిగాని యిలా దౌర్జన్యంగా మనిషిమీద పడి చావగొట్టడం ఏమాత్రం ధర్మం కాదని దాన్ని సహించలేక పోయాడు. అయినా చేసేదిలేక మునసబు తమ్ముణ్ణి వాటేసుకుని వెంకన్నను కొట్టొద్దని బ్రతిమాలాడు. అణ్ణి రేపు పంచాయితీకి తీసుకొచ్చి మీకాళ్ళమీద పడేసి, జరిగిన దానికి క్షమాపణ చెప్పిస్తా నన్నాడు.

క్రిష్ణమూర్తి మాటను ఎవరూ ఖాతరు చెయ్యలేదు. వీళ్ళను ముందే అణచక పోతే మరీ మీతిమీరి పోతారనీ, ఇలా జరగవలసిందేననీ, ఆ పడిపోయినవాణ్ణి మరోసారి ఎత్తి కుదేసి, కూచోపెట్టి చెంపలమీద ఇష్టం వచ్చినట్టు గుద్దారు. రైతుల మీద ఎవరైనా చెయ్యి చేసుకుంటే వాళ్ళకి కూడ ఇదే శాస్తి జరుగుతుందని, తతిమ్మా రైతులు అన్నారు. అక్కడకు చేరిన పేట జనానికి రైతులను ఇదేంపని అని అడగడానికి ధైర్యం చాల్లేదు.

వెంకన్న రైతుల మీద చెయ్యి చేసుకున్నందుకు రైతులొచ్చి కొడుతున్నారని

మాత్రం అందరికీ తెలిసింది. రైతుల మీదనే చెయ్యి చేసుకుంటాడా అన్నారు కొందరు- కాని అందరూ లోలోన జరుగుతున్న దాన్ని మాత్రం సహించలేకపోయారు.

చిన్నోడు అప్పటికే పరుగు పరుగున వెళ్ళి 'రామయ్యమామా' అని అరిచాడు.

రామయ్య చిన్నోడి మాటవిని కళ్ళు మరీ చిన్నవిచేసి ఆ లాంతరు కాంతిలోంచి చుట్టూ మూగిన జనంలోకి చూసాడు. చిన్నోడు జనాన్ని ఒత్తిగించి లోనికి వచ్చాడు. చిన్నోడి గాబరాను చూసి ఏమైందిరా అన్నాడు రామయ్య.

'మా అన్న నెత్తి బద్దలు కొట్టేసారు మామా... రైతులొచ్చి... మా ఇంటివద్ద... అంటూ ఎక్కిళ్ళు, వచ్చే ఏడుపు ఆపుకుంటూ అన్నాడు.

నెత్తి బద్దలు కొట్టేసారన్న మాట విన్న రామయ్యకు ఎక్కడలేని కోపం వచ్చింది. 'ఎంత తప్పు జేస్తే మాత్రం ఇంటిమీద పడి కొడతారా- కూడుంటే వుండుగాక, డబ్బుంటే ఉండుగాక, కాని యింత లోకువా- ఇలానే చెల్లనిస్తే ఎంతకాలమైనా ఇలానే చెల్లుద్ది. ఒరేయ్! సిన్నోడా పద్దాలుగేళ్ళొచ్చాయి- ఎదవన్నర ఎదవా... నెత్తి బద్దలు కొడితే ఏడుస్తూ వచ్చావా- ఆ కత్తట్టి కెళ్ళి ఆళ్ళని నరికి పడెయ్యక సూత్తావేరా...' అన్నాడు.

చిన్నోడు రామయ్య మామ వొంక అలానే ఓ క్షణం రెప్పెయ్యకుండా చూసాడు. ఆ తర్వాత ఏమనుకున్నాడో ఏమో ఒక్క ఉరుకు ఉరికి ఆ చర్మం మీదున్న కత్తిని అందుకుని అక్కడ నుండి రెప్పపాటున మాయమయ్యాడు.

చిన్నోడు వాకిట్లోకి వచ్చేసరికి వెంకన్న నేలమీద కూలబడ్డాడు. అక్కడ ఏమి జరుగుతున్నా చిన్నోడికి పట్టలేదు-

పేటలోని జనానికి అప్పటికే స్పృహ వచ్చింది. కాని చిన్నోడికది వాళ్ళందరి కంటే ఓ క్షణం ముందే వచ్చింది.

'ఏయ్-' అని పెద్దగా అరిచాడు చిన్నోడు. అది అప్పుడే కూత పట్టిన కోడి పుంజు అరుపులా అనిపించింది. ఆ అరుపు విని అందరూ అటు కేసి చూసారు. ఆ చీకట్లోంచి మెరుపులా దూసుకువస్తుంటే అతని చేతిలోని కత్తి ఎవరికీ కనిపించలేదు. చిన్నోడు మరీ దగ్గరకు వచ్చేసరికి క్రిష్ణమూర్తికి కనిపించింది. దాన్ని వాటంలో పెట్టి మునసబు తమ్ముని మీదకు ఉరకడం చూసాడు.

చిన్నోణ్ణి ఆగమంటూ క్రిష్ణమూర్తి పక్కకు తిరిగాడు. అప్పటికే అది మునసబు తమ్ముడి మీదకు దూసుకుపోతోంది. కాని క్రిష్ణమూర్తి అడ్డు రావడంతో అది కాస్తా క్రిష్ణమూర్తి డొక్కలో దూరిపోయింది.

చిన్నోడు క్రిష్ణమూర్తి డొక్కలో యిరుకున్న కత్తిని బలంగా గుంజి లాగేసాడు. ఆ కత్తికి ఎంతమంది దొరికితే అంతమందినీ ఖాళీ చేసేటట్టు దూసుకుపోతోంది.

కాని చిన్నోడి ఆశ నెరవేరలేదు.

అప్పటికే వాళ్ళు ఆ చీకటిలో కనుమరుగయ్యారు.

ఆ చీకట్లో వాళ్ళు పరుగెత్తే కాళ్ళ చప్పుడు వినిపించింది. ఆ చప్పుడు వెంట చిన్నోడు అరుస్తూ చీకట్లోకి దూసుకుపోయాడు.

---

అప్పుడు ఆ వరస వంద గుడిసెల్లోనూ ఒక్కసారిగా గగ్గోలు లేచింది. బీభత్సంతో జనం అక్కణ్ణుండి పారిపోయారు.

క్రిష్ణమూర్తి రక్తపు మడుగులో బోర్లపడి వున్నాడు. అతని గుండెల్లోంచి వేడి రక్తం బయటకు చిందుతోంది.

వెంకన్న మాత్రం స్పృహలేకుండా పడి ఉండడం చూసి వాళ్ళవాళ్ళు వచ్చి మరోచోటుకు తీసుకుపోయారు,

అవతలి పేటలోంచి క్రిష్ణమూర్తికోసం, అతని మనుషులొచ్చారు. క్రిష్ణమూర్తిని చూడ్డంతోనే అతని భార్య మీదపడి గొల్లుమని ఏడ్చింది. ఏదైన ఆస్పత్రికి తీసుకెళ్లాలని క్రిష్ణమూర్తిని హడావుడిగా చేతులమీదికి తీసుకున్నారు.

కాని అప్పటికే క్రిష్ణమూర్తి ప్రాణాలు విడిచాడని వాళ్ళెవరికీ తెలీదు.

✿ ✿ ✿

ఆ పూట చినసోమయ్యగారి ఇంట్లో విందు జరుగుతోంది. అందుకుగాను ఇల్లంతా లైట్లతో పట్టపగల్లా వుంది. ఊళ్ళో కావలసిన బంధువులు అక్కడే వున్నారు. పట్నం నుండి వాళ్ళ మామగారితో సహా మరికొందరు స్నేహితులు కూడా వచ్చారు. అంతా ఆ మండువా లోగిలి ఎత్తు అరుగుల మీద కూచొని కావలసినవీ, అక్కర్లేనివీ మాటాడుకుంటూ కాలాన్ని వెళ్ళబుచ్చుతున్నారు. వాళ్ళముందు నేషనల్ పెనాసానిక్ ట్రాన్సిస్టర్ నిగనిగ లాడుతోంది. దాని వాల్యూమ్ పెద్దది చేసి వుంచారు. గ్రామస్థుల కార్యక్రమం యింకా జరుగుతూనే వుంది.

మునసబు గారి తమ్ముడు, మరికొందరు అనుకోకుండా అక్కడికి వచ్చారు. చిన సోమయ్యగారు వాళ్ళ హడావుడి చూసి ఏదో జరిగిందని మండువాలోకి వాళ్ళతో పాటే నడిచాడు. మునసబుగారి తమ్ముడు మొదట్నించీ జరిగిందాన్ని పూసగుచ్చినట్టు చెప్పాడు.

చిన సోమయ్యగార్కి కోపం వచ్చింది. వాడింటికి వెళ్ళి కొట్టడం ఆయనకేమీ నచ్చ లేదు. ఇంత వయసొచ్చినా బుద్ధిరాలేదని వాళ్ళని కసురుకున్నారు. అతనికీ సంగతి ముందే తెలిస్తే ఆ వెంకడినే యిక్కడికి రప్పించి వాడి తోలు వొలిపించే వాణ్ణి గదా అని మండిపడ్డారు.

ఆయన మాటకు ఎవరూ ఎదురు చెప్ప లేదు. తన పెదపాలేరు క్రిష్ణమూర్తికి ఏమైనా గట్టి దెబ్బ తగిలిందేమోనని తమాయించుకుని అడిగారు. కాని ఆ సంగతి వాళ్ళకేమీ తెలీదని నిజం చెప్పేశారు.

ఆ సమయానికే మాలపేటలోని జనం ప్రహరీ తలుపు నెట్టుకుని లోనికి వచ్చేసింది. వాళ్ళ కళ్ళల్లో ఆందోళన, స్వరంలో ఆక్రందన వుంది.

చినసోమయ్యగారు మరో గుమ్మం నుండి మునసబు తమ్ముణ్ణీ, మిగతావాళ్ళనీ అవతలకు పంపించివేసారు. గడియారం చూసుకుని మండువాలోంచి బయటకు వచ్చారు.

పేటలోని సగం జనం తన ఇంటిముందు నిలుచున్నారు. 'బాబూ! కూనీ- కూనీ అయిపోయింది బాబూ! కిట్టమూర్తిని నరికేసారు'- అన్నారు. అక్కడ జరిగిన బీభత్సానికీ,

క్రిష్ణమూర్తి చనిపోయాడన్న దుఃఖానికీ వాళ్ళ గొంతులు ఎండిపోయాయి.

చినసోమయ్యగారు షాక్ తిన్నవాడిలా నివ్వెరపోయాడు. ఆ తర్వాత ఒక్క క్షణం తత్తరపడ్డాడు. అతను ఏదో చిన్నతగువు అనుకున్నాడేగాని యింత జరిగిందని ఊహించలేదు.

ఇంతకూ ఏమి జరిగిందిరా అని తమాయించుకుని అడిగారు. వాళ్ళంతా తలా ఓ మాట చెప్పారు. కాని ఒక్కటీ వినలేక పోయారు. నిష్కారణంగా క్రిష్ణమూర్తి పోయాడన్న బాధ అతన్ని కదిలించివేసింది. అతనిలో ఎంతటి బాధ వున్నా యిలాంటి పరిస్థితుల్లో ఎలా నడుచుకోవాలో ఆలోచించుకుని వెంటనే ఓ నిర్ణయానికి వచ్చేసారు.

'ఎవర్రా నరికింది?' అన్నారు.

'ఇంకెవ్వరు బాబూ- ఆ ఎంకడూ, ఆడి తమ్ముడు చిన్నోడూనూ'.

'ఎక్కడ జరిగింది?'

'ఆడింటికాడే బాబూ!'

'ఆడెలాగున్నాడు?'

'బాగా దెబ్బలు తిన్నాడట బాబూ!'

చినసోమయ్యగారు మరల ఆలోచనలో పడ్డారు. వెనకాతలి గొడవకీ, ఆడవాళ్ళ ఏడ్పులకీ మాటలు వినిపించక విసిగి, ఇక్కడ గోల చేయకండని కసిరేసి ఆలోచన కోసం లోనికి వెళ్ళిపోయారు.

చిన సోమయ్యగార్ని పెద సోమయ్యగారు పిలిచి, క్రిష్ణమూర్తి పోయాడా అని విచారపడుతూ అడిగారు. ఆయనిది పెద్దవయసు కావడంచేత నడిచే ఓపిక లేకపోయింది. కనుక ఆ మండువాలోనే ఓ పడకకుర్చీలో కూచుంటూ, అలాకూచో లేనప్పుడు మంచంమీద నడుం వాల్చుతూ కాలాన్ని గడుపుకొస్తున్నాడు.

ఈ కేసు రైతులమీదికి ఎక్కడ వస్తుందో నని భయపడిన చినసోమయ్యగారు పెద్ద సోమయ్యగారి వద్దకు వచ్చారు. పెదసోమయ్యగారు కూడ ఓ నిముషం ఆలోచనలో పడ్డారు. ఆలోచనలోంచి తేరుకుని క్రిష్ణమూర్తిది మాలపేట గందా, వెంకడిది ఏ పేటో తెలుసా అని చినసోమయ్యగారు సమాధాన మివ్వక ముందే పెదసోమయ్యగారు బోసి నోరు మీద ఓ చిరునవ్వు తెచ్చుకుని, కనుక యిది 'మాల మాదిగల కొట్లాట-' అని తేల్చి చెప్పేసారు.

పెద సోమయ్యగారి అనుభవానికి చిన సోమయ్యగారు ఎప్పుడూ ఆశ్చర్యం చెందుతూనే వుంటారు. ఏ చదువులూ చదవని వీళ్ళు సమస్యలని యింత తేలిగ్గా ఎలా విడదీసేయ గల్గుతున్నారో ఇప్పుడిప్పుడే అనుభవంలోకి వస్తోంది చినసోమయ్యగార్కి.

చినసోమయ్యగారు మళ్ళీ అరుగుమీదికి రావడం చూసి నిశ్శబ్ద మయ్యారు జనం. ఆయన మరోసారి గడియారం చూసుకుని ఎనిమిది కావస్తోందని తొందపడ్డారు. వినవలసిన ఆ రేడియో ప్రోగ్రాం ప్రసారం కావడానికి మరెంతో సమయం లేదు.

చినసోమయ్యగారు జరిగిందానికి విచారాన్ని ప్రకటించారు. ఆడు మీ మనిషేకాదు, నా మనిషికూడాను. నా పెద్దపాలేరు- నాకుడి భుజం- అన్నారు. కనుక ఆడు చస్తే నేనూరు

కుంటానా? ఆ యెదవలు ఎంతమంది వున్నారో ఆళ్ళందరికీ ఉరేయించేస్తాను. ఆ కేసు ఏదో నేనే చూసుకుంటాను- మీరెళ్ళండి- అన్నారు.

మా కిట్టమూర్తిని నరికి నోడికి యీ భూమ్మీద నూకలు మిగలకూడదు. మా కంతేసాలు. ఆడికి ఉరేయించేత్తే అంతే సాలు- అన్నారంతా.

చినసోమయ్యగారు, నేను మాటిస్తున్నానుగా, మీరెళ్ళండి. మళ్ళీ ఏ గొడవా పడకండి. కేసు ఫిరాయిస్తాది, అని చెప్పి పంపించివేసారు.

అల్లుడు పైకొస్తాడని, రాజకీయాలు బాగానే అబ్బాయనీ చినసోమయ్యగారిని చూసి ఆయన మామగారు నిండుగా గాలి పీల్చుకున్నారు.

✿ ✿ ✿

ఎనిమిది గంటలైంది. విందు భోజనం ముందు కూచున్నారు.

ఎదురుగా టేబుల్ మీద ట్రాన్సిస్టర్ ఉంది. హైదరాబాద్ కేంద్రం నుండి ప్రత్యేక కార్యక్రమం ప్రసారమౌతోంది.

దానిలో-

ఆ సంవత్సరానికి వరి పంటను పండించడంలో అధిక దిగుబడిని సాధించిన చిన సోమయ్యగార్ని 'ఆదర్శ రైతు'గా ఎన్నిక చేసారని చెప్పారు. ఇందుకు గాను ఐదువేల రూపాయల నగదు బహూకరించ బడిందని ప్రకటించారు. ప్రకటన అనంతరం చిన సోమయ్యగారి రేడియో టాక్ ప్రసారమైంది.

చినసోమయ్యగారు పొలాన్ని ఏ విధంగా సాగు చేసిందీ, ఎలా అధిక దిగుబడిని సాధించినదీ వివరించారు.

రేడియో టాక్ ముగిసింది.

విందుకొచ్చిన వాళ్ళందరూ చప్పట్లు చరిచారు. మరికొందరు చినసోమయ్యగార్ని ఎంతగానో శ్లాఘించారు.

'ఇక భోంచెయ్యండి-' అంది బంగారమ్మగారు.

విస్తర్లలోని విందు భోజనంలోకి అందరి మునివ్రేళ్ళు చొరబడినాయి.

'కిష్టమూర్తి మంచి పనోడురా- అలాంటి మనిషి మరోకడు మనకి దొరుకుతా డంటావా? కనీసం దెబ్బలు తిన్న ఎంకడన్నా చావకుంటే ఈ వ్యవసాయానికి యిబ్బం దుండదు. మనకు కావలసింది యీ వ్యవసాయం మీద మంచి రాబడిగాని, యీ కేసులు కాదు. అందుగ్గాను ఎంకణ్ణి కేసులోంచి బయటికి లాగాలి' అన్నారు పెదసోమయ్యగారు.

పెద సోమయ్యగారి ముందు చూపును కాదనలేరు చినసోమయ్యగారు.

*'జ్యోతి' దీపావళి ప్రత్యేక సంచిక – 1976 **

హైదరాబాద్

*13.4.74*

# వర్షం

'ఈ యేల రాత్రి ఆసుపత్రిలో సెవం దించార్రా సోమరాజూగా...'

రిక్షాస్టేండు దగ్గరకొచ్చి ఏదో రహస్యం చెప్పినట్టు నెమ్మదిగా సాలమను చెప్పాడు.

'ఎవర్రా పోయింది-'

రిక్షా సోమరాజూ అంత నెమ్మదిగానే అడిగాడు.

'ఎవరో పాపం - పడుసోడేరా. ఏం జబ్బో ఏటోమరి-'

'అదే లేరా.... పోయినోళ్ళు లేనోళ్ళే నంటావా?'

'కాకపోతే నీకెందుకు సెప్పుతారా... పాపం లేనోళ్ళేరా- తెల్లారగట్టే పోయాడట- నీవు రిచ్చాయేసుకుని, అటిటు పోక ఈయేల ఇక్కడేవుండు-'

'బేరం తగులుద్దంటావా?'-

'తగలకేమవుద్ది? గేటును కనిపెట్టుకుని వుండు- ఒచ్చేముందు నేను చెపుతాలే-'

సాలమను కబురు చెప్పి గేటు వద్దకు వెళ్ళిపోయాడు. తతెమ్మా రిక్షా వాళ్ళకీ సంగతి తెలియకూడదు. తెలిస్తే వాళ్ళు కూడా శవం కోసం పోటీ పడతారన్న భయం వాళ్ళది.

సాలమను ఆ మిషనరీ ఆస్పత్రిలో గేటు కాపలాకి కుదిరినప్పటి నుండీ ఇలాంటి కబురు అప్పుడప్పుడూ సోమరాజూకు చెబుతుంటాడు. అలా చెప్పిన రోజు సోమరాజూ ఓ పాతిక రూపాయలు సొమ్ము చేసుకుంటాడు. ఆ రోజు సాలమను కూడా రామ్మకొట్టు వద్ద పెసరట్టూ, పక్క బడ్డీకొట్టు వద్ద ఓ అరకప్పు టీ దొరకుతుంది.

సోమరాజు అందుకని అప్పటి నుండీ శవం కోసం ఆ గేటువద్ద రిక్షాతో కనిపెట్టుకుని కూచున్నాడు.

✿ ✿ ✿

అది సుమారు పది ఎకరాల స్థలంలో కట్టబడిన అందమైన మిషనరీ ఆసుపత్రి. దాని చుట్టూ సెంట్రల్ జైలు గోడలాంటి ప్రహరీ వుంది. దాని పెద్ద గేటు గ్రాండ్ ట్రంక్ రోడ్డు మీదకు తెరుచుకున్న తిమింగలం నోరులా వుంది. ప్రహరీ లోపల పరచిన తివాచీలా పచ్చని పెద్ద లాన్ వుంది. తెల్లని సిమ్మెంటు రోడ్లు నీటుగా వున్నాయి. వాటిపక్క కత్తిరించిన బాబ్డ్

---

హెయిర్ క్రోటన్స్ బారులు తీరి వున్నాయి. పెద్ద గేటుకు ఫర్లాంగు దూరంలోని రోగుల భవనం రాజాగారి కోటలా వుంది. పక్కనున్న చర్చి సింహాసనంలా ఠీవిగా వుంది. దాని గోపురం మీద ఎంతో ఎత్తున వున్న సిలువ మహారాణి కిరీటంలోని మణిదీపంలా వుంది.

తెల్లని చీరల్లో నర్సులు ఉద్యానవనంలోని చెలికత్తెల్లా ఛలాకీగా వున్నారు. అందులోని రోగులు మరణ దండనకు గురైన రాజద్రోహుల్లా బిక్కుబిక్కుమంటున్నారు.

ఆ రాత్రి చనిపోయిన రోగివార్త అమలు జరిగిన మరణ దండనలా వాళ్ళను హడలెత్తించింది.

అక్కడ ఆ గదిముందు అందరూ సానుభూతి చూపించేవాళ్ళే-

'అయ్యో! చిన్న వయసే- ఎందుకు చనిపోయాడో పాపం!'

'టెట్నస్ వల్ల పోయాడంట-'

'అంటే ఏమిటి?'

'ధనుర్వాతం.... ఇనుము తెగితే ఆ జబ్బు వస్తుందట-'

'అయితే దానికి మందులేవీ లేవా-'

'ఎందుకు లేవూ- వెంటనే ఎ.టి.యస్ ఇంజెక్షన్ చేయించుకోవాలిట-'

'మరి ఇతనెందుకు చేయించుకోలేదు?-'

'అతనుంది పల్లెటూరాయె... ఇంజెక్షన్లూ, మందులూ ఎక్కడ దొరుకుతాయి. అయినా పూటకు గడవనోళ్ళకి ఇంజెక్షన్లెలా వస్తాయి చెప్పండి-'

ఏవో మిషన్లు తెచ్చి ఎవరో కంట్రాక్టరు అడివి నరికిస్తున్నాడట-

ఇతనేమో రోజుకూలికని కుదిరాడట. పాపం మిషను లాగేసిందట.... కాలు ఇనప చక్రాల్లో పడితే వుంటుందటండీ.... వెంటనే లాగేశారట- కాలు విరిగి బయటపడ్డాడు-

'కంట్రాక్టరు కాస్త మందయినా వేయించలేదంటారా?-'

వేయిస్తే ఇంతెందుకు జరుగుతుంది? ఆకూ అలమూ కట్టుకున్నారట- వుండు నయం కాలేదట.... కాలు చూసి వెంటనే ఏదయినా పెద్దాసుపత్రికి తీసుకు వెళ్ళమంటే, వారం రోజుల క్రితం గవర్నమెంటు ఆసుపత్రికి వచ్చారట- వాళ్ళేమో బెడ్స్ ఖాళీ లేవు తరువాత రమ్మన్నారట... మనలో మనమాట- ఎంత ప్రభుత్వాసుపత్రి అయతే మాత్రం వాళ్ళకు ముట్టాల్సింది ముట్టకపోతే మడిసిని చూస్తారటండీ-

'అందుకని అక్కణ్ణుండి ఇక్కడి కొచ్చి మూడు రోజుల క్రితం చేరారు. కాలు కుళ్ళిపోయింది, తీసెయ్యాలన్నారట డాక్టరు. మందులకీ, ఇంజెక్షన్లకీ డబ్బు కట్టమంటే, డబ్బు లేదన్నారట... డబ్బు కట్టిన తరువాతనే ఆపరేషన్ చేస్తానన్నారట డాక్టరు. నిన్న రాత్రి "సంది" చూపిందంట-పాపం'... 'కోమా' వస్తే మనిషి బతకడం కష్టమే కదండీ-'

'కోమా వచ్చినా మందులున్నాయిగా.'

'ఉన్నాయనుకోండి- కాని ఒక్కొక్కటీ వందలమీదనే... అలాంటివి ఎన్ని చేయించాలో ఏటో... ఈ పేదోళ్ళు వాటినెలా కొనగలరు?-'

'మీరన్నదీ నిజమే... అందుకని మనిషిని వదులుకోవడమే చేయగలిగింది.

స్ట్రెచర్ మోసుకుని వార్డ్ బాయ్‌లు గది దగ్గరకు వచ్చారు. ముందున్న జనంలోంచి గదిలోకి వెళ్ళి శవాన్ని స్ట్రెచ్చర్ మీద వేసుకుని బయటికి వచ్చారు.

అప్పుడు అక్కడ ఏడుపులేవీ వినపడలేదు...

'ఇతను తాలూకు మనుషులు ఇక్కడ లేరేమిటి?-'

'ఉన్నారు - ఓ ముసలమ్మ, ఓ పడుచమ్మాయి- తల్లీ పెళ్ళాం అనుకుంటాను.'

'అయితే మరి కనిపించరే-'

'ఆఫీసుకు కాబోలు వెళ్ళారు, డబ్బు కట్టేందుకు-'

శవాన్ని బయట నుండి డెడ్‌రూమ్ కేసి తీసుకు వెళ్లిపోయారు.

✿ ✿ ✿

రిక్షాకు శవం ఎక్కితే ఎవ్వరైనా పాతిక రూపాయలు ఇవ్వవలసిందే- అది ఆ సెంటర్ వాళ్ళు నిర్ణయించుకున్న రేటు. అంతకు తక్కువ ఎవరు కట్టినా యూనియన్‌కు సమాధానం చెప్పుకోవాలి. కనుక ముందడిగిన వాడిదే బేరం- బేరం ఎంత లాభసాటిదైనా ఇలా గంటల తరబడి కనిపెట్టుకుని కూచోవడం చెడ్డ చికాకనిపించింది సోమరాజుకి.

'ఒరె-సాలమను-ఏ(రాఆళ్ళు-ఇంతవరకూ సెవం లేదు, గివం లేదు- నాల్గయిపోయింది- ఓనరు కిచ్చెయ్యాలి రిచ్చా-' అంటూ గేటు వద్ద నిలబడిపోయాడు సోమరాజు.

'ఉండరా మరి- డబ్బు కట్టందే సెవాన్నిత్తా రేంటి? ఏదో ఆళ్ళు బతిమాలు కుంటున్నారు. పేణం పోయాక కూడా డబ్బేంటి బాబయ్యా అంటుంది ముసిల్ది- అయ్యగారేమో మందూ మాకూ ఊరికే వత్తాదేటి-దాని డబ్బయినా కట్టంటున్నారు.'

సాలమను ఏదో రకంగా సోమరాజును సముదాయించాడు. వాడు ఇప్పించే పెసరట్టూ, టీ ఎక్కడ పోతుందోనని వాడి భయం- అందుకే చూపంతా ఆసుపత్రి మీదనే వేసి ఉంచాడు.

'ఒరే సోమరాజు - వాళ్ళొత్తున్నా(రా అల్లదిగో తెల్లకోక ముసిల్ది, ఆ పక్క పచ్చ చీర పిల్లా - ఆళ్ళే..... ఎల్లి తొందరగా బేరం చూడు... ఎళ్ళెళ్ళు-'

అంతా కలిసి గుప్పెడంత మనిషి లేదు ముసిల్ది- ఆమె కోడలుగా అవటం కోసమే పుట్టిందా అన్నట్టుంది ఆమె కోడలు. కోడలు భుజమ్మీద వాలిపోయి వస్తోంది ముసిలిది.... అది తన జీవితాంతం బాధ్యతల బరువులా మోస్తోంది కోడలు.

పెద్ద గేటు వద్దకు వచ్చి రోడ్డు పక్క కంకర గుట్టకు వెనుక చతికిలబడ్డది. నిస్సహాయతతో ఆసుపత్రి ప్రహరీ మీదకు వొరిగిపోయింది. నోటికి అడ్డంగా కొంగు పెట్టుకుని కుమిలి కుమిలి ఏడ్చి ఈ లోకంతో సంబంధం లేని మనిషిలా అయోమయంగా మారిపోయింది.

అత్త పరిస్థితి కోడలికి ఏదోలా వుంది.

ఆమెకు ఏమి చేయాలో తెలియటం లేదు. ఈ పట్టణం కొత్త; లోకానుభవం లేనిది. ఇదివరలో ఇలాంటి బాధల బరువు మోయనిది. తాను ఎప్పుడన్నా ఎరుగున్నది

ఆకలి దప్పులు మాత్రమే-

మొదట్లో భర్త పోయాడంటే నిజమో అబద్ధమో అనుకుంది. ఆ తరువాత పెద్ద ఘోరమేదో జరిగిపోయింది కాబోలనుకుంది. ఆ ఘోరమేమిటో తెలియదు. అది తన బతుకు మీద ఎంత కక్షసాధిస్తుందో తెలియదు. ఆమె ముఖంలో ఆవేదన లేదు; ఆందోళన లేదు; కేవలం అయోమయం తప్ప-

కన్న తల్లికి పుత్ర శోకం కన్నా బాధాకరమైన దేముంది-

ఆమె దుఃఖాన్ని దిగమింగుకుంది. ఎక్కడో శూన్యంలోకి చూస్తోంది. ఆ కళ్ళనుండి కన్నీరు కారటం లేదు; అవి గడ్డకట్టిన మంచుముక్కల్లా చలనం లేకుండా వున్నాయి.

ఆమె తన జీవితంలో కన్నీరు ఎరగనిదేమీ కాదు-

తన భర్త పోయినప్పుడూ ఏడ్చింది; బతికున్నప్పుడూ ఏడ్చింది. తను నమ్మినవారు తనను దిక్కుమాలినదాన్ని చేసినప్పుడు దిక్కు తెలీకా ఏడ్చింది.

బతుకంతా బతకటం కోసమే సరిపోయింది.

అయితే ఇప్పుడు కొడుకు కోసమే జీవిస్తోంది. అందొచ్చిన కొడుకును చూసుకుని పడ్డ కష్టాలన్నింటినీ మరచిపోయింది. తన జీవితాధారంగా, ధైర్యంగా, నిండుగా ఊపిరి తీసుకుంది.

ఆ కొడుకు ఈనాడు తనకు లేకుండా పోయాడు.

ఆసుపత్రి వార్డ్‌బాయ్‌లు స్ట్రెచర్ మీద తీసుకు వచ్చి గేటువద్దనున్న తల్లి కాళ్ళముందు శవాన్ని దించి వెళ్ళిపోయారు.

జనం శవాన్ని చూసి చుట్టూమూగారు.

సాలమను వచ్చి శవాన్ని అక్కడ నుండి వెంటనే తీసుకు పోవాలని ఆర్డరు జారి చేశాడు. పక్కనున్న సోమరాజుతో 'బేరం ఏమయిందిరా-' అని నెమ్మదిగా అడిగాడు.

'లాభం లేదురా' అన్నాడు సోమరాజు.

సాలమను ముఖం దిగాలు పడిపోయింది.

'ఏం! ఎందుకు?' అన్నాడు.

'ఆళ్ళు ఇక్కడోళ్ళు కాదు... ఎక్కడో మన్నిపోళ్ళు...'

'అయితే సెవాన్ని ఏం చేత్తారట-'

'ఏమో మరి! ఎనక మగదిక్కులేదట- ఇక్కడ ఏదైన చేయాలంటే ఆళ్ళ దగ్గర డబ్బు లేదట-'

అప్పుడు ఆ జనంలోంచి సింహాలు సోమరాజు దగ్గరకొచ్చాడు. సింహాలుతో పాటు మరో ఇద్దరు సోమరాజు వెనక చేరారు.

'ముసలమ్మకు ఎనక ఎవరూ లేకపోతే సెవాన్ని ఒక్కతీ ఏం సేత్తదీ-' అన్నాడు సింహాలు.

సోమరాజు ఏమీ మాటాడలేదు-

'అయితే మనం సెవాన్ని కాల్చేద్దాం... ఏమంటాదో ముసలమ్మ నడుగు-' అన్నాడు సింహాలు.

ఆ జనం సింహాలుకేసి చూశారు.

సింహాలు నడియవసు మనిషి.... మాసిక వేసిన కాకీనిక్కారు, ఆఫ్‌చేతుల కాకీ షర్టూ తొడుక్కొని, చిరిగిన ఎర్ర తుండొకటి భుజం మీద వేసుకున్నాడు. ఎక్కడో తూర్పు నుండి ఇక్కడి కొచ్చి, ఈ ఆసుపత్రినే ఆశ్రయించుకున్నాడు. అక్కడికి వచ్చి పోయేవాళ్ళకు సామానులు చేరవేయటం... బస్సులమీదనుండి మూటలు దించటం, ఎక్కించటం, లాంటి పనులు చేస్తాడు. ఖాళీ ఉన్నప్పుడు కమీషనుకు ఆసుపత్రిలో సోడాలు అమ్ము తాడు. నాల్గుడబ్బులు దొరుకుతాయంటే ఏపనైనా చేయడానికి వెనకాడడు.

దిక్కులేని శవాలను కాల్చేలాంటి పనులు ఇదివరకు ఒకటి రెండు చేసున్నవాడు. అందుకే అంత చొరవగా ముందుకు వచ్చాడు.

సాలమను, సోమరాజు ముఖముఖాలు చూసుకున్నారు.

'మనం చేసేద్దాం అంటేనే సరిపోద్దట్రా సింహాలూ- ఎన్ని కట్టెలు కావాల, ఆటి కెంత కరుసవ్వుద్దీ... దానికెంత పయాస పడాలి... యివన్నీ ఆలోచన చేశావా-'

'పెయాసంటే పెయాసే మరి... రిచ్చా తొక్కడం పెయాస కాదా? సోడా లమ్మడం పెయాస కాదా? సెవాన్ని కాల్చటమొక్కటే నేటి పెయాస?-'

'మరి సొమ్ములు?'

'ముసలమ్మ నడగండి- కాల్చడానికి కట్టెల కింతవ్వుద్దని అడగండి- ఓ గంటలో పని పూర్తి చేసెయ్యొచ్చు-'

'ముసలమ్మ దగ్గర యింకా డబ్బెక్కడిదిరా...అంతా ఆసుపత్రిలోనే కట్టేసిందట-'

'ఆ!.... నీ మాటలకేం గాని... ముసలమ్మ దగ్గర అసలు డబ్బేలేదంటావేటి- పల్లెటూరోళ్ళు డబ్బంత తేలిగ్గా వొదలరు- పోనీ, లేకపోతే మాత్రం మానేత్తామా- ఏదోరకంగా సెవాన్ని కాల్చెయ్యాలి.... రాత్రనగ సచ్చిన మడిసంటున్నారు... అలా ఊరికే వదిలేత్తామా- ఆ మాత్రం పున్నెం కట్టుకోవద్దూ-'

'ఇంతకీ నీ వనేదేటి?'

'ఏమీ లేదు,... నీవు కాస్త సాయిముండు- అంతేసాలు-' మేం తలో పావలా, అర్ధా అడిగి కర్చులకు పోగేత్తాం- సీకటడకుండానే గోదారొడ్డున కాల్చేద్దాం-

'మనకేటి కలిసాద్ది-'

అదిగో... ఆమాటే అనక-

కలిసి రాకపోతే ఉత్తిపున్నానికి సేత్తామేటి? అసలు ఈ భూపెపంచకంలో ఎవడూ ఉత్తిపున్నానికి ఏపనీ సేయడు. ఆడికేదయినా కలిసొత్తేనే సేత్తాడు-

ఇంతకీ నేననేటి దేటంటే- సెవం దొరకమంటే మనకు దొరుకుద్దేంటి? సచ్చినోళ్ళ దగ్గిరకెళ్ళి మాకు సెవం యిమ్మంటే యిత్తారా? సెప్పు తీసుకుని కొడతా నంటారు- ఏదో ఏలబాగుండి దొరికొంది- నాల్గుడబ్బులు దీనిమీద రాబట్టుకోవడం నేర్చుకోవాల- లేకపోతే కూటికెలా వత్తాది- అయితే మమ్మల్ని ఏటి సెయ్యమంటారని అడక్కు. ఆ సంగతి

నాకొదిలెయ్యండి. మీకు నాల్గు డబ్బులు రాబట్టే పూచీ నాది-' అన్నాడు సింహాలు.

సోమరాజు, పాలమను ముఖముఖాలు చూసుకుని సరేకానియ్యండి అన్నారు.

అందరూ కలిసి ముసలమ్మ చుట్టూచేరి, సం[ప్రదించారు. ఓ అయిదు నిమిషాల తర్వాత శవం దగ్గర చేరి పని పురమాయించుకున్నారు.

సింహాలుతో ఉన్న ఇద్దరూ గడబొంగులు తెచ్చి పాడికట్టారు. శవాన్ని దాని మీద కెక్కించారు.

సింహాలు ముసలమ్మ దగ్గరకొచ్చి ఆమె గుడ్డసంచిని తీసి, అందులోని సొట్టలు పోయిన సీవెండి పళ్లాన్ని బయటికి తీసాడు. గుడ్డసంచిని తిరిగి పెట్టేసి, పళ్ళెం పుచ్చుకుని పాడి వెనకాతల బయల్దేరాడు.

పాడిని స(త్రం ముందు దించారు, కొట్లు ముందు దించారు; బిజీ సెంటర్లలో జనం ముందు దించారు. ఇస్తున్న డబ్బుల్ని పళ్ళెంలో వేయించుకున్నారు.

దరమాలు లేదనుకుండానే వచ్చాయి-

'సందలడి పోతుందిరా సింహాలు....'

'ఎంత పోగడిందేటి?'

'తలో ఇరవయ్యన్నా రాకపోతే యెలారా...'

'ఇంకా ఎక్కువే వచ్చుంటాయి లేరా-'

'పోనీలే...ఇంకేటి సేత్తాం.... పొద్దుకూకిపోతుంటే-' నిరుత్సాహంగా ఆగిపోయాడు సింహాలు.

పాడిని గోదారి గట్టుమీదకు తీసుకుని వచ్చారు. మరో అరమైలు దూరం పోయి గట్టు దిగి అక్కడ దహనం చేయాలి.

సోమరాజు ఆలోచనలో పడ్డాడు.

శవాన్ని కాల్చేందుకు కట్టెలు లేవు. అవి కొనాలని సింహాలు అనటం లేదు. అసలు సంగతేమిటో సోమరాజుకు అనుమానం వచ్చింది. అందుకని నెమ్మదిగా పాడిని కిందకు దించాడు.

'సెవాన్ని కాల్చడానికి కట్టెలేయిరా-'

'ఇప్పుడు కట్టెలు మనకెక్కడ దొరుకుతాయి-'

'అయితే దీన్నేమి సేయాలి-?'

'అక్కడి కెళ్ళి గోదాట్లోకి గెంటేద్దాం-'

'అదేం మాటరా సింహాలు.... ముసలమ్మతో సెవాన్ని కాలుత్తాం అన్నావు, ఇప్పుడేమో గోదాట్లోకి గెంటేద్దాం అంటున్నావు. కొడుకు చచ్చి అది ఏడుత్తుంది... దాని ఉసురు మనకి తగలకూడదు.... ఏదోలా సెవాన్ని కాల్చెయ్యాలి-'

సోమరాజు పాడి పక్కనే మొండికేసి కూచుండిపోయాడు.

'అవున్నా- సెవాన్ని కాల్చేద్దాం..... ఈ డబ్బంతా పెట్టి కట్టెలు కొని సెవాన్ని కాల్చేద్దాం.... మిగిలేదేమిటి? బూడిది... అదే పంచుకుని తిందాం-'

సింహాలు కోపంతో సోమరాజు మీదకు ఎదురు తిరిగాడు.

'డబ్బంతా పెట్టి కట్టెలు కొనాలా ఏంటి?.... సగం డబ్బు సరిపోదా... మిగిలినదే పంచుకుందాం- తలా పదేసయినా వత్తాయి-'

సోమరాజు పట్టువిడవక పోయేసరికి సింహాలుకు వళ్ళుమండింది. బూతులు కూడా ఒకటి రెండు దొర్లాయి. కాని కాస్త నిదానించుకుని-

'ఒరేయ్! మీరు సెవాన్ని కాలుత్తారో, పారేత్తారో... నాకేటీ అక్కర్లేదు. నావాటా నాకు పంచేయ్యండి. నేనిప్పుడే పోతాను-'

'మా వాటాకూడా ఇచ్చెయ్యండి.' సింహాలుతో వచ్చిన ఆ ఇద్దరు కూడా అడిగారు.

సాలమనును అనుకోని ఆ పరిస్థితి కలవర పెట్టింది.

'ఒరేయ్! సింహాలు... నా మాట యింటావా- సెవాన్ని కాల్చాలని సోమరాజు అంటున్నాడు... నీవేమో వాటా యిచ్చెయ్యంటున్నావు. ఇప్పటి దాకా కలిసి చేసి యిప్పుడు కుమ్ములాడుకోవడం బాగాలేదు...

కట్టెలు కొంటే మనకేటి మిగులుద్దనేగా నీమాట-

అందుకు నేనొక మాట సెప్పుతాను యిను... ఆ ముసలమ్మ దగ్గరకెళ్ళి ఏమైనా సొమ్ములుంటే అడుగు. అదికూడ కలిపి శవాన్ని కాల్చేద్దాం- అప్పుడు నాల్గు డబ్బులు మనక్కూడా మిగులుతాయి.

సాలమను చెప్పి మాట సింహాలుకు నచ్చింది.

సింహాలును చూడడంతోనే ముసలమ్మకు దుఃఖం పొంగి పొరలి ఒక్కసారిగా బావురుమంది. ఆమె నెమ్మదించాక సింహాలు ముసలమ్మ పక్కన కూచుని- 'ఏం ముసలమ్మా... డబ్బులు సరిపోవడం లేదు, కట్టెలు కొనాలి... నీ దగ్గర సొమ్మెంతుంది?' అన్నాడు.

కోడలు సింహాలు కేసి నిదానించి చూసింది. అత్త పరిస్థితి ఆమెకు తెలుసు-

'మా దగ్గర సొమ్మంతా ఆసుపత్రికే కట్టేశాము- మా దగ్గర ఇంకేమీ లేదు-'

కోడలి సమాధానం సింహాలు పట్టించుకోలేదు. కోడలి వంక చూడనూ చూడ లేదు. కాని ముసలమ్మ సమాధానం కోసం కాసేపు ఆమె ముఖంలోకే చూశాడు.

'పోనీ వత్తువేదయినా వుంటే యివ్వండి మరి-'

'మా దగ్గర వత్తువేటుంది... తాళిబొట్టు అమ్ముకుని నా మొగుణ్ణి ఇక్కడికి తీసుకొచ్చాం... ఇంకా మాదగ్గరేముంది?-'

సింహాలుకు ముందునుండీ సహనం లేదు- ముసలమ్మ దేనికీ సమాధానం చెప్పక పోయేసరికి సోమరాజు మీదున్న కోపమంతా ముసలమ్మ మీదకు విరుచుకుపడింది-'

'ఒలే! ముసలమ్మా... డబ్బు లేదంటావు.. ఊరోళ్ళ డబ్బు తేరగా వుందను కున్నావేంటి- మీరలా కూసుంటే అన్నీ చేసుకు రావడానికి నీకు పుట్టాననుకున్నావేటి... సొమ్మియ్యి- కట్టెలు తేవాల.'

సింహాలు నోటికొచ్చినట్టు అరిచాడు.

---

ముసలమ్మ బొడ్డున దోపుకున్న మాసిన గుడ్డ సంచి తీసి సింహాలుకు ఇచ్చింది. సింహాలు దాని బొందునుముని వేళ్ళతో వదులు చేసి లోపలున్న ఒక రూపాయి కాగితం, ఆ తర్వాత ఓ పదిపైసల బిళ్ళ ఒక్కొక్కటే బయటకు తీసాడు. సంచిని నలిపి కిందకు తిప్పి దులిపాడు. ఒకపైసా బిళ్ళ జీవం లేనట్టు సంచినుండి కిందకు రాలింది.

ఖాళీ సంచిని ముసలమ్మ మీదకు విసిరేసి సింహాలు చికాగ్గా వెళ్ళిపోయాడు.

✿ ✿ ✿

గోదావరి గట్టుమీద పాడిని ఎత్తుకుని ఎర్రబడుతున్న సంధ్య చీకట్లోంచి కదుల్తున్న నల్లని నీడల్లా నలుగురూ వెళ్తున్నారు.

ఎదర నిప్పుతో సింహాలు నడుస్తున్నాడు.

పడమటి ఆకాశం రక్తపు మరకలా కలాగపులగంగా వుంది.

సూర్యుడు రక్తపు ముద్దలా వున్నాడు.

ఆ రక్తపు ముద్దను మింగుతున్న కొండచిలువలా వంకరలు తిరిగి వుంది గోదావరి- దాని మీద పడిన రంగు రంగుల మబ్బుల నీడలు కొండచిలువ మచ్చల్లా వున్నాయి.

పాడి గోదారి గట్టు దిగి పల్లంలోకి చేరింది.

తూరుపు ఆకాశంలోని చీకటిలోంచి కారుమబ్బు దొంగలా పాకింది.

పేర్చిన చితికి నిప్పంటుకుంది.

మబ్బును తరుముకొస్తోంది పెనుగాలి-

పేర్చిన చితి రాజుకుంది-

ఒరే! సోమరాజూ... వొరసం వచ్చేలా వుంది-

సింహాలుతో పాటు అంతా గట్టుమీదకు చేరే సరికి చెదురుమదురుగా చినుకులు ప్రారంభమయ్యాయి.

అందరూ కలిసి అడుగుల జోరు పెంచి ఇళ్ళకేసి దారితీసారు.

ప్రకృతి ఒక్కసారి తిరగబడింది-

కారుమబ్బులు అడవి మృగాల్లా నోళ్ళు తెరిచి అరిచాయి. మెరుపులు ఆకాశాన్ని చీల్చవలసినంత దూరం చీల్చాయి. కుండపోతగా వర్షం పడింది.

వీధులు నిర్మానుష్యం అయ్యాయి. రోడ్లమీద జనం ఎక్కడికక్కడ సర్దుకుపోయారు. ఆసుపత్రి గేటుముందు మూసిన కిళ్ళీకొట్టుకు పాత తడికె జారేసి వుంది. దాని పంచన రెండు మేకలు కునికి పాట్లు పడుతున్నాయి. దారి తప్పిన కోడి ఒకటి వొణుకుతూ నిలబడ్డది. పళ్ళు బయటకు పెట్టి కదిలితే కరిచే కుక్కలా మీదకు దూకుతోంది వాన-

ఆ ముసలమ్మా, ఆమె కోడలూ మోకాళ్ళలో తలలు దూర్చి, బితుకు బితుకు మంటూ చూస్తున్నారు ఆ చీకట్లో-

వాన జోరు తగ్గింది.

సాలమను సోమరాజు ఇంటికి వచ్చి 'కాష్టం కాలకుండా ఆగిపోయిందిరా- అన్నాడు.

'ఔనురా! మరి సెవం సంగతేటంటావ్...'

'ఇంకేం సెవం-'

'అల్లా వొదిలెయ్యాలంటావా?'

'మళ్ళీ నిప్పెడితే ఎలుగుద్దేంటి?'

'ఎనభై రూపాయల సిరుమాను పేడురా...'

'పొయ్యిలోకి ఎలా లేదన్నా రెండు నెలలు సరిపోద్ది-'

'అయితే ఓ మాటింటావా?'

'సెవాన్ని అలా బయటుండనిత్తామా... సెమనుకోకపోతే గొయ్యి తీసి కప్పెడదాం- లేకపోతే ఆడన్నట్టు గోదాట్లో కన్నా గెంటేద్దాం.... ముందు ఆ పేడు ఇంటికి చేరవేసి-'

సొలమను చెప్పిన మాటను సోమరాజు కాదనలేదు-

చిన్న బుడ్డి దీపంతో చితిపేర్చిన చోటకి ఇద్దరూ చేరారు. వొత్తి పెద్దది చేసి ఆ ప్రదేశాన్నంతా వెతికారు.

కాని అక్కడ చితిలేదు... శవం వుంది. నేలమీద పడివుంది-

అప్పుడు గట్టుమీంచి మరో రెండు మానవాకారాలు అక్కడ చేరాయి.

"సింహాలూ!" అన్నాడు సోమరాజు-

ఎవరికివారు ఆ పనిమీదనే అక్కడకు చేరారని అందరికీ తెలిసిపోయింది. నలుగురూ ముఖముఖాలు చూసుకున్నారు.

కానీ... కానీ...

అందరి ముఖాల్లోనూ ఒకే ప్రశ్న... ఒకే బాధ-

'ఈ పేడంతా ఏమయ్యింది!?'

'లోకంలో మనమేనా... మనకంటే పేదోళ్ళు యింకా సానాసానా....'

'అయ్యోపాపం ముసల్ది!.... ఎప్పుడు తిన్నదో, ఈ వానకెక్కడుందో... ఏమైపోందో...'

సింహాలు మనసులో మెదలగానే ఆమెకోసం అటు పరుగుతీశాడు-

'జ్యోత్స్న', నవంబర్ 1972*

హైదరాబాద్
*10.10.1972*

---

లోకం చూశాక

# ది ఫస్ట్ క్రిటిక్

కళ...

అందునా చిత్రకళ-

ఆకళకు ఏది ఆలంబనో... ఏది ఊపిరో....

పమ్మీ ముక్కుమీద సోడాబుడ్డి కళ్ళద్దాలు అందంగా అలంకరించుకున్నాయి. అతని నునుపెక్కిన బుగ్గలకింకా యవ్వనం ఎరుపు రాలేదు. రాగిరంగు నూనూగు మీసానికి నల్లని నిగారింపు సోకలేదు. అతని వయసింకా సమాజపు కాటుకు మచ్చపడలేదు.

అతను తన డాడీని పప్పా అంటాడు.

అతను తన మమ్మీని మమ్మీ అంటాడు.

అతను పక్కింటి శైలజను శైలూ అని పిలవడానికి ఈమధ్య కాస్త సిగ్గుపడుతున్నాడు.

పమ్మీ పరీక్షలు రాసి కాన్వెంటు స్టడీస్ పూర్తిచేశాడు. ఈవేసవి రెండు నెలలూ గడిస్తే విధిగా కాలేజీ చదువుల్లో మునిగిపోతాడు.

అందుకని అతని డాడీ చివరికి సరే ఊరు వెళ్ళి రండి అన్నాడు ఏమాత్రం ఇష్టం లేక పోయినా. పల్లెటూళ్ళుకదా.... కనీసం ఒక సారైనా చూసినట్టుంటుందిలే... ఆపై వాళ్ళకా ఉబలాటమూ తీరుతుందిలే- అని మనసును సరిపెట్టుకుని చివరకు వెళ్ళిరండని అన్నాడు.

అలా అన్నాక పమ్మీకి ఈ ఊరువచ్చి వాలే వరకూ నిద్రపట్టలేదు. ఆకలివేయలేదు. అన్నం సయించలేదు. ఎన్నెన్నో చిత్రమైన ఊహల మధ్య అతని పగటి కలలు.

ఈ దేశాన్నుండి ఎవరైనా విదేశాలకు వెళ్ళడం వాళ్ళకెంత సంబరమో, పమ్మీకి తన సొంత పూరు రావడం అంత సంబరమయ్యింది.

అతను తన తల్లితోనూ, అక్కతోనూ కలిసి ఈ ఊరు వచ్చాడు.

అతని ఊహతెలిశాక యిదే మొదటిసారి యిక్కడికి రావడం. ఇక్కడకు వచ్చిన ఈ నెలరోజుల్నుండీ అతను పంజరం విడిచిన రామచిలుక. కట్టతెగిన నదీ ప్రవాహం.

అతని ఆనందానికి అవధుల్లేవు.

అతని స్వేచ్ఛకు హద్దుల్లేవు.

---

అతను వస్తూ తన ఎయిర్ గన్ తెచ్చాడు. ఆ తుపాకీతో ఈ నెల్లాళ్ళూ ఆ చుట్టు పక్కల పొలాల మీది పిట్టల్ని ఎక్కడా ఏ కొమ్మమీదా వాలనివ్వలేదు. అతను తన ఎయిర్ గన్‌ను భుజాన్ని వేసుకున్నప్పుడల్లా ఆఊళ్ళోని పిల్లల గుంపంతా అతనివెంట తరలి వెళ్తుంది.- తరలి వస్తుంది.

ఆ పేటలోని కుర్రవాళ్ళందరికీ అతనో పెద్ద హీరో- వాళ్ళంతా అతనికేసి ప్రతిసారీ అర్థంకాని ఆశ్చర్యంతో నోరు వెళ్ళబెట్టుకుని చూస్తుంటారు.

ఈ నెల్లాళ్ళలోనూ తాను తెచ్చిన కాట్రాయిడ్స్ పూర్తిగా నిండుకున్నాయి. అతని అంచనాలు అంతటితోతారుమారై పోయాయి. ఇప్పుడు కొత్తవి కొని తేవడానికి సిటీ కాదాయె.... దగ్గర పట్నం నుంచి తెప్పించడానికి అవి దొరకవాయె-

అందుకని పొలం మీదికి పోయి పిట్టల్ని వేటాడే హాబీ పరిసమాప్తి అయిపోయింది.

అతనికి కొంత వ్యవధి-

నిజానికి రోజంతా వ్యవధి. ఏమీ తోచని విరామ స్థితి.

అతని వెంట పేటలోని తన ఈడు పిల్లలు క్రీతంలా తిరగడం మానేశారు. కనుక కొత్త 'ఏక్టివిటీ' కోసం వెతుకులాడుతోంది అతని మనసు.

అతను పుస్తకాల పురుగు కాడు. అతని కింకా నవలలు చదివే అలవాటురాలేదు. నవల చదివి ఉటోపియాలో కొట్టుకుపోయే మనః ప్రవృత్తి యింకా అతనికలవడలేదు.

అందుకని అతని ఆలోచనలు ఎటో పయనిస్తున్నాయి. నిరంతరం అతనికి తెలీకుండానే కొత్త 'ఏక్టివిటీ' కోసం తన ఆలోచనలు వెదుకు లాడుతున్నాయి. ఏదో థ్రిల్ కోరుకుంటోంది మనసు.

అక్కడ ఆ పల్లెలో అతని అక్కడకు మాత్రం పుస్తకాలు తప్ప మరో వ్యాపకం లేక పోయింది. ఈ నెల్లాళ్ళలోనూ ఆమె తెచ్చుకున్న పుస్తకాలిక చదవడానికి ఏమీ మిగల్లేదు. ఆ ఇంట్లో మరోమూల వాళ్ళ బాబాయి రేక్‌లోని ఎప్పటివో కొన్ని పుస్తకాలు చూశాక, పమ్మీ సాయంతో వాటి బూజు దులిపింది.

పమ్మీ ఆ పుస్తకాల్ని కాలం గడపడం కోసమో, మరెందుకో, ఈచివర్నుండి ఆచివరి వరకూ విధిగా తిరగేయడం జరిగింది.

ఉన్నట్టుండి ఓరోజున ఓ పుస్తకంతో పమ్మీ మాయమైపోయాడు. అతడు తిరిగి కనిపించే సరికి పడమటి ఆకాశం ఎరుపెక్కిపోయింది.

అప్పుడతని కళ్ళల్లో ఏదో కొత్త మెరుపు తళుక్కుమంది-

ఆకళ్ళల్లో ఎంతో ఉత్సాహం.

ఆ కళ్ళల్లో ఎంతో సంతృప్తి-

అతని చేతిలో అచ్చు పుస్తకంతో పాటు యిప్పుడు మరో పెద్ద కాగితం వుంది. దానిమీద తాను గీసిన చిత్రం వుంది.

ఆ చిత్రాన్ని అందరికీ చూపించాడు.

అందరూ బాగుందని మెచ్చుకున్నారు.

అందుకని అతను తన బాబాయికూ్కడా దాన్ని చూపించాలని అటూ ఇటూ పరుగులు తీశాడు.

అతని బాబాయ్ ఆచిత్రాన్నందుకుని కిందికీ, పైకీ తిప్పి చూశాడు.

పాత కేలండరులో పేపరు...వెనక్కి తిప్పి వేశాను బాబాయ్–ఇక్కడ డ్రాయింగు పేపరు దొరకలేదుమరి–అన్నాడు

ఈ పేపరు కేమి? ఇదీ బాగుందిగా... అంటూ ఆ చిత్రంలోకి చూడ్డం మొదలుపెట్టాడు. రెప్పవెయ్యకుండా దానిమీదనే తన చూపును నిలిపి కాసేపటికి యిది 'స్టాలిన్' చిత్రం కదూ అన్నాడు.

పమ్మీ ఆనందానికి అవధుల్లేవు. తను గీసిన గీతలకు ఓ ఆకృతి సంతరించుకుంది. అంతకన్నా ఏం కావాలి?

ఔను బాబాయ్! ఇదిగో దీన్ని చూసి వేశాను. పమ్మీ తన చేతిలోని స్టాలిన్ బయాగ్రఫీని ఉత్సాహంగా అందించాడు.

అతని బాబాయ్ ఆ పుస్తకాన్నందుకుని పడక్కుర్చీలో జేరగిలబడ్డాడు. ఆ స్టాలిన్ ఫొటోను మరింత నిశితంగా చూశాడు.

స్టాలిన్ యవ్వనంలోని ఫొటో అది. ఆ ఒక్కటే మిగిలిన ఫొటోలకన్నా భిన్నమైనది. గడ్డం అందంగా పెంచుకుని, జుట్టు పైకి ఎగదువ్వుకుని, చక్కని సైడు ఫోజులో వున్నాడు.

పమ్మీ! బాగుంది... నిజంగానే బాగావేశావు... మీకాన్వెంటులో ఇలాంటివి వేయడం నేర్పిస్తారనుకుంటాను, అన్నాడు.

అక్కడింత వరకూ పోర్ట్రెయిట్సు వేయడం నేర్పించలేదు బాబాయ్– లేండ్ స్కేప్ పెయింటింగ్స్ మాత్రమే నేర్పారు– అన్నాడు.

అయితే ఆర్ట్స్ స్కూల్లో నేర్చుకుంటున్నావా?

అక్కడకు నేనెప్పుడూ వెళ్ళ లేదుగా–

ఇంటివద్దనే ఏమైనా ప్రాక్టీస్ చేస్తున్నావా?

లేదు బాబాయ్–

మరి ఇది–

ఎస్! మై ఫస్టటెమ్ట్... బాబాయ్

అయితే స్టాలిన్ చిత్రంతో నీ మొదటి చిత్రం ప్రారంభించావన్నమాట.వెరీ గుడ్–

పమ్మీ ముఖంలో ఏదో తెలియని ఆనందం–

స్టాలిన్ ఎవరో తెలుసా? పమ్మీకేసి దగ్గరగా వాలి, ఎదర వాళ్ళకి తెలియని ఏదో రహస్యం తాను చెప్పబోతున్నట్టు నెమ్మదిగా ప్రశ్నించాడు.

తెలుసు, రష్యన్.... నెమ్మదిగానే జవాబిచ్చాడు.

'అఫ్‌కోర్స్... అది కరక్టేననుకో... కాని అతని గురించి మనం ప్రత్యేకించి

తెలిసికోవలసింది కూడా కొంత వుంది...' అన్నాడు.

పమ్మీ వాళ్ళ బాబాయ్ చెప్తున్నది శ్రద్ధగా వింటున్నాడు.

అతను ఓ చెప్పులు కుట్టుకునే వాడికొడుకు-

పమ్మీ ముఖంలో ఏ భావమూలేదు. కాని అతని పెదవులనుండి నెమ్మదిగా "సో వాట్...?" అని మాత్రం వెలువడింది.

"అంటే మన కులస్తుడురా!" అన్నాడు ధీమాగా-

పమ్మీ చూపు ఎదురుగా తెల్లని గోడమీద అమాయకంగా నిలిచిపోయింది.

నీ మొదటి చిత్రం "స్టాలిన్'ది కావడం నాకెంతో సంతోషాన్నిస్తోందిరా... నీలో కులాభిమానం వుంది. అందుకే స్టాలిన్ ని వెయ్యడానికి ఎన్నుకున్నావ్... అంటూ పమ్మీకి చిత్రాన్ని అందించాడు.

పమ్మీ ముఖంలో కేవలం మౌనం తప్ప మరే హావభావమూ కనిపించలేదు. తాను గీసిన చిత్రాన్ని అందుకుని బయటకు వచ్చాడు. వస్తూ అతని బాబాయ్ మాటల్ని తాను అర్థంచేసుకోలేని అశక్తతకి మాత్రం అతను కించిత్తు ఖిన్నుడయ్యాడు.

✿ ✿ ✿

కళ....

అందునా చిత్రకళ-

తాను గీసిన చిత్రం తాలూకు ఆనందం రోజూరోజుకూ అలా పెరుగుతూనే వచ్చింది. నాల్గు రోజులు గడిచే సరికి పమ్మీ చేతిలో మరోపోర్ట్రైటుంది. అతని అక్కకు కాన్వెంటు వాళ్ళిచ్చిన పాంప్లెట్ అది.

దానిమీద పటాన్నీసారి మరింత జాగ్రత్తగా గీశాడు. చివరి టచ్చెస్ కూడా ఇచ్చాడు.

'మమ్మీ....'

అమ్మో! ఎంత బాగా వేశావు రా అంది. మమ్మీ-

'అక్కా.....'

చాలా బాగుంది కదా... వెరీఫైన్.. అంది.

ఈ సారి కూడా అతని బాబాయ్ కోసం పరుగులు తీశాడు.

అతని బాబాయ్ ఈసారికూడా ఆ చిత్రాన్ని శ్రద్ధగా చూశాడు. అదే కేలెండర్ లో మరో కాగితం. పెన్సిల్ డ్రాయింగ్, మునుపటి దానికన్నా మరింత బాగుంది.

'జీజస్....'

పమ్మీ ముఖం విప్పారింది.

మతాభిమానం వుందన్నమాట... జీజస్‌ను ఇంత బాగా వేయగలిగావంటే. క్రీస్తులో విశ్వాసముందన్నమాట- అదే లేకపోతే ఆ కళ్ళల్లో గొప్ప కరుణ, ఆ కాంతీ సాధ్యంగాదు. అన్యుల కవి అర్థంకావు. ఎంతగొప్ప శాంతి ఉట్టిపడుతుందో ఈ ముఖకవళికల్లో.... నీలో విశ్వాసమే లేకుంటే ఇలా గీయగలవా? రియల్లీ ఫైన్.... మతాభిమానం వుండాలి?-పమ్మీ

---

ముఖంలోకించిత్తు సంతోషం కనిపించింది. క్రీస్తంటే తనకు చాలా యిష్టం. క్రీస్తు ప్రేమమూర్తి, కరుణామయుడు, పరిపూర్ణుడు. గొప్ప ఆదర్శం కోసం ప్రాణాల్ని పోగొట్టుకున్న త్యాగ పురుషుడు-- అంతకన్న పమ్మీ ఆలోచనలు మరో కోణానికి పోలేదు. అందుకని ఏదో వెలితిగా తన చిత్రాన్ని అందుకుని బయటకు నడిచాడు.

✿ ✿ ✿

కళ...

ఒక తీరని దాహం- అందునా చిత్రకళ-

పమ్మీకి తాను గీసిన ఆ రెండు చిత్రాలూ ఎంతో ఆనందాన్నిచ్చాయి. అక్కా.... అమ్మా...బాబాయ్... అంతా మెచ్చుకునే సరికి ఆ ఆనందానికి అవధుల్లేవు.

తను ఓ చిత్రకారుడు.

తను గీసిన గీతకు ఓ అర్థం పలుకుతోంది. ఆ గీతలు రూపు రేఖలు దిద్దుకుని, జీవకళ ఉట్టిపడేలా సొంపులను సంతరించుకుంటున్నాయి.

ఇంతకన్నా ఏం కావాలి?

తనలో ఇంతకాలం ఈ కళ ఎక్కడ దాగున్నట్టు? ఎప్పుడో ఎక్కడో తాను కృషి చేసినట్టు, ప్రతిగీతా తన అదుపులోకి ఎలా వస్తున్నట్టు? తనకే ఒక థ్రిల్-

పాత కాలెండర్ లో మరో పేజీ ఖాళీగా వుంది.

తాను మరో చిత్రం వేయాలి-

అతను సరైన చిత్రం కోసం అనుక్షణం అన్వేషిస్తున్నాడు. చివరకు తన అక్క తెచ్చుకున్న పుస్తకంలో ఓ పేజీలో తన కళ్ళు నిలిచాయి.

అతను ఆరోజంతా ఆ చిత్రాన్ని గీసాడు.

ఏకాగ్రతతో అతని కళ్ళు లావెక్కాయి. మనసు ఆనందంతో తేలికయ్యింది.

తాను సాధకుడు.

తానూహించిన దానికన్నా ఆ చిత్రాన్ని ఎంతోబాగా గీయగలిగాడు. ఆ రోజంతా తాను ఏమి తిన్నాడో, ఏమి తాగాడో తనకే తెలియదు.

చిత్రానికి చివరి చేర్పులూ కూర్పులూ చేర్చి తన చిత్రానికి తానే ముగ్ధుడయ్యాడు.

అతని అక్క ఎంత మెచ్చుకుంది. ఇంటికి వెళ్ళాక డాడీకి చూపిస్తే నిజంగా ఆశ్చర్యపోతాడు: నిన్ను తెగమెచ్చేసుకుంటాడు అని మరింత మెచ్చుకోలుగా, ఉత్సాహంగా అంది.

పమ్మీ ఉప్పొంగిపోయాడు. గాలిలో ఎగిరే దూదిపింజలా అతని మనసు పైపైకి ఎక్కడికో ఎగసిపోయింది.

ఒక కళలోసాధించిన ఫలితం ఏదీ తక్కువ అంచనా వేయదగింది కాదు మరి. నిజమైన ఆనందమంటే యిదేనేమో-

పమ్మీ తన బాబాయికోసం అటూఇటూ పరుగులు తీశాడు. అతని బాబాయ్

ఈసారి కూడా ఆ చిత్రాన్ని అంత నిశితంగానూ చూశాడు

చిన్న చిరునవ్వుతో 'ఠాగోర్...' అన్నాడు.

పమ్మీ కళ్ళల్లో వసంతాలు వెల్లివిరిశాయి. తాను గీస్తున్న గీతలు అర్థరహితం కావు అనుకున్నాడు.

'బాగా వేశావు....'

పమ్మీకి అది గొప్ప కాంప్లిమెంట్- గొప్ప తృప్తి-

'విశ్వకవి- రవీంద్రుడు-'

నీవు వేస్తున్న చిత్రాల్లో ఏదో ప్రత్యేకత ఉంది సుమా? రవీ! కవీ!

ఔను! ఈసారి రవీంద్రుని చిత్రాన్ని వేశావు కదూ... అన్నాడు.

అతని బాబాయ్ ముఖంలో చిరునవ్వు-

పమ్మీ ఈసారి తన బాబాయ్‌కేసి చూశాడు. చిన్న చిరునవ్వు ఆ లేబుగ్గల మీద కూడా చూచాయిగా కదిలింది. అది తాను తన చిత్రంమీది వ్యాఖ్యను ఆహ్వానిస్తున్నట్టే వుంది.

చిత్రాన్ని పమ్మీకి అందిస్తూ జాతీయాభిమానం మనిషిలో తప్పకా వుండాలి... అన్నాడు.

పమ్మీ చిత్రాన్ని తీసికుని బయటకు వచ్చాడు. బాబాయ్ గదివంక మరోసారి చూశాడు. అదే చిరనవ్వు అదేబుగ్గలమీద మళ్ళీ వెల్లివిరిసింది.

ఆరోజు సాయంత్రం మమ్మీని అడిగాడు- మనం ఇంటికి ఎప్పుడు వెళ్దామని-

✿ ✿ ✿

'పప్పా!'

'ఎస్! పమ్మీ...'

ఆ మూడుచిత్రాలూ ఎలావున్నాయి..?'

'అదే చూస్తున్నాను మైడియర్ చైల్డ్... రియల్లీ నైస్-'

'థాంక్యూ పప్పా! ఓ చిన్న విషయం- వాటిని చూస్తూంటే నీకేం అనిపిస్తోంది?'

'ఏదో సామ్యం వుందనే అనిపిస్తోంది.-'

'అది సరే.... మరింకేమి అనిపించడం లేదా?'

'నీ ప్రశ్న అర్థంకాలేదు పమ్మీ... ప్లీజ్ బీ స్ట్రెయిట్-'

ఈ మూడు చిత్రాలూ గియ్యడం వెనుక ఓ కారణం వుంది. అదేమిటో నీవు ఊహించగలవా పప్పా....?'

'టెల్ మీ మై చైల్డ్.... నీ ఉద్దేశ్యమేమై య్యుంటుందో చెప్పు?-'

నేనడిగేది నిన్ను పప్పా... కాని నీవు చెప్పలేవు.-

అక్కడ మన ఊళ్ళో బాబాయ్ ఉన్నాడే... ఆయన ఈ చిత్రాల వెనుక మోటివ్ ఏమిటో ఇట్టే చెప్పేశాడు.

'రియల్లీ!'

ఎస్! రియల్లీ డాడీ-'

'అయితే అదేమిటో నేనూ తెలుసుకోవచ్చా-

'బై ఆల్ మీన్స్ పప్పా....'

స్టాలిన్ చిత్రం కులాభిమానమట-

జీజస్ చిత్రం మతాభిమానమట-

ఠా........

ఆగు ఆగు ... అదే నిజమైతే తండ్రిగా నేను సిగ్గుపడాల్సిందే...

ఆర్ యు ష్యూర్ పప్పా?

ఎస్ మై ఛైల్డ్.... ఐ యామ్ ష్యూర్ అది సరే... ఈ చిత్రాలు ఎన్నుకోవడంలోని ఉద్దేశ్యమేమిటి?

ఇట్స్ వెరీ సింపుల్ పప్పా

ఆ మూడుచిత్రాలు చూడు- ఆ ముగ్గురికీ గడ్డాలున్నాయి. గడ్డం వున్న చిత్రం వేయడం సులభంకదా- కొన్ని డిటైల్సు ఎక్కువ వర్క్ చెయ్యకుండానే రూపాన్ని తీసుకురావచ్చు.... నిజంగా అదే జరిగింది.... పప్పా అందుకని ఆ మూడింటినీ ఎన్నుకుని వేశాను.

డాడీ ముఖంమీద చిరునవ్వు-

పప్పా! యు ఆర్ నైస్-

ఫిబ్రవరి *1988* 'రచన

హైదరాబాద్

***1.1.1986***

# ఉదయం

రాలిపోతున్న రక్తం బొట్టు... సూర్యుడు.

ఆ కడసారి కిరణాలకు రక్తం కలిసినట్టు ఎర్రబారింది చెరువు-

బంగారయ్య కాస్త పొగాకు వుండచుట్టి పళ్ళ మధ్య ఇరికించి, వాకిట్లో అరుగుమీద చతికిల బడ్డాడు. అతనికి ఎదురుగా సర్కారు వారి పుంత వుంది. ఆ పుంతకు ఇవతలి వేపు తాను విప్పేసిన రెండెడ్ల బండి వుంది. బండిలో ఫూటుగా తొక్కిన పొగాకుంది. దాన్ని రాత్రికే జల్లెసీమకు తోలుకెళ్ళి నాలుగు రాళ్ళు సొమ్ము చేసుకోవాలి-

రెడ్డి సీమలో పొగాకు రేటు ఎంతయినా తక్కువే... జల్లెసీమలో ఇంతకన్న రేటెక్కువే పలుకుతుంది. అందుకని బంగారయ్య గత నాల్గేళ్ళనుండీ కొంత దూరమయినా, ప్రయాసయినా లెక్క చేయక, నలుగురితో పాటు తానూ ఆ జల్లెసీమకే తోలుకెళ్తున్నాడు.

అతను విప్పేసిన బండికేసి చూసి, రెండూ, రెండువందల ఏభై గిట్టవచ్చునని అంచనా వేసుకున్నాడు. అప్పుడతని కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

ఎర్రనుయ్యా, గోదారి లాకులూ అతని కళ్ళముందు కదిలాయి.

అతను పళ్ళకింద పొగాకును కొద్దిగా నమిలి వూసి, మిగిలిన రసాన్ని ఆరారగా ఆరగిస్తూ తిరిగి తన రాజాలు గూర్చి ఆలోచించడం మొదలు పెట్టాడు.

రాజాలు అంటే అతని రెండో కొడుకు. అతనిఆశాకిరణం- అతనికోసం ఈ లోకాన్ని కూడా లెక్కచేయకుండా మొండికేసి జీవించగలిగాడు. అలా అతను బతికినందుకు అతని బతుకు సార్థకమయ్యింది. ఆ చుట్టుపక్కల పదూళ్ళదాకా తన కొడుక్కి సరితూగగల వాడు మరొకడు లేకుండా తాను చదివించ గలిగాడు. ఇప్పుడతను ఇంజనీరై నెల తిరక్కముందే ఉద్యోగంలో చేరాడు.

అందుకని తన రాజాలు తన గర్వకారణం...

ఆ రాజాలుకు తాను పెళ్ళి జరిపించాలి... కాని రాజాలు పెళ్ళి జరగాలంటే అంత తేలిక కాదు... ఆ సంగతి అతనికి బాగా తెలుసు. అయినా తండ్రిగా తన బాధ్యతేదో తాను నెరవేర్చుకోవాలని కృతనిశ్చయానికొచ్చాడు. ఇంతకాలంగా ఏవేవో ఆలోచనల్తో సతమత

మయ్యాడు. ఇప్పుడిక ఆ ఆలోచనల్ని కట్టిపెట్టేసి, కేవలం ఆచరణ కోసం ఆయత్తమయ్యాడు.

అందుకే బంగారయ్య నాలుగు రోజుల నుండి ఊరంతా తిరిగాడు. ప్రతి వీధికీ వెళ్ళి, ప్రతి గుమ్మం వద్దా ఆగి, వాళ్ళను పలకరించి, వాళ్ళు కూచోమన్నా అనకపోయినా ఏ మెట్ల మీదనో, చెంపనో చతికిల బడి, పిచ్చాపాటీ మాటాడి, తన రాజులు గురించి కనీసమైనా ఆ మాటల్లో ముచ్చటించి, వచ్చేముందు ఇంటెల్లి పాదికీ చేతులు జోడించి, చివరికి పసిపాపకూడా సెలవని చెప్పి వచ్చేవాడు. అలాంటి సమయాల్లో అకారణంగా అతని కళ్ళు చెమ్మగిల్లేవి.

ఆ పల్లెలో ప్రతి ఇల్లూ అతనెరిగినదే.... తన పెళ్ళీడు వరకూ ఆ గుమ్మాల్ని ఎక్కి దిగినవే... కాని ఈనాడా ఇళ్ళు తిరిగి తాను తొక్కాలంటే అటు వాళ్ళకీ, ఇటు తనకీ ఇబ్బందిగానే వుంది.

అయినా బంగారయ్య ఆ ఊళ్ళో ఇంటింటికీ క్షణం తీరిక లేకుండా తిరుగుతు వుంటే, కాసులమ్మకి కించెత్తు ఆశ్చర్యం కలిగింది. 'కొడుకుని చూసుకుని, ఉద్యోగం వచ్చిన కాడి నుండీ తెగ మురిసిపోతున్నాడు. అని ఆమె కూడా తన కొడుకుని గూర్చి గుంభనంగా మురిసిపోయింది.

బంగారయ్య ఉన్నంతసేపూ కొడుకును ఎంతగానో మెచ్చుకుని, తండ్రిగా అతని బాధ్యతను శ్లాఘించి, చివరికి పెళ్ళి బాధ్యతను సైతం అతనికి పదే పదే గుర్తు చేసి, ఆప్యాయతను వొలకబోసిన వాళ్ళు అతన్ని కాస్త అటు గడప దాటనిచ్చి అతను కూచున్న అరుగునీ, మెట్లనీ ఏ పాత చీపుర్తోనో రాచిరాచి కడిగించి దాన్ని ఏ పెంటమీదకో విసిరేయించే వాళ్ళు-

బంగారయ్య బతుకలాంటిది మరి-

అతని బతుకు పదేళ్ళ కిందటే మూగబోయింది. అలా మూగబోయిన బతుక్కి ఓ అర్థాన్ని కల్పించినది ఆ ఊళ్ళోని వీర్రాజు మాష్టారు. ఆ వీర్రాజు మాష్టారే లేకుంటే తనకీ చదువుల్లోని మర్మమేమీ తెలియకపోవును. ఆయనకీ చదువుల్లోని మెలకువలన్నీ తెలుసు కనుకనే తన రాజులీ నాడింతటివాడయ్యాడు.

బంగారయ్య వాకిట్లోంచి చెరువుకేసి చూశాడు.

అతని మనసు కలవరంగా వుంది.

పడమటి ఆకాశం సూర్యుడికి వెలుగు గుమ్మాల్ని మూసేస్తుంది.

రామి కనిపిస్తుందా వెళ్ళేలోగా?... అతను పేటకేసి చూశాడు-

కూలి కోసం పొలాలెళ్ళిన ఆడామగా ఇళ్ళకొచ్చేసి కావుళ్ళూ కడవల్తో నీళ్ళ కోసం చెరువుకేసి వస్తున్నారు. అతని ఇల్లు చెరువు గట్టుకు దిగువలోనే వుంది. కనుక వాళ్ళంతా బంగారయ్య వాకిట్లోంచే వెళ్ళాలి-

అప్పుడు తాను ఎదురు చూస్తున్నట్టే ఆ వెళ్తున్న వాళ్ళలో రామి కనిపించింది.

ఆమె చెరువు కేసి వెళ్తుంటే, ఆమెతో పాటు అతని చూపు కూడా చెరువు గట్టు వరకూ సాగి ఆమె అవతలికి వెళ్ళాక ఆగిపోయింది. ఆ తర్వాత అతని చూపును చెరువు గట్టుమీంచి మరల్చి బాధగా నేలమీద గుచ్చేశాడు.

ఎర్రనుయ్యా, గోదారి లాకులూ మరోసారి అతని కళ్ళముందు కదిలాయి.

బంగారయ్య గతనాల్గు రోజుల్నుండీ వూళ్ళో అందరి గడపా తొక్కినా రామి ఇంటి కెళ్ళలేదు. అతని మనసందుకు ఒప్పుకోలేదు. ఈ రోజు మాత్రం రామి తడవ తడవకూ గుర్తొచ్చి లేచిన కాడి నుండీ మనసంతా ఆక్రమించేసింది.

రేవులో కెళ్లిన రామి కోసం ఎదురు చూశాడు. అప్పుడు పడమటి ఆకాశం భూమ్మీదకు దించిన ఎర్రని తెరలా వుంది. ఆ తెర మీద కదుల్తున్న నల్లని నీడలా గట్టు మీంచి రామి కనిపించింది.

బంగారయ్య మనసులో ఆందోళన-అది ఫలానా అని చెప్పడానికి తనకూ తెలీకుండా వుంది. అతని నోట్లో చప్పబారిన పొగాకు రసాన్ని ఉమ్మేసి, ఘాటైన రసం కోసం బుగ్గకింది పొగాకును మరోసారి నమిలాడు.

రామికి కూడా నడివయసు దాటి ముసలితనం ముంగిట నిలిచింది. అయినా ఆమెలో యింకా మునుపటి అందాన్నే చూస్తున్నాడు బంగారయ్య. అతనికి రామిని చూసినప్పుడల్లా గతం గుర్తుకొస్తుంది. ఆ గతాన్ని నెమరు వేసుకుంటే కొంత తీపి-మరికొంత బాధా మిగుల్తుంది.

ఇప్పుడు ఆమెను పలకరిస్తే పలుకుతుందా?-

రామి బరువు బిందెతో వస్తోంది. ఆమె దగ్గరకు వచ్చేసరికి బంగారయ్య చూపును గ్రహించి ఒక్క క్షణం తత్తర పడింది.

బంగారయ్య "కాస్తాగు..." అన్నాడు అంతలోనే-

వెళ్తున్న రామి ఠక్కున ఆగింది.

"సందలడనిచ్చి ఎర్రిమామిడి చెట్టుకాడికోసారి రా..." అన్నాడు.

"ఎర్రి మామిడి చెట్టా....???"

రామి కనుబొమలు ముడివడ్డాయి. ఆమెలోని రోషం మరింత బుసగొట్టింది. ఆమె నెత్తిమీది బరువు బిందె కుంగిపోయే సందె కిరణాలకి కాలిన నిప్పు ముద్దలా కణకణలాడుతూ కనిపించింది. ఆమె ముఖం కూడా అంత ఎర్రగానూ మారి ఒక్కసారిగా భగ్గుమంది.

"వొళ్ళు కుళ్ళినా గుణం సక్కబడలేదు. సచ్చినోడికి..." అంది రోషంగా-

బంగారయ్య ఆమె మాటలకి చిన్నగా నవ్వేశాడు. కాని తానింకా చెప్పాలను కున్నది మాత్రం గొంతులోనే అడ్డుపడిపోయింది.

బంగారయ్య పైకి నవ్వేశాడే గాని నవ్వినంత తేలిగ్గా ఆ మాటల్ని మనసు నుండి తుడిచేసుకోలేక పోయాడు.

ఒక్కొక్క బలహీనత మనిషి జీవనాన్ని దెబ్బ తీస్తుంది. ఆ ఒక్క పొరబాటే మనిషి జీవితాన్ని పూర్తిగా మార్చివేస్తుంది కూడా-

రామి కాస్త దూరం వెళ్ళాక తానన్నది పొరబాటేమో అనుకుంది. ఆ తర్వాత ఆమె మనసును ఏ ఆలోచనలు కుంగదీశాయోగాని దుఃఖం మాత్రం అక్కడి కక్కడే ముంచు కొచ్చేసింది.

రామి మాటలు బంగారయ్య మనసును పీకుతున్నాయి. అతను బండికేసి వెళ్ళి కమ్మల్ని తప్పించి పలుపుతాళ్ళు సర్దాడు. తొట్లోని ఎండు గడ్డిని లోనికి కూరాడు. కాడికున్న పలుపును మరోసారి విప్పి మరోసారి బిగించాడు. ఇలా ఎన్ని చేసినా అతని హృదయాన్ని గాయపరచిన రామి మాటల్ని ఏవీ మరిపించ లేకపోయాయి.

అతను ఒక్కక్షణం ఆగి తన వొళ్ళును తానే జాలిగా చూసుకున్నాడు. బంగారయ్య బలహీనత అతన్ని చావుదెబ్బ తీసింది. కేవలం అమాయకత్వంతో ఒకప్పుడు వ్యసనానికి లోనైపోయిన వొళ్ళు-

ఆ బంగారు వొళ్ళుకు రంగు మారింది-

ఆ అందమైన రూపంలో తేడా వచ్చింది-

ఇప్పుడది గజ్జి గజ్జిగా ఎర్రని దద్దుర్లతో- అతను పదేళ్ళ నుండి కుష్టురోగి-



సందె చీకట్లోంచి వెన్నెల ఉదయిస్తోంది.

అతను ఎడ్లకు దానా పెట్టేశాడు. తానూ ఉడుకుడికి నీళ్ళు పోసుకున్నాడు. కాసులమ్మ భోజనం వడ్డిస్తే పంచాదిలో కూచొని ఆమెతో ఏవేవో చెప్తూ భోజనం కూడా పూర్తి చేశాడు. ఇవన్నీ అయ్యేసరికి ఊరు కొంత సద్దుమణిగింది. తానిక మిగిలిన బళ్ళకోసం ఎదురు చూడడం తప్ప చెయ్యాల్సింది ఏమీ లేదు. అందుకని బయట వాకిట్లోకి వచ్చి నులకమంచం మ్మీద నడుం వాల్చాడు.

బంగారయ్య బండితోపాటు ముత్తాలూ, పెదవీరడూ, ఎర్రయ్య బళ్ళు కూడా బయల్దేరుతున్నాయి. దూరంగా పుంతలోంచి తాటాకు బళ్ళ అలికిడి వినిపించి కాసులమ్మను కేకపెట్టి పిలిచాడు బంగారయ్య.

బళ్ళు వచ్చి బంగారయ్య వాకిట పుంతలో నిలిచాయి.

కాసులమ్మ పంచాదిలోని హరికేన్ లాంతరు తెచ్చి బండికాడి కింది కొయ్యకు వేలాడగట్టింది.

ఆలిస్యం వుందా వొదినా... అన్నాడు ముత్తాలు.

కాసులమ్మ బంగారయ్యకేసి చూసింది.

బంగారయ్య లేచి బండికేసి నడిచాడు.

కాసులమ్మ బండి వొసిగర్రకు మంచినీళ్ళు నింపిన తాబేటి కాయ తగిలించింది.

పొద్దుటి కోసం మూటకూడుతో సహా ఓ గోనెపట్టా, దుప్పటీ తెచ్చి తొట్లో సర్దింది. బంగారయ్య ఎడ్ల మెడ మీదకు కాడి ఎత్తుతుంటే ఆమె వాకిట్లో కాస్త దూరంగా జరిగి నిలుచుంది.

బంగారయ్య 'ఎడ్లను అదిలికియ్యరా ముత్తాలు...' అన్నాడు.

ముత్తాలు బండి ముందుంది. అతను అదిలికించాక ఒక్కొక్కటే కదిలాయి. చివరగా బంగారయ్య తన ఎడ్లనీ అదిలికించాడు. కిర్రుమని కాడికట్టు శబ్దమవ్వగా ఒక్క ఊపుతో ఆ బరువు బండి ముందు కురికింది. గంగడోలు కింది గంటలు గణగణమని గజిబిజిగా మోగాయి.

బంగారయ్య గుండె దడదడ లాడింది. అతని కళ్ళల్లో నీరు ఒక్కసారిగా కమ్ముకు పోయింది. తానిక ముందు బండి వెయ్యతలచలేదు. ఆ సంగతే అతను భోజనం చేసేటప్పుడు కాసులమ్మతో చెప్పాడు. ఇంతకాలమూ బండి వెయ్యొద్దని కాసులమ్మ ఎంత పోరినా 'కొడుకు చదువు...' అన్న మాటతో నోరు నొక్కేసిన బంగారయ్య ఈనాడు తనంతట తాను ఈ నిర్ణయానికి రావడం ఆమెకు ఆశ్చర్యాన్ని కల్గించింది. బండి వేసుకుని నలుగుర్లోకీ వెళ్తే, ఇతరులు ఏమనుకుంటారో, ఏం చేస్తారో కాసులమ్మ ఊహించుకుని ఇన్నాళ్ళూ బాధ పడింది. కాని అది ఈ ఒక్కసారితో పరిసమాప్తి కాబోతుందన్న సంతృప్తితో...'ఇక ఈ పాడు బండి వేసి పైసాకి పైసా జమ చేయాల్సిన అవసరం ఏముంది – రాజులు చదువు పూర్తయింది. ఉద్యోగం వచ్చేశింది.. కనుక నీవన్నదే మంచిది' అంది.

అయినా బంగారయ్య అలా చెప్తున్నప్పుడు అతని గొంతులో దిగడని బాధను ఆమె కళ్ళారా చూసింది.

అందుకే ఆమె వాకిట్లో నిలబడి, బండి ముందుకు సాగుతుంటే, బంగారయ్య కేసీ, బండి కేసీ చూస్తూ అచేతనంగా నిలుచుండిపోయింది. చివరికి ఏదో గుర్తొచ్చి "ఎప్పటి కొస్తావ్..." అని అడిగింది. కాని అప్పటికే ఆ బండి తన మాటకు అందకుండా ముందుకు వెళ్ళిపోయింది.

బంగారయ్య బండిముందు నడుస్తున్నాడు. ఎడ్ల పలుపులు రెండూ అతని చేతిలో వున్నాయి. అతను నడుస్తుంటే కాళ్ళు అగాధంలో పడుతున్నట్లు నేలమీద పడుతున్నాయి. కొంత దూరం నడిచాక అతను ఇంటికేసి తిరిగి చూశాడు.

అష్టమి నాటి చంద్రుని తెల్లటి కాంతి తేర్చి వడపోసిన సెలయేటి నీరల్లే వుంది. తెల్లని చీరవల్ల వాకిట్లో నిలుచున్న కాసులమ్మ దూరాన్నుండి కూడా అతనికి కనిపిస్తోంది. అప్పుడామె వెన్నెల స్నానం చేస్తున్న పాలరాతి విగ్రహంలా వుంది.

ఆమె అందమే అందం– తానేగాని కుష్టువాడు కాకుంటే ఆ అందాన్ని ఊళ్ళో ఎంతమంది జుర్రుకోవడానికి అంగలార్చేవాళ్ళో...

బంగారయ్య ఆలోచనల్ని ఆపేశాడు.

---

బళ్ళు చెరువుగట్టు దాటి నలిగిన బళ్ళగాడిలో పడి ముందుకు సాగాయి. ఊరు పొలిమేరలోకి వచ్చాక బంగారయ్య బండెక్కి ఆకులపై కూచున్నాడు.

ఊరూ, ఇల్లూ, ఆ చెరువూ ఒక్కొక్కటే తన కనుచూపుల మేర నుండి వెనక్కి జరిగిపోయి ఆ మసక వెన్నెల వెల్తుర్లో కరిగిపోయాయి.

అప్పుడు తానెక్కడున్నానన్న ఆలోచన వచ్చింది.

అతని కళ్ళముందు ఊరు పొలిమేర- వల్లకాడు-

అతని మనసు చివుక్కుమంది. ఆలోచనలు తెగినాయి.

ఆ వల్లకాటికి అవతల ఓ మూలగా ఎర్రిమామిడి చెట్టు-

బంగారయ్య కళ్ళముందు రామి కదిలింది. ఆ తర్వాత మళ్ళీ ఆ ఎర్రిమామిడి చెట్టు తన ఆలోచనల్లో చోటు చేసుకుంది.

ఎర్రి మామిడి చెట్టు!!!

తన లానే వయసు మళ్ళింది.

ఒకప్పుడది పచ్చని ఆకుల్తో గుబురుగా పెరిగి నిండుగా వుండేది. తానూ రామీ అర్ధరాత్రి వరకూ ఆ చెట్టుకింద ఒకరిలో ఒకరు ఒదిగి, కోరికల్తో కరిగి, మైమరచి వుంటే గుబురుగా పెరిగిన తన రెమ్మల నీడల్తో కప్పేసి, ఊరు జనానికి కనుమరుగు చేసేసి, కేవలం ఆ ఒక్క అనుభవం కోసమే ఆరాటపడుతున్న తమ నిద్దరినీ రహస్యంగా చూస్తూ పులకించి పోయే మాచికమ్మలాంటి ఆ ఎర్రిమామిడి చెట్టు ఈనాడు ఆకు రాలి, కొమ్మలు ఎండి, తనలానే వయసు మళ్ళిపోయింది.

ఒకప్పుడా ఎర్రిమామిడి చెట్టు తన యవ్వనానికి ప్రతీక- ఇప్పుడది తన బతుక్కి ప్రతిబింబం.

అదిప్పుడు చిక్కి శల్యమై వయస్సుడిగిన ముసిల్దానిలా ఈసురోమంటూ ఆ వల్లకాటికి ఓ మూల ఒంటరిగా నిలుచుంది. మరికొంత కాలానికి మిగిలిన ఆ ఆకులు కూడా రాలిపోతాయి. అప్పుడు ఏ సర్కారువారో దాన్ని నరుక్కుపోతారు. కాకుంటే ఎప్పుడో ఒకప్పుడు ఎవరికో ఒకరికి ఈ కాష్టంలోనే తగల బడుతుంది. అలా ఏ అర్థం లేకా, ఎలాగో పుట్టి, ఎలాగో పెరిగి, ఏ లక్ష్యాన్నీ ఆశించక చచ్చేవరకూ బతికిన ఆ ఎర్రిమామిడి చెట్టు రేపు చచ్చాక ఎవరికో ఒకరికి ఈ కాష్టంలోనే ఉపయోగపడుతుంది.

మనిషి పోతే?-

ఔను మనిషి చచ్చి ఎవరికీ ఉపయోగపడడు. ఆ సంగతి ఇప్పుడిప్పుడే తన ఆలోచనల్లోకి వస్తోంది.

బంగారయ్య నవ్వుకున్నాడు, వెర్రిగా-వేదనగా.

రామి!-

చిన్న చిరునవ్వుతోనో, చినికిన రెండు కన్నీటి చుక్కల్తోనో ఆ నాటి తమ రసగాధకు ఓ అందమైన రూపం కలిగిస్తుందని అనుకున్నాడు.

కాని రామి రానంది.

రామి నిజానికి రాదు.

ఇప్పుడు రామిగానీ, తాను గానీ, ఆ ఎర్రిమామిడి చెట్టుగానీ తన అనుభవాల్లో మరేది గానీ - అన్నీ వయసు మళ్ళినవే... కాలానికి చెల్లనివే-

బంగారయ్య తానిక చేయవలసిందేమీ లేదనుకున్నాడు. అతను బండిపై కమ్మల్ని వత్తిగించి, గొనె పట్టా, దుప్పటీ పరిచి, పక్క సర్దుకుని ఎల్లకిలా పడుకున్నాడు.

బళ్ళు సాఫీగా నడుస్తున్నాయి.

బళ్ళ గాడిలో వొండ్రు ఇసుక చక్రం కింద నలిగి సన్నని శబ్దంతో పాయలౌ తోంది. పక్కకింది తాటాకులు తన బరువుకు వొత్తిగిలి తాను తొట్టి పడవలో పడుకున్నట్టుంది.

బంగారయ్య కళ్ళముందు విశాలమైన ఆకాశం-

బళ్ళు ఊరుదాటి చాలా దూరం వచ్చేశాయి. ఆ పుంత వెంబడే మరో నాల్గు కోసుళ్ళు ముందుకు పోతేగాని కంకర్రోడ్డు రాదు.

బళ్ళు ఒక్కొక్క చెలకా దాటుకుంటూ ముందుకు వెళ్తున్నాయి.

ఒకప్పుడా ప్రాంతం చిట్టడవి. ఇప్పుడది బీళ్ళకిందా, తోటల కిందా మారింది. అయినా ఆ పరిసరాల మీంచి అడివి యొక్క రూపురేఖలు పూర్తిగా మాసిపోలేదు. సర్కారు పుంత చాలా వరకూ విశాలంగానే వున్నా ఒక్కొక్క చోట సన్నగా ఇరుగ్గా వుంది. ఇరుపక్కలా కట్టవల్లో ఏపుగా పెరిగిన టేకు చెట్లున్నాయి. వాటితో పాటు కుంకుళ్ళూ, తెల్ల తుమ్మలూ, ముసిని చెట్లూ వున్నాయి. వాటి రెమ్మలు గుబురుగా పెరిగి పుంతను ఇరుపక్కల్నుండీ కమ్మేశాయి.

అప్పుడు బయటి లోకాన్నంతా వెన్నెల్లో ముంచెత్తుతున్న చంద్రుడు ఆ చెట్ల నీడల్లో మాత్రం లేడు. ఆ చిక్కటి చీకటి చెట్ల నీడల్లోంచి ఆ బరువు బళ్ళు అలవాటుగా ముందుకు సాగిపోతున్నాయి.

చెలకమీది గవళ్ళ పాకలోంచి ఎక్కడో తొలికోడి కూసింది.

బంగారయ్య కలవరంతో దిక్కులు చూశాడు. ఎర్రనుయ్యి దాటేసింది.

చుక్క పొడిచేలోగా జల్లేసేమ చేరుకోవచ్చుననుకున్నాడు.

అతని కళ్ళముందు గోదావరి లాకులు నిలిచాయి. గోదావరి లాకులు దాటితే అవతలిదంతా జల్లేసేమ-

బంగారయ్య పక్కమీద ఒత్తిగిలి ఎప్పటిలా ఎల్లకిలా పడుకున్నాడు. ఇప్పుడతని కళ్ళముందు విశాలమైన ఆకాశం వుంది. లెక్కకందని నక్షత్రాలున్నాయి. తెలిమబ్బుల్లోంచి తేలియాడే చంద్రుడున్నాడు.

అంతకు మినహా మరేవీ కనిపించవు.

అప్పుడు-

అతను ఆకాశానికి దగ్గరగానూ, భూమికి దూరంగానూ వున్నట్టు అనుభూతిని పొందాడు.

---

భూమికన్నా ఆకాశం అతనికి అతి చేరువలో వున్నట్టు అనుభూతి కలగడం ఇదే మొదటిసారి. ఆ ఆకాశంలోని చంద్రుడూ, నక్షత్రాలు అన్నీ తనవైనట్టూ, ఈ భూమ్మీద సర్వం తనవి కానట్టూ అనిపించాయి. అలాంటి అనుభూతి లోంచి అతను ఆకాశ మండలం కేసి చూసి మరింత తన్మయం చెందాడు.

ఆ వెన్నెలకి తాను పడుకున్న తాటాకుల పక్క తెల్లని హంస తూలికా తల్పంలా వింతగా ప్రకాశిస్తోంది.

బంగారయ్య అలా ఆకాశంలోకి చూస్తూనే వున్నాడు.

ఎక్కడో చుక్క జారింది. ఎక్కడో చుక్క రాలింది.

ఎన్నో చుక్కలు - ఎన్నెన్నో లెక్కకందని రకరకాల చుక్కలు.

దూరంగా, దగ్గరగా... ఎంతో ఆహ్లాదంగా-

ఇవన్నీ పగలెందుకు కనపడవు?!

పగలు కనిపించే ఈ రాయీ రప్పా, పురుగూ పుట్రా ఈ రాత్రి వెన్నెట్లో ఎందుకు కనిపించవు?!

పగటి కన్నా రాత్రీ-

సుఖం కన్నా దుఃఖం-

మనిషికి అతి విలువైన అనుభవాల్ని అందిస్తాయే మో-

బంగారయ్య అలా థ్రిల్ ఫీలయ్యేటప్పుడు అతను ఆ చుక్కల్లోంచి రెక్కలాడించుకుంటూ ఎగిరే రెండు తెల్లని పక్షుల ఆకారాల్ని చూశాడు. అంతలోనే వెనక నుంచి తన మీదుగా ఏడుపులాంటి స్వరమేదో వినిపిస్తూ పోయింది.బంగారయ్యకు తీతువు పిట్ట కూతని తెలుసు. అతను విస్తుపోయి దుర్వార్త విన్న వాడిలా ఆకాశం కేసి చూశాడు.

ఆ పిట్ట అరుపులు దూరమైనట్టే అయి మళ్ళీ తన పక్కనే వినపడుతూ వెంటాడ్డం మొదలు పెట్టాయి.

ఎదర ఎవరి బళ్ళమీద వాళ్ళు హాయిగా నిదురోతున్నారు. బంగారయ్యకు కూడా నిద్ర సోకుతోంది. అతని కనురెప్పలు మూతలు పడ్డాయి.

అప్పుడు నదీ ప్రవాహంలోని తొట్టె పడవలా ఏ ప్రోద్బలం లేకుండానే ఆ బండీ, తానూ, ఇతర బళ్ళతో పాటు ఆ పుంతలోంచి ముందుకు సాగిపోతున్నాయి.

పడమటి చల్లగాలి తిరిగింది.

బంగారయ్యకు నిద్ర బాగా పట్టేసింది.

✿ ✿ ✿

బంగారయ్య బండి కుదుపుకీ, చక్రాల కింద నలిగిన కంకరాళ్ళ శబ్దానికీ, ఎదర లారీ హారన్ కీ త్ళుళ్ళిపడి లేచాడు. కళ్ళు తెరిచే సరికి లారీ హెడ్ లైట్లు ముఖం మ్మీద పడి కళ్ళు బయర్లుకమ్మాయి.

ఎదర కంకర్రోడ్డు-

చుట్టూ కలయచూశాడు. మరో అరమైలు దూరంలో గోదారి గట్టు- అంతవరకూ తాను పోయింది కలత నిద్రే- ఆ కలత నిద్దట్లో తాను కన్నకల లీలగా కదిలింది.

ఆ కలలో తాను పచ్చని వరిచేలనూ, పెద్ద కాసారాన్నీ, పెళ్ళి పందిరినీ చూశాడు-

నవ నవలాడుతూ కనుచూపుమేర వున్న ఆ పచ్చని వరిచేను తాను చూస్తుండగానే పాలు పోసుకుని, గింజతొడిగి, బరువెక్కిన బంగారు వన్నె కంకెల్తో నేల వాలింది. బంగారయ్యే హడావుడిగా ఆ కంకెల్ని వొడేసి పట్టుకుని, తన కొడవలితో ఆ పంట యావత్తూ కోసి, నిలబడి, తృప్తిగా చూస్తూ ఈ పంట 'నా ముందు తరాలకి' అనుకున్నాడు. చెమటతోనూ, నూగుతోనూ, అలసటతోనూ వున్న బంగారయ్య ఆ చెరువులోకి దూకి, పాతాళాన్నంటి పైకి లేచే సరికి తన చుట్టూ జలమయమయ్యింది. ఎక్కడా నేలనేది కనిపించడం లేదు- అతను ఎంతకూ తెగని ఆ మహాజలసమూహాల్ని ఈదుకుంటూ ప్రపంచాన్నంతా చుట్టేసి చివరికి నేలమీద అడుగు పెట్టాడు. అది అంతకు ముందు అతను నిలుచున్నదే- ఆ నేలమీద తాను అడుగు పెట్టాక తాను తన వొళ్ళుకేసి చూసుకున్నాడు. అది ధగధగమని మెరిసిపోతోంది-

ఆ కలలో బంగారయ్య తన రాజులుకు తాను దగ్గరుండి పెళ్ళి జరిపిస్తున్నాడు. తాళమేళాలతో, సన్నాయి పాటల్తో ఆహ్లాదంగా జరుగుతోంది.

ఆ కలలో బంగారయ్య ఈనాటి బంగారయ్య కాడు. బండితోలుకునే నిరుపేదా కాదు. కుష్టురోగీ కాడు. బాగా మెరుగు పెట్టిన బంగారం వన్నె శరీరంతో నిగనిగలాడుతున్న బంగారయ్యతను. చక్కని సిల్కు లాల్చీ తొడుక్కుని, అన్ని పనులూ చేసుకుంటుంటే బంధువులొచ్చి అతన్ని వాటేసుకుంటున్నారు. ఆ సన్నివేశం అతన్ని ఆపాదమస్తకం ఆనందంతో ఉర్రూతలూపింది.

రాజులు పెళ్ళి అతనూహించిన దానికన్నా ఎంతో ఘనంగా జరుగుతోంది. పీటల మీంచి కొత్త పెళ్ళి కూతుర్తో సహా లేచి వచ్చి రాజులు అతని పక్క నిలుచున్నాడు. అతని మనసు గర్వంతో ఉప్పొంగింది. కోడలివంక చూశాడు. ఆమె నుదుట బాసికంతోనూ, పెళ్ళి బట్టల్తోనూ ముగ్ధమనోహరంగా వుంది.

అతనా కలలో ఇందాకటి నేలనే చూశాడు.

ఇప్పుడది దున్ని, చదును చేసి, తీర్చిన చాళ్ళుతో చక్కగా పదును చేయబడి సిద్ధంగా వుంది. ఇక ఆ క్షేత్రంలో విత్తనం నాటడమే తరువాయి.

అతను తిరిగి కోడలికేసి చూశాడు.

ఆమె చంకను పసిపాపడు నవ్వుతూ కనిపించాడు. 'నీ మనవడు' అందామె- అతనిలో ఎన్నెన్నో జలపాతాలురికినయ్ ఆనందంతో-

కాని ఎత్తుకోవాలంటే అతని చేతులు పైకి లేవడం లేదు. అతనిలో ఏదో మార్పు...

---

కల కరిగిపోతోంది కాబోలు... అయినా తన సంతతిని ఎత్తుకోవడం కోసం తన రెండు చేతులూ పైకెత్తడానికే తహ తహలాడుతున్నాడు.

ఏదో కలవరం, భయం, బాధా అతన్ని సతమతం చేస్తోందా కలలో-

శస్త్రచికిత్స అయ్యాక రోగికి మత్తులోని హాయి తొలగుతూ, దాని స్థానే మెలకువలోని బాధ చోటు చేసుకుంటూ ఒకదాని కొకటి తారస పడుతున్నట్టు, కలకీ, అనుభవంలోని కుమ్మ జీవితానికీ మధ్య పెనుగులాట జరుగుతోంది.

అలాంటి సమయంలో బండి చక్రాల కింద కంకర్రాళ్ళు నలిగీ, లారీ హారన్ మోగీ, ఒక్క కుదుపుకి కంటున్న కలలలోంచి, కలత నిద్దట్లోంచి, ఈ లోకానికొచ్చి పడ్డాడు.

బండి గోదారి గట్టు మీద పోతోంది.

నల్లని చీకటి తెల్లని వెన్నెలని కబళిస్తోంది.

బంగారయ్య లేచి, బండిమీద పక్కాపై దుప్పటి కప్పుకుని ముడుచుకు కూచున్నాడు.

ప్రశాంతమైన వాతావరణం... చుట్టూ అలుముకున్న నిశ్శబ్దం-

అతని మనసు బితుకు బితుకు మంటోంది.

అవతల నదికి వరదొచ్చి పొంగి పొరల్తోంది. నది మీంచి చల్లని గాలి వీస్తోంది. తూరుపు ఆకాశం నుండి మరిన్ని చుక్కలు మిణుకు మిణుకు మంటున్నాయి.

తార్రోడ్డు మీద గిట్టల చప్పుడూ, గంగడోలు కింది గంటల చప్పుడూ, బళ్ళ చక్రాలకు రాసుకుంటున్న ఆకుల చప్పుడూ కలసి లయబద్ధంగా, వింత సంగీతంగా, చరమ గీతంగా వినిపిస్తోంది. నిశ్శబ్దాన్ని చిందరవందర చేస్తోంది.

అయినా చుట్టూ దిగంతాల వరకూ అలుముకున్న చీకట్లు లోకాన్నంతా ఏలే నిశ్శబ్దాన్ని మరింత సన్నిహితంగా తీసుకొస్తోంది. చల్లగాలి మరింత చల్లగా వీస్తోంది. తాను కన్న కలేమిటి?

బంగారయ్య మనసు పరిపరి విధాల ఆక్రోశించింది.

తూరుపు ఆకాశం మీది వేగుచుక్క మాయమౌతోంది. చిమ్మచీకటి కమ్ముకొస్తోంది.

బళ్ళు ఆగాయి.

ఎదర గోదావరి లాకులు.

నిశ్శబ్దం-

చీకటి గాఢ పరిష్వంగంలో పూర్తిగా మూర్ఛనలు పోయిన చావులాంటి నిశ్శబ్దం... ఆ నిశ్శబ్దంలోంచి సన్నని రొద అలలా లేచి, వామన మూర్తిలా ఎదిగి బంగారయ్య గుండెల్ని బద్దలకొట్టినట్టయింది. లాకులు కింది నీరు తలుపుల్ని నెట్టుకొచ్చే రొద అది-

గోదావరికీ, దాని నుండి వేరయ్యే కాలవకీ బ్రిటిష్ వాళ్ళ కాలంలో నిర్మించిన లాకులవి-

ఆ లాకుల్ని దాటించడానికి ముత్తాలూ, ఎర్రయ్యా, పెదవీరడూ బళ్ళు దిగారు

బంగారయ్య కూడా దిగాడు. ఆ బళ్ళు ఒక్కొక్కటీ గోదారి గట్టుదిగి, పక్క నున్న లాకుల మీదికి మళ్ళాయి. కింద నీటి శబ్దానికి ఆ ఎడ్లు లాకులమీద కాస్త బెదిరినా ఆ తర్వాత నెమ్మదిగా దాటి పక్కనున్న కంకర్రోడ్డు ఎక్కాయి.

ఎదురున్న ముత్తాలు ఆ కంకర్రోడ్డుమీద బళ్ళను ముందుకు నడిపిస్తున్నాడు. మిగత వాళ్ళు బళ్ళెక్కి ముసుగు తన్నిపట్టారు.

బండి దిగిన బంగారయ్య తిరిగి ఎక్కలేదు.

అతను లాకుల వద్ద నిలుచుండిపోయాడు.

అతని ప్రమేయం లేకుండానే బళ్ళన్నీ ముందుకు సాగిపోయి చీకట్లో కనుమరుగైపోయాయి.

ఆకాశం మ్మీద వేగుచుక్క మాయమయ్యింది.

బంగారయ్య తాను కన్నకల నిజం కాబోతుందనుకున్నాడు.

అతను తన ఊళ్ళో ఇంటింటికీ తిరిగినప్పుడు వాళ్ళంతా తన రాజులు పెళ్ళి బాధ్యతను గుర్తు చేస్తుంటే తాను శిలువ ఎక్కుతున్న క్రీస్తులా మౌనం వహించాడు.

తాను కుష్టువాడయ్యుండగా తన కొడుక్కి పెళ్ళి ఎలా జరుగుతుంది.

ఇప్పుడు తాను ఎదురు చూస్తున్న ఘడియ వచ్చేశింది. ఈ ఘడియ తాననుకున్నట్టు గడిస్తే రాజులు పెళ్ళి నిరాఘాతంగా జరిగిపోతుంది. తండ్రిగా ఆ బాధ్యతను తానెన్నడో గుర్తించాడు. ఇప్పుడు దాన్ని ధైర్యంగా స్వీకరిస్తున్నాడు.

అతని కళ్ళల్లో నీళ్ళు కమ్ముకున్నాయి.

తెల్లవారడానికి మరికొంత సమయం మిగిలి వుంది.

అతను చుట్టూ కలయ చూశాడు.

భూమి శాంతంగా వుంది. ఇప్పుడది మరింత మౌనం వహించింది.

ఆకాశం ఎంతో విశాలంగా వుంది. ఇప్పుడది మరింత నిర్మలమైపోయింది.

తను నీళ్ళకేసి చూశాడు.

అవి నిర్మలంగా లేవు... శాంతంగానూ లేవు.

అలజడిలో ఆక్రోశిస్తున్నాయి. చీకట్లో రోదిస్తున్నాయి. అగాధం లోంచి అలజడితో, రోదనతో అలలు విరిగి ముందుకు విరుచుకు పడుతున్నాయి.

అవతల గోదావరి పొంగి పొర్లుతోంది. వరద–

విసురుగా, వేగంగా, నురుగు తేలుతూ, సుడులు తిరుగుతూ ముందుకు తోసుకు పోతోంది.

అతను మళ్ళీ లాకులు కింది అగాధంలోకి చూశాడు–

అది భయంకర ప్రభంజనంలా విరుచుకు పడుతోంది–

అది విచ్చుకున్న కత్తుల బోనులా కర్కశంగా వుంది.

అది విషపు కోరలా క్రూరంగా వుంది.

జీవితం మీద అతనికి ఆశ చావకుండా వుంది.

కాని అతని శరీరంలోని అణువణువూ చల్లబడి, నిస్సత్తువయి, వాడిలి, ఏ క్షణాన్నయినా రాలిపోయే పూవులా తానున్నాడు.

అతను తూరుపు కేసి చూశాడు.

ఆకాశం మీద అరుణకాంతి కనిపించే సమయం ఆసన్నమౌతోంది. ఓమ హోదయం కోసం అక్కడ వేగుచుక్క ఆహుతై పోవడం కళ్ళారా చూశాడు.

అతను ఈ చీకట్లలోనే ఈ కుష్టును పరిసమాప్తి చెయ్యాలనుకున్నాడు.

అది తన ముందు తరానికి ఏ మాత్రం సోకక ముందే, ఆ ప్రవాహంలో ప్రక్షాళన గావించాలనుకున్నాడు.

ఆ లాకుల తలుపుల మధ్య ఏదో శబ్దం- ఏదో అనూహ్యమైన ఆర్తనాదం-

తూరుపు ఎర్రబారింది.

వరద నీరూ ఎర్రబారింది.

హైదరాబాద్

*మార్చి 1982*

# తోలకరి వెలుగు

నన్ను ఆ యిల్లు ఖాళీ చేయమన్నప్పట్నించీ ఆ గదికీ నాకూ వున్న అనుబంధం మరీ పెరిగిపోయింది. అలాగే ఆ పరిసరాలతో కూడా-

పది రోజుల్లో నేను మరోచోటుకు మారాలి. మరో కొత్త వాతావరణంలో యిమిడి పోవాలి.

నాకూ ఆ గదికీ వున్న అనుబంధంలాంటిదే ఆ పరిసరాల్లోని మనుష్యుల్తో కూడా వుంది. (నేనెప్పుడూ వాళ్ళతో మాటాడకపోయినా-)

నేను మేడమీద గదిలో వుంటున్నాను. ఒకే ఒక్క గది. మరీ ఒంటరివాడినై పోవడం వల్ల తరచూ నేను కిటికీ వద్దకు వచ్చి కిందికి చూస్తుంటాను. కింద పచ్చని మైదానం. దాని చుట్టూ ఎత్తయిన మేడలూ డాబాలు. ఆ కాస్త స్థలాన్నీ కార్పొరేషన్ వాళ్ళు పార్కుకని కేటాయించారట- అది వర్షాకాలంలో పెద్ద మడుగులా అవుతుంది. అప్పుడు అందులోని కప్పలు రాత్రిళ్ళు చేసే గోల యింతా అంతా కాదు. తతిమ్మా కాలాల్లో మాత్రం యిబ్బంది లేదు.

ఆ పార్కుకని కేటాయించిన స్థలంలో చిన్నపాక- నేను వచ్చినప్పటి నుండీ దాన్ని అక్కడ చూస్తూనే వున్నాను. వర్షాకాలంలో వచ్చే వరదకు అదెక్కడ కొట్టుకుపోతుందోనని భయం వేసేది.

నేను కిటికీ తెరిస్తే మా యింటి ఓనరు యిల్లు, ఆ పక్కనే ఈ పూరి పాకా, రెండూ కనిపిస్తాయి. ఏమీ తోచనప్పుడు అటుకేసి చూస్తూ కాలం గడపడం నాకు అలవాటై పోయింది.

ఒంటరి జీవితం ఒక్కోసారి భరించరానిదిగా వుంటుంది. అలాంటప్పుడు రాత్రిళ్ళు గది తలుపులు బార్లాతీసి పడకకుర్చీలోంచి బయటకు చూస్తుంటాను. అక్కడ నాకు ఎదురుగ కనిపించేవి రెండు యూకలిప్టస్ చెట్లు మాత్రమే. నేను మేడమీద ఉండటం వల్ల వాటి మొదళ్ళు నాకు కనిపించవు. వాటి రెమ్మలు ఆకాశానికి తాకుతూ వుంటే నేను కూడా ఆకాశంలోని ఆ రెమ్మలకేసి చూస్తూ వుండిపోతాను.

నాకెవరూ లేరనేభావం ఒక్కోసారి నన్ను కలచివేస్తుంటుంది. అలాంటప్పుడు గాలికి నిండుగా కదలాడే ఆ రెండు చెట్లూ నన్ను ఊరడిస్తున్నట్టు వుంటాయి. వాటిని చూస్తున్నంత సేపూ అదో తృప్తి. ఇద్దరు స్నేహితులు నా ముందు మసలుతున్నట్టే వుంటాయి. ఒక్కోసారి అవే నా ప్రాణస్నేహితుల్లా కనిపిస్తాయి.

ఇప్పుడు నన్ను యిల్లు ఖాళీ చేయమన్నారు. నేను నా గదికీ యీ చెట్లకీ సన్నిహితంగా ఏర్పరచుకున్న యింతటి అనుబంధాన్ని అమాంతం ఒక్కసారిగా తెంచేసుకోవాలి. తెంచుకోవడం తప్పనిసరి అని గుర్తొచ్చినప్పుడల్లా ఆ అనుబంధం మరీ ఎక్కువౌతుందే తప్ప తక్కువ కావడం లేదు.

మనిషికీ-మనిషికీ మధ్య అనుబంధాన్ని మనిషికీ-మరో చెట్టుకో లేక పరిసరానికో మధ్య వుండే అనుబంధంతో పోలిస్తే దాని స్వభావంలో కొంత తేడా వుంటే వుండొచ్చు. గాని మనుషుల మధ్య అనుబంధాన్ని మాత్రం పూర్తిగా నమ్మలేకుండా వున్నాను.

మా యింటి ఓనరు తల్లిని నేను అవ్వ అని పిలుస్తాను. వాళ్ళ యింట్లో ఓ గదిలో నాల్గేళ్ళపాటు వంటరిగా వున్నాను. ఆతర్వాత వాళ్ళు పక్క స్థలం కొని యిల్లు కట్టారు. కిందిభాగం అద్దెల కిచ్చేశారు. నా కొరకు కూడా మరో గది ఆ మేడమీదనే కట్టి అందులో నన్ను ఉండమన్నారు. అద్దెలో ఏమంత తేడా లేదు. నాకూ వాళ్ళకూ ఉన్న ఎటేచ్‌మెంట్ అలాంటిది. నా అంతట నేను వెళ్ళిపోతేనేగాని వాళ్ళకు వాళ్ళుగా నన్ను ఎన్నడూ వెళ్ళ మనరట. ఆ గది లోంచి యీ గదిలోకి మారేటప్పుడు కూడా యీ మాత్రానికే ఎంతో బాధ పడిపోయారు. పిల్లలు పెద్దవాళ్ళవడం వల్ల, ఇల్లు చాలక పోవడం వల్ల మరో గదిలోకి పంపుతున్నా మన్నారు. ఈ కొత్త యిల్లు మీదిగది కేవలం నా ఒక్కడికోసమే కట్టారట.

ఇల్లు మారి ఇక్కడికొచ్చి యిప్పటికి ఆరుమాసాలయినా కాలేదు. ఇప్పుడు నన్ను గది ఖాళీ చేయమన్నారు. మరోచోట ఎక్కడయినా చూసుకోమన్నారు.

ఇప్పుడు నన్ను ఖాళీ చేయమనడానికి కారణాలేవైనా కానీ, త్వరలో నేను మరో యిల్లు చూసుకుని ఖాళీ చేయతలచాను.

ఇంతకూ నన్ను ఆగది ఖాళీ చేయమన్నప్పటి నుండీ నేనా కిటికీని తెరవడం మాని వేశాను. అది తెరిస్తే వాళ్ళ యిల్లు చూడాలి. వాళ్ళ యిల్లు చూడాలంటే నా ముఖం చెల్లడం లేదు. కాని ఎన్ని రోజులని తెరవకుండా ఉండగలను? ఇప్పుడు కిటికీని తెరిస్తే మొదట నేను చూసేది మా ఓనరు యిల్లు కాదు. అది ఇప్పుడు నా కంటికి చాలా దూరమైపోయింది. నేనా యింటిని చూసి చాలా రోజులయిందంటే ఎవరూ నమ్మరు.

ఏమిటో... ఆ కిటికీని తెరవ కూడదని నిశ్చయించుకున్నాకే నేనా కిటికీ వద్ద ఎక్కువసేపు గడుపుతున్నాను. ఆ పూరిపాక మరీ సన్నిహితమైపోయింది. అందులోని మనుషులనందరినీ చూశాను. అందరి జీవితాలు ఒకేలా ఉండవనడానికి ఆ యిల్లు ఓ తార్కాణం-

ఆ యింట్లో తిరిగే ఓ పధ్నాలుగేళ్ళ అమ్మాయి నాకు తరచూ కనిపించేది. ఆమె ఎప్పుడూ చింపిరి తలతో, మార్చని మురికి గుడ్డలతో నెత్తిమీద ఉప్పరతట్ట పెట్టుకుని చేతిలో గునపమో, పారో, డష్టక్రో తీసుకొని ఇంటి ముందునుండి వెళ్తూ కనిపించేది. సాధారణంగా ఆ వయసు అమ్మాయిలు నవ్వుతూ గెంతుతూ బడికి వెళ్ళడం చూస్తుంటాము. కాని ఈ అమ్మాయిలో ఏ ఒక్కనాడూ అలాంటి సంతోషం మచ్చుకి కూడా కనిపించలేదు.

కొందరి జీవితాలు అంతేనేమో-

తల్లి ఎప్పుడూ దాన్ని తిడుతూనే వుండేది. దాని నోరేనోరు. సాయంత్రాలు తండ్రి తాగివస్తాడు. వచ్చి పెళ్ళాన్ని చితకబాదుతాడు. అది వాణ్ణి అడ్డమైన బూతులూ తిడు తుంది. వాడు దాన్ని నేలమీద బరబర యీడ్చుకుని ఎదరున్న ఏదో యింటికి లాక్కెళ్ళతాడు. వాళ్ళను న్యాయం చెప్పమంటాడు. వాళ్ళు పొండని ఛీదరించుకుంటారు. వాడూరుకోడు. మీ కాళ్ళు మొక్కుతా న్యాయం చెప్పండంటాడు. తలుపులు మూసుకుంటారు. మళ్ళీ ఆమెను చితకబాదుతాడు. అర్ధరాత్రి అవుతుంది. ఇలా ఎన్ని సంవత్సరాల చరిత్రో వాళ్ళది.

ఇప్పుడు పెద్ద కొడుకు కూడా అందొచ్చాడు. వాడూ సమంగా కూలి డబ్బులు సంపాదిస్తున్నాడు. అందుకని యింట్లో వాడి హెూదా కూడా సమంగా పెరిగింది. తండ్రే తనతోపాటు కల్లు దుకాణంలో కొడుక్కి ఓ గుక్కెడు పట్టించి మరీ తీసుకొస్తున్నాడు. తాగేసాక తండ్రి రివాజుగా పెళ్ళాన్ని కొడతాడు. కొడుకు "లాపాయింటు" తీస్తాడు. వాడూ వీడూ తిట్టుకుంటారు. ఆ తర్వాత కర్రలు తీసుకుంటారు. ఓ రోజు యిది కాస్త పాకం ముదిరింది. ముదిరిన మీదట తండ్రి కొడుకు లిద్దరూ తాడి పట్టెలు తీసుకుని బాదు కున్నారు. తాటి ఏసులు దిగి వంటి నుండి రక్తాలు కారాయి. ఆ మీదట కోపంతో కొడుకు ముక్కుని కొరికేసాడు. అది ఆవకాయ ముక్క నలిగినట్టు నలిగి నోట్లోకి వచ్చేసింది. దాంతో వాడు లబో దిబో మని గోలెత్తాడు. పోలీస్ కంప్లెయిట్ వెళ్ళింది. కొడుకు దగ్గర్నించి కాదు- మెడల్లోంచి - న్యూసెన్సు కేసది. లాకప్ నుండి మరుసటి రోజు బయ టకు వచ్చారు. పెళ్ళాం మెడలోది పోలిసోళ్ళ చేతిలో పెట్టక తప్పింది కాదు. వాళ్ళు వెళ్ళిపోయాక ఆ పెట్టినదాని కోసం మూడు రోజులు విసుగు విరామం లేకుండా తిట్టింది. శోకాలు పెట్టి ఏడ్చింది. అయితే సంసారాలు యిలా కావడానికి ఎవరు బాధ్యులన్నది ఆలోచిస్తే ఆ గాలి దుమారం ఏ వ్యవస్థ మీదికో పోతుంది. కాని సంసారం ఇలానే వుంటే ఎంతైనా ఆ అమ్మాయి లేత గుండెదే కదా- సంతోషమనేది ఎక్కణ్ణించి వస్తుంది.

నేనా రోజు యిల్లు ఖాళీ చేస్తున్నాను; అవ్వ వచ్చింది. ఆమె వచ్చి అంది గదా- ఏనాటి ఋణానుబంధమో యిది- నీవు వెళ్ళి పోతుంటే ఏదోలా వుంది. అబ్బాయి దీని మీద కూడ పోర్షన్లు లేపి అద్దెకు యిస్తాడుట. నీదా చిన్న ఉద్యోగం. చిన్న జీతం... పై రాబడి లేని ఆఫీసు. రేపు కట్టిన తర్వాత ఓ పోర్షను యిచ్చినా అంత అద్దె కట్టుకోలేవు గదా- అందు కని తప్పని సరయింది- అంది.

ఆమె సానుభూతి అలాంటిది.

అద్దె కట్టుకునే తాహతు నాకు లేదు కాబోలు-

గడించడం గొప్ప కళే మరి-

లోకంలో చాలా మందికి గడించడం తెలిసినట్టు నాకు తెలీదు.

కనుక నేను గది ఖాళీ చేసేసాను.

ఇప్పుడు నా ఈ కొత్త గదిచుట్టూ అంతా మనుషులే- ఇక్కడ కనీసం జాబు రాసుకోడానికి కూడా మనసు పుట్టడం లేదు. అందుకని రాత్రి ఎప్పటికోగాని గదికి రాను. ఎక్కువ సేపు బజారులోనూ, ఆ తర్వాత సినిమాహాల్లోనూ గడిపేస్తున్నాను.

ఎప్పటిలానే ఈ రోజుకూడా సాయంకాల మయ్యేసరికి బయటికని బయల్దేరాను. రోడ్లన్నీ బిజీగా వున్నాయి. సినిమాకు వెళ్ళాలంటే ఎందుకో బుద్ధి పుట్టడం లేదు. పాతిల్లు గుర్తుకొచ్చింది. ఆలోచనలన్నీ ఆనాటి గది మీద, ఆ చెట్ల మీద నిలిచిపోయాయి. ఓసారి కాదనుకున్న చోటకు తిరిగి వెళ్ళడం నాకు వెలితిగా వుంటుంది. అయినా కాపురమున్న స్థలాన్ని ఓసారి చూసొస్తే తప్పేమిటని సమాధాన పడ్డాను. కాని యిప్పుడా గది చుట్టూ కొత్తగా మరెన్ని గదులు లేచాయో- ఆ రెండు చెట్లూ అక్కడే వున్నాయనే నమ్మక మేమిటి? వాటిని కొట్టేసి ఆ స్థానే ఏ మరుగు దొడ్లనయినా కట్టినా కట్టవచ్చు-

ఆ ఆలోచనల్లోంచి అనుమానం మబ్బులా పాకింది.

ఇప్పుడు నేవెళ్ళినా అక్కడ మునుపటి వాతావరణాన్ని తిరిగి చూడగలనన్న నమ్మకం లేదు. ఆ ఎటేచ్‌మెంట్ యిప్పుడు రాదు. అందుకని అక్కడికి వెళ్ళి అందమయిన ఆ చిత్రాన్ని మనసు నుండి మలుపుకోలేను. నాకు తెలుసు నేను యింకెప్పుడూ అటుకేసి వెళ్ళనని-

బజారులో జనాన్ని తోసుకుంటూ ముందుకు నడిచాను. నాకు అనుమానం వేసింది.

పక్కకు తిరిగి చూశాను. అవును... ఆ అమ్మాయే. ఆ వూరిపాకలో వుండే అమ్మాయే.

ఆగాను.

ఆ యిద్దరు కుర్రాళ్ళు ఎవరు?

జుట్టు బాగానే దువ్వుకుంది. కాగితం పువ్వులాంటిదేదో తల్లో పెట్టుకుంది. ఎర్ర జాకెట్టు కింద తెల్లనిబాడీ రమారమి పూర్తిగా కన్పిస్తోంది. సీత్రూ వోణీ కట్టింది.

ఆ యిద్దరు కుర్రాళ్ళూ ఎవరో నాకు తెలీదు. కాని వాళ్ళు హొటల్లో సర్వర్లయినా కావచ్చు. టాక్సీ క్లీనర్లయినా కావచ్చు, లేక మరింకెవరైనా కావచ్చు. నా చూపుకి అలా అనిపించింది.

ఆ అమ్మాయి వాళ్ళతో మాటాడుతూన్నంతసేపూ ఆమె ఎంత ఉత్సాహంగా వుందో నేను వేరే వివరించి చెప్పనవసరం లేదు. నే చూస్తుండగానే వాళ్ళిద్దరూ రిక్షాను పిలిచి

ఆమెను ఎక్కించుకు పోయారు.

నేనిప్పుడేమనుకోవాలి?

అమాయకమైన ఆ పేద పిల్లని వాళ్ళిద్దరు మోసం చేసి తీసుకుపోయారని ఆమె శీలం గురించి నోరు నెత్తి బాదుకుని గగ్గోలు పెడుతూ నీతి వాక్యాలు వ్రాయాలా? అలా వ్రాయను.

పోనీ ఆనాడు అవ్వ నామీద చూపిన సానుభూతి లాంటిదే ఈనాడు ఈ అమ్మాయి పట్ల చూపనా? అవ్వ హృదయం వేరు, నాలుక వేరని నాకానాడే తెలుసు. కనుక లోకాన్ని అలాంటి సానుభూతి వాక్యాలతో మభ్యపెట్టను.

ఎప్పటికీ చూడలేననుకున్న ఆనందం, ఉత్సాహం నిండైన ఆ నవ్వూ నేడా అమ్మాయిలో చూడగల్గాను. కొందరి జీవితాలకి మొదలేగాని చివర ఉండదని తెలుసు. అయినా సరే- అంతేచాలు.

ఆ అమ్మాయి రాత్రంతా సుఖించాలనే కోరుకుంటున్నాను. ఆమె ఆనందాన్ని నేను కూడా పంచుకోగలుగుతున్నానంటే ఎక్కడో తెలియని ఎటేచ్‌మెంట్ ఉందన్నమాటే.

ఇప్పుడెందుకో ప్రకృతి చాలా ఆహ్లాదకరంగా వుందనిపిస్తోంది.

ఆకాశం మీద తెలిమబ్బు చంద్రుడి మీదికి పాకింది. ఎక్కణ్ణించో చల్లగాలి వీచింది. తొలకరి కప్ప చేసే శబ్దం ఎప్పటిదో గుర్తుకొచ్చింది.

నేనిప్పుడు ఎవ్వరూ లేనిచోట ఎక్కడైనా ఒంటరిగా కూర్చోవాలని వుంది. కాని ఈ మహానగరంలో నా కోసం ఎక్కడ ఒంటరి తనం మిగిలివుంటుంది?

** 7.11.1976 ప్రజాతంత్ర **

# అమ్మకం

గాలి కాదది, గాడ్పు-

నీడున్న చోటల్లా రిక్షాలు పొంచి వున్నాయి. కిళ్ళీ కొట్టు ముందు సోడాలు "కయ్" మంటున్నాయి. రోడ్డుమీద జనం నిజానికి లేనట్టే-బస్సులూ, లారీలూ రొదచేస్తూ దూసుకుపోతున్నాయి. ఆ రోడ్డు మీద లేచిన ఎర్రదుమ్ము మాత్రం సుబ్బులు ముఖాన్ని మబ్బులా ఆవరిస్తోంది.

అయోమయంగా ఆలోచిస్తోంది సుబ్బులు.

ఆమెకు పాతికేళ్ళే వున్నా ముప్ఫయ్యేళ్ల వయసు కన్పిస్తోంది. ఎండకూ, వానకూ ఆమె శరీరం రంగుమారి కిలుం పట్టిన యిత్తడి పాత్రలా వుంది.

ఇంతవరకూ సుబ్బులు కూచున్నది రోడ్డు పక్క చెట్టునీడన నేలమీద- ఓ పావు గంట నడిచేసరికి ఆమెకు అలసట వచ్చింది. చలాకీగా నడవడానికి ఆమె వట్టి మనిషికాదు మరి. తొందర్లోనే మూడవ బిడ్డకు తల్లి కాబోతుంది.

సుబ్బులకు ఆలోచనలు అంతంకావడం లేదు. చెట్టు మీదుండి కాకిరెట్ట నెత్తిమీద పడింది. ఆలోచనలు చెదిరిన్నై-

"ఛీ!పాడు-" అని నీరసంగా అని, అంతకన్నా నీరసంగా కూచున్న చోటు నుండి లేచింది. పైట చెంగుతో కాకిరెట్టను తుడుచుకుంది. ఆ మాత్రానికే తన చీర మాసిపోదని తెలుసు.

ఎదురుగా వున్న ఆస్పత్రి వేపు నడిచింది.

ఆ సమయంలో డాక్టర్లుండరని తెలియనిది కాదు. తనకు మందూ మాకూ అవసరమైనా అవి తన బతుక్కి జాలిపడవనీ తెలుసు. అయినా చాలా వాటికి అనువైనవి ఆస్పత్రులని ఈ మధ్యనే తెలుసుకుంది. ఈ ఆస్పత్రుల చుట్టూ నివాసం చేసే జనం స్వార్థంతోనే అయినా తనలాంటివాళ్ళకి సాయపడతారని ఆమె నమ్మకం.

ఆమె విశాలమైన లాన్‌ల మధ్య నల్లరాతి తాజమహల్లా కనిపించే ఆ ఆస్పత్రి దగ్గరకు వచ్చింది. దాని ఎదరగేటు బిగించి వుంది.

ఆమె రెండు చేతులతో ఆ ఇనప వూచలను పట్టుకొని మోయలేని భారాన్నంతా గేటు మీద మోపింది. తల ముందుకు వంచి లోనికి చూసింది.

పక్కనున్న గేటతను "ఎవరు కావాలి"అని అడిగేడు.

ఆమె వేలితో లోపలి ఓ యిల్లు చూపి, "బాబుగారు! ఆ యింటి కెళ్లాలి–" అంది ఆ తర్వాత ఆయాసంతో ఓ శ్వాస విడిచి లోనికి వెళ్ళింది.

అది అగ్గిపెట్టిలా ఇరుకుగావున్న చిన్న బంగళా పెంకుటిల్లు. దాని వరండాకు చెక్కల కటకటాలున్నాయి. ఆ కటకటాలకున్న తలుపు తీసేవుంది. అక్కడ మధ్యవయసు దాటిన ఒకామె పడక కుర్చీలో జేరగిలబడి కాలం ఎలా వెళ్ళబుచ్చాలో తెలియక గేటువేపూ గేటవతలి రోడ్డు వేపూ చూస్తోంది.

ఆమె సుబ్బులును చూసింది. సుబ్బులు ఆమెకు కొత్తేమీ కాదు. వారం రోజుల నుంచి ఆమె వద్దకు సుబ్బులు వచ్చిపోతూనే వుంది. రోజులో ఏ కొద్ది ఖాళీ దొరికినా ఆమెను కలుసుకోటానికి వస్తోంది. వారం నుంచి ఎదురు తెన్నులు చూస్తున్న మనిషి ఎందుకు రాలేదో తెలియక సుబ్బులుకు దిగులేసింది.

"కలిగున్న బాబులకు ఎన్ని పనులో– ఎప్పుడొత్తాడో ఏటో మరి–" అని నిరుత్సాహపడింది. అతను వస్తేగాని ఓ నిర్ణయానికి రాలేదు. తన బతుక్కి, కేవలం రెండునెలల పొట్టపోషణకి హామీ దొరకదు.

ఇంటావిడ సుబ్బుల్ని కూర్చోమంది.

సుబ్బులు అరుగుమీద చతికిలబడ్డది. అరటి బొందల్లా లావుగా నీరు పట్టిన ఆమె కాళ్ళను కనిపించకుండా తన చీరను కిందికి లాక్కుంది. సుబ్బులును పైనుంచి కందికి ఓసారి చూసి ఆ యింటావిడ "వంట్లో ఎలా వుంది సుబ్బులు–" అంది.

ఆమె పలకరింపులోని ఆదరణకు కృతజ్ఞతగా సుబ్బులు ఓ చిరునవ్వు బలవంతంగా పెదాలమీదకు తెచ్చుకున్నా నీరు పట్టిన ఆమె కాళ్ళను దాచలేకపోయినందుకు తన చినిగిన చీరమీద చికాకు వేసింది.

"ఆయనగారు రేపు వస్తున్నారట వంద రూపాయలకు ఖాయమేనని ఉత్తరం రాశారు" అంది ఆమె.

సుబ్బులు కళ్ళు క్షణంలో మెరిశాయి. అవి ఆరిపోయే ముందు గుప్పున వెలిగే దీపంలా కాంతిని పుంజుకున్నాయి. అంతకు ముందు బలవంతంగా తెచ్చుకున్న ఆ చిరునవ్వు ఒక్కసారిగా మారి ఆనందంతో ఆమె పెదవులను సుడులు తిప్పింది.

"వందరూపాయలకు ఒప్పుకున్నారా అమ్మగారూ–నిజంగానేనా–"

ఆమె సుబ్బులు ఆత్రుతను చూసి "యిక ఇచ్చి పుచ్చుకునే సంగతులు మీరే చూసుకోండి! నేను చెయ్యాల్సినంత చేశాను–" అంది.

"అదేటమ్మగారు! కన్నాక బిడ్డను మీ చేతుల్లో పెడతాను. ఆ సంగతులన్నీ మీరే సూసుకొని ఆ వంద నాకిప్పించండి అంతేచాలు. మీ రుణం తీర్చుకోలేను–" అంది.

సుబ్బులన్న దానికి ఆమె ఔనని గాని కాదని గాని సమాధాన మివ్వలేదు. ఓ క్షణం నేలవేపు చూసి "సరే రేపు యిదే టైముకి రా." అంది.

సుబ్బులు తిరిగి గేటువద్దకు వచ్చేసరికి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. కడకు బిడ్డ నమ్మకునే గతి పట్టిందని కుమిలిపోయింది. ఒక్కసారిగా ఆపుకోలేని దుఃఖం పెల్లుబికింది. పైట చెంగుతో కళ్ళొత్తుకుంది.

ఆమె గేటు దాటి రెండడుగులు ముందుకు వేసింది. ఆమె కళ్ళల్లో కన్నీటిపొర అడ్డుకోవడం వల్ల రోడ్డుమీద తనకేమీ కన్పించలేదు. ఆమె తిరిగి తేరుకునేసరికి ఎక్కువ సేపు కాకపోయినా యింటికి మాత్రం వెళ్ళాలనిపించలేదు.

పైని ఎండ నివురుగప్పిన నిప్పులా తెల్లగా వుంది.

ఈ ఎండలో యింటికి వెళ్ళితే తను తిరిగి రాగలననే నమ్మకం లేదు. తనేగాని తిరిగి రాకపోతే రోజూ పోసే పదిబిందెల నీళ్ళూ చేరవేయకపోతే ఆ పూట యింట్లో గడిచేది ఎలా అని చివరకు అక్కడే ఆగిపోయింది.

సుబ్బులు తన జానెడు పొట్టకోసం రెక్కలు ముక్కలు చేసుకుంటోంది. అయినా నోటికీ, చేతికీ అందకుండా వుంది. ఆమె ప్లీడరుగారింట్లో నెలకు పది రూపాయల జీతానికీ, ఓ పూట భోజనానికీ యింటి చాకిరీ చేస్తోంది. రెండోపూట గడిచే యెత్తులేక సాయంత్రాలు బిందెకు ఐదు పైసలు వంతున సోడా షాపులకు నీళ్ళు చేరవేస్తుంది. తను చేరవేసే పది బిందెలకు వచ్చే ఆ అర్ధరూపాయీ ఆ పూట బియ్యానికే సరిపోదు. అయినా వేరే గత్యంతరం లేక ఆ అర్ధేచాలని సుబ్బులు మోయలేకున్నా నీళ్ళు మోస్తుంది. యింటి చాకిరీ చేయలేకున్నా చేస్తుంది.

సుబ్బులు జీవితంలో మాత్రం ఎన్ని మధురక్షణాలు లేవు – ఆమె సత్యాన్ని తప్ప మరొకడిని ఒప్పుకోనని కరాఖండిగా చెప్పేసి ఆ సత్యంతోనే పట్నానికి లేచి వచ్చేసింది. ఆ వచ్చిన కొత్తలోనే ఎన్నడూ చవిచూడని అనుభవాలు చవిచూసి ఉక్కిరిబిక్కిరైంది. అతని అండన ఎన్నో ఊహాసౌధాలను నిర్మించుకుంది. యిద్దరు బిడ్డలు కలిగేటప్పటికి జీవితం మీద ఎక్కడలేని ఆశ కలిగింది. ఎదుగుతున్న బిడ్డల్ని చూసి మురిసిపోయింది. తన సంసారం కూడా అందరి సంసారాల్లా పైకి రావాలని కోరుకుంది. తన బిడ్డలు కూడా వాళ్ళ తండ్రి, తాతల్లా కూలిపని చేసి ఆ పేదరికం లోనే, ఆ అజ్ఞానంలోనే ఉండకుండా చదివి, ఉద్యోగం చేసి, మనుషుల్లా నాల్గు కాలాలపాటు బతకాలని కోరుతుంది.

ఆమె అనుకున్న ప్రకారం పెద్దోణ్ణి ఆరోయేట బడిలో చేర్పించింది. వాడు రెండో తరగతికి వచ్చాడు. చిన్నోణ్ణికూడా బడిలో చేర్పించాలనుకుంది. కాని సత్యాన్ని ఎన్ని సార్లు అడిగినా, యిదిగో ఈ రోజు, రేపు అంటూ జాలాం జాలం చేసేశాడు. చివరకు చేర్పించనే లేదు.

సుబ్బులుకు మాత్రం ఏం తెలుసు– యింతలో ఇంత జరుగుతుందని. అతడికి జ్వరం వచ్చిందనుకుంది. సత్యం అదే తగ్గిపోద్ది అన్నాడు. వారం గడిచాక గాని డాక్టర్ అవసరం అన్న సంగతి తెలియలేదు. డాక్టర్ డబుల్ న్యూమోనియా అన్నాడు. అప్పటికే

అది సీరియస్‌కేస్ అని చెప్పాడు. ఆ రాత్రే సత్యం సుబ్బులుకు దూరమైపోయాడు,

సుబ్బులు ఏడ్చింది.

ఏడ్చి ఏడ్చి గత్యంతరం లేక గుండె రాయి చేసుకుంది.

అన్నీ తన కళ్ళముందే జరిగినా ఎందుకో సత్యం చనిపోయాడని ఆమె కింకా నమ్మకం కుదరడం లేదు. అతడు బతికున్నట్టే కలలు కంటుంది. ఆరు నెలలు గడిచినా అతని ధ్యాస పోనేలేదు. అతను పందలపాక గుడ్డబనీను తొడుక్కొని మోకాళ్ళపైకి బిగుతుగా పంచె కట్టుకుని పిటపిటలాడే కండరాలతో పొట్టిగా గుమ్మటంలా నడిచే అతని రూపం ఎప్పుడూ కళ్ళముందు కదలాడుతునే వుంటుంది. తాను వడ్ల మిల్లు నుంచి నెత్తినిండా, వంటినిండా దూగరతో వచ్చి వాకిట్లో నిలబడి సుబ్బులును పిలిచే పిలుపే ఆమె చెవుల్లో మారు మోగుతుంటుంది. అలాంటప్పుడు క్షణకాలం మైమరచి, కల చెదిరి, కన్నీటి పొర అలుముకుంటుంది.

ఈ రోజెందుకో సత్యం నిముష నిముషానికీ గుర్తుకొస్తున్నాడు. తన మనసులోని ఆందోళన ఎవరికీ చెప్పుకునేది కాదు. ఎండ తీవ్రత తగ్గేవరకు తను ఆరోడ్డు పక్క చెట్టు నీడనే చతికిలబడింది. చెట్టు మీదుండి ఎండుటాకులు రాల్తున్నాయి. సుబ్బులు ఎండ తగ్గాక నేలను ఆనుకొని లేచి నెమ్మదిగా సోడా కొట్లవేపు నడిచింది. ఆమె కొంత దూరం నడిచేవరకూ తన మక్కెలు పోట్లాస్తున్నట్లు తెలీలేదు. ఆ రోజు తానిక నీళ్ళు చేరవేయ లేననుకుంది. ఆమె కిప్పుడు పూర్వంలా మనసులో భయంగాని, ఆందోళనగాని లేదు. బాలెంతగా రెండు నెలలు పొట్టగడవడం యెలా అన్న సమస్య నేటితో పరిష్కారమైంది. మనసు తేలికైంది. వందరూపాయల బేరం మీద కల్గిన నెమ్మది అది. ఆ తృప్తితోనే ఆరోజు ఆకలి మరవగల ననుకుని యింటివేపు నడిచింది.

ఇంటికి చేరిన సుబ్బులు రేపు జరగబోయే దాని గురించి పిచ్చి పిచ్చిగా ఆలో చించసాగింది. తను చేసిన దానికి ఇరుగు పొరుగు ఎక్కడ కాకుల్లా పొడిచి ఆడి పోసు కుంటారో అని భయపడిపోయింది. ఎదర చస్తున్నా నోట్లో ఓ గుక్కెడు నీళ్ల పోయని ఈ లోకం నన్నేమనుకుంటే నాకేమి? యింతకంటే మరో గత్యంతరం లేదుమరి అని తనను తాను సంబాళించుకుంది. ఎప్పటికీ ఆలోచనలు అంతంకాక బలవంతంగా కళ్ళు మూసుకుని చాపమీద ఒరిగింది.

ఊరు చాలా వరకు సద్దుమణిగింది.

చీకటితో కుస్తీ పట్టలేక ఆయాసంతో ఒదిగి ఒదిగి వెల్గుతోంది కోడిగుడ్డు దీపం. ఆరు నెలల్రకితం బడిలో చేర్పించాలనుకున్న చిన్నోడు ఈ రోజు హోటల్ పనికి అలిసి గుమ్మం వద్ద నేలమీదపడి నిదురోతున్నాడు. వాడికి నిండా ఆరేళ్ళు లేవు. హోటల్లో కప్పులు కడిగినందుకు వాడికి జీతం యివ్వకపోయినా తిండి పెడుతున్నారు. అంతే చాలనుకుంది సుబ్బులు.

పెద్దోడు కూడా పనిలోంచి అప్పుడే వచ్చాడు. వాడు సైకిల్ షాపులో పనిచేస్తున్నాడు.

పని కొత్త కాబట్టి నేర్చుకునే వరకు జీతం యివ్వనన్నాడు ఓనరు. కొడుకు తొందర్లో అందొస్తాడని సైకిల్ షాపులోనే కుదిర్చింది.

సుబ్బులు చాపమీద పడుకుని బాధతో ఆయాసపడుతోంది. ఆమె అలా మూల్గుతుంటే పెద్దోడికి ఏమిటో గాబరాగా వుంది. తండ్రి పోయినప్పటి నుంచీ వాడి గుండెల్లో మిగిలింది కూడా గాబరాయే.

చిన్నోణ్ణి గోనెమీద పడుకోబెట్టమంది సుబ్బులు, తమ్ముణ్ణి లేవదీయగల బలం వాడిలో లేదు. తమ్ముడికన్న రెండేళ్ళే పెద్దవాడు. రోజూ వాడిని తన తల్లే లేవదీసేది- కాని ఈ రోజు ఆ పని తనకు చెబుతోంది. అతని గుండెల్లో గాబరా మరీ ఎక్కువయ్యింది.

నేలమీద గోనెపరచి చిన్నోణ్ణి ఎత్తలేక వాణ్ణి గోనెమీదకు లాగి పడుకో బెట్టాడు. కాని తన చూపంతా తల్లిమీదనే వుంది.

ఆయాసపడుతూ "పెద్దోడా-" అని అరిచింది సుబ్బులు. వాడు మరీ గాబరా పడుతూ తల్లి వద్దకు వెళ్ళాడు.

"నర్సమ్మత్తని పిల్చుకురా" అంది.

నర్సమ్మత్త యిల్లు అలా పడమరగా ఆ పేటకు ఓ ఫర్లాంగు దూరంలో వుంది. అది అందరూ నిదురపోయే సమయం కాబట్టి అటుకేసి ఆ చీకట్లో వెళ్ళాంటే వాడికి భయం భయంగా వుంది, అయినా మొండి ధైర్యం వచ్చి ఒక్కసారిగా అక్కడ నుంచి పరుగు తీశాడు.

నర్సమ్మకు కావలసిన మనిషిసుబ్బులు. బంధువు. ఆమె వచ్చేసరికి నేలమీద పడుకున్న సుబ్బులు ఆయాసంతో ముక్కుతోంది. సుబ్బులు ప్రసవం కాబోతుందని గ్రహించి వీధి చివరకుపోయి ఎరుకలమ్మితో తిరిగి వచ్చింది.

ఆ యెరుకలమ్మి ఎన్నో ఏళ్ళుగా అక్కడి వాళ్ళకు పురుడుపోస్తోంది. అక్కడి పేదజనానికి ఆమెది చల్లని చేయని మంచి నమ్మకం. నిజానికి ఆ చేతులేగాని ప్రత్యేకించి చూస్తే ఏ మొగాడివో అన్నట్టు మొరటుగా వుంటాయి. అయినా కదలిక మాత్రం మృదుత్వం కలిగి గొప్ప ఆదరణ కలిగిస్తాయి ఆమె ఎంత కాలం నుంచి పురుళ్ళు పోస్తున్నా తన గుడిసె గుడిసెలానే వుంది. తను తనలానే వుంది.

ఆమె సుబ్బులు వద్దకు వెళ్ళి చూసింది.అమ్మాయికి పురుడొచ్చేసింది అని నేల మీద పడివున్న బిడ్డను చేతుల్లోకి తీసుకుంది.

మైకంలో వున్న సుబ్బులుకు ఆ మాట లీలగా వినిపించింది. తను లేచి కూచుని బిడ్డని చూసుకోవాలనుకుంది. కాని తన కాళ్ళూ చేతులూ తన స్వాధీనం లోకి రాకపోవడంతో నెమ్మదిగా కళ్ళు విప్పి చూసింది. ఆ గుడ్డి వెలుగులో ఆమె కళ్ళకు ఎదురుగా ఎరుకులమ్మి ఆమె చేతిలో పసిబిడ్డా, పసిబిడ్డను పరీక్షగా చూస్తున్న నర్సమ్మా మసక మసకగా కన్పించారు. ఎరుకులమ్మి బిడ్డను దీపం వద్దకు తీసుకెళ్ళింది. నర్సమ్మ కూడా ఆమె వెనకాలే దీపం

వద్దకు నడిచింది.

"నా బిడ్డ నొకసారి చూడనివ్వండి" అంది సుబ్బులు. దానికి నర్సమ్మగానీ, ఎరుక లమ్మిగానీ సమాధానమివ్వలేదు. ఆ రక్తపు మడుగు నుంచి పక్కకు తొలగి ఆత్రుతతో లేచి కూచుంది.

"ఏది?... ఏ బిడ్డ పుట్టింది-" అని తిరిగి అడిగింది.

ప్రతి తల్లీ తన బిడ్డను మొదటిసారిగా చూసుకొనే ఆరాటమే అదని ఎరుకులమ్మికి అనుభవం మీద తెలుసు. అయినా ఆమె మౌనం వహించింది.

"ఏ బిడ్డయితే యేంటిలే దిక్కుమాలిన దానివి. కంటే మాత్రం పెంచొద్దా-యిసారం పడకు" అని సానుభూతిగా అంది నర్సమ్మ.

కాని నరసమ్మకుగాని, మరెవ్వరిగాని ఏం తెలుసు. ఆ బిడ్డ ఖరీదు వంద రూపాయలని, రెండు నెలల జీవనాధారమని.

తన పుట్టిన బిడ్డ చనిపోయిందనే సంగతి తెలియగానే సుబ్బులు చేతికి ఎవరో వందరూపాయల నోటు అందిస్తుండగా సుడిగాలి లాక్కుపోయినట్టూ, అది గాలిలో రెప రెపలాడుతుండగా కాకులూ, గద్దలూ, రాబందులూ ఎగబడి ఏదో పొట్లం అనుకుని దానిని కాళ్ళతో తన్ని గోళ్ళతో చీల్చేసినట్టూ పరిపరి విధాల అనిపించింది.

సుబ్బులుకు ఎదురుగావున్న గుడ్డిదీపం మసక మసకగా కనిపించి చీకటై పోయింది. మరుక్షణంలోనే నిలువుచూపుపడ్డ సుబ్బులు కాళ్ళూ, చేతులూ వంకర్లు పోయాయి. ఆమె గింజుకుంటూ నేలమీదకు వొరిగి పోయింది.

"అయ్యో! అమ్మాయికి గురకవాతం వచ్చింది." అంది కంగారు పడుతూ ఎరుకలమ్మి.

** 9.4.1976 ఆంధ్రజ్యోతి వారపత్రిక **

హైదరాబాద్
*10.3.1973*

# అతిథి

అందమైన సాయంత్రం వేళ కమ్యూనిటీ హాల్ మీద రంగురంగుల ఫ్లూట్ బల్బులు నక్షత్రాలను దిగుదుడిపేసేలా మిలమిల్లాడుతున్నాయి. నగరం మీద చిక్కబడు తున్న చీకటిని విద్యుత్ కాంతి చుట్టు పక్కల సందుల్లోకి తరిమేస్తోంది. బజారు సందడి లోంచి, వీస్తున్న గాల్లోంచి కమ్యూనిటీ హాల్లోని సన్నాయి పాట ఉండి ఉండి వినిపిస్తోంది.

శీనుకు సన్నాయి వినడం చాలా యిష్టం. అలా విన్నప్పుడు అతని ప్రాణం లేచొస్తుంది. అందుకే అతను గదికి పరుగెత్తి ముఖం, కాళ్ళూ వగైరా కడుక్కొని, అందంగా జుట్టు దువ్వుకుని నీటుగా బట్టలు వేసుకుని అరగంటైనా తిరగకముందే కమ్యూనిటీ హాల్ కి వచ్చేశాడు.

శీను తను వేసుకున్న చొక్కాను మరోసారి పైనుండి కిందవరకు చేత్తో రాసుకున్నాడు. అందమైన రంగురంగుల చారల సిల్కు చొక్కా అది. ఆ చొక్కా సోముకంటే అతనికే అందంగా వుంటుందని తృప్తిగా అనుకున్నాడు. సోము కది వాళ్ళ నాన్న కుట్టించాడట. ఆపై శీను చొక్కా గురించిగాని, నాన్న గురించిగాని అధికంగా ఆలోచించ గూడదని మానివేశాడు.

కమ్యూనిటీ హాల్లో డోలూ సన్నాయి తారస్థాయిలో వినిపిస్తున్నాయి. పెళ్ళి వారు పెళ్ళితతంగం పెద్ద ఎత్తునే చేసారు. ఓ అబ్బాయి ఇద్దరు అమ్మాయిలూ కింద నిలబడి వచ్చిన అతిథుల్ని మేడమీది హాల్లోకి పంపుతున్నారు. ఆ యిద్దరమ్మాయిలూ నవనవలాడుతూ గులాబీల్లా కోమలంగా వున్నారు. బెల్ బాటమ్ మీద వైట్ షర్టు వేసుకుని ఆరోగ్యంగా, అతి మాడరన్ గా వున్నారు. వాళ్ళని ఎవరన్నా డాష్ ఇస్తే ఆ నేరం అబ్బాయిలది అనడం కన్న అమ్మాయిలది అనడమే సబబు.

శీను గేటులో అడుగు పెట్టాడు. తెల్లని కాంతి ఆ పరిసరాల్లో పట్టపగలును మరిపింపజేస్తోంది. అతను పైకి వెళ్ళడానికి మెట్లెక్కాడు. మెట్లపొడవునా రెండేసి ట్యూబు లైట్లతో గజానికి ఓ ఆర్చి చొప్పున పై వరకు వున్నాయి.

శీను మేడమీదికి వచ్చాక, అతనిని లోనికి రమ్మని, వెనుక కుర్చీలు ఖాళీగా

వున్నాయనీ పెళ్ళివారి పెద్దల్లుడు చూపించాడు.

శీను తన చొక్కాని మరోసారి చేత్తో పైనుండి కిందికి రాసుకొన్నాడు. అది మృదువుగా చల్లగా తగిలింది. చొక్కా అందంగా వుందన్న తృప్తి అతనికి కొండంత బలాన్నిచ్చింది.

ఫస్టుఫ్లోర్ లోని ఆ పెద్ద హాల్లో మెర్క్యురీలైట్లు దేదీప్యమానంగా వెల్గుతున్నాయి. హాల్లో మధ్య కళ్యాణమండపం ఎత్తుగా రత్నకిరీటంలా ఠీవిగా వుంది. దాని మీద వధూవరులు ఎదురెదురుగా కూచున్నారు. వాళ్ళిద్దరి మధ్య యింకా తెల్లని తెర అడ్డం వుంది. హాల్లో డోలూ సన్నాయి చెవులను గింగిర్లెత్తిస్తున్నాయి. అతని గుండెల మీద డోలు బాదుతున్నట్టు అయి ఓ క్షణం ఊపిరి బిగబట్టి శ్వాస వదిలాడు. ఆ తర్వాత నిదానంగా హాల్లోకి నడిచాడు.

శీను ఖాళీవున్న ఓ కుర్చీలో కూచుని పెళ్ళి తతంగాలు సావకాశంగా చూస్తున్నాడు. సోము సమయానికి లేకుండా పోయినందుకు వాడి మీద చాలా కోపం వచ్చింది. తను వేసుకున్న చొక్కా మరోసారి చూసుకున్నాడు. సోము వుంటే ఆ చొక్కా తనని వేసుకోనిచ్చేవాడా అన్న ఆలోచన వచ్చింది. వాడు లేకపోయినా వాడి పెట్టి వెతికేసి అడక్కుండానే వాడి చొక్కా యిలా వేసుకోవడం ఏదో దొంగతనం చేసినంత సిగ్గేసింది. కాని అవసరం. పెళ్ళికి వెళ్ళాలి కనుక తప్పింది కాదు.

పెళ్ళిని చూస్తుంటే అతని మనసు పరిపరి విధాలపోయింది. రెండేళ్ళ క్రితం వరకు శీనుకు పెళ్ళంటే ఏమిటో సరిగా తెలీదు. మరీ చిన్నప్పుడనుకుంటాను, ఓసారి వాళ్ళ మేనత్త మా అమ్మాయిని చేసుకుంటావురా అని వేళాకోళంగా అంటే, చేసుకోను- సీతక్కను చేసుకుంటాను అన్నాడు. అందుకు వాళ్ళ మేనత్త ఛీ! తప్పురా- అక్కను చేసుకుంటాను అనకూడదు అని చిన్నగా గసురుకుంది. అందుకు ఏడుపొచ్చినంత పనై సీతక్కంటే నాకెంతో యిష్టం. మంచిది. తెల్లగా అందంగా వుంటుంది- అనుకున్నాడు. కానీ అవన్నీ యిప్పుడు గుర్తొస్తేమాత్రం తను సగం బిక్కచచ్చిపోతున్నాడు.

శీను మునుపటిలా యిప్పుడు అమాయకుడేమీ కాడు. సోమువల్లా, వాడిచ్చిన సెక్సుపత్రికలవల్లా జీవితం ఏమిటో కొంత వరకు తెలిసింది. ఇప్పుడు ఆడపిల్లల్తో మాటాడ్డం చెడ్డ సిగ్గుగా వుంటోంది. అతనిలో మొగ్గలా దాగున్న యవ్వనం ప్రతి అమ్మాయి చూపుకీ పులకించి రేకులు విప్పారుతోంది. ప్రస్తుతం శీను చూపులు అందమైన అమ్మాయిలను వెతుకుతున్నాయి.

పురోహితుడొచ్చి మంగళసూత్రంతో పాటు గుప్పిట్లో బిగించిన అక్షింతలు తలా కాసిన్ని యిచ్చాడు. అవెక్కడ తన కివ్వకుండా వెళ్ళిపోతాడోనని శీను ముందే చెయ్యి చాచి వాటిని అందుకున్నాడు.

ముహూర్తం వేళకి బాజాలు మోగాయి. ఆ హాల్లో రీసౌండుకు ఆ బాజాలు ఉరుములు ఉరిమినట్టూ, పిడుగులు పడ్డట్టూ హెూరెత్తాయి. అందరితోపాటు శీను కూడ వధూవరుల మీదికి అక్షింతలు విసిరాడు.

---

బాజాలు ఆగాయి. పిడుగుల వర్షం అనంతరం నెలకొన్న ప్రశాంతతలా హాల్లో వాతావరణం నిశ్శబ్దమయింది. ఎవరన్నా తుమ్మితే అశుభమని, అలాంటివి వినిపించకుండా ఆ హోరులో కలిసిపోవడానికే బాజాలిలా వాయిస్తారని తను ఎప్పుడో విన్న సంగతి గుర్తొచ్చింది.

శీను హాలంతా పరికించి చూసాడు. సుమారు రెండువందలమందిలో తానొకడు. పెళ్ళిమండపం మీద మంత్రోచ్చారణతో పాటు కావలసిన తతంగాలన్నీ జరుగుతున్నాయి.

సూత్రధారణ జరిగింది.

అమ్మాయి తండ్రి హడావుడిగా వున్నాడు. ఓ పక్క నుండి పెళ్ళికొడుకు తరపున, మరో పక్కనుండి పెళ్ళికూతురు తరపునా మిఠాయి పొట్లాలు అందుతున్నాయి.

శీను రెంటినీ అందుకున్నాడు.

మైక్‌లోంచి వెస్ట్రన్ మ్యూజిక్ ఉల్లాసంగా వినిపిస్తోంది.

పెళ్ళికూతురు తండ్రి ముందుకు వచ్చి పక్కహాల్లో డిన్నర్ ఏర్పాట్లు జరిగాయనీ, వచ్చిన వారు భోజనానికి వెంటనే లేవవలసిందనీ కోరాడు.

శీను లేచి సోము వచ్చేడేమోనని హాలంతా కలయచూసాడు. సోము వచ్చిన జాడలేదు. పక్కనే వున్నవారి విడిది కేసి వెళ్ళి కాసేపు ఆ గదుల్లోని జనాన్ని చూసాడు. ఆ తర్వాత ఆలస్యమౌతుందని డిన్నర్ కోసం పక్కహాలుకు తిరిగి వచ్చాడు.

హాల్లో డిన్నర్ ఏర్పాట్లన్నీ పెద్ద ఎత్తున జరిగాయి. తెల్లని టేబుల్ క్లాత్‌లు పరిచిన బల్లలు బారులు తీర్చి వున్నాయి. వాటి మీద నిగనిగలాడే గాజు సామగ్రి అందంగా అమర్చివుంది.వాటి పక్కనే కంచాల్లో స్పూనులున్నాయి. తెల్లని యూనిఫారమ్ మీద ఎర్రని బార్డరున్న డ్రస్సుల్లో గజానికొక్క సర్వరున్నాడు. వాళ్ళంతా వడ్డన చేయడానికి రెడీగా ఆర్డరు కోసం చూస్తున్నారు.

అవతలి పెళ్ళివారు బొంబాయి నగరానికి చెందినవారట. వెస్ట్రన్ కల్చర్‌కి అలవాటు పడ్డవారని ఎరిగిన మీదట డబ్బు ఖర్చయినా మాట మాత్రం రాకూడదని డిన్నర్ ఏర్పాట్లన్నీ ఓ పెద్ద హోటల్‌కి కంట్రాక్టు యిచ్చేశారు. వాళ్ళు యిచ్చిన ఐటెమ్స్ ప్రకారం ఒక్కొక్క భోజనానికీ పన్నెండు రూపాయలు ఎస్టిమేట్ అయ్యింది. అలా రెండువందల మందికి డిన్నర్ యేర్పాటు చేశారు. ఇక పెళ్ళి జరిపించడానికీ, అనంతరం భోజన ఏర్పాట్లకీ కమ్యూనిటీ హాలొకటి బుక్ చేసారు. కమ్యూనిటీ హాల్ మెయిన్ బజారుకు మరీ దగ్గర కావడం చేత బయటి వాళ్లు తిండికోసం లోనికి వచ్చే ప్రమాదం వుందని, అలా రాకుండా చూడ్డానికి గుమ్మం వద్ద మరో యిద్దర్ని వుంచారు.

హాల్లోని డిన్నర్ ఏర్పాట్లను చూసాక శీను ప్రాణం లేచొచ్చింది. పెళ్ళి భోజనం తినాలనే ఆత్రుత మరీ ఎక్కువయింది. ఇంతకుముందు కంటే ఆకలి మరీ ఎక్కువయినట్టు అనిపించింది. అందుకని గుమ్మంవద్ద నిలుచుని లోనికి వెళ్తున్న నలుగురిలో ఒకడిగా తనూ కలిసిపోయాడు.

శీను లోనికి వెళ్ళేముందు గుండె కాస్త దడదడ లాడింది. అతను భయపడు తున్నట్టే అతనిని గుమ్మం వద్ద ఆపేశారు. ఆపేసి ఎవరి తాలూకు? ఎవరు పిలిస్తే వచ్చావని అడిగారు.

శీను ఏదో సమాధానం చెప్పడానికే ప్రయత్నించాడు గాని నోరు పెగల్లేదు. అతను తిండికోసమే వచ్చాడన్నది నిర్ధారణయ్యింది. ఇంతకు ముందు కూడ యిలానే ఇద్దరు ముగ్గురు దొంగతనంగా రావడం జరిగింది. వాళ్ళని బెదిరించి పంపించి వేశారు. ఈసారి శీను రావడంతో, పదేపదే యిలాంటి వాళ్ళు రావడం చిరాకనిపించి గట్టిగా బుద్ధి చెప్పాలని అక్కడే నిలబెట్టేశారు. పెళ్ళివారి పెద్దల్లుడు కూడా అదే సమయానికి అక్కడికి రావడం జరిగింది. అతను రావడంతోనే వీణ్ణి మొదట్నించీ కనిపెడుతున్నాను అన్నాడు. విడిది గదులకేసి వెళ్ళి పొంచి పొంచి చూస్తున్నాడు- వీడు అక్కడికి వెళ్ళవలసిన అవసరమేముంది అన్నాడు. ఆ తర్వాత శీనుని అటు వెళ్ళవలసిన అవసరం ఏమిటని రొక్కించి అడిగాడు.

శీనుకు నోరు పెగల్లేదు.

అతను మరల మరల అదే ప్రశ్న వేశాడు. ఆ తర్వాత వీడు దొంగ- ఏవైన దొరికితే పట్టుకు పోడానికే యిటు వచ్చాడు. వీణ్ణి అంత తేలిగ్గా వదలకూడదు అంటూ అతను పారిపోకుండా అతని చొక్కా కాలరును వడేసి పట్టుకున్నాడు. చొక్కా పట్టును విడిపించుకోడానికి శీను ప్రయత్నించాడు గాని అది మరీ బలంగా వుండడం చేత లాభం లేకపోయింది.

శీను విదిలించుకోవడంతో అతను ఛెళ్ళన రెండు చెంపదెబ్బలు వేసి పక్కనే వున్న గదిలోకి లాక్కుపోయాడు. అతని వెనకాతలే మరో యిద్దరు లోనికి వెళ్ళి తలుపు గడియ వేసేశారు.

శీనుని గదిలోకిలాక్కుపోయేముందు, గుమ్మం వద్ద చాలా పెనుగులాడేడు గాని అదంతా వృథా ప్రయాసే అయ్యింది. అతన్ని లోనికి తీసుకు వెళ్ళిన తర్వాత రివాజుగా అందరూ కలిసి తన్నవలసిన నాల్గూ తన్నేసి ఆ తర్వాత ఎందుకు వచ్చావో నిజం చెప్పు అని అడిగారు.

శీను అవమానంచేత బాధచేత అతని గొంతులో గుటక అడ్డంపడి మింగలేక అచేతనంగా నిలుచుండిపోయాడు. అలా నిలుచుండిపోయిన శీనును గోడకేసి అదిమి పట్టి దొంగతనానికి వచ్చింది నీవు ఒక్కడివేనా? లేక 'బేచ్చీ' వుందా అని అడిగారు. ఆ తర్వాత మీ బేచ్చీ వాళ్ళంతా కిందగేటు వద్దుండి నిన్ను పంపించారు కదా అని అడిగారు.

శీనుకు గొంతులో బాధ ఎగదన్ని ఎక్కిళ్ళు వచ్చాయి తప్ప మాటలు రాలేదు.

నిజం చెప్పకపోతే పోలీసు రిపోర్టిస్తామన్నారు.

శీనుకు భయం వేసింది.

అతను నిజం చెప్పడం లేదని, వాళ్ళ బేచ్చీవాళ్ళు ఎక్కడుందీ చెప్పడం లేదనీ మరల కొట్టారు.

---

శీను, తాను దొంగను కాననీ, భోజనం కోసం వచ్చాననీ వస్తున్న ఎక్కిళ్ళ మధ్య కాసేపటికి అన్నాడు.

దొంగ అవునో కాదో పోలీసువాళ్ళే తెలుసుకుంటారు- మీ యిల్లెక్కడో ఎవరబ్బాయివో నీ అడ్రస్ ఏమిటో చెప్పమన్నారు.

శీను సమాధానం చెప్పలేదు.

సమాధానం చెప్పనందుకు కొట్టారు.

శీను మొండికేశాడు. అతను చచ్చినా సమాధానం చెప్పకూడ దనుకున్నాడు. చెప్పలేదు. ఒకవేళ సమాధానమే చెప్పవలసి వస్తే తానొక ఆర్ఫన్ కుర్రాణ్ణనీ, దగ్గర్లోనే వున్న ఆర్ఫనేజ్ లో వుంటున్నానని చెప్పాలి.

శీనులో అనేకమైన ఆందోళనలు చెలరేగాయి. అతనేగాని తన అడ్రస్ తప్పని సరిగా యివ్వవలసివస్తే, ఆ అడ్రస్ ప్రకారం వాళ్ళు హాస్టల్‌కు రిపోర్టు యిస్తే, తను చేసిన పొరబాటుకు వాళ్ళు ఆర్ఫనేజ్ నుండి డిస్‌మిస్ చేసి బయటకు పంపించి వేస్తే నిరాధారమైన తన జీవితానికి గత్యంతరం ఏమిటి అనుకున్నాడు. ముందు ముందు ఏమి జరగబోతుందో అతను ఆలోచించలేక పూర్తిగా భయపడిపోయాడు. అందుకే మౌనంగా అన్నీ భరించాడు. దెబ్బలన్నీ- అవమానాన్నీ....

అక్కడ జరుగుతున్న విషయమేమిటో తెలియక బయటనుండి పెళ్ళికూతురు తండ్రి హడావుడిగా పరుగెత్తుకొచ్చి తలుపు తెరిపించాడు. అతని పెద్దల్లుడు చెప్పింది విని పోనీలే వెధవని వొదిలెయ్యండి అనేసి తిరిగి వెళ్ళిపోయాడు. గది బయట వింతగా చూస్తున్న వారితో లోపల పెద్ద విశేషమేమీ లేదనీ, ఎవరో రికామీ కుర్రాడు భోజనానికని దొంగతనంగా వస్తే బెదిరిస్తున్నారనీ, అలా బెదిరించకపోతే యీ నడి బజార్లో యిలాంటి వాళ్ళని ఆపడం కష్టమనీ చెప్పి వాళ్ళందరినీ భోజనాలకి వెళ్ళవలసిందిగా మరొకసారి మర్యాదగా కోరాడు. ఆ తర్వాత పెద్దల్లుణ్ణి బయటకు పిలిచి అతిథులకు ఏదైన లోటు వస్తుందేమో అలాంటిది రాకుండా భోజనాల వద్దుండి అన్నీ చూసుకోమని హెచ్చరించి వియ్యాల వారి విడిదికేసి నడిచాడు.

శీను గదిలోంచి బయటకు వచ్చేశాడు. బయట హాల్లో పట్టపగల్లా మెర్క్యురీ లైట్లు వెల్గుతున్నాయి. ఒకళ్ళిద్దరు తప్పించి హాల్లో యింకెవ్వరూ లేరు. అందులో అతిథులకోసం వేసిన కుర్చీలు శోభనం రాత్రి రాలిన పూరేకుల్లా హాలంతా చెల్లా చెదురుగా వున్నాయి.

శీను ఎలాగో వాటిని తప్పించుకుంటూ నడిచాడు. మెట్లదగ్గరికి వచ్చాడు. ఆర్చిలా పై నుండి కింది వరకు వెలుగుతున్న ట్యూబు లైట్ల కిందినించి ఒక్కొక్క మెట్టే కిందికి దిగాడు. కిందికి దిగాక కాంపౌండు గేటువరకూ నడిచాడు.

శీను గేటు దాటేముందు చొక్కానొక సారి చేత్తో పై నుండి కింది వరకు తడుము

కున్నాడు. అది సోము చొక్కా. అతన్ని అడగకుండా వేసుకున్న చొక్కా. అదిప్పుడు చేతికి మృదువుగానూ, చల్లగానూ తగల్లేదు. మధ్యలో ఎక్కడో దారపుపోగు అడ్డొచ్చి అతని చేతి వేలు చొక్కాలో ఇరుక్కుపోయింది.

శీను చొక్కాను చూసుకున్నాడు. చినిగిపోయింది. బొత్తాలు తెగి వూడి పోయాయి. ఎటునుంచో వీచిన రికామీ గాలికి చొక్కా ఎగిరి ఆ చినుగులోంచి బొడ్డు చుట్టూ లోతుకు పోయిన అతని పొట్ట బయట పడింది.

గొప్ప సొసైటీవాళ్ళ ఆడంబరానికీ, అంతస్తుకీ ప్రతినిధి అయిన ఆ రంగు రంగుల చొక్కా చినిగి పేద ప్రేవులను చూపిస్తోంది.

శీను అటుకేసి చూడకూడదు అనుకుంటూనే వెనక్కి తిరిగాడు. అతని కళ్ళల్లో చేరిన నీటిపొరకి రంగురంగుల బల్బుల కాంతీ, ట్యూబులైట్ల కాంతీ నెమ్మది నెమ్మదిగా అలుక్కుపోయింది. ఆ తర్వాత ఆ వెలుతురు అతని కళ్ళల్లో చక్రాల్లా తిరిగి అందులోంచి సూదుల్లా కిరణాలు లేచి పొడవై, చిన్నవై, చక్రాలు చక్రాల్లా గిరగిరా తిరిగి ఒక్కసారి ఆగి కమ్యూనిటీ హాలంతా షేక్ అయినట్టయ్యి తలక్రిందులై మీదికి లేచి చీకటై- చివరకు రెండు కన్నీటి బిందువులుగా కిందికి రాలి కమ్యూనిటీ హాలు తిరిగి యథావిధిగా కనిపించింది.

గేటు దాటిన శీనుకు ఎటు వెళ్లాలన్నది కొంత సేపటి వరకూ తెలీలేదు.

** 'జ్యోతి' మాసపత్రిక డిసెంబరు 1977 **

# వేదిక

అంతవరకూ నిప్పులు చెరగుతూ కణకణలాడే ఎండ నీరుకారిపోయింది.

అయినా సాయంకాలం యింకా పూర్తిగా రానేలేదు. జనం మాత్రం చెదపురుగుల్లా, చలిచీమల్లా ఒక చోటకు వచ్చి చేరుకుంటున్నారు.

నగరమంతా అలజడి...

వర్షం వచ్చి అప్పుడే వెలిస్తే, నీరంతా దారులు చేసుకుంటూ పిల్లకాలువలై నాల్గు మూలల నుండీ గలగలమంటూ ఉరకలేస్తూ పల్లపు భూముల్లోకి వచ్చి నిల్చినట్టు నాలుగు దారుల నుండీ జనం వచ్చి అక్కడ నిలిచి పోతున్నారు.

కనుచూపు మేర ఆవరించిన స్థలం అది.

జనంతో అప్పటికే అంతా నిండిపోయింది.

ఏమిటీ జనసందోహం అనే ఆలోచన ఎవరికీ లేదు; జనం అక్కడకు ఎందుకొస్తున్నారో అందరికీ తెలుసు.

బస్సుల్లో, కార్లల్లో, రిక్షాల్లో... మిగిలిన వాళ్ళు నడకలో... ఉరకలేస్తూ అక్కడికి వచ్చి చేరుతున్నారు. కొందరు ఇక్కడ నుండే చూడడం మంచిదని రోడ్డు కిరువైపులా బారులు తీరి నిలబడిపోతున్నారు.

దేశ ప్రధాని ఆ దారినుండే వెళతారని వాళ్ళకు తెలుసు. మొత్తం మీద ఆ రోజు అక్కడ భూమి జనాన్ని ఈనినట్టే వుంది.

అరుణబాబు కూడా దేశప్రధానిని చూడాలని స్నేహితుల్తో సహా బయల్దేరాడు. జనాన్ని త్రోసుకుంటూ ఆ ఆవరణను చేరాడు. అతను ఆశించినట్లు, దేశప్రధానిని కళ్ళారా చూడడం కోసం ముందు ఆవరణలోకి వెళ్ళలేక పోయాడు. కనీసం కనుచూపు మేరలో నిలబడి చూసే అవకాశం కూడా అతనికి దొరకలేదు. అందుకని అతను ఆలోచనలో పడ్డాడు. వేదిక వెనకవేపు ఎవరూ వుండరని ఊహించి అటుకేసి బయల్దేరాడు.

అరుణబాబు అనుకున్నట్టే వేదిక వెనకవేపు ఎవరూ లేరు.. అందుకని కట్టుదిట్టానికై పాతి వుంచిన కర్రలను దాటి గద్దెకు సూటిగా నడక సాగించాడు. అక్కడ ఎవరూ

లేరనుకోవడం కేవలం పొరపాటేనని చెప్పడానికి ఓ కర్రవచ్చి అతని గుండె మీద వాలి వెనక్కి నెట్టింది. ఎదురుగా పోలీసు –

అరుణబాబు మ్రాన్పడిపోయాడు.

అతను ఊహించినది తారుమారైనందుకు కాస్త తబ్బిబ్బయ్యాడు. సిగ్గుపడ్డాడు. అతను ఊహలోంచి కాకుండా ఇప్పుడు కళ్ళతో చూడసాగాడు.

అరుణబాబుకు అక్కడ వరుసగా, మిలిటరీ ట్రక్కులూ, పోలీసు వేనులూ కనిపించాయి. మిలిటరీ పోలీసులూ, సి ఆర్‌పి పోలీసులూ, సివిల్ పోలీసులూ గస్తీ కాస్తూ కనిపించారు. వాళ్ళ చేతిలో తుపాకులూ, లాఠీలూ వున్నాయి.

అరుణబాబు మర్యాదగానే వెనక్కి వచ్చేశాడు. ఓ మూలగా పాతిన కర్రకు ఆనుకుని ఫర్లాంగుకు ఆవల వున్న గద్దెను చూస్తూ ఊరుకున్నాడు.

దేశ ప్రధాని ఇంకా రాలేదు. అసలు ఈ నగరంలో దిగనేలేదనీ. మరో నగరంలో ప్రోగ్రాం అనంతరం టీపార్టీలో వున్నారనీ... అలాగనని ఎవరికి తోచినట్టు వాళ్ళు అనుకుంటున్నారు.

అరుణబాబు ఆలస్యంతో వేగిపోయాడు. అతడికి కాళ్ళు పీకాయి. నిర్లిప్తంగా గడియారం కేసి చూశాడు.

'ఏం బాబూ! మన రాజాగారింకా రాలేదా...' పక్కన ఎవరో అరుణబాబును అడిగారు –

'రాజాలు ఇంకా ఎక్కడయ్యా... వచ్చేది మన ప్రధాని...' అన్నారు మరెవరో –

'మా కెవరేటో ఎలా తెలుసుద్ది బాబూ... సదుం కోనోళ్ళం... మోటోళ్ళం...' అన్నాడు అతను.

అరుణబాబు పక్కకు తిరిగి చూశాడు.

బిగదీసి కట్టుకున్న ఎర్రపంచె – తెల్లని తలపాగా – చేతిలో కర్ర... ఎండకూ వానకూ సానబట్టిన నాపరాయిలాంటి ఒళ్ళు... ముసలితనం వాకిట నిలిచిన ఓ మానవాకారం – కూలివాడల్లే వున్నాడు.

ఓ రాజాకీ, ప్రధానికీ తేడా తెలియని ఇతను దేశప్రధానిని ఎందుకు చూడాలని వచ్చినట్టు?... అనుకున్నాడు అరుణబాబు.

కాని ఇంత హంగామా జరుగుతూ వుంటే, ప్రధానిని చూడాలని ఎవరికి మాత్రం వుండదు? – అయినా ఈ రోజుల్లో పేదోళ్ళు పేదోళ్ళా లేరు; కూలోళ్ళు కూలోళ్ళా లేరు; నీవేనా, నేను చూడకూడదా అని ఎదురు ప్రశ్నించ గలరు కూడా –

'బాబూ ఇక్కడ మన ప్రధాని ఎంతసేపువుంటారు?'

'ఏమో! ఉంటే ఓ గంట ఉండొచ్చు...'

'ఈ గంటలో వారొచ్చి ఏం సేత్తారు బాబూ?'

'ఉపన్యాసం ఇస్తారు-'

'ఏం చేస్తారు బాబూ?'

'దేశ ప్రజలకి వారి సందేశాన్నిస్తారు-'

'మీరంటున్నది నాకేటో తెలియటం లేదు బాబూ-'

'అంటే మనకీ మన దేశానికీ వారు ఏమేం చేస్తారో, చేయబోతున్నారో అవన్నీ మనకు చెబుతారన్నమాట -'

'అయితే వారు మనకేదయినా చేస్తారా బాబూ?-'

'అది నేను మాత్రం ఏం చెప్పగలను... వచ్చాక విను... ఇంతకూ నీ విక్కడికి కొత్తగా వచ్చావా?...'

'ఔను బాబూ... కూలిపనికని వచ్చాను...'

'ఏం పేరు?'

'పద్దాలు బాబయ్య...'

'కూలి ఏమైనా దొరుకుతుందా?...'

'సిత్తం! అప్పుడప్పుడూ...'

'ఏమేం చేస్తావు?'

'అదేంటి బాబయ్యా... మన ప్రధానోరు ఈనాడు ఆ గద్దె ఎక్కుతున్నారంటే మేమే గద బాబయ్యా... మేం వచ్చిన కాడి నుండీ వారెక్కే గద్దెనే కట్టాం బాబయ్యా...'

'అలాగా?'

'అవును బాబయ్యా! రోజూ రాళ్ళెత్తి, ఇటుకలు మోసి, గుంజలు పాతి అంతెత్తు కట్టింది మేమే బాబయ్యా... పైని ఎండ తగలకుండా డేరా వేసింది కూడా మేమే బాబయ్యా... కాని ఏం లాభం... ప్రధానోరు మద్దేనపేల రావలసింది పోయి సందలడే యేల కొత్తున్నారు... ఎండంతా దిగిపోయినాక-

అరుణబాబు పద్దాలు చెప్పింది శ్రద్ధగానే విన్నాడు.

'ఏ మాత్రం కూలిగిట్టింది?' అన్నాడు.

'ఫరవాలేదు బాబూ... నోటిదాకా చేతులు వెల్తున్నాయి... అంత మాత్రం చాలదా-'

అరుణబాబు మరోసారి గడియారం కేసి చూసాడు. దూరంగా రోడ్డు మీంచి పైలెట్ మోటార్ సైకిల్‌పై దూసుకుపోయాడు. పోలీసులు మరింత హడావుడిగా ఈలలు వూది, పరుగులు తీసి, రోడ్డునూ, ట్రాఫిక్‌నూ కంట్రోల్ చేశారు. పోలీస్ జీప్‌లూ, వివిపీల కార్లూ దూసుకుపోయాయి. వాటివెనుక టాప్‌లెస్ కారులో ప్రధాని -

అది రోడ్డు మీద అటుగుండా వచ్చి నేరుగా వేదిక వేపు వెళ్ళింది.

అన్ని లక్షలమందిలోనూ ఒక్కసారిగా ఆనందోత్సాహం వెల్లి విరిసింది. అందరి ముఖాల్లోనూ ఏదో మందహాసం... ఏదో ఆత్రుత...

ప్రధాని వేదిక ఎక్కారు-

ప్రజలందరూ ఏక కంఠంతో 'దేశ ప్రధాని జిందాబాద్' అంటూ స్వాగత వచనాలు పలికారు. ఆ తర్వాత అంతా ఉపన్యాసం వినడం కోసం సద్దు మణిగారు-

ప్రధాని అందరినీ 'భాయియో! ఔర్ బెహనో!!' అని సంబోధించారు.

ప్రజలు అది వినడం కోసం మరింత నిశ్శబ్దమయ్యారు.

అప్పుడు దేశ పరిస్థితులనూ, ఆర్థిక స్థితిగతులనూ ప్రస్తావించారు. సామాజిక రుగ్మతలనూ, విదేశీ విధానాలనూ విమర్శించారు. ప్రతిపక్షాల తీరు తెన్నులను దుయ్యబట్టారు -

ప్రజల అభిమానాన్ని చూరగొన్న ప్రధాని కనుక ఎంతో ఆశ్చర్యంతో అంతా విన్నారు. ప్రతి మాటమీదా చెవి వేసి వుంచారు. అప్పుడప్పుడూ ఉద్వేగంతో హర్షధ్వానాలు చేశారు. నినాదాలిచ్చారు.

అరగంట పైగా అనర్గళంగా సాగిపోయింది-

నాయకులు వాగ్దానాలు చేస్తుంటే, ప్రజలకు పెద్ద సంతృప్తి... ఉన్నట్టుంది ఒక్క సారిగా ఇన్ని లక్షల మంది నుండీ హర్షధ్వానాలు మిన్ను ముట్టాయి. అలజడి తగ్గే వరకూ ఉపన్యాసాన్ని నిలుపుజేసి, మరల మొదలు పెట్టారు ప్రధాని - అయినా ప్రజలు సంతోషంతో ఆవార్తను ఒకరికొకరు చెప్పుకుంటూ మురిసిపోయారు -

అరుణబాబును పక్కనున్న పద్దాలు, 'మన ప్రధాని ఏమన్నారేటి బాబయ్యా...' అన్నాడు.

'గరీబీ హటావ్... అన్నారు... విన్నావుగా...'

'అంటే ఏంటి బాబయ్యా?'

'అంటే పేదరికాన్ని పారదోలేస్తానంటున్నారు...'

'అదేంటి బాబయ్యా... పేదరికాన్ని ఎవర్నుండి ఎక్కడికి పారదోలేస్తారు బాబయ్యా-'

'ఈ దేశాన్నుండి!'

మీ లాంటోరు అలాగే అంటారుగానీ, ... పేదరికం ఎక్కడికి పోద్ది బాబయ్యా... పిల్లలు ఏడిస్తే.... చందమామ రావే, జాబిల్లి రావే, గోగుపూలు తేవే... ఎండి గిన్నెలో పాలుపోసి రావే అని పాడతాం... చందమామ వస్తాదా, గోగిపూలు తెస్తాదా... ఎండి గిన్నే, పాలూ... అంతా చిత్రం బాబయ్యా...ఆడి ఏడుపు మాత్రం ఆగిపోద్ది... అంతే-

అరుణబాబు సమాధానం చెప్ప లేకపోయాడు. పద్దాలు అతన్నుండి సమాధానం కోరనూ లేదు. బొత్తిన కాళ్ళమీద కూచుని మోకాళ్ళ మీదనుండి చేతులు ముందుకు చాచి కర్ర నేలమీద నిలబెట్టి రెండు చేతులతో కర్రను పట్టుకొని భూమ్మీదకు చూస్తూ ఆలోచిస్తున్నాడు.

ప్రధాని సందేశం ముగిసింది -

జనగణ మన... పాట వినిపించింది -

చలిచీమల పుట్ట చెదిరినట్టు ప్రజలు ఎవరి యిష్టము వచ్చిన తీరున వాళ్ళు పోతున్నారు. అరుణబాబు కూడ వెళ్ళిపోతున్నాడు. కాని తన కళ్ళ ఎదురుగా పద్దాలు కనిపించాడు. అందరూ లేచినా అతను మాత్రం ఎలా కూర్చున్న వాడు అలానే వుండటం చూచి - "అంతా అయిపోయింది. నీవిక వెళ్ళిపోవచ్చు-" అన్నాడు.

"ఎక్కడకు వెళ్ళమంటారు బాబయ్యా-" అన్నాడు.

"ఇక్కడ కూర్చొని ఏమిచేస్తావ్ -" తిరిగి ప్రశ్నించాడు రమణబాబు,

"ఆ గద్దె పడగొట్టాలి బాబయ్యా."

అరుణబాబు వివర్ణుడైనాడు. ప్రధానిపై ఎనలేని అభిమానం గల తను ఆ మాట వినలేకపోయాడు. కోపం వచ్చింది. ఒడలు వొణికింది. అంత కోపాన్నీ మింగుతూ "ఏమిటన్నావ్-" అన్నాడు.

అంతవరకూ మామూలుగా మాట్లాడిన అతనిలో ఒక్కసారిగా కోపాన్ని చూచి పద్దాలు భయపడ్డాడు. తనేదో తప్పు పలికానని తెలిసికొని నివ్వెరపోయాడు. కాని కొద్ది సేపటిలోనే సంబాళించుకొని ... "నేను సెప్పేది కోపం పడకండా యినండి బాబయ్యా-" అంటూ పద్దాలు మొదలుపెట్టాడు.

"మీరు రాబోయే మన ప్రధాని కోసరం ఈ రోజునుండే గద్దె కడుతున్నారు. ఆ రోజు ఓ గంట మాటాడి వెళ్ళిపోతారు. తరువాత ఈ గద్దె యిక్కడ ఐదు సంవత్సరాల వరకూ వుండటం ఉపయోగం లేని పని - పైగా అన్నిటకూ అడ్డు - కనుక ఈ కర్రలు పీకేయాలి. ఈ జెండాలు దించెయ్యాలి. ఈ గద్దెను పడగొట్టెయ్యాలి. కాబట్టే మీరు కూలికోసం భయపడనక్కరలేదు. మరి కొన్ని రోజులు యిక్కడేవుండి కూలి చేసికోండని మమ్మల్ని పనిలో పెట్టుకున్న మేస్త్రీ మాతో చెప్పాడు బాబయ్యా - అందుకని కూలికాసపడి యిక్కడే ఈ రోజంతా పడుగాపులు పడి కూచున్నాను. ఈ పనుంది కదాని ఈ రోజు కూలికి ఎక్కడికీ పోలేదు. పోయినా కూలి దొరుకుద్దేంటి బాబయ్యా- ఆదేముడిసాచ్చిగా చెబుతున్నాను - కూలికోసం యిక్కడ వున్నాను గాని ప్రధానిని సూడ్డానికి కాదు బాబయ్యా-కూలి డబ్బుల్తో ఏమన్న కడుపు నింపు కోగలం గాని పెద్దోల మాటల్తో కడుపులు నింపుకోగలమా బాబయ్యా - ఏమంటారు?

ఇంతకాలమూ పనిలో పెట్టుకొన్న మేస్త్రీ వస్తున్నాడు. పద్దాలుకు మేస్త్రీని చూడ్డంతోనే కన్నుల పండుగయ్యింది. ఔను - తనకు యింతకాలమూ పనిచూపిపొట్ట నింపింది అతనే. పెంపుడు జంతువు యజమానిని చూచినట్టు - పద్దాలు మేస్త్రీని ఆశగా, తృప్తిగా, సంతోషంగా చూశాడు. ఎదురుగా వున్న అరుణబాబు మీదకన్న, వేదికపై వాగ్దానాలు పల్కిన ప్రధాని మీదకన్న పనిచూపిన మేస్త్రీపైనే పద్దాలు గౌరవం చూపాడు.

కాని ఈనాడు పద్దాలుకు ఎవరూ పని చూపలేకపోయారు. అతడు యాచించేది కేవలం పనిమాత్రమే - అది మేస్త్రీ కూడ లేదన్నాడు.

"పనుంటుంది ఉండండ్రాని సెప్పి యిలా అంటారేటండి బాబూ? పొద్దుటి నుండి ఈ కూలిపని కోసమే కాచుకున్నాను" అంటూ దీనంగా మేస్త్రీని వేడుకున్నాడు.

"ఔన్రా! అదినిజమే గాని, ఈ గద్దె పడగొట్టొద్దని అధికారుల నుండి ఆర్డ రొచ్చింది. వచ్చే ఏడాది అసెంబ్లీ ఎలక్షనులున్నాయట. అంతవరకు యీగద్దె యిలానే వుంటుంది." అన్నాడు మేస్త్రీ.

"మేస్త్రీగారో! కూలోళ్ళం-కూటికోసం బతికేవాళ్ళం. నాకు కూలి పని చూపించయ్యా - మీ కాళ్ళకు..."

"కాళ్ళ మీద పడకు....లే! నేను మాత్రం పనిని ఏం చూపించగలను" అంటూ మేస్త్రీ వెళ్ళిపోయాడు. అతనికి యిలాంటి కూలోళ్ళ మొరలు కొత్తేమీ కాదు -

కాళ్ళమీద పడ్డచోటే భూమ్మీద చతికిల బడ్డాడు పద్దాలు. అప్పటికే చీకటి ముసురుతోంది. అరుణబాబు నిలబడ్డవాడు నిలబడ్డట్టే వున్నాడు. గొంతులో మాత్రం ఓగుటక జారింది -

చీకటిలో ఓ హస్తం పద్దాలుని తట్టింది. "లే!" అంది మరో గొంతు -

** ఏప్రిల్ 1974. 'కథలు12' సంకలనం. **

హైదరాబాద్
మార్చి *1972*

# ప్రత్యూష

కొన్ని సంఘటనలు జీవితం మీద చెరగని ముద్రవేస్తాయి. కొన్ని కొన్ని జీవితాన్నే మార్చివేస్తాయి. జీవితాన్ని మార్చివేయకపోయినా చెరగని ముద్ర వేయక పోయినా కొన్ని సంఘటనలు జీవితాంతం గుర్తుంటాయి.

నేను రైల్లో ప్రయాణం చేస్తున్నాను.

ఆగ్రాలోని రాజా-కీ-మండి నుండి రాజమండ్రికి నా ప్రయాణం.

రైలు వేగంగా నడుస్తోంది.

నేనా రైల్లో మూడు రోజుల పాటు కూచోవలసిందే – విజయవాడలో మాత్రం మారాలి.

నేను రైల్లో కూచున్నా నా మనసింకా రైలెక్కలేదు. అదింకా ఆగ్రాలోని రాజా-కీ-మండీ స్టేషన్ లోనే వుంది. ఆ ప్లాట్ ఫామ్ మీద వున్న ఓ నలుగురమ్మాయిలు నా కళ్ళముందు వెలుగు మరకల్లా కదుల్తున్నారు. వాళ్ళంతా బీజాపూర్ కాలేజీలో ఎమ్మెస్సీ చేస్తున్నారు. నాలాగే వాళ్ళూ సెలవలకి ఇంటికని బయల్దేరారు. కాని వాళ్ళు మరో బండి, జి.టి.కి రిజర్వు చేసుకున్నారట– అందుకని మేం... అంటే నేనూ, నా నలుగురు మిత్రులూ వాళ్ళలా జి.టిలో రిజర్వు చేసుకోనందుకు తెగబాధ పడిపోయాం...

అందరి మాట ఎలా వున్నా, నేను మరీ బాధపడిపోయాను. ఈ మూడు రోజుల ప్రయాణంలో ఆ బోటనీ ప్రీవియస్ అమ్మాయితో ఏదో వంకను కాస్త మాట కలుపు కొందును.

కాని నాకా అవకాశం చెయి జారిపోయింది.

రైలు వేగంగా పరుగిడుతోంది.

నా ఆలోచనలింకా నా స్వాధీనంలోకి రాలేదు. రిజర్వేషన్ బట్టి ఐదవ నంబరు బెర్తునాది. సామాన్లు సర్ది, బెర్తుమీద బెడ్డింగు పరిచాను.

అతను ఎవరో నాల్గవ నంబరు బెర్తుమీది వ్యక్తి నన్ను పలకరించాడు. నా బెర్తు కింది

బెర్తు అతనిదే. అతను తన బిస్తరు సర్దుకొని, హిందీ పత్రికలు ముందు వేసుకుని కూచున్నాడు. నన్ను కూడా కూచోమంటే నేనతని బిస్తరు మీద కూచున్నాను.

అతను నాతో మాటలు కలిపాడు.

నేను ఆగ్రా కాలేజీలో ఎమ్మెస్సీ చేస్తున్నట్టూ సప్రూ హాస్టల్లో నలభై ఐదో నంబరు గదిలో నేనుంటున్నట్టూ నా గురించిన భోగట్టాను అతనే చెప్పేశాడు.

నా గురించి ఇన్ని వివరాలు తనకెలా తెలిసిందాని కించెత్తు ఆశ్చర్యపడి అడిగాను. అతను కూడా అదే కాలేజీలో ఎమ్మెస్సీ చేస్తున్నాడట. అదే హాస్టల్లో అరవయ్యో నంబరు గదిలో వుంటున్నాడట.

నేనతనిని ఇంతవరకూ చూడలేదు.

మేమిద్దరం ఫార్మల్‌గా పరిచయాలు చేసుకున్నాం.

అతని పేరు "పాలీవాల్" అని చెప్పాడు.

ఒకసారి చూస్తే మరోసారి చూడాలనిపించే చక్కటి రూపం అతనిది. మనిషి సామాన్యమైన ఎత్తు. కాస్త పీలగా వున్నాడు. రంగు మాత్రం మిసమిసలాడుతూ దబ్బ పండులా పచ్చగా వుంది. అందమైన ముక్కు, తీర్చిదిద్దిన కనుబొమలు, మెరిసే కళ్ళు పలుచని ఎర్రని పెదవులు, ఒత్తుగా పెరిగిన పక్క పాపిడి జుట్టు. అన్నింటినీ మించి మంచి హుందాతనం.

నేనిదివరకు మగవాళ్ళ అందం గురించి ఎప్పుడూ ఆలోచించలేదు. పదే పదే చూడాలనిపించే అందం మగవాళ్ళలో కూడా వుంటుందన్న సంగతి అతన్ని చూశాకే మొదటిసారిగా తెలిసింది.

మేం చాలాసేపు కాలేజీ గురించీ, చదువు గురించీ మాటాడుకున్నాం. తన చదువు గురించిన ప్రస్తావన వచ్చేసరికి, అతను తన ఇంటి విషయాలు కొన్నిటిని చెప్పాడు. అతని తండ్రికి మంచి వ్యాపారముందట. అతన్ని కూడా ఆ వ్యాపారమే చూసుకోమని చదువు ఆపించి, పెళ్ళిచేసి కొట్లో కూచోబెట్టారట. అతనికిద్దరు సంతానం అట. చదువుకోవాలని తండ్రితో గొడవ పడి ఇన్నేళ్ళ తరువాత తిరిగి కాలేజీలో ప్రవేశించాడట.

నిజానికి ఎంత మందికి చదువు మీద శ్రద్ధవుంటుంది. నా మటుకు నేను బతుకు తెరువుకోసమే ఈ చదువులు చదువుతున్నాను.

ఇప్పుడు మూడు నెలల ఎడబాటు తర్వాత కుటుంబంతో గడపడం కోసం ఇంటికి వెళుతున్నాడనుకున్నాను. కాని అతను అలాంటిదేమీ కాదన్నాడు. మధ్య ప్రదేశ్‌లో తన పెత్తల్లి కొడుకు ఇంజనీరు చేస్తుంటే అతన్ని చూడ్డానికని బయలు దేరానన్నాడు.

నేను కాసేపు ఏమీ మాట్లాడలేకపోయాను. మూడు నెలల తర్వాత ఓ పది రోజులు సెలవు వస్తే భార్యా బిడ్డల్ని చూసుకోవడం కోసం ఆఘమేఘాల మీద ఇంటికి పోవలసినవాడు, ఎక్కడో వున్న మారుటి అన్నగార్ని చూడ్డానికై వెళుతున్నాడంటే ఆశ్చర్యం వేసింది.

అయినా అతని స్వవిషయాల్లో నేను కుతూహలం చూపడం మంచిది కాదని తిరిగి ప్రశ్నించలేదు. ఆ తర్వాత మా ఇద్దరి మధ్యా కొంతసేపు మౌనం ఏర్పడింది.

రైలు వేగానికి కిటికీలోంచి గాలి విసురుగా కొడుతోంది. సంధ్య వెలుగు ఆకాశాన్ని అలుము కొంది. ఎర్రబారుతున్న ఆకాశాన్ని అడ్డుకుంటూ ఓ నల్లని కొండ కనిపించింది. ఆ కొండ సమీపించేకొద్దీ మరీ పెద్దదయింది దాని మీద పెద్ద పెద్ద బురుజాలూ, కోట గోడలూ కనిపించాయి. అది గ్వాలియర్ పోర్టు.

ఆ పోర్టులో జరిగిన ఓ విశేషం చిన్న కథలా పాలీవాల్ నాతో చెప్పాడు. కొడుకు ప్రేమించిన స్త్రీని తండ్రి చేసుకున్న కథ అది. రాజు, యువరాజుల మధ్య జరిగిందట.

ఆ తర్వాత ఝాన్సీ పోర్టు గురించి కూడా ప్రస్తావనలోకి వచ్చింది. ఆ కోటముందు ఓ కాళికాలయం వుందట. ఝాన్సీరాణి తను కదన రంగంలోకి దూకేముందు ఆ దేవికి బలిచ్చి ప్రతిజ్ఞ పూనిందట... అప్పటి నుండి నేటివరకూ ఆ ఆలయం ముందు తప్పని సరిగా ప్రతిరోజూ వేట తెగవలసిందేనట.

పాలీవాల్ స్వతహా మితభాషి అయినా, సందర్భాన్ని బట్టి చక్కగా మాటాడగల మనిషి – మనం రైల్లో కోరుకునేది కూడా అంతే కదా.

అతను నన్నుచూసి చాలాసార్లు ఉత్తరాది వాడిననే అనుకున్నాడట. మద్రాసీలా వుండవన్నాడు. అతని దృష్టిలో ఇది నన్ను మెచ్చుకోవడమే అయినా, నా మనసు చివుక్కు మంది. దక్షిణాది వాళ్ళమీద ఉత్తరాదివాళ్ళకుండే తేలిక భావం బయటపడింది. మనం నల్లగా వుంటామనీ, అందంగా వుండమనీ వాళ్ళ భావం. వాళ్ళకీ మనకీ మధ్య ఆర్యులూ, ద్రావిడు లనే జాతిభేదం ఏదో వుందనీ, మద్రాసీలు రావణున్ని మొక్కుతారనీ ఏవేవో అపోహ లున్నాయి. పైకి అనకపోయినా –

ఇంతకూ పాలీవాల్ కూడా నన్ను మద్రాసీ అనడం ఏమంత బాగాలేదు. అతనితో నేను మద్రాసీని కాననీ, ఆంధ్రుణ్ణనీ చెప్పాను. నామాట పూర్తికాగానే అయితే మీ మాతృ భాష ఏమటని అడిగాడు.

"తెలుగు" అన్నాను.

అతను ముందుకు ఉత్సాహంగా వంగి తాను తెలుగు నేర్చుకున్నానన్నాడు.

అక్కడివాళ్ళకు దక్షిణాది నాలుగుభాషల్లో ఒకటి సెకండ్ లాంగ్వేజిగా తీసుకుంటే స్కాలర్ షిప్ ఇస్తారట దానికోసమని తెలుగు నేర్చుకున్నాడట .అతను తెలుగు నేర్చుకున్నట్టు నాకు ప్రూఫ్‌గా ఓ వాక్యం కూడా వినిపించాడు అది–

'ఆవు పాలు ఇచ్చును' అని

అతనన్నదేమిటో మొదట్లో నాకేమీ అర్థం కాలేదు. అతను పెదవులు అదోలా తమాషాగా పెట్టి నాలుగయిదు సార్లు దాన్నే ఉచ్చరించాక నాకర్థమయింది. నేను తిరిగి స్పష్టంగా అన్నాను. ఆతర్వాత అతను మరికొంత స్పష్టంగా అనగలిగాడు. అయినా

నేనుండబట్టలేక నా ఫ్రెండ్స్‌ని పిలిచాను. అతనుకూడా స్పోర్టివ్‌గానే తీసుకుని రిపీట్ చేశాడు. అందరం గొల్లున నవ్వాం.

కిటికీలోంచి నీరెండ తగుల్తోంది.

చంబల్ లోయల్లోంచి రైలు వేగంగా పోతోంది. మధ్యలో టాపిక్ డెకాయిట్స్ మీదకు మళ్ళింది. నా మిత్రులు ఆటాపిక్‌మీద మంచి కుతూహలం చూపించారు. డాకూలఖన్ సింగ్ గూర్చి అతను కొన్ని విషయాలు ఇంటరెస్టింగ్‌గా చెప్పాడు. ఆతర్వాత మేమంతా పిచ్చాపాటీలోకి దిగిపోయాం.

నాకు కాస్త బడలికగా వుండి ఆవులింతలు వచ్చాయి. పైకెక్కి నాబెర్తుమీద పడుకుంటానని చెప్పాను. బెర్తుమీద కెక్కాక నిద్రపట్టేసింది.

అలా నేనెంతసేపు నిద్రపోయానోగాని, తిరిగి పాలీవాల్ నన్ను లేపేసరికి మా కంపార్టుమెంటులో లైట్లు వెలుగుతున్నాయి కిందికి దిగి కిటికీలోంచి బయటికి చూస్తే గుబురుగా పెరిగిన చెట్ల నల్లని ఆకారాలు వెనక్కి పరుగులు తీస్తున్నాయి. పాదరసంలా మిలమిలలాతూ ఓ నక్షత్రం పడమటి ఆకాశం మీద ఇంకా మిగిలిపోయిన ఆ కొద్ది సంధ్య వెలుగుమీద కనిపించకుండా వుంది. దానిపక్కన అప్పుడే పుట్టిన పసిపాప అమాయకపు బోసినోరులా సన్నగా 'నెలవంక' కనిపిస్తోంది.

పాలీవాల్ నాకు నెలవంకను చూపించాడు.

అతడు నన్ను లేపింది దాన్ని చూపించడానికేనట. మొదటిరోజు చంద్రవంకను చూస్తే అదృష్టం వస్తుందట.

నేనతనికేసి సాలోచనగా చూశాను.

నాముఖంలోని భావాన్ని చదవగలిగాడు.

నాకు సెంటిమెంట్సు మీద నమ్మకం లేదనుకున్నాడో ఏమో ఇదిమాత్రం ముమ్మాటికీ నమ్మమన్నాడు. నెలవంకను చూసిన పక్షం రోజులూ ఏకీడూ రాకుండా తొలిగి పోయి, అంతా మంచే జరుగుతుందన్నాడు. కావలిస్తే నన్ను పున్నమివరకూ వేచి చూడ మన్నాడు.

నా పెదాలమీద వెలసిన ఆకొద్ది దరహాసానికే అతను సంతృప్తి పడ్డాడు.

అపుడే పున్నమి గురించికూడా ప్రస్తావన వొచ్చింది.

ఆ వచ్చే పున్నమి కార్తీక పున్నమి అట. పున్నమిలోగా నేను ఆగ్రాకి తిరిగి వచ్చేదీ లేనిదీ అడిగాడు. నేను తేదీలు లెక్కవేసి వచ్చేస్తానని చెప్పాను. ఇంతకూ నన్ను కార్తీక పున్నమినాడు తాజ్‌మహల్‌ను చూడ్డం మిస్ కావద్దన్నాడు. ఏమిటి ప్రత్యేకత అని అన్నాను. ఆరోజు వెన్నెల అన్ని పున్నమి వెన్నెలలకన్నా కాంతివంతంగా వుంటుందట. ఆవెన్నెల్లో తాజ్ ఎప్పుడూ కనిపించనంత సొగసుగా కనిపిస్తుందట. ఆ అందాన్ని అనుభవించడానికి అనేకమంది, దేశం నలుమూలల నుండీ వస్తారట– ఆ రకరకాల జనాన్ని అక్కడ చూడ్డం

చూడముచ్చటగా వుంటుందట-

నేను తప్పక వస్తానని మాటిచ్చాను.

అతను ఆ రాత్రి తెల్లవారుతుండగా ఏదో స్టేషన్‌లో దిగిపోయాడు. నేనతని బెడ్డింగు కింది కందించాను. రైలు కదిలేవరకూ అతనితోపాటే ప్లాట్‌ఫాంమ్మీద వున్నాను. రైలు కదిలేముందు పున్నమిని మరోసారి గుర్తుచేసి సెలవు తీసుకున్నాడు.

వారం రోజులు ఎంతలో తిరిగి రావాలి-

రైలుకి రిజర్వేషన్ దొరకలేదు. బెజవాడ స్టేషన్‌లో మిగిలిన మిత్రుల్నికూడా కలిసాను. వాళ్ళకీ రిజర్వేషన్ దొరకలేదట. కాసేపు రైల్వే వాళ్ళను తిట్టుకుని ఎవరితంటాలు వాళ్ళు పడ్డాం.

నేనుకూడా జి.టి. జనతా ప్రయత్నించాను. కాని లాభం లేకపోయింది. ఇక డీలక్స్ ఒక్కటే మిగిలింది ఓ నాలుగ్గంటల తరువాత అదికూడా జనంతో కిటకిటలాడుతూ వచ్చింది. నేను ఓ బెడ్డింగూ, సూట్‌కేస్, ఆవకాయలూ వగైరావున్న బుట్టా- అన్నింటితోనూ కంపార్టుమెంటులోకి ఎక్కేశాను. ఆ రెండు రోజులూ నిద్రాహారాలు ఒంటికాలు మీదనే జరిగాయి. హాస్టలుకొచ్చి ఓ రోజంతా మంచంమ్మీద పడి నిద్రోతే గాని తిరిగి మామూలు మనిషినవలేదు.

ఆ సాయంత్రం స్నానం చేసి, మెస్‌లో నాల్గు పరోటాలు తిని, హాస్టల్‌వేపు ఓ రౌండు కొట్టాను. తెలుగువాళ్లు ఎవరెవరు వచ్చారో సందర్శించాను చివరిగా పాలీవాల్ రూమ్‌కి కూడా వచ్చాను. గదికి తాళం వేసుంది. ఊరునుండి ఇంకా రాలేదేమో.... అయినా పున్నమి రేపుకదా. అప్పటికి రావచ్చును.... అనుకున్నాను.

చీకటి పడుతుండగా గదికి చేరాను. ప్రయాణ బడలిక పూర్తిగా వదలక మళ్ళీ నిద్రలోకి జారుకున్నాను.

అప్పటికి రాత్రి రెండవుతుంది. తలుపు మీద ఎవరో దబదబ బాదుతున్న శబ్దం విని తృళ్ళిపడిలేచాను. బయటనుండి తలుపు తెరవమని ఎవరో అరిచారు. కాని తీయాలా వద్దాని తటపటాయించాను. దొంగలుకూడా ఇలానే కొట్టి, గది తెరిచాక కత్తుల్తో భయపెట్టి అందులోని మొత్తం లూటీ చేసేస్తారట- ఇలాంటివి జరిగిన కొన్ని సంఘటనలు చెప్పగా విన్నాను.

కాని ఇప్పుడలాంటిదేమీ కాదని మరుక్షణమే అనిపించింది. బయట గొడవమాత్రం పెద్దగానే వినిపిస్తోంది. పైగా ఆ పిలుస్తున్నది మా హాస్టల్ సెక్రటరీ అని ఆనవాలు కట్టాను.

తలుపు తెరిచాను.

హాస్టల్ హస్టలంతా లేచి బయటనిలుచుంది. ఇంత అలజడి ఎందుకో అర్థం కాలేదు. సెక్రటరీ విషయం చెప్పి పక్కగదికి వెళ్ళిపోయాడు.

పాలీవాల్ చనిపోయాడట-

నేను నిర్ఘాంతపోయాను. కొన్ని నిజాలు పచ్చి అబద్ధాల్లా వుంటాయి. వినడానికి బాధనిపించింది. నమ్మాలనిపించలేదు. నేనునమ్మినా నమ్మకపోయినా నిజం నిజమే కదా-

మరుసటి రోజు ఉదయం పది గంటల కల్లా పాలీవాల్ శవానికి జమునా బ్రిడ్జికింది శ్మశానవాటికలో అంతిమక్రియలు జరిగాయి. మేమంతా తిరిగి హాస్టల్ చేరేసరికి మధ్యాహ్నం ఒంటిగంట దాటింది. ఎంత మరుద్దామన్నా అతని అంతిమయాత్ర కళ్ళల్లో మెదులుతోంది. ఇన్ని వందలమంది విద్యార్థుల్లోనూ పాలీవాల్ కే ఈ మరణం సంభవించాలా?

గదికి వచ్చాక తలుపు బిగించి కాస్త నడుం వాల్చాను.

నెలవంక పదేపదే గుర్తొస్తోంది. జనరల్ హాస్పటల్ గుర్తొస్తోంది. అందులో మూడు రోజులు స్పృహలేకుండా టెటనస్ తో బాధపడి మరణించిన పాలీవాల్ గుర్తొస్తున్నాడు.

నాకు తెలీకుండానే సాయంత్రం అయ్యింది.

ఏదీ ఆగదు. ఓ వరుసలో అన్ని జరిగిపోతూనే వుంటాయి.

సాయంత్రం అయ్యింది కనుక తెలుగు వాళ్లంతా లాన్ లో చేరారు.

నాకూ కబురొచ్చింది.

స్నానం పూర్తిచేసి. డ్రస్ చేసుకుని బయల్దేరాను.

మేమంతా తాజ్ మహల్ చేరేసరికి తూర్పు నుండి నిండుగా చంద్రుడు పైకి లేచాడు. కార్తీక పున్నమి వెన్నెల అది.

నిజంగానే ఈ వెన్నెల్లో ఏదో మహత్తుంది.

ఒక్క తాజమహల్ మీదనేకాదు.... అక్కడున్న ప్రతి మొక్కమీదా, ప్రతి ఆకుమీదా, ప్రతి రెమ్మమీదా ఆ వెన్నెలసొగసు కన్పిస్తోంది. విశాలమైన లాన్ లు పరిచిన పచ్చటి మఖ్మల్ తివాసీల్లానూ, వాటిపై వెన్నెల వెండి జలతారులానూ వింత శోభను చేకూర్చుతున్నాయి. తెల్లని వస్త్రాల్లోని అందమయిన అమ్మాయిలు అప్పుడే వికసించిన కలువ రేకుల్లా, పక్క అబ్బాయిలు మధువుకోసం వాలిన భ్రమరాల్లా వున్నారు.

పాలరాతి చప్టాల మీద, ఎక్కిదిగే మెట్లమీదా, విశాలమైన లాన్ ల మధ్యా ఎక్కడ చూసినా జనం.

అక్కడికి జనం ఎందుకు వస్తారో అందరకూ తెలుసు. నా మనసూ పరిపరి విధాలపోయి దేనికోసమో ఆరాటపడుతోంది.

ఆ వాతావరణం అలాంటిది మరి-

అక్కడ బతుకు దెరువు కోసం ఆరాటం లేదు.... పరుగులేదు. స్వేచ్ఛా.... సుఖం కోసం మిగత ప్రపంచంతో సంబంధం తెంచుకుని వేరై వచ్చిన భూభాగంలా వుంది.

అందరం కలిసి లాన్ లో కూచున్నాం. ఓ మిత్రుడు పాట పాడాడు. గొప్ప సాహిత్యం వున్న గొప్ప పాటది. వాతావరణానికి సరిపోయింది. అందరి హృదయాల్లోనూ అనిర్వచనీయమైన ఆనందం-

ఆ తర్వాత అందరం కలిసి తాజ్ ని చేరాము. పైకెక్కి చుట్టూ తిరిగాము. నా

కాళ్ళు అనుకోకుండా ఒక చోట ఆగిపోయాయి. తాజమహల్ వెనుక నుండి జమునా బ్రిడ్జి కనిపిస్తోంది. ఆ బ్రిడ్జి కిందనే ఓ మైలు దూరంలో పాలీవాల్ సమాధి! నాకంటికి ప్రత్యేకించి ఏమీ కనిపించకపోయినా, నా చూపును మాత్రం అటునుండి మరల్చ లేకుండా వున్నాను. మరోసారి నాకు నెలవంక గుర్తొచ్చింది.

ఇప్పుడు ఆకాశంమ్మీద చాలా ఎత్తున లేచిన పున్నమి చంద్రుడు అమాంతం ఖిన్నుడై కిందకు జారినట్లనిపించింది. నెలవంక ఎంతవరకు వుంటుందో అంతవరకూ తెగి రాలినట్టనిపించింది.

తాజ్ మహల్ కూడా సమాధే-

కాని పాలీవాల్ సమాధివంటిది కాదు.... అక్కడ విషాదముంది.

ఓ నాడు ఈ జమునా నది ఒడ్డున. తాజమహల్ కట్టిన ఈ చోటున యావత్ భారత దేశం విలపించలేదా? కాని ఇప్పుడాచ్చాయల్లేవు. ఇక్కడకొచ్చి ఎవడూ విలపించడు. ప్రేమకు ప్రతీకగా ఆనందానికి నిర్వచనంగా నిలచే చోటిది.

రేపు పాలీవాల్ పేర యూనివర్సిటీ, ఓ టెన్నిస్ ట్రోఫీ డిక్లేర్ చేస్తుంది. ప్రతి సంవత్సరం అతను చనిపోయిన రోజున టోర్నమెంట్ జరుగుతుంది, అందరూ కేరింతలు కొడుతూ దాన్ని గెలుచుకుంటారు. ఆనందంతో ఉప్పొంగిపోతారు.

ఏదయినా ఎంత కాలముంటుంది? అది ఎంతటి విషాదకరమైనా గానీ-

నాకిప్పుడు పున్నమి చంద్రుడు అందంగానే వున్నాడు. కాని- నెలవంకను చూసినప్పుడు మాత్రం పాలీవాల్ గుర్తురాకమానడు.

*ఏప్రిల్ 1979, తెలుగు అమెరికా.*

*20.1.1988, మయూరి.*

హైదరాబాద్

*8.2.1976*

# లోకం చూశాక

ఆమె నా భార్య.... నా సహధర్మ చారిణి....

ఆమెకు నేనివ్వగలిగిందేమిటి?

ఆమె నా కందివ్వగలిగిందేమిటి?

నేనందుకొన్నదీ, ఆమె నా కందించినదీ మా యవ్వనం తొలిపంట, మా ప్రేమ ప్రథమ ఫలమూ అయిన 'ఓ పుత్ర సంతానం'

అందుకని నా ప్రతి అడుగులోనూ ఎంత రాజసమో-

ఆమె ప్రతి ఊహలోనూ వాడిని గూర్చిన ఎన్నెన్ని ఆనందడోలికలో-

వాడు పుట్టీ, పెరిగీ బోర్లబడి, కూచుని, నిలుచుని.... అన్ని హంగులూ చేశాడు.

నేను వాడిని బుజ్జగించిన రోజున, ఆమె వాడిని ముద్దాడిన రోజున అంతా ఆనందమే వెల్లివిరిసేది-

వాడిని ఆమె ఒడిలోనో, నాభుజం మీదనో వేసుకుని, ఏ సినిమాకో, షికారుకో వెళ్ళి మా ఆనందాన్ని ఆహ్లాదంగా మార్చుకునే వాళ్ళం-

అలాంటి మేము, నన్ను గురించి ఆమె, ఆమెను గురించి నేనూ ఆవేదన చెందక తప్పలేదు.

మా యవ్వనం తొలిపంట, మా ప్రేమ ఫలమూ అయిన మా పుత్ర సంతానం ఓ మూగ అనీ, మెంటల్ రిటార్డనీ కాలం నెమ్మదిగా నిర్ణయించింది.

అందుకని మా ప్రలోభాలనన్నింటినీ ప్రక్కకు నెట్టేసి, బాధ్యతల బరువును స్వీకరించాం.

వాడికి నడక వచ్చి, పెద్దయ్యే కొద్దీ మాబాధ్యత మరింత పెరిగిందే గాని తరగలేదు.

వాడికోసం ఎన్నో ఆటవస్తువులు కొన్నాం.

రంగు రంగుల బొమ్మలు కొన్నాం.

చెక్క గుర్రం, రబ్బరు బంతి, మూడు చక్రాల సైకిలు... ఇలా ఎన్నో-

అన్నీ వాడికోసమే-

కాని వాడికి అవేవీ అక్కర లేదేమో.... వాటిని వాడు చెల్లా చెదురు చేస్తాడు. లేకపోతే వాటికేసి అసలు చూడనే చూడడు.

వాడికి నడక వచ్చినప్పటి నుండీ తలుపు చప్పుడయిందా, ఉన్నపాటున లేచివచ్చి, ఆ తలుపు సందులోంచి బయటి కొచ్చి వీధిన పడతాడు.

వాడికోసం చుట్టూ కలయ చూస్తాం.

వాడు రోడ్డుమీద ఎటో పరుగులు తీస్తాడు. ఆ రోడ్డుమీద వాడు తగిలేదీ, తప్పేదీ కానడు. తల కాస్త పైకెత్తుకుని, నోరు తెరచుకుని ఉరకులూ పరుగులూ తీస్తాడు. కారుకీ, సైకిలుకీ ఎదురేగుతాడు.

క్షణం ఆదమరచి ఉండడానికి వీల్లేదు.

ఉంటే ఇదే వరస-

నేనయితే ఎలాగో ఓలాగా వాడిని వొడిసి పట్టుకుని వెనక్కి తీసుకొస్తాను. కాని ఆమెకు కొంతకాలంగా ఏదీ సాధ్యం కావడం లేదు.

వాడిని ఆపుజేస్తే పెద్ద మారం చేస్తాడు. బేరమంటాడు. వాడు కొంత గ్రహించీ కొంత గ్రహించ లేడు. ప్రశాంతంగా వుంటే ఆముఖ కవళికలు ఏమంత విపరీతంగా వుండవు గాని, ఏమాత్రం అసహనం వాడిలో చోటు చేసుకున్నా క్షణంలో ఆ ముఖ కవళికలు మారిపోతాయి... అప్పుడే వాడిలోని అంగవైకల్యం కాస్త వికృతంగా బయటపడుతుంది.

వాడు ఇల్లంతా చిందరవందర చేసినా, ఏడ్చినా, పెడబొబ్బలు పెట్టినా, ఖరీదైన వస్తువుల్ని విసిరి పారేసినా, పగలుగొట్టినా మరేం చేసినా మా కంత బాధలేదు గానీ, స్నేహితుల విషయంలోనూ, బంధువుల విషయంలోనూ మేం కొంత కలవరపడక తప్పలేదు.

పాపం వాడికేం తెలియదని సమర్థించుకున్నా, దీన్ని సహించడానికి ఎవరు మాత్రం సిద్ధంగా వుంటారు. అభిమానంతో ఇలా ఇంటికి వచ్చిన వాళ్లను అసౌకర్యానికి గురిచేయడం ఏమంత ధర్మం కాదని మేమిద్దరం వాడిని వేయికళ్ళతో కనిపెట్టుకుని కూచుంటాం. గదిలోకో పెరట్లోకో తీసుకపోయి ఇటు రాకుండా చూస్తాం.

ఆ వచ్చిన వాళ్ళతో మేమిద్దరం కలసి కూచోవడం గానీ, కలిసి మాట్లాడడం గానీ సాధారణంగా జరగని పని - వాడితో మేం ఓ బజారుకో బంధువుల ఇంటికో, సినిమాకో వెళ్లి ఆనందించడమనేది కూడా జరగని పని-

అందుకని ఆమెను చూస్తే నాకూ, నన్ను చూస్తే ఆమెకూ జాలి-

జాలి జీవితానికి ఆనందం చేకూర్చలేదు కదా....

అందుకని జీవితాన్ని ఆనందమయం చేసుకోవడానికి ఎన్నింటినో మార్గాలను ఆలోచించాను. కాని అనుభవంలో అన్నీ వ్యర్థమేనని తేలిపోయింది.

కనుక జీవితమంటే ఇదేనా?!

ఇప్పుడు వాడు మరింత పెద్దవాడయ్యాడు. వాడి రెక్కల్లో మరింత బలం చోటుచేసుకుంది. అందుకని వాడు తప్పించుకుని వీధిని పడ్డప్పుడల్లా వాడిని ఆపుజేయడం ఆమెకు మరింత కష్టమౌతోంది. నాకూ వాడి వెనక పరుగులు తీయడం ఏమంత తేలికనిపించడంలేదు. రోడ్డుమీద జనానికి అప్పుడప్పుడూ అది గొప్ప చోద్యమైనప్పుడు చిన్నతనమనిపించి, ఎవరో కడుపులో చేయిపెట్టి దేవినట్టవుతుంది-

అందుకని... ఇలా ఇంకెన్నాళ్ళు....

ఈ ప్రశ్న పైకి అనుకోక పోయినా మా ఇద్దర్లోనూ లోలోపల నిత్యం చెలరేగుతున్నదే అలా ఈ ప్రశ్న ఉదయించినప్పుడల్లా ఆమె కళ్ళునాలోకి చూస్తాయి, సమాధాన పడలేక నా ముందుకొస్తాయి -

'నేను నీకు అన్యాయం చేశాను రవీ...'

'అన్యాయమా?!'

'ఔను! నన్నుగాక ఇంకెవరిని చేసుకున్నా మీకు ఓ అందమయిన కొడుకు పుట్టేవాడు. ఓ నార్మల్ చైల్డ్‌కు తండ్రి అయ్యేవారు... ఇదంతా నామూలంగానే జరిగింది-'

ఛ! అవేం మాటలు- అల్లాగని నేనెప్పుడూ అనుకోలేదు....'

'అది నా అదృష్టం... కాని నామూలంగా మీ సుఖాల్ని ఇలా బలిచేసుకున్నందుకు కుమిలిపోతున్నాను....'

'అల్లాగా! ఆ సంగతి నాకింతవరకూ తెలీదే...'

'పోనీలెండి, మీకు తెలియకపోవడమే మంచిది-'

'అయితే ఓ సంగతి చెప్పమంటావా?....'

'?'

'నీవు నన్నుగాక మరెవ్వరిని చేసుకున్నా ఓ అందమైన నార్మల్ చైల్డ్‌కు తల్లివయ్యేదానవు. నన్ను చేసుకోవడం వల్ల ఓ మెంటల్ రిటార్డుకు తల్లివయ్యావు అందుకని నేనే నీకు అన్యాయం చేశానేమో....' అన్నాను.

ఆమె పక్కమీంచి కదలి నానోటిని తన మునివేళ్ళతోనొక్కి, 'ఎప్పుడూ అలాంటి మాటలు అనకండి- మీకవి సరదాగా వున్నా నాకు బాధ కలిగిస్తాయి...' అని నన్నల్లుకుంటూ ఒదిగిపోయేది-

జీవితం కదా మరి,... ఆమె నన్నలా ఆక్రమించుకున్నప్పుడు నాలో ఓ సముద్ర కెరటం దావానలంలా ఉవ్వెత్తున ఎగసి, ఆమెను అల్లుకుని, ఆ ఆనందడోలికలో ఓలలాడించి పారవశ్యం చెందించి, ఉక్కిరి బిక్కిరిగావించి, చల్లగా సద్దుమణిగి పోయేది.

అయినా మా ఆలోచనలు నిత్యం ఒకే ప్రశ్నమీద నిలిచిపోయేవి-

'ఇలా ఇంకెన్నాళ్ళు?....' అని-

అందుకని నేను తీవ్రంగా ఆలోచించాను. ఓ నిర్ణయానికి కూడా వచ్చాను ఆమె నా

భార్య... నా సహ ధర్మచారిణి... నా మాట కాదనదన్న నమ్మకం వున్నవాడిని...

ఆమె నా మాట కాదన లేదు-

ఆ వారంలోనే మేం అడ్రస్‌లు సేకరించాం. ఉద్యోగానికి ఓ వారం సెలవు చీటీ రాసేసి, మావాడితో రైలెక్కి ఓ రిహేబిలిటేషన్ సెంటర్లో వాడిని చేర్చి తిరిగి వచ్చాం.

అక్కడ మేం వాడిని వదిలి రావడానికి ఆయత్తమౌతుంటే, ఆ క్షణం నుండీ వాడు మాతో వేరైపోతుంటే, వాడు తప్ప వేరేలోకం ఎరగని నా భార్య ఒక్కసారిగా దిగులు పడిపోయింది. ఆమె గొంతుక పూడుకు పోయి కళ్ళనీళ్ళు కుక్కుకుంది-

కన్న బిడ్డల్ని కన్నవాళ్ళకన్నా అధికంగా ఎవరు ప్రేమించగలరు?

నేనూ అంతే....

తల్లి దండ్రులుగా వాడి బాగోగులు చూడాల్సిన బాధ్యత మామీద వుంది. వాడికి సంబంధించిన చదువులకోసం, వాడి భవిష్యత్తు కోసం మేం ఆ రిహేబిలిటేషన్ సెంటర్లో చేర్పించి వచ్చాం అని కావలసిన వాళ్ళకు మేమే చెప్పుకున్నాం. అలా ఆశించడంలో మా తప్పేమీ లేదనే మామనసు మమ్మల్ని సమర్థిస్తోంది.

అయినా కొందరు నోళ్ళు నొక్కుకున్నారు - మా సుఖం కోసం, మా స్వేచ్ఛ కోసం వాడిని అలా దూరంగా పంపేశాం అన్నారు- అన్నీ విన్నాం-

ఎవరు ఏమనుకుంటే మాకేం... మాకు సుఖం కావాలి.... స్వేచ్ఛ కావాలి. గత ఏడెనిమిదేళ్ళుగా మేం పోగొట్టుకున్న జీవితం అణాపైసల్తో సహా మేం తిరిగిపొందాలి- అందుకని మేం ఎవరిమాటలూ పట్టించుకోదలచ లేదు-

మేం ఇంటికి రావడంతోనే గొప్ప రిలీఫ్ అనిపించింది. ఆ మరుసటి రోజే కలర్ టీవీని ఖరీదు చేసి, లివింగ్ రూమ్‌లో అనువుగా అమర్చుకున్నాం. అది సాయంత్రాలన్నీ మాకు నిక్షేపంలా కాలక్షేపాన్నిస్తోంది-

పాత టేప్ రికార్డర్‌ని మార్చేసి, స్టీరియో సోనిక్ టేప్ రికార్డర్‌ని ఖరీదు చేశాం. దాన్ని బెడ్‌రూమ్‌లో చేతి కందుబాటులో అమర్చుకున్నాం.

నేను మెహదీ హసన్, ఆమె భీమ్‌సెన్ జోషి-

నేను జాన్ హిగ్గిన్స్, ఆమె బాలమురళి-

నేను జేసుదాసు, ఆమె బాలసరస్వతి-

రవి శంకర్, చిట్టిబాబు,.... ఇలా కాసెట్లను సెలెక్టు చేసుకుని తెచ్చుకుంటాం. రోజులో ఎక్కువ సేపు ఇవే మాకు హాయిని అందిస్తూ వచ్చాయి.

సెలవు రోజుల్లో ఇంట్లోనే వుంటాం కనుక విసిఆర్ అద్దెకు తెచ్చుకుని, జయభేరి, విప్రనారాయణ, బైజూబావరా, మొఘల్-ఏ-ఆ జమ్, మల్లీశ్వరి... లాంటి సినిమాలు హడావుడిగా చూసేశాం-

ఇద్దరి అభిరుచులూ దగ్గరే కనుక సెలెక్షన్ విషయంలో అంతగా భేదాభిప్రాయాలు

వచ్చే అవకాశం లేకపోయింది.

అందుకని పెళ్ళయిన మా తొలిరోజులిప్పుడు గుర్తుకొస్తున్నాయి. మాముందు కావలసినంత స్వేచ్ఛ... అందుకని మేం ఇంట్లోకన్నా వీధిలోనూ, వీధిలో కన్నా ఇంట్లోనూ అధికంగా గడుపుతున్నాం-

రోజూ సాయంత్రాలు దూరంలో వున్న బీచ్ కో, దగ్గర్లో వున్నపార్కుకో వెళ్తున్నాం, అలా కుదరని నాడు ఏ మెయిన్ రోడ్డుకో, శారీ సెంటర్ కో, బేంగిల్ మార్టుకో... ఎక్కడికో అక్కడికి వెళ్ళి లేని చల్లగాలిని మెల్లగా ఆరగించి ఇంటికి చేరుకుంటున్నాం-

జీవితం హాయిగా, ఆనందంగా గడపాలన్న తపన-

ఆరోజు సాయంత్రం సినిమా ప్రోగ్రామ్ వేసుకున్నాం. ఫలానా సినిమాయే చూడాలన్న నియమం ఏదీలేదు కనుక ఏ థియేటరయినా ఒకటే మాకు... ఎందుకంటే గత ఆరేడు సంవత్సరాలుగా మేం ఏ కొత్త సినిమానూ చూసి ఎరగం. నేను ఒకటో ఆరో సంవత్సరంలోచూసినా, అవి ఏ అవార్డు సినిమాలో కావడం వల్ల తెలుగు సినిమా నేనూ చూడనట్టే... ఈ మధ్య కాలంలో టీవీ కొన్నాక అప్పుడప్పుడూ బుల్లితెరపై కొత్త సినిమాలు ప్రసారం అవుతున్నా ఆ సమయానికి మేం ఏ బజారులోనో, బంధువుల ఇంట్లోనో విధిగా బందీ అయిపోవడంతో వాటిని చూసే అవకాశం లేకపోయింది-

అలా ఎన్నో ఏళ్ళుగా మేం తెలుగు సినిమాకు దూరమయ్యాం-

ఇప్పుడు తిరిగి సినిమా హాల్లో కూచున్నాం.

హాలు పాతదే అయినా, పాత సైకిలుకు కొత్తరంగు వేసినట్టు 'రెనొవేషన్' అయి మంచి హంగామాగా వుంది. పైగా పాతదానికి కొత్త పార్టులు బిగించినట్టు 'ఏసీ' కూడా వుంది.

హాల్లో కూచున్నాక కొత్త సినిమా చూడబోతోన్న ఓ కొత్త పులకింత మమ్మల్ని ఆవహించింది.

సినిమా మొదలైన ఓ అరగంటకి మా శ్రీమతి కాస్త తికమకపడి నన్నేదో ప్రశ్నించింది. పక్కవాళ్ళను డిస్టర్బ్ చేయడం ఏమంత సంస్కారం కాదని ఆమె మాటల్ని పట్టించుకోలేదు- ఇంటర్వెల్లో థియేటర్ కారిడార్ లోకి వచ్చాక ఐస్ క్రీమ్ చప్పరిస్తూ 'ఇదేం సినిమా అండీ...' అంది.

నేను మౌనం దాల్చేశాను-

సినిమా అయిపోయింది. ఇంటికి వచ్చేశాం. డాబాపై పడక కుర్చీలో రిలాక్స్ంగా కూచున్నాం.

ఆమె కాస్త మూడీగనే కూచుంది.

'సినిమా నచ్చలేనట్టుంది...' అన్నాను.

'మీకు నచ్చిందా?' తిరిగి ప్రశ్నించింది-

నేను వెంటనే ఏమీ చెప్పలేకపోయాను. నిజానికి నాకూ నచ్చలేదు-

ఆ హీరో హీరోలా కాక పరమ విలన్‌లా వున్నాడు. ఆ చిన్ని నుదురూ, పొట్టి ముక్కూ, లోతుకళ్ళూ, దట్టమయిన కనుబొమలూ, బొద్దుమీసాలూ- హీరోకి అందమే వుండాలని ఏ నియమం లేకపోయినా ఓ క్రోటన్ మొక్కను చూసినదానికీ, బొమ్మ జెముడు మొక్కను చూసిన దానికీ ఎంతో కొంత తేడా వుంటుందను కుంటాను... ఆహీరోలో కథానాయకుడి కన్నా వీధి రౌడీని మనం హాయిగా ఊహించుకోగలం-

ఆ హీరోయినూ అంతే... ఆమె ఆనంద హేల.. ఎక్కడా సంసారిక లక్షణాలు మచ్చుకయినా కనపడవు. కేవలం మగవాడికి విలాస వస్తువులా కనిపించడమే నటనగా

పోనీ ఏక్టర్ల నెలాగో తగలడనీ... కథలోగాని, సాహిత్యంలో గానీ సంగీతంలో గానీ ఏదీ బాగనిపించలేదు.... అలాంటప్పుడు నేనామెను 'సినిమా నచ్చలేనట్టుంది....' అని అడగడంలో ఔచిత్యం ఏముంటుంది-

అందుకని నేనామెను సంతోషపెట్టడానికి "రేపు మంచి సినిమాకు వెళ్దాం లే...." అన్నాను.

ఆమె ఓ చిరునవ్వుతో అంతా నెట్టేసి, ఎదర వున్న టేప్‌రికార్డర్‌ను ఆన్ చేసింది. బాలసరస్వతి తీయని స్వరం వినిపించసాగింది.

రేపు అన్నది మరో నాల్గురోజులగ్గాని రాలేదు.

బజారుకు వెళ్ళాక ఆమె ఏవేవో చిన్నచిన్న షాపింగులు చేసింది. సినిమా చూడ్డం కోసం అక్కడే ఓ హోటల్లో భోజనం కానిచ్చి బయల్దేరాం-

సినిమా మొదలైయ్యింది....

ఈసారి కూడా మేం ఫలానా సినిమా అని సెలెక్టు చేసుకోలేదు. హీరో అయితే మారాడు గాని, అదే మీసకట్టు, అదే తల జుట్టు... రూపం అందంగానే వున్నా, విలన్ లాంటి హీరో-

కథ అంతే కథ కథనమూ అంతే; సంగీతమూ అంతే, సాహిత్యమూ అంతే.... దేనిలోనూ చెప్పుకో తగ్గ తేడా లేదు.

మేం ఇంటికి వచ్చాక ఆమె తొందరగా పక్క వేసింది. సినిమా మీద కామెంట్ చేయడం అంతగా ఇష్టం లేకపోవడమేనని గ్రహించాను. ఎంత కూడదనుకున్నా సినిమాలోని మార్పును గురించిన ఆలోచనలే నన్ను చుట్టుముట్టాయి.

అయినా మేం సినిమాలు చూస్తూనే వున్నాం. చూడక చస్తామా? రోజూ అవే మెయిన్ రోడ్లనూ, అవేషాపింగ్ సెంటర్లను ఎంతకాలం చూడగలం- దగ్గర్లో వున్న పార్కుకో, దూరంలో వున్న బీచ్‌కో ఎప్పుడన్నా వెళ్ళినా అవేవీ మనుషుల కంత యోగ్యమైనవి కావని త్వరలోనే తెలిసి వచ్చింది.

అందుకని ఆనందం కోసం మిగిలిన ఏకైక మార్గం సినిమా మాత్రమే... అలా మేం

వారానికో, పదిరోజులకో కనీసం ఒకటైనా చూస్తున్నాం-

ఎప్పుడు ఏ సినిమా చూసినా నాభార్య, నా సహధర్మచారిణి, నన్నేవేవో ప్రశ్నల్తో ఇబ్బంది పెడుతూనే వచ్చింది-

ఈ సినిమా అంతట్లో ఓ మంచి డైలాగు వుంటే వెదికి చెప్పండి చూద్దాం అని-

కాలం మారింది.... నేనేమని సమాధానం చెప్పగలను?

'ఇది స్పీడ్‌యుగం డియర్... ఆలోచించడానికి మనిషికి సమయమెక్కడిది? ప్రేక్షకుడెవడూ నేడు ఆలోచించడానికి కాలాన్ని వృధాచేయడు. అందుకని ఆలోచనలు రేకెత్తించే డైలాగులు వుండవు...' అని ఆమెను సమాధాన పరచడానికి ప్రయత్నించాను.

అప్పుడు ఆమె మరింత నిర్ఘాంతపోయి, కనీసం పాటలో నయినా మనసుకు హాయనిపించే సాహిత్యం వుండాలి కదా- అన్నది.

'అక్కరలేదు... ఈనాడు పాటలు రాస్తున్నది వినడానికి కాదు తెరమీద చూడ్డానికి....' అన్నాను.

ఆమె ఓక్షణం నివ్వెరపోయి, 'అంతేమరి! ఆలోచించలేని వారికి ఆనందం కలిగించేవి ఇలాంటి వినోదాలే కదా...' అని ఊరుకుంది.

ఆమెకు నేనెలాగో సమాధానం చెప్పడానికి ప్రయత్నించినా, నాకు నేను చెప్పుకోలేను కదా... ఎందుకంటే- మనకు కవులు లోటు లేదు, కథకుల లోటు లేదు సాహిత్యానికి లోటు లేదు.... అలాంటిది సినిమా సాహిత్యానికింత లోటెలా వచ్చింది?-

సినిమా ఈనాడు జనానికి అతి చేరువులో వున్న గొప్ప కళా రూపం- సమస్యలను నిజమైన శ్రద్ధతో రచయిత పట్టించుకుని, నిజాయితీతో దర్శకుడు జీవితాన్ని గమనించి దాన్ని చిత్రీకరిస్తే అద్భుతమైన సినిమాలు రాక మానవు-

కాని నేడు సినిమాలో, ఒకప్పటిలా కాకుండా, మొదటినుండి చివరి వరకూ క్రైం, రేప్, బ్రేక్‌డాన్స్,ఫైటింగ్.... అన్నీ అనర్గళంగా సాగిపోతున్నాయి. ఉత్కంఠ పెంచడం కోసం అవి తప్పనిసరై చోటు చేసుకుంటున్నాయి. విచక్షణాతీత సమాధిలోకి తీసుకుపోతున్నాయి.

ఈ మార్పు ఇంత స్వల్ప కాలంలో ఎలా వచ్చిపడింది. ఎప్పుడూ సినిమాలూ చూసేవాళ్ళకు ఈ మార్పు అంతగా తెలియక పోవచ్చునేమో గానీ, ఆరేడు అజ్ఞాత సంవత్సరాల అనంతరం మళ్ళీ మేం ఈ ప్రపంచాన్నీ, సినీ ప్రపంచాన్నీ తిరిగి చూస్తున్నాం కనుక మా కిదంతా కొత్తే... అంతా వింతే... నాటికీ నేటికీ ఎ బిగ్ గాప్-

ఈ మార్పుకు మేం కొంత అలజడి చెందాం-

ఇతమిద్ధంగా ఇదని మొదట్లో తెలియక పోయినా తర్వాత కొంతవరకూ అవగాహనయ్యింది. ఇవ్వాళ సినిమా కథలోనూ, కథనంలోనూ 'కసి' దాని ఆలంబన, 'క్రోధం' దాని ఉచ్ఛ్వాస, 'రక్తపాతం' దాని అవిరామక్రీడ-

ఎర్రని రక్తసిక్తమైన ఆ హీరో కళ్ళల్లోంచి జ్వలిస్తున్న అగ్ని... ప్రతీకార దావాగ్ని... శత్రు నిర్మూలనంలో అతడు రాక్షసుడు... పరమ కిరాతకుడు.

నా శ్రీమతికి తిరుగు లేని సందేహం కలిగింది. నేటి సినిమా ఈనాటి సమాజానికి ప్రతిబింబమా?... అని. అందుకని ఆమె నన్ను సౌమ్యంగా అడిగింది-

ఏమని?-

'ఈలోకంలో మార్పు వచ్చిందా?' అని-

'మార్పు అవసరం డియర్... మార్పు లేనిదే మనిషి మనుగడే లేదు. అభివృద్ధి కుంటుబడి పోతుంది...' అన్నాను.

'అయితే సినిమాల్లో మార్పు ఎలాంటిది?...' అంది.

'ఎందుకొచ్చింది నీకీ అనుమానం?...' అన్నాను.

'నిజాయితీగా బతకడం కోసం మనిషి ఈనాడు ఇంతపోరాటం సాగించాలా? రక్తపాతంతో పాశవికంగా నర్తించాలా?

'అదిసినిమా డియర్... మనకు కాస్త థ్రిల్ కలిగించడం కోసం వాళ్ళు కల్పించినవే అవన్నీ...' అన్నాను.

ఆమె తన మౌనంతో నామాట త్రోసిపుచ్చింది-

ఆరేడు అజ్ఞాత సంవత్సరాల తర్వాత ఆనందంగా సినిమా ప్రపంచంలోకి వెళ్ళి అసంతృప్తితో తిరిగి వచ్చాం-

ఇప్పుడు ఆమె సినిమా పట్ల పూర్తి మౌనం వహించింది.

అందుకని ఇప్పుడు వస్తున్న కొన్ని నవలల్నీ, వార పత్రికల్నీ తెప్పించుకుని, తీరిక వేళల్లో తిరగ వేయసాగాం-

ఆమె కొంత చదివాక సాహిత్య రంగం సయితం ముప్పయ్యారు పూలూ, మూడు కాయల్తో గిడచబారి, సినిమా రంగానికి ప్రతిబింబంలా కనిపించసాగింది. అందుకని ఆమె నవలా సాహిత్యానికి సయితం తిలోదకాలు వదిలేసింది.

ఇప్పుడు నేనామెకు ఏ ఆనందాలనూ అందించలేకపోయాను. నేను తెప్పించుకునే దినపత్రికల్నే తిరగేస్తూ, అప్పుడప్పుడు వార్తలకు స్పందిస్తూ కాలాన్ని వెళ్ళ బుచ్చుతోంది- అయితే...

ఆమె ఏ రక్తపాతాన్ని నిరసించి, ఏ పాశవికాన్ని తెగడి సినిమాలను పూర్తిగా మానుకున్నదో... ఆ రక్తపాతాన్నే, ఆ పాశవికాన్నే అంతకన్నా అనాగరికంగా, అంతకన్నా పాశవికంగా పత్రికా ముఖంగా ప్రతిరోజూ ఉదయాన్నే చూస్తోంది.

ఏ పేజీ తిప్పినా కనిపించేవి హత్యలే... రక్తపాతాలే...

దొంగతనాలు, దోపిడీలు, అత్యాచారాలు, లాకప్పు మరణాలు, ఎన్‌కౌంటర్లు... తమపై జరిగే హింసను భరించలేక... ఎన్నెన్నో ఆత్మహత్యలు –

ఆమె ప్రతి వార్తనూ నిశ్చేష్టురాలై చదివేది... -

పదిరికుప్పం, కంచిక చర్ల, చుండూరు, కారంచేడు, బెల్చినీ, కీలవేన్మణి...

అన్నిటా హత్యలే...

అవి కులం అక్కసులే కావచ్చు...

అది మతం మహమ్మారులే కావచ్చు...

అవి దిగజారిన రాజకీయ రాక్షసాలే కావచ్చు...

అంతా నరమేధమే... అంతా పాశవికమే...

నా భార్య... నా సతీమణి... రక్తమంటిన ప్రతివార్తకూ, ప్రతి పాశవికానికీ వివశురాలయ్యేది - సంతోషమనేది ఆముఖం మీద మాయమయ్యేది.

నేనామెతో 'టేకిట్ ఈజీ' నీవు మరీ సెన్సిటివ్‌గా ఉండకూడదు. అనేవాడిని -

సినిమాల్లోలా మనకు కాస్త థ్రిల్ కలిగించేవే నంటారా ఇవన్నీ, అని నన్ను ఎదురు ప్రశ్నించేది -

ఈ భయానక ప్రపంచంలో నేను దేనినీ సమర్ధించలేకపోయాను.

ఎందుకంటే -

నేడు శాంతి పేర హత్యలు -

సామరస్యం పేర హత్యలు -

స్వేచ్ఛా స్వాతంత్రం పేర హత్యలు

అది ఆపరేషన్ బ్లూస్టార్ కావచ్చును -

అది ఆపరేషన్ రినో కావచ్చును -

అది ఆపరేషన్ బజ్రంగ్ కావచ్చును -

అది రామాలయం పేరా, బాబ్రీ మసీదు పేరా కావచ్చును.

అది మానవాళి విముక్తి కోసం తిరుగులేని పోరాటం పేర తప్పనిసరైన హత్యలే కావచ్చును. ఏదయితేనేం... అన్నీ హత్యల కోసమే హత్యలు -

నేను ఉదయాన్నే లేచి, ముఖం కడుక్కొని, పేపరు అందుకున్నాను. నా శ్రీమతి నాకు కాఫీ అందిస్తూ... ఉదయాన్నే తడారని ఆ రక్తాన్ని మీ చేతుల కెందు కంటించు కుంటారు...' అంది. పేపరును ఈసడించుకుంటూ-

నేను పేపరు అవతల పెట్టి, ఇంత భయంకరంగా వున్న సమాజాన్ని చూసినా మనకు మానవత్వం మీద ప్రేమే కలుగుతుంది, అని కాఫీ అందుకున్నాను.

ఆమె నా పక్కన కూచుంది.

నేనామె కళ్ళల్లోకి చూసి, 'రాత్రి నిద్ర పట్టలేదా...' అన్నాను.

'మన అబ్బాయిని గురించి ఆలోచించాను...' అంది.

'బెంగ తిరిగిందా?' అన్నాను.

'లేదు... లోకం చూశాక బాబును గురించి పునరాలోచన చేశాను...' అంది.

'ఏమని?'

'బాధ్యతల బరువుకు భయపడి మనం వాడిని దూరం చేసుకున్నామేమోనని –'

'మనమీద మనం అభియోగం మోపుకోవడం సబబా?'

ఆమె పెదవి విరిచి, ముఖం చాటేసింది –

నేను అనుమానంతో ఆమెకేసి చూశాను.

'మనబిడ్డ వికలాంగుడే కావచ్చు... వాడివల్ల మనకు గానీ, లోకానికి గానీ ఏ ప్రయోజనం లేకపోవచ్చు... అయినా నా బిడ్డ నాకు చాలా అవసరం...'

' ఆ సంగతి నేను ముందే గ్రహించాను... కాని లోకాశలు చాలా చిత్రమైనవి...'

'ఔను! నేనూ అలాగే అనుకున్నాను. కాని అవి చాలా వికృత రూపం దాల్చాయి. అవి వాడి వికృత రూపం కన్నా మరింత వికృతంగా వున్నాయి. ఈ కుష్టు వ్యవస్థలో వికృత రూపం దాల్చిన ఈ సమాజాన్ని కసాయి గుండెతో చూసి ఆనందించలేను. అంతకన్నా మన బాబే మనకు మేలు... మనం మన బాబుని దూరం చేసుకుని శాంతికి దూరం అయ్యాం...' అంది.

ఆ మరుసటి రోజే మేం ఆ రిహేబిలిటేషన్ సెంటర్‌కు వెళ్ళాం –

రాజమండ్రి

*16.11.1991*

# రచయిత గురించి

పుట్టిన తేదీ జూలై 3, 1940

సొంత ఊరు రాజమహేంద్రవరం

చదివిన చదువు M.Sc. (Mathematics)

సాగర్ యూనివర్సిటీలో

B.Sc. భీమవరంలో

B.Ed రాజమండ్రిలో

బాల్యం భీమవరంలో గడిచింది.

ఉద్యోగ రీత్యా 1970 నుండి '87 వరకు హైదరాబాద్‌లో-

ఈ కాలంలోనే రచనా వ్యాసంగం మొదలయ్యింది .

కథ రాయడం ఇష్టమైన ప్రక్రియ .

ఆలిఇండియా రేడియో, హైదరాబాద్ వారికి ఎడ్యుకేషనల్ బ్రాడ్ కాస్టింగ్‌లో ఓ ఏభై ప్రోగ్రాముల వరకూ స్క్రిప్టురైటర్‌గా వుండడం జరిగింది.

సంగీతం, చిత్రలేఖనం అన్నింటికంటే ప్రీతిపాత్రమైనవి.